# ఆయుర్వేదయోగముక్తావళి



గ్రంథకర్త

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ప్రొప్రయిటరు: గంధర్వఫార్మసీ




పబ్లిషర్సు: అద్దేపల్లి అండుకో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# ఆయుర్వేదయోగముక్తావళి

## విషయసూచిక

### (ప్రకరణానుసారం)

### ఉపోద్ఘాతం - గ్రంథాదిని



### * చూర్ణాలు *

## * లేహ్యాలు *



## * తైలాలు *

## * ఘృతాలు *



## * కజ్జలీ ఔషధాలు *

## * వంట ఔషధాలు *

## ఆ స వా లూ - అ రి ష్టా లూ

# ఔషధసూచిక

## (అకారాదిగా)

ఈ గ్రంథం కొత్తవారికి ఉపయోగపడితేనూ, పండితవైద్యులకు ఆదరపాత్రం అయితేనూ నాకు ధన్యత. ఇందులో చేర్చవలసిన యోగాలు ఇంకా కొన్ని వున్నాయి; కాని యుక్తకాలంలో అవి నాకు దొరకలేదు; ముందుముందయినా అవి చేరుస్తాను.

ఇందులో వున్న కొన్ని యోగాలు నాకు నామిత్రులు వైద్యరాజ శ్రీ వ్యాకొల్యం వెంకటేశ్వర్లుగారు దయచేశారు. ఆనుంచీ నాకు సాంప్రదాయాలు చెబుతున్నవారున్నూ వారే. వారికి నాకృతజ్ఞత విన్నవించుకుంటున్నాను. విశేషం ఏమిటంటే? కొన్ని స్థలాలలో వారితో నున్నా నాకు అభిప్రాయభేదాలు కలిగాయి. వారు నన్ను మన్నించారు. ఇంకా మన్నిస్తారనిన్నీ నమ్ముతున్నాను.

నా అభిప్రాయాలతో ఏకీభవించనివారు ఇంకా వుండవచ్చు. ఉన్నారనే నిశ్చయం. వారికిన్నీ నాప్రార్థన యిదే. నచ్చితేనే వారు నా అభిప్రాయాలు స్వీకరించవచ్చు. నచ్చనిచోట్ల నన్ను మన్నిస్తే చాలు. విచారణ చేస్తేనే చాలు. నేను, వారికి నా కృతజ్ఞత విన్నవించుకుంటాను.

ఇది చేపట్టి అన్నిటి ధరలూ ఆకాశం అంటిపెట్టిన ఈసమయంలో ప్రకటించి శ్రీ లక్ష్మణస్వామినాయుడుగారు నాకు చాలా మేలు చేశారు. వారికి మరీమరీ కృతజ్ఞత విన్నవించుకుంటున్నాను.

అచ్చుతప్పులు దిద్దడంలో నాకు శ్రీ సామర్తి గోపాలకృష్ణశర్మగారు మిక్కిలి సాయంచేశారు. వారికిన్నీ నావందనాలు.

గంధర్వమార్గశీ
రాజమండ్రి 1–12–47

ఇట్లు
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# ఆయుర్వేదయోగముక్తావళి

## మానపరిభాష



న మానేన వినా యుక్తి ర్ద్రవ్యాణాం జాయతే క్వచిత్
అతః ప్రయోగకార్యార్థం మాన మత్రోచ్యతే మయా ॥

ద్రవ్యాలకు పరిమాణ నిర్ణయం లేకుండా యోగకల్పన చెయ్యగూడదు. అందుకే, యిక్కడ మానపరిభాష వివరిస్తున్నాను.

షట్సర్షపై ర్యవ స్త్వేకో గుంజైకా తు యవై స్త్రిభిః
మాష స్తు పంచభి ష్షడ్భిః తథా స ప్తభి రష్టభిః
దశభి ర్ద్వాదశభి శ్చ రక్తిభి ష్షడ్విధో మతః
చరకస్య తు మాష స్తు దశగుంజాభి రేవ చ
చరకస్య తు చార్థేన సుశ్రుతస్య తు మాషకః ॥

ఆరు ఆవగింజ లైతే ఒక యవ. మూడు యవలు గాని, నాలుగు వడ్లగింజలు గాని ఒక గుంజ. ఇదే రక్తి. 5 రక్తులు ఒక మాషం. అంటే రెండణాల యెత్తు అవుతుంది, 5, 6, 7, 8, 10, 12 రక్తులు ఒక మాషం అని భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. చరకుని అభిప్రాయం ప్రకారం 10 గుంజలు ఒక మాషం. సుశ్రుతుని అభిప్రాయం ప్రకారం అయితే ఐదు గుంజలే ఒక మాషం.

మాషై శ్చతుర్భి శ్శాణ స్స్యా ద్ధరణం త న్నిగద్యతే
టంక స్స ఏవ కథిత స్తద్వయం కోల ఉచ్యతే
క్షుద్రకో వటక శ్చైవ ద్రంక్షణ స్స నిగద్యతే ॥

నాలుగు మాషాలు ఒక శాణం. అంటే అరతులం. దానికే ధరణం అనీ టంకం అనీ మరో రెండు పేర్లు. రెండు శాణాలు ఒక కోలం. కోలానికి క్షుద్రకం, వటకం ద్రంక్షణం అనేపేర్లు. ఇది తులం.

# ఉపోద్ఘాతం

ఈగ్రంథం ప్రకటించాలని పదేళ్ళుగా సంకల్పించి వున్నాను. ముప్ఫయి సంవత్సరాల నా జిజ్ఞాసా అనుభవమూ యిందులో క్రోడీకరించాను. శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయడుగారు చేపట్టడంవల్ల ఇప్పటికయినా యిది ప్రకటన అయింది.

సంప్రదాయసిద్ధంగా వృద్ధవైద్యులు వాడే ఔషధయోగాలే నేనిందులో చేర్చాను. వాటికి టీకలున్నా వృద్ధవైద్యుల సంప్రదాయం అనుసరించే రాశాను. వాటిలో అనేకాలు నేను నాగంధర్వ ఫార్మసీలో తయారుచేసి వాడిన్నీ వున్నాను.

దేశంలో వాడుకలో వున్న అనేకయోగాల మూలార్థం వేరూ, ఆచరణలో వున్న అర్థం వేరూగా కనబడుతోంది. మూలాతిక్రాంతం అయిన యీ వ్యవహారం ఎప్పుడు ఎలాగ ప్రారంభం అయిందో చెప్పలేము; కాని వైద్యశాస్త్రపరిచయం అయినా లేని సంస్కృతపండితులు టీకలు రాయడమూ, సంస్కృతభాషావాసన అయినా లేనివారు ఔషధాలు తయారుచేస్తూవుండడమూ దీనికి కారణం అయి వుండవచ్చు. ఏమయినా మూలాతిక్రమణం మంచిది కాదుగదా? అనేకయోగాలలో నేను మూలాలు అనుసరించి ఆచరణకు వ్యతిరేకంగా యిందులో టీకలు రాయవలసివచ్చింది. ఈగ్రంథరచనకు గల కారణాలలో యిది కూడా వొకటి.

నా సంకల్పమూ ప్రయత్నమూ ఇవి. నా శక్తి వీటికి చాలింది కాదు. అయినా తెలిసినంతవరకైనా గ్రంథస్థంచెయ్యడం అగత్యం అనిపించింది. సాహసించాను. ప్రమాదాలు పడివుండవచ్చు. దిద్దుకుంటాను.

దేశంలో ఒక్కొక్క ఔషధానికి చాలా యోగాలు కనబడుతున్నాయి. అన్నీ వాడుకలో వున్నాయేమో నాకు తెలియదు; కాని పెద్దలు చాలామంది వాటిలో ఒక్కటే చేస్తున్నట్టు కనపడింది. ముప్ఫయి సంవత్సరాలుగా నేను తెలుసుకున్న ఆయోగాలే యిందులో చేర్చాను. శాస్త్రీయమూ, సంప్రదాయసిద్ధమూ అయిన యోగం కావాలని తాపత్రయపడేవారికి అలాంటివన్నీ ఒకచోట ఉండడం అగత్యం అన్న ఉద్దేశంతో యిది కూర్చాను. అయితే వాటి టీకలలో అన్యవృద్ధవైద్యులతో నాకు కొన్ని అభిప్రాయభేదాలు తటస్థించాయి, భారతదేశంలో ఇతరప్రాంతాల ఆయుర్వేదవైద్యుల సాంప్రదాయాలు కొన్ని తెలుసుకోడంవల్లకూడా యిది తటస్థించింది. ఈగ్రంథంలో అలాంటి నా భిన్నాభిప్రాయాలు దృఢంగా ప్రతిపాదించాను. అవి నేను నమ్మి ఆచరణలో పెట్టిచూసినవి. దృష్టఫలాలు. ఈగ్రంథం చూసినవారు అవి బాగా పరిశీలిస్తారని నమ్ముతున్నాను.

కోలద్వయంతు కర్షస్స్యాత్ప్రోక్తః పాణి శ్చ మాణికా
అక్షం పిచుః పాణితలం కించిత్పాణి శ్చ తిందుకమ్
బిడాలపదకం చైవ తథా షోడశికా మతా
కరమధ్యో హంసపదం సువర్ణం కవళగ్రహః
ఉదుంబరం చ పర్యాయైః కర్ష ఏవ నిగద్యతే ॥

రెండు కోలాలు ఒక కర్షం. అంటే రెండుతులాలు. పాణిమాణిక, అక్షం, పిచు, పాణితలం, కించిత్పాణి, తిందుకం, బిడాలపదకం, షోడశిక, కరమధ్యం, హంస పదం, సువర్ణం, కవళగ్రహం, ఉదుంబరం—ఇవి కర్షానికి మరికొన్ని పేళ్లు.

స్యాత్కర్షాభ్యా మర్ధపలం శుక్తి రష్టమికా తథా
శుక్తిభ్యాం చ పలం జ్ఞేయః ముష్టి రామ్ర శ్చతుర్థికా
ప్రకుంచ షోడశీ బిల్వం పల మేవాత్ర కీర్త్యతే ॥

రెండు కర్షాలు అర్థపలం. దీనికి శుక్తి, అష్టమిక అనిన్నీ పేళ్లు. రెండు శుక్తులు అంటే యెనిమిది తులాలు ఒక పలం. ముష్టి, ఆమ్రం, చతుర్థిక, ప్రకుంచం, షోడశి, బిల్వం— ఇవి పలానికి పేళ్ళు.

పలాభ్యాం ప్రసృతి ర్జ్ఞేయో ప్రసృతం చ నిగద్యతే
ప్రసృతిభ్యా మంజలి స్స్యాత్కుడవో అర్ధశరావకః
అష్టమానం చ సజ్ఞేయః కుడవాభ్యాం చ మాణికా
శరావోష్టపలం తద్వ ద్జ్ఞేయ మత్ర విచక్షణైః ॥

రెండు పలాలు ప్రసృతి. దానికే ప్రసృతం అనిన్నీ పేరు. రెండు ప్రసృతులు అంజలి. కుడవం, అర్ధశరావం, అష్టమానం అనిన్నీ దానికే పేళ్ళు. రెండు కుడవాలు ఒక మాణిక. అదే శరావం, అష్టపలం అనిన్నీ దానికి పేరు.

శరావాభ్యాం భవేత్ప్రస్థ శ్చతుః ప్రస్థై స్తథాఢకమ్
భాజనం కంసం పాత్రం చ చతుష్షష్టిపలం చ తత్ ॥

రెండు శరావాలొక ప్రస్థం. నాలుగు ప్రస్థాలొక ఆఢకం. ఆఢకానికే భాజనం, కంసం, పాత్రం అని పేళ్లు. అది అరవైనాలుగు పలాలు.

చతుర్భి రాఢకై ర్ద్రోణః కలశో నల్వణోర్మణః
ఉన్మానం చ ఘటో రాశి ర్ద్రోణపర్యాయసంజ్ఞితః ॥

నాలుగు ఆఢకాలొక ద్రోణం. కలశం, నల్వణం, అర్మణం, ఉన్మానం, ఘటం, రాశి— అనిన్నీ దానికి పేర్లు.

ద్రోణాభ్యాం శూర్పకుంభౌ చ చతుష్షష్టిశరావకః
శూర్పాభ్యాం చ భవే ద్ద్రోణీ వాహో గోణీ చ సా స్మృతా ॥

రెండు ద్రోణాలు ఒక శూర్పం. దానికే కుంభం అనిన్నీ పేరు. అది అరవైనాలుగు శరావాలు. రెండు శూర్పాలు ఒక ద్రోణి, వాహం గోణి అని దానికే పేర్లు.

ద్రోణీచతుష్టయం ఖారీ కథితా సూక్ష్మబుద్ధిభిః
చతుస్సహస్రపలికా షణ్ణవత్యధికా చ సా
పలానాం ద్విసహస్రం చ భార ఏకః ప్రకీర్తితః
తులా పలశతం జ్ఞేయా సర్వత్రైవైష నిశ్చయః ॥

నాలుగు ద్రోణులొక ఖారి. ఇది నాలుగువేల తొంభైఆరు పలాలు. రెండువేల పలాలు ఒక భారం. నూరు పలాలు ఒక తుల.

గుంజాదిమాన మారభ్య యావత్స్యాత్కుడవస్థితిః
ద్రవార్ద్రశుష్కద్రవ్యాణాం తావన్మానం సమం మతమ్
ప్రస్థాది మాన మారభ్య ద్విగుణం త ద్ద్రవార్ద్రయోః
మానం తథా తులాయాస్తు ద్విగుణం నక్వచిత్స్మృతమ్

గుంజా ప్రమాణం మొదలు కుడవ ప్రమాణం దాకా ద్రవద్రవ్యాలూ, ఆర్ద్రద్రవ్యాలూ, శుష్కద్రవ్యాలూ ఎంత చెబితే అంతే వేసుకోవాలి. ప్రస్థం మొదలు అయితే ద్రవ ద్రవ్యాలూ, ఆర్ద్రద్రవ్యాలూ రెట్టింపు వేసుకోవాలి. తుల అయితే మాత్రం ద్విగుణం అక్కర్లేదు.

# మానపరిభాష

---

| | | | |
|---|---|---|---|
| 6 ఆవాలు | ... | ... | ఒక యవ |
| 3 యవలు (లేక 4 వడ్లగింజలు) | | ... | ఒక గుంజ లేక రతి. |
| 12 రతులు లేక గుంజలు | | ... | ఒక మాషం (రెండువరాల యెత్తు) |
| 4 మాషాలు | ... | ... | ఒక శాణం (అరతులం) |
| 2 శాణాలు | ... | ... | ఒక కోలం (ఒక తులం) |
| 2 కోలాలు | ... | ... | ఒక కర్షం. |
| 2 కర్షాలు | ... | ... | ఒక శుక్తి. |
| 2 శుక్తులు | ... | ... | ఒక పలం |
| 2 పలాలు | ... | ... | ఒక ప్రసృతి. |
| 2 ప్రసృతులు | ... | ... | ఒక కుడవం. (32 తులాలు) |
| 2 కుడవాలు | ... | ... | ఒక శరావం (64 తులాలు) |
| 2 శరావాలు | ... | ... | ఒక ప్రస్థం (128 తులాలు) |
| 4 ప్రస్థాలు | ... | ... | ఒక ఆఢకం. |
| 4 ఆఢకాలు | ... | ... | ఒక ద్రోణం. |
| 2 ద్రోణాలు | ... | ... | ఒక కుంభం. |
| 2 కుంభాలు | ... | ... | ఒక గోణి. |
| 4 గోణీలు | ... | ... | ఒక ఖారి. |
| 100 పలాలు | ... | ... | ఒక తుల. |
| 2000 పలాలు | ... | ... | ఒక భారం. |

గమనిక :—

ఇది భైషజ్యరత్నావళిలో వున్న పథకం అనుసరించి వేశాను. మొదట్నుంచీ నేనీ మానపరిభాషే వాడుతున్నాను. తెనుగుదేశంలో 4 తులాల పలం వాడుకలో వుండడం యెరుగుదును. ఔషధాలు చెయ్యడంలో లెక్కింపు కావడం తప్ప ఈ రెండు పథకాల్లోనూ విప్రతిపత్తి లేనమూ లేదు. వాడడంలో మాత్రం కొంచెం సర్దుబాటు చేసుకుంటే సరిపోతుంది.

# కషాయాలు

## కషాయ కల్పన

పానీయం షోడశగుణం క్షుణ్ణే ద్రవ్యపలే క్షిపేత్
మృత్పాత్రే క్వాథయే ద్గ్రాహ్య మష్టమాంశావశేషితమ్
కర్షాదౌ తు పలం యావ ద్దద్యాత్ షోడశికం జలమ్
తత స్తు కుడవం యావ త్తోయ మష్టగుణం క్షిపేత్
చతుర్గుణ మత శ్చోర్ధ్వం యావ త్ప్రస్థాదికం జలమ్
తజ్జలం పాయయే ద్ధీమా న్కోష్ణం మృద్వగ్ని సాధితమ్
శృతః క్వాథః కషాయ శ్చ నిర్యూహః స నిగద్యతే
మాత్రోత్తమా పలేన స్యా త్త్రిభి రక్షైస్తు మధ్యమా
జఘన్యా తు పలార్ధేన స్నేహక్వాథౌషధేషు చ॥

కషాయం కాచవలసిన ద్రవ్యం పచ్చిదైనా ఎండుదైనా ముందు మెత్తగా చితక్కొట్టాలి. ఆ ద్రవ్యం ఒక పలం గ్రహించి 16 రెట్లు నీళ్ళలో కలిపి ఎనిమిదో వంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. కషాయం మట్టిపాత్రలో కాచడం మంచిది.

ఆ కషాయద్రవ్యం కర్షం మొదలు పలందాకా వుంటే నీళ్ళు 16 రెట్లు చేర్చాలి. పలం మొదలు కుడవం దాకా వుంటే 8 రెట్లు జలం చేర్చాలి. కుడవం మొదలు ప్రస్థం దాకా వుంటే 4 రెట్లు జలం చేర్చాలి. కషాయం సన్నని మంటమీద కాచాలి. అది గోరువెచ్చగా ఉండగా పుచ్చుకోవాలి. కషాయానికి శృతం అనీ, క్వాథ అనీ, నిర్యూహం అనీ పర్యాయపదాలు. కషాయం ఉత్తమమాత్ర ఒక పలం. మధ్యమమాత్ర 6 తులాలు. అధమమాత్ర అరపలం, అంటే నాలుగు తులాలు.

అపిధానముఖే పాత్రే జలం దుర్జలతాం వ్రజేత్
తస్మా దావరణం త్యక్త్వా క్వాథాదీనాం వినిశ్చయః॥

కషాయం కాచేటప్పుడు పాత్రమీద మూత పెడితే జలం చెడిపోతుంది కనక మూత వెయ్యకుండా కాచాలి.

## కషాయంలో శర్కరాదులు

క్వాథే క్షిపేత్సితా మంశైః చతుర్థాష్టమషోడశైః
వాతపిత్తకఫాతంకే విపరీతం మధు స్మృతమ్॥

కషాయంలో చక్కెర చేర్చవలసివుంటే, వాతవ్యాధులలో ఇచ్చే కషాయంలో నాలుగోవంతూ, పిత్తవ్యాధులలో ఇచ్చే కషాయంలో ఎనిమిదోవంతూ, కఫవ్యాధులలో ఇచ్చే కషాయంలో పదహారోవంతూ చేర్చాలి. తేనె అయితే యిందుకు తల్లక్రిందులుగా చేర్చాలి. అంటే, తేనె వాతవ్యాధిలోయిచ్చే కషాయంలో 16 వ వంతూ, పిత్తవ్యాధిలో ఇచ్చే కషాయంలో యెనిమిదోవంతూ, కఫవ్యాధిలో ఇచ్చే కషాయంలో నాలుగోవంతూ చేర్చాలి.

## ఉష్ణ శైత్యాలు

శుద్ధపిత్తే శృతం శీతం ఉష్ణం వాతకఫామయే
స్నిగ్ధోష్ణం కేవలే వాతే కదుష్ణం సర్వరోగనుత్ ॥

కేవల పిత్తరోగంలో యిచ్చే కషాయం చల్లగా వుండాలి. వాత కఫాలలో ఇచ్చే కషాయం వేడిగా వుండాలి. కేవలవాతంలో ఇచ్చే కషాయం గోరువెచ్చగా వుండాలి. గోరువెచ్చనిది సర్వరోగాలూ హరిస్తుంది.

## కాగుపాత్రలు

శ్రేష్ఠం విషఘ్నం సౌవర్ణే మధ్యమం రాజతే బలమ్
తామ్రపాత్రేఽధమం ప్రోక్తం న నింద్యం మృణ్మయేషు తు॥

కషాయం బంగారపుపాత్రలో కాచడం చాలామంచిది. ఆ కషాయం విషాలు హరిస్తుంది. వెండిపాత్రలో కాచడం మధ్యమం. ఆ కషాయం బలకరం. రాగిపాత్రలో కాచడం మిక్కిలి అధమం. నింద్యం. ఎలాంటి సందర్భంలోనూ కూడా రాగిపాత్రలో కాచకూడదు. మట్టిపాత్రలో కాచడం చెడ్డది కాదు.

ఇమనికి ఒకే కషాయాలు, ఫాంటు, క్వాథ అనే పేరుతో కొన్ని కంపెనీలవారు అమ్ముతున్నారు. కషాయాలు నిలవ ఉండేటట్లు మంచి ఉపాయాలు అవలంబించే వారలా చేస్తున్నారు. అలా చెయ్యడం చెడ్డది కాదు; గాని ఎప్పటికప్పుడు తయారు చేసుకోవడమే మంచిది.

## క్వాథ చూర్ణాలు

మరిన్ని, కొన్ని కంపెనీలవారు కషాయద్రవ్యాలు అన్నీ కలిపి నూరిపొడి చేసి అమ్ముతున్నారు. వస్తుసంపాదనకు ఇందువల్ల కష్టం లేకపోవచ్చు గాని, రెండు మాసాలు దాటితే చూర్ణాలు శక్తిహీనా లయిపోతాయి. ఈ సందర్భంలో అంగడి క్వాథచూర్ణాలు కొని వాడుకోడం దండుగే కాదు, అపాయకరమున్నూ కూడా. వైద్యులూ, రోగులూ కూడా మూలికలు ఎప్పటికప్పుడే చేర్చి, సంసిద్ధం చేసి వాడుకోడం శ్రేయస్కరం.

### ౧ దశమూల కషాయం

శాలిపర్ణీ పృశ్నిపర్ణీ బృహతీద్వయగోక్షురైః
బిల్వాగ్నిమంథశ్యోనాకకాశ్మరీ పాటలాయుతైః
దశమూల మితి ఖ్యాతం క్వథితం తజ్జలం పిబేత్
పిప్పలీచూర్ణసంయుక్తం వాతశ్లేష్మజ్వరాపహమ్
సన్నిపాతజ్వరహరం సూతికాదోషనాశనమ్
శోషశైత్యభ్రమస్వేదకాసశ్వాసవికారనుత్
హృత్కంఠగ్రహపార్శ్వార్తితంద్రామస్తకశూలహృత్

శాలిపర్ణి, పృశ్నిపర్ణి, వాకుడు, పెద్దములక, పల్లేరు, మారేడు, నెల్లి, దుండిలం, పెగ్గుమ్మడు, కలిగొట్టు—ఇవి దశమూలాలు. వీటికషాయం పిప్పలీచూర్ణం కలిపి పుచ్చుకుంటే వాతశ్లేష్మజ్వరాలు తగ్గిస్తుంది. సన్నిపాతజ్వరాలు, సూతికాదోషాలు, శోష, శైత్యం, భ్రమ, చెమట, దగ్గు, వగర్పు, హృద్రోగం, కంఠగ్రహం, పక్కలనొప్పి, తంద్ర, తలనొప్పి తగ్గించేస్తుంది.

### ౨ మహారాస్నాది కషాయం

రాస్నా ద్విగుణభాగా స్యా దేకభాగా స్తతః పరే
ధన్వయాస బలైరండ దేవదారు శటీ వచా
వాసకో నాగరం పథ్యా చవ్యా ముస్తా పునర్నవా
గుడూచీ వృద్ధదారుశ్చ శతపుష్పా చ గోక్షురః

అశ్వగంధా ప్రతివిషా కృశమూల శ్శతావరీ
కృష్ణా సహచర శ్చైవ ధాన్యకం బృహతీద్వయమ్
ఏభిః కృతం పిబే త్క్వాథం శుంఠీచూర్ణేన సంయుతమ్
కృష్ణాచూర్ణేన వా యోగరాజగుగ్గులునాఽథవా
అజమోదాదినా వాపి తైలే నైరండజేన వా
సర్వాంగకంపే కుబ్జత్వే పక్షాఘాతేఽథ బాహుకే
గృధ్రస్యా మామవాతే చ శ్లీపదే చాపతానకే
అంత్రవృద్ధౌ తథాధ్మానే జంఘాజానుగతేఽర్దితే
శుక్రామయే మేఢ్రరోగే వంధ్యాయోన్యామయేషు చ
మహారాస్నాది రాఖ్యాతో బ్రహ్మణా గర్భకారణమ్॥

సన్నరాష్ట్ర రెండుభాగాలు. దూలగొండి వేళ్లు, బల, ఆముదపువేళ్లు, దేవదారు, కచ్చూ రాలు, వస, అడ్డసరపువేళ్లు, సొంటి, కరకపొలుసు, చవ్యం, తుంగముస్తలు, గలిజేరు, తిప్పతీగ, వృద్ధదారు, సదాప, పల్లేరువేళ్ళు, పెన్నేరు, అతివస, రేలగుజ్జు, పిల్లితేగలు, పిప్పళ్ళు, పచ్చగోరింట, ధనియాలు, వాకుడు, పెద్దములక, —ఇవి ఒక్కొక్కభాగం ఈ మూలిక లన్నీ యెంతయెత్తో అంత కెనిమిదిరెట్లు నీళ్ళు పోసి నాలుగోవంతు మిగి లేటట్టు కాచి వడబోసి పుచ్చుకునేది.

ఈ కషాయంలో సొంటిచూర్ణం గాని, పిప్పళ్ళచూర్ణం గాని, అజామోదం గాని, ఆముదంగాని, మహాయోగరాజగుగ్గులుగాని, (రోగిప్రకృతి ననుసరించి) కలిపి పుచ్చుకుంటే సర్వాంగకంపవాతం, కుబ్జత్వం, పక్షవాతం, అపబాహుకం, గృధ్రసి, ఆమవాతం, శ్లీపదం, అపతానకం, అంత్రవృద్ధి, ఆధ్మానం, జంఘ—జానువు లాశ్ర యించిన వాతం, శుక్రవాతం, మేఢ్రరోగం, వంధ్యారోగం, పోగొడుతుంది.

### 3 ఖర్జూరాదికషాయం

ఖర్జూర యష్టి కాశ్మీర మృద్వీకా పద్మకేసరమ్
ధాత్రీ పరూషకం వ్యాఘ్రీ చ బలాయుగ్మం చ చందనమ్
మధూకపుష్ప కాశ్మర్యం తోయై శ్చైవ చతుర్గుణైః
పక్వం పర్యుషితం రాత్రౌ స్థితం భాండే నవే దృఢే
లాజాచూర్ణ ప్రతీవాపం శర్కరా మధుసంయుతమ్

తృష్ణాదాహహరం పానే జాతీపుష్పాధివాసితమ్
మూర్ఛా దాహ భ్రమం హంతి దీప్తం గృహ మివాంబునా ॥

ఖర్జూరపుపండు, యష్టిమధుకం, కుంకుమపువ్వు, ద్రాక్షపండు, పద్మకేసరాలు, ఉసిరిక పప్పు, చిట్టీతపండు, వాకుడు, బల, అతిబల, చందనం, ఇప్పపువ్వు, పెద్దముస్తలు, — ఇవి సమభాగాలు. వీటికి నాలుగురెట్లు నీళ్ళు చేర్చి నాలుగోవంతు మిగిలేటట్లు కాచి వడబోసి పుచ్చుకునేది.

ఇది కొత్తకుండలో పోసి అందులో కొంచెం పేలపిండి, పంచదార, జాపత్రి వేసి ఒకరాత్రి ఉంచి మర్నాడు పుచ్చుకుంటే దప్పి, తాపం, మూర్ఛ, భ్రమ పోగొడుతుంది.

## ౪ బృహన్మంజిష్ఠాదికషాయం

మంజిష్ఠా ముస్త కుటజ గుడూచీ కుష్ఠ నాగరైః
భార్గీ క్షుద్రా వచా నింబ నిశాద్వయ ఫలత్రికైః
పటోల కటుకా మూర్వా విడంగాసన చిత్రకైః
శతావరీ త్రాయమాణా కృష్ణేంద్రయవ వాసకైః
భృంగరాజ మహాదారు పాఠా ఖదిర చందనైః
త్రివృ ద్వరుణ కైరాత వాకుచీ కృతమాలకైః
శాఖోటక మహానింబ కరంజాతివిషా జలైః
ఇంద్రవారుణికానంతా శారిబా పర్పటై స్సమైః
ఏభిః కృతం పిబే త్క్వాథం కృష్ణా గుగ్గులుసంయుతమ్
అష్టాదశసు కుష్ఠేషు వాతరక్తార్దితే తథా
ఉపదంశే శ్లీపదే చ ప్రసుప్తౌ పక్షఘాతకే
మేదోదోషే నేత్రరోగే మంజిష్ఠాదిః ప్రశస్యతే ॥

మంజిష్ట, తుంగముస్తలు, కొడిశపాలపట్ట, తిప్పతీగ, చెంగల్వకోష్టు, సొంటి, గంటు భారంగి, వాకుడు, వస, వేపపట్ట, పసుపు, మానుపసుపు, కరకవొలుపు, తాడికాయ బెరడు, ఉసిరికపప్పు, చేదుపొట్ల, కటుకరోహిణి, చాగనార, విడంగాలు, వేగిసపట్ట, చిత్రమూలం, పిల్లితేగలు, కలుగానుగ, పిప్పళ్లు, పాలకొడిశవిత్తులు, అడ్డసరం, గుంట

కలగర, దేవదారు, పాఠ, చంద్రచేన, రక్తచందనం, తెగడ, ఊలిమిరిపట్ట, నేలవేము, బావంచాలు, లేలగజ్జు, పేకపట్ట, పెనువేప, గానుగచెక్క, అతివస, కరువేరు, చేదుపుచ్చ, సుగంధి, పాలసుగంధి, పర్పాటకం—ఇవి సమభాగాలు.

ఇవన్నీ మెత్తగా చితకగొట్టి ఎనిమిదిరెట్ల నీళ్ళలో కలిపి, ఎనిమిదోవంతు మిగిలేటట్లు కాచి వడబోసుకుని, పిప్పళ్ళచూర్ణమైనా, మహిషాక్షిగుగ్గిలం అయినా కలిపి పుచ్చుకుంటే సర్వ కుష్ఠురోగాలూ, వాతరక్తమూ, అర్దితవాతరక్తమూ, ఉపదంశమూ, శ్లీపదమూ. పక్షవాతమూ, స్పర్శజ్ఞానం లేకపోవడం, కొవ్వు. నేత్రరోగాలూ పోగొడుతుంది.

## ౫ పథ్యాదికషాయం

పథ్యాక్షధాత్రీభూనింబ నిశానింబామృతాయుతైః
కృతః క్వాథః షడంగోయం సగుడ శ్శీర్ష శూలహా
భ్రూశంఖకర్ణశూలాని తథార్ధశిరసోరుజమ్
సూర్యావర్తం శంఖకం చ దంతపాతం చ తీవ్రుజమ్
నక్తాంధ్యం పటలం శుక్రం చక్షుఃపీడాం వ్యపోహతి ॥

కరకపొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, నేలవేము, పసుపు, వేపపట్ట, తిప్పతీగ—ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి బెల్లం కలిపి పుచ్చుకుంటే తలనొప్పి, కనుబొమ్మలలోనూ, చెవులలోనూ కలిగే పోట్లూ, పెడ తలనొప్పి, సూర్యావర్తమూ, శంఖకమూ, దంతాలూడిపోడమూ, పళ్ళపోటూ, రేచీకటి, కంటిజబ్బులూ పోగొడుతుంది.

## ౬ అభయాదికషాయం

అభయా ముస్త ధాన్యాక రక్తచందనపద్మకైః
వాసకేంద్రయవోశీరా గుడూచీకృతమాలకైః
పాఠానాగరతిక్తాభిః పిప్పలీచూర్ణయు క్కృతమ్
పిబే త్త్రిదోషజ్వరజి త్పిపాసా దాహ కాసనుత్
ప్రలాప శ్వాస తంద్రాఘ్నం దీపనం పాచనం పరమ్

విణ్మూత్రానిలవిష్టంభ వమీ శోషా రుచిచ్ఛిదమ్ ॥

కరకవోలుపు తుంగముస్తలు, ధనియాలు, రక్తచందనం, పద్మకాష్ఠం, ఆడ్డసరం, కొడిశపాలవిత్తులు, వట్టివేరు, తిప్పతీగ, రేలగుజ్జు, పాఠ, సొంటి, కటుకరోహిణి,—ఇవి కషాయం కాచి పిప్పళ్ళచూర్ణం కలిపి పుచ్చుకుంటే త్రిదోషజ్వరాలు పోగొడుతుంది. దప్పిక, మంటలు, దగ్గు, ప్రలాపం, శ్వాసలు, తంద్ర, మలమూత్రవాయుబంధం, వాంతులు, శోష, అరుచి తగ్గించేస్తుంది. ఆమపచనం చేస్తుంది. ఆకలి పుట్టిస్తుంది.

## ౬ దేవదార్వాది కషాయం

దేవదారు వచా కుష్ఠం పిప్పలీ విశ్వభేషజమ్
కట్ఫలం ముస్త భూనింబ తిక్తా ధాన్యా హరీతకీ
గజకృష్ణా చ దుస్పర్శా గోక్షురో ధన్వయాసకమ్
బృహ త్యతివిషా ఛిన్నా కర్కటం కృష్ణజీరకమ్
క్వాథ మష్టావశేషం తు ప్రసూతాం పాయయే త్స్త్రియమ్
శూలకాసజ్వరశ్వాసమూర్ఛా కంపశిరో ర్తిజిత్ ॥

దేవదారు, వస, చెంగల్వకోష్ఠు. పిప్పళ్లు, సొంటి, కాయఫలం, తుంగముస్తలు, నేలవేము, కటుకరోహిణి, ధనియాలు, కరకవోలుపు, గజపిప్పళ్లు. దురదగొండి, పల్లేరు, పెద్దములక, అతివస, తిప్పతీగ, కర్కాటకశృంగి, నల్లజీలకర్ర.—ఇవి మెత్తగా చితకగొట్టి, నాలుగురెట్లు నీళ్ళుచేర్చి ఎనిమిదోవంతు మిగిలేటట్టు కాచి వడబోసి పుచ్చుకునేది.

ఇది ప్రసవించిన స్త్రీలకు చాలా మంచిది. శూల, దగ్గు, జ్వరం, వగర్పు, మూర్ఛ, వణుకు, తలనొప్పి పోగొడుతుంది.

## ౭ త్రిఫలాది కషాయం

త్రిఫలా దేవదారు శ్చ ముస్తా మూషకకర్ణికా
శిగ్రు రేతైః కృతః క్వాథః పిప్పలీచూర్ణసంయుతః
విడంగచూర్ణయుక్త శ్చ క్రిమిఘ్నః కృమిరోగహా ॥

కరక, తాడి, వుసిరికలు, దేవదారు, తుంగముస్తలు, ఎలకచెవియాకు, మునగచెక్క— వీటి సమభాగాలతో కషాయం కాచి అందులో పిప్పళ్ళచూర్ణం అయినా, వాయు విళంగాల చూర్ణం అయినా కలిపి పుచ్చుకుంటే కృములు నశిస్తాయి. కృమిరోగాలున్ను తగ్గిపోతాయి.

## ౯ పునర్నవాది కషాయం

పునర్నవా దారునిశా నిశా శుంఠీ హరీతకీ
గుడూచీ చిత్రకో భార్గీ దేవదారు చ తైః శ్రృతః
పాణిపాదోదరముఖ ప్రాప్తం శోఫం వినాశయేత్॥

గలిజేరు, మానుపసుపు, పసుపు, సొంటి, కరక్కాయ, తిప్పతీగ, చిత్రమూలం, గంటు భారంగి, దేవదారు— ఇవి సమభాగాలుగా కషాయం కాచి పుచ్చుకుంటే చేతులు కాళ్లు, కడుపు, మొగం— ఈ స్థలాలలో పుట్టే ఉబ్బు తగ్గిపోతుంది.

## ౧౦ దార్వ్యాది కషాయం

దార్వీ రసాంజనం ముస్తం భల్లాత శ్రీఫలం వృషః
కైరాతశ్చ పిబే దేషాం క్వాథం శీతం సమాక్షికమ్
జయే త్సశూలం ప్రదరం పీతశ్వేతాసితారుణమ్॥

మానుపసుపు, రసాంజనం, తుంగముస్తలు, జీడిగింజలు, మారేడు, అడ్డసరం, నేల వేము,— ఇవి సమభాగాలుగా కషాయం కాచి పుచ్చుకుంటే పసుపు, తెలుపు, నలుపు, ఎరుపు ప్రదరం శూలతో కూడా వున్నది తగ్గిపోతుంది.

## ౧౧ మంజిష్ఠాది కషాయం

మంజిష్ఠా త్రిఫలా తిక్తా వచా దారునిశా మృతా
నింబ శ్చైషాం కృతః క్వాథో వాతరక్తవినాశనః
పామా కాపాలికాకుష్ఠ రక్తమండలజిన్మతః॥

మంజిష్ఠ, కరక, తాడి, వుసిరికలు, కటుకరోహిణి, వస, మానుపసుపు, తిప్పతీగ, వేపపట్ట— ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి పుచ్చుకుంటే వాతరక్తం

పోగొడుతుంది. పాము, కపాలిక, రక్తమండలం—ఇత్యాది కుష్ఠురోగాలన్నీ నశింప చేస్తుంది.

## ౧౨ అమృతాష్టకకషాయం

అమృతారిష్టకటుకా ముస్తేంద్రయవనాగరైః
పటోలచందనాభ్యాం చ పిప్పలీచూర్ణయుక్కృతమ్
అమృతాష్టక మేతచ్చ పిత్తశ్లేష్మజ్వరాపహమ్
ఛర్ద్యరోచకహృల్లాసదాహతృష్ణానివారణమ్॥

తిప్పతీగ, వేపపట్ట, కటుకరోహిణి, తుంగముస్తలు, కొడిశపాలవిత్తులు, సొంటి, చేదు పొట్ల, రక్తచందనం—ఇది అమృతాష్టకం. ఇది కషాయం కాచి, అందులో పిప్పళ్ళ చూర్ణం కలిపి పుచ్చుకుంటే పిత్తజ్వరాలూ, శ్లేష్మజ్వరాలూ, పోగొడుతుంది ఛర్ది, అరోచకం, హృల్లాసం, తాపం, దప్పికయున్నూ, తగ్గించేస్తుంది.

## ౧౩ వాసాదికషాయం

వాసా ద్రాక్షా భయా క్వాథః పీతః సక్షౌద్రశర్కరః
నిహంతి రక్తపిత్తార్తిం శ్వాసకాసాన్ సుదారుణాన్॥

అడ్డసరం, ద్రాక్షపండు, కరకపొలుపు, ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయంకాచి అందులో తేనె, చక్కెరా కలిపి పుచ్చుకుంటే రక్తపిత్తం, దగ్గు, వగర్పు పోగొడు తుంది.

## ౧౪ భూనింబాద్యష్టాదశాంగకషాయం

భూనింబ దారు దశమూల మహౌషధాబ్ద
తిక్తేంద్రబీజధని కేభకణా కషాయః
తంద్రాప్రలాప కసనారుచిదాహమోహా
శ్వాసాదియుక్త మఖిలజ్వర మాశు హంతి॥

నేలవేము, మానుపసుపు, దశమూలాలు—అంటే మారేడు, దుండిగం, గుమ్మడి, కలి గొట్టు, తక్కోల, ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు, సొంటి, తుంగముస్తలు, కటుకరోహిణి, కొడిశపాలవిత్తులు, ధనియాలు, గజపిప్పళ్ళు,

ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి పుచ్చుకుంటే తంద్ర, ప్రలాపం, దగ్గు, అరుచి, తాపం, మోహం, వగర్పు మొదలైన దుర్లక్షణాలు గల జ్వరం తగ్గిపోతుంది.

## ౧౫ వత్సకాదికషాయం

సవత్సక స్సాతివిషః సబిల్వః
సోదీచ్య ముస్తం చ కృతః కషాయః
సామే సశూలే సహ శోణితే చ
చిరప్రవృత్తేఽపి హితోఽతిసారే॥

కొడిశచెక్క, అతివస, మారేడు, కురువేరు, తుంగముస్తలు—ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి పుచ్చుకుంటే ఆమశూల, అతిసారం, రక్తాతిసారం—ఎంత కాలంగా వున్నవైనా తగ్గిపోతాయి.

## ౧౬ కంటకార్యాదికషాయం

కంటకారీయుగద్రాక్షా వాసా కచ్ఛూరవాలకైః
నాగరేణ చ పిప్పల్యా క్వథితం సలిలం పిబేత్
శర్కరామధుసంయుక్తం పిత్తకాసహరం పరమ్॥

వాకుడు, ములక, ద్రాక్షపండు, అడ్డసరం, కచ్చూరాలు, కురువేరు, సొంటి, పిప్పళ్ళు—ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి అందులో చక్కెరా, తేనె కలిపి పుచ్చుకుంటే పైత్యంవల్ల వచ్చిన దగ్గులు హరిస్తాయి.

## ౧౭ మరీచ్యాదికషాయం

మరిచ భృంగి మహౌషధి కుండలీ
కసనహా వృష వృశ్చిక భార్గిభిః
క్వథిత మంబు కణారజసాన్వితమ్
శ్వసనహృత్ క్షయకాసవినాశనమ్॥

మిరియాలు, గుంటకలగర, సొంటి, నల్లపుప్పి, కసింత, అడ్డసరం, గలిజేరు, గంటుభారంగి

రంగి—ఇవి సమభాగాలుగా కషాయంపెట్టి పిప్పళ్ళచూర్ణం కలిపి పుచ్చుకుంటే వగర్పు, క్షయ, దగ్గు పోగొడుతుంది.

## ౧౮ ధాత్ర్యాదికషాయం

ధాత్రీ చ మాగధీ శుంఠీ క్వాథ స్త్వేషాం సితాయుతః
హినస్తి హృదయోద్భూతాం హిక్కాం ప్రాణాపహోదినీమ్॥

ఉసిరిపప్పు, పిప్పళ్లు, సొంటి—ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి అందులో చక్కెర కలిపి పుచ్చుకుంటే ఎంత అసాధ్యపు ఎక్కిళ్ళయినా పోగొడుతుంది.

## ౧౯ అశ్వత్థాదికషాయం

అశ్వత్థోదుంబరప్లక్ష వట వేతసజైర్కృతః
వ్రణశోఫోపదంశానాం నాశనః క్షాళనా త్స్మృతః॥

రావిపట్ట, మేడి (అత్తి) పట్ట, జువ్విపట్ట, మర్రిపట్ట, ప్రబ్బలి—ఇవి సమభాగాలుగా కషాయంపెట్టి దానితో కడిగితే వ్రణాలు, ఉబ్బు, సవాయిపుండ్లు తగ్గిపోతాయి.

## ౨౦ గోక్షురాదికషాయం

సమూలగోక్షురక్వాథ స్సితామాక్షిక సంయుతః
నాశయే న్మూత్రకృచ్ఛ్రాణి తథా చోష్ణసమీరణమ్॥

పల్లేరు సమూలంగా కషాయం కాచి అందులో చక్కెరా, తేనే కలిపి పుచ్చుకుంటే మూత్రకృచ్ఛ్రాలు, ఉష్ణవాతమూ హరించిపోతాయి.

## ౨౧ పిప్పల్యాదికషాయం

పిప్పలీ పిప్పలీమూలం చవ్యచిత్రకనాగరైః
వచా సాతివిషా జాజీ పాఠా వత్సక రేణుకైః
కిరాతతిక్తకం మూర్వా సర్షపా మరిచాని చ
కటుకం పుష్కరం భార్గీ విడంగం కర్కటాహ్వయమ్

అర్క మూలం బృహత్సింహీ శ్రేయసీ సదురాలభా
దీప్యకం చాజమోదా చ శుకనాసాది హింగుభిః
ఏతాని సమభాగాని గణోష్టావింశతో మతః
కషాయ ముపభుంజీత వాతశ్లేష్మజ్వరాపహమ్
హంతి వాతం తథా శీతం ఛేదజం ప్రబలం కఫమ్
ప్రలాపం చాతినిద్రాం చ రోమహర్షారుచీ తథా
మహావాతేఽపతంత్రే చ సర్వగాత్రే చ శూన్యతామ్
అయం సర్వజ్వరాన్ హంతి సన్నిపాతాం త్రయోదశ॥

పిప్పళ్లు, పిప్పలిమూలం, చవ్యం, చిత్రమూలం, సొంటి, వస, అతివస, జీలకర్ర, పాఠ, కొడిశపాలవిత్తులు, రేణుకలు, నేలవేము, చాగనార, ఆవాలు, మిరియాలు, కటుక రోహిణి, పుష్కరమూలం, గంటుభారంగి, వాయువిడంగాలు, కటుకరోహిణి, జిల్లేడు వేరు, పెద్దములక, కరకవోలుపు, దూలగొండివిత్తులు, వాము, అజామోదం, దుంది లం, ఇంగువ—ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి పుచ్చుకుంటే వాత శ్లేష్మజ్వరాలు, వాతం, శైత్యం, కఫం, ప్రలాపం, అతినిద్ర, గగుర్పాటు, అరుచి, మహావాతం, అపతంత్రకం, స్పర్శజ్ఞానశూన్యత, సకలజ్వరాలు హరిస్తుంది. సన్నిపాత జ్వరాలు అమోఘంగా తగ్గించేస్తుంది.

### ౨౨ న్యగ్రోధాదిగణ కషాయం

న్యగ్రోధ ప్లక్ష కోశామ్ర వేతసో బదరీతుణీః
మధుయష్టి ప్రియాళు శ్చ లోధ్రద్వయ ముదుంబరః
పిప్పల శ్చ మధూక శ్చ తథా పారిసపిప్పలః
సల్లకీ తిందుకీ జంబూద్వయ మామ్రమతరు శ్శివా
కదంబ కకుభా శ్చైవ భల్లాతకఫలాని చ
న్యగ్రోధాదిగణక్వాథం యథాలాభం చ కారయేత్
అయం క్వాథో మహాగ్రాహీ వ్రణ్యో భగ్నం చ నాశయేత్
యోనిదోషహరో దాహ మేదో మేహ విషాపహః॥

మద్రిపట్ట, జువ్విపట్ట, తుమ్మెదమామిడి, ప్రబ్బలి, రేగుపట్ట, నందిపట్ట, యష్టిమధుకం. మొరలిపట్ట, లొద్దుగుచెక్క, మేడిపట్ట, రావిపట్ట, ఇప్పపట్ట, గంగరావిపట్ట, ఆందుగుచెక్క, తుమికిచెక్క, నేరేడుపట్ట, అల్లనేరేడుపట్ట, మామిడిపట్ట, కరకవాలుప్ప, కడిమిపట్ట, మద్దిపట్ట, నల్లజీడిగింజలు,—ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి పుచ్చుకుంటే మలబంధం పుట్టిస్తుంది. యోనిదోషం, తాపం, మేహరోగం, మేహరోగం హరిస్తుంది. దీనితో వ్రణాలూ, గాయాలూ కడిగితే త్వరగా మాని పోతాయి.

## ౨౩ నాగరాది కషాయం

నాగరస్య పిబే దుష్ణం కషాయం చాగ్నివర్ధనమ్
కాసశ్వాసానిలహరం శూలహృద్రోగనాశనమ్॥

సొంటి కషాయంపెట్టి వేడివేడిగా ఉండగా పుచ్చుకుంటే ఆకలి వృద్ధిచేస్తుంది. దగ్గు, వగర్పు, వాతం, శూల, హృద్రోగాలు నశింపచేస్తుంది.

## ౨౪ పటోలాది కషాయం

పటోలం త్రిఫలా తిక్తా గుడూచీ చ శతావరీ
ఏషః క్వాథో జయే త్తీవ్రో వాతాస్రం దాహసంయుతమ్॥

చేదుపొట్ల, కరకవలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, కటుకరోహిణి, తిప్పతీగ, పిల్లితేగలు,—ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి పుచ్చుకుంటే మంటగల వాతరక్తం నశిస్తుంది.

## ౨౫ మహౌషధాది కషాయం

మహౌషధామృతాభవః కషాయక శ్చ సేవితః
హినస్తి చామమారుతం చిరాయు సంధి సంశ్రితమ్॥

సొంటి, తిప్పతీగ—ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి పుచ్చుకుంటే కీళ్ళవాతం త్వరగా తగ్గిపోతుంది.

## ౨౬. బృహద్వాసాది కషాయం

వాసా హరిద్రా ధనికా గుడూచీ
భార్గీ కణా పౌష్కర రింగణీనామ్
క్వాథేన మారీచరజోన్వితేన
శ్వాసః క్షయం యాతి న కస్య పుంసః॥

అడ్డసరం, పసుపు, ధనియాలు, తిప్పతీగ, గంటుభారంగి, పిప్పళ్ళు, పుష్కరమూలం, వాకుడు—ఇవి సమభాగాలుగా గ్రహించి కషాయం కాచి అందులో మిరియాల చూర్ణం కలిపి పుచ్చుకుంటే ఎలాంటి దగ్గులయినా తగ్గిపోతాయి.

---

# చూర్ణ ప్రకరణం

—0—

## చూర్ణ కల్పన

అత్యంతశుష్కం యద్ద్రవ్యం సుపిష్టం వస్త్రగాలితమ్
తత్స్యా చ్చూర్ణం రజః క్షోద స్తన్మాత్రా కర్షసమ్మితా
చూర్ణే గుడ స్సమో దేయ శ్శర్కరా ద్విగుణా మతా
చూర్ణేషు భర్జితం హింగు దేయం నోత్క్లేదకృ ద్భవేత్
లిహే చ్చూర్ణం ద్రవై స్సర్వై ర్ఘృతాద్యై ర్ద్విగుణోన్మితైః
పిబే చ్చతుర్గుణై రేవ చూర్ణ మాలోడితం ద్రవైః
చూర్ణావలేహగుటికాకల్కానా మనుపానకమ్
పిత్తవాత కఫాతంకే త్రిద్వ్యేకపల మాహరేత్
యథా తైలం జలే ప్రాప్తం క్షణే నైవ ప్రసర్పతి
అనుపానబలా దంగే తథా సర్పతి భేషజమ్
ద్రవేణ యావతా సమ్య క్చూర్ణం సర్వప్లుతం భవేత్
భావనాయాః ప్రమాణం తు చూర్ణే ప్రోక్తం భిషగ్వరైః॥

చూర్ణంలో చేర్చే ద్రవ్యాలు బాగా ఎండినవై ఉండాలి. అవి మెత్తగా దంచాలి. అది వస్త్రగాలితం చెయ్యాలి. చూర్ణం యెప్పుడూ అతిమెత్తగా వుండాలి. అంచేత చిక్కని వస్త్రంతో గాలితం చెయ్యడమే మంచిది, ఎంతవరకూ చూర్ణం రాలుతూ వుంటుందో అంతవరకూ మాలికలు దంచాలి, గాని కొంత చేసి మానగూడదు. మానేస్తే పాళ్లు సరిగా తేలవు.

చూర్ణానికి గజస్నూ దమూ అని మారుపేళ్లు, గుండ అని కూడా వాడకం వుంది.

చూర్ణం మోతాదు దినానికొక కర్షం.

చూర్ణంలో బెల్లం కలుపుకోవలసివుంటే సమంగానూ, చక్కెర అయితే రెండు రెట్లు చేర్చుకోవాలి,

ఇంగువ చేర్చవలసివుంటే వేయించినది కావాలి. పచ్చిది చేర్చగూడదు. పచ్చిది గాభరా పెడుతుంది.

నెయ్యి మొదలైన స్నేహద్రవ్యాలతో చూర్ణం పుచ్చుకోవలసివుంటే చూర్ణం కంటే రెండురెట్లు కలిపి నాకాలి. పాలూ, నీళ్ళూ, గోమూత్రమూ మొదలైన ద్రవద్రవ్యాలైతే చూర్ణానికి నాలుగురెట్లు చేర్చి బాగా కలిపి తాగాలి.

చూర్ణం—అవలేహం—గుటిక—కల్కం—వీటికి అనుపానద్రవ్యాలు. పిత్త వ్యాధిలో మూడుపలాలు. వాతవ్యాధిలో రెండుపలాలు. కఫవ్యాధిలో ఒక్కపలం ఇలా పుచ్చుకుంటే తైలబిందువు నీళ్ళలో వ్యాపంచేటట్టు ఔషధం శరీరం అంతటా వ్యాపిస్తుంది.

భావన చెయ్యవలసివుంటే నిమ్మరసం మొదలైన భావనారసాలు చెయ్యమునిగేటట్టు చేర్చుకోవాలి. అది యెండలో యెండబెట్టాలి. గడ్డకట్టి, ఎండి, మళ్ళీ చూర్ణం అయేదాకా ఎండబెట్టాలి. ఎన్ని రసాలతో భావనచేసినా, ఒక్కొక్క రసంతో ఎన్నిమార్లు చేసినా యిదే విధం. భావనా ప్రమాణం యిది.

## ౧ తాళీసాది చూర్ణం

తాళీసం మరిచం శుంఠీ పిప్పలీ వంశరోచనా
ఏక ద్వి త్రి చతుః పంచ కర్షై ర్భాగాన్ ప్రకల్పయేత్
ఏలాత్వచో స్తు కర్షార్థం ప్రత్యేకం భాగ మాహరేత్
ద్వాత్రింశత్కర్ష తులితా ప్రదేయా శర్కరా మతా
తాళీసాద్య మిదం చూర్ణం రోచనం పాచనం స్మృతమ్
కాసశ్వాసజ్వరహరం ఛర్ద్యతీసారనాశనమ్
శోషాధ్మానహరం ప్లీహగ్రహణీపాండురోగజిత్
పక్త్వా వా శర్కరాం చూర్ణం క్షిపే త్తాస్య ద్గుటికా తతః॥

తాళీసపత్రి ఒక భాగం, మిరియాలు రెండు భాగాలు, సొంటి మూడు భాగాలు. పిప్పళ్ళు నాలుగు భాగాలు. తవాక్షీరి ఐదు భాగాలు. ఏలకులు అర్థభాగం. దాల్చిని చెక్క అర్థభాగం. కలకండ 32 భాగాలు. ఇవి మెత్తగాదంచి వస్త్రగాలితం చెయ్యాలి. ఇందులో తవాక్షీరి పలుకులుగా వున్నదీ, కలకండ మద్రాసుదీ వెయ్యడం మంచిది. ఈ చూర్ణం ప్రత్యేకంగానూ, ఔషధాలకు అనుపాన చూర్ణంగానూ వాడుకోవచ్చు. కలకండ లేపాకం పట్టి, తక్కిన వస్తువుల చూర్ణం అందులో కలిపి గుటికలుగా కూడా వాడుకోవచ్చు. వయస్సు—బలం—అవస్థ—వీటి ననుసరించి చూర్ణానికీ గుటికకూ మోతాదు నిర్ణయించుకునేది.

ఇది రుచి పుట్టిస్తుంది. అనుపచనం చేస్తుంది. దగ్గూ, ఆయాసమూ, జ్వరమూ తగ్గిస్తుంది. వాంతీ, అతిసారమూ కట్టుతుంది. శోషా, కడుపుబ్బరింపూ పోగొట్టుతుంది. ప్లీహవ్యాధులూ, గ్రహణీ, పాండువూ హరిస్తుంది.

## సితోపలాది చూర్ణం

సితోపలా షోడశ స్యా దష్టౌ స్యా ద్వంశరోచనా
పిప్పలీ స్యా చ్చతుఃకర్షా స్యా దేలాచ ద్వికార్షికీ
ఏకకర్ష స్త్వచః కార్యం చూర్ణయే త్సర్వ మేకతః
సితోపలాదికం చూర్ణం మధుసర్పిర్యుతం లిహేత్
శ్వాస కాస క్షయహరం హస్తపాదాంగదాహజిత్
మందాగ్నిం సుప్తజిహ్వత్వం పార్శ్వశూల మరోచకమ్
జ్వర మూర్ధ్వగతం రక్తం పిత్త మాశు వ్యపోహతి॥

కలకండ పదహారు భాగాలు. తవాక్షీరి ఎనిమిది భాగాలు. పిప్పళ్ళు నాలుగుభాగాలు. ఏలకులు రెండు భాగాలు. దాల్చినిచెక్క ఒకభాగం. ఇవన్నీ కలిపి కొట్టి వస్త్రగాలితం చెయ్యాలి. తవాక్షీరి మంచిరకమూ, కలకండ మద్రాసుదీ వేస్తే చాలా మంచిది. స్థితిగతులను బట్టి మోతాదు నిర్ణయించుకుని తేనెతోనూ నేతితోనూ కలుపుకుని పుచ్చుకునేది.

ఇది ఆయాసమూ, దగ్గూ, క్షయా హరిస్తుంది. కాళ్ళమంటలూ, చేతులమంటలూ, శరీరం మంటలూ పోగొట్టుతుంది. అగ్నిమాంద్యం తగ్గిస్తుంది. నాలుక మొద్దుబారితే తగ్గిస్తుంది. పార్శ్వశూలా, అరుచీ, జ్వరమూ, ఊర్ధ్వగతరక్తపిత్తమూ హరిస్తుంది.

## 3 భాస్కర లవణ చూర్ణం

సాముద్రలవణం కార్యం మష్టకర్షమితం బుధైః
పంచ సౌవర్చలం గ్రాహ్యం బిడం సైంధవధాన్యకమ్
పిప్పలీ పిప్పలీమూలం కృష్ణజీరకపత్రకమ్
నాగకేసర తాళీస మామ్లవేతసకం తథా
ద్వికర్షమాత్రా ణ్యేతాని ప్రత్యేకం కారయే ద్భిషక్
మరీచం జీరకం విశ్వం ఏకైకం కర్షమాత్రకమ్
దాడిమం స్యా చ్చతుఃకర్షం త్వగేలా చార్ధకార్షికీ
ఏత చ్చూర్ణీకృతం సర్వం లవణం భాస్కరాభిధమ్
శాణప్రమాణం దేయ తు మస్తుతక్రసురాసవైః
వాతశ్లేష్మభవం గుల్మం ప్లీహాన ముదరం క్షయమ్
అర్శాంసి గ్రహణీం కుష్ఠం విబంధం చ భగందరమ్
శోఫం శూలం శ్వాసకాస మామదోషం చ హృద్రుజమ్
మందాగ్నిం నాశయే దేత ద్దీపనం పాచనం పరమ్
సర్వలోకహితార్థాయ భాస్కరేణోదితం పురా॥

వేచిన సముద్రలవణం ఎనిమిది భాగాలు. సౌవర్చలవణం ఐదు భాగాలు, బిడాలవణమూ, సైంధవలవణమూ, ధనియాలూ, పిప్పళ్ళూ, మోడి, నల్లజీలకర్రా, ఆకుపత్రికమూ, నాగకేసరాలూ, తాళీసపత్రీ, అమ్లవేతసమూ—ఇవి ఒక్కొక్కటి రెండేసి భాగాలు. మిరియాలూ, జీలకర్రా, సొంఠీ—ఇవి ఒక్కొక్కటిని ఒక్కొక్క భాగం. దానిమ్మపండు బెరడు నాలుగు భాగాలు. దాల్చినచెక్కా, ఏలకులూ ఒక్కొక్కటి అర్ధభాగం. ఇవి మెత్తగా దంచి వస్త్రగాలితం చెయ్యాలి. ఇందులో పడే బిడాలవణం చాలా దుర్వాసనగా వుంటుంది. కొందరది వెయ్యరు. అది తప్పు. తప్పకుండా వెయ్యాలి.

దీని మోతాదు దినానికి అరతులం. పూటకొకపావుతులం చొప్పున వాడడం మంచిది. ఇది పెరుగుమీది తేటతోగాని, మజ్జిగతోగాని, మద్యంతోగాని, బ్రాందీరకాలతో గాని, చివరికి మంచినీళ్ళతో గాని కలిపి భోజనం అయిన తరవాత పుచ్చుకునేది. భోజనంలో కూడా వాడవచ్చు.

ఇది వాతంవల్లా కఫంవల్లా పుట్టిన గుల్మరోగమూ, ప్లీహవ్యాధీ, ఉదరవ్యాధీ, క్షయా, మూలశంకా, గ్రహణీ, కుష్ఠురోగమూ, మలబంధమూ, భగందరవ్యాధీ, ఉబ్బూ, శూలా, వగర్పూ, దగ్గూ, ఆమదోషమూ, హృద్రోగమూ, అగ్నిమాంద్యమూ పోగొట్టుతుంది. ఆకలి పుట్టిస్తుంది. ఆమపచనం చేస్తుంది.

## ౮ వృద్ధగంగాధరచూర్ణం

ముస్తారలుకశుంఠీభి ర్ధాతకీలోధ్రవాలకైః
బిల్వమోచరసాభ్యాం చ పాఠేంద్రయవత్సకైః
ఆమ్రబీజం ప్రతివిషా లజ్జాళు రితి చూర్ణితైః
క్షౌద్రతండులపానీయైః పీతై ర్యాతి ప్రవాహికా
సర్వాతిసారం గ్రహణీ ప్రశమం యాతి వేగతః
వృద్ధగంగాధరం చూర్ణం సరిద్వేగవిబంధనమ్॥

తుంగముస్తలూ, దుందిలమూ, సొంఠీ, ఆరెపువ్వూ, లొద్దుగుచెక్కా, వట్టివేళ్లూ, మారేడూ, బూరుగుజిగురూ, విషబొద్దీ, కొడిశపాలవిత్తులూ, కొడశచెక్కా, మామిడిజీడీ, అతివసా, అత్తిపత్తిఆకూ- ఇవి సమభాగాలు. ఇది తేనెతో గాని, కలితో గాని కలిపి పుచ్చుకునేది. ఇది ప్రవాహికా, (కలరా) సర్వాతిసారాలూ, గ్రహణీ తగ్గించేస్తుంది. నదీవేగం గల అతిసారాలున్నూ తగ్గించేస్తుంది.

## ౯ సుదర్శనచూర్ణం

త్రిఫలా రజనీయుగ్మం కంటకారీయుగం శటీ
త్రికటు గ్రంథికం మూర్వా గుడూచీ ధన్వయాసకః
కటుకా పర్పటో ముస్తం త్రాయమాణా చ వాలకమ్
నింబః పుష్కరమూలం చ మధుయష్టీ చ వత్సకః
యవానీంద్రయవో భార్గీ శిగ్రుబీజం సురాష్ట్రిజా
వచా త్వక్పద్మకోశీరం చందనాతివిషా బలాః
శాలిపర్ణీ పృశ్నిపర్ణీ విడంగం తగరం తథా

దానిమ్మకాయల బెరడు ఎనిమిది పలాలు. కలకండ ఎనిమిది పలాలు. పిప్పళ్లూ, మోడీ, వామూ, మిరియాలూ, ధనియాలూ, జీలకర్రా, సొంటీ—ఇవి ఒక్కొక్క పలం, తవాక్షీరి ఒక కర్షం. ఆకుపత్రికమూ, దాల్చినిచెక్కా, ఏలకగింజలూ, నాగకేసరాలూ—ఇవి ఒక్కొక్క కోలం.

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది. దీల్లో వెయ్యవలసిన కలకండ మద్రాసుది వెయ్యడం మంచిది. తవాక్షీరి పలుకులుగా వున్నది వెయ్యాలి.

ఇది అతిసారమూ, గ్రహణీ కడుతుంది. క్షయ, గుల్మం, (బల్ల) గళగ్రహం అనే కంఠవ్యాధి, పీనస, దగ్గు తగ్గిస్తుంది. అగ్నిమాంద్యం హరిస్తుంది.

## ౮. అవిపత్తికర చూర్ణం

త్రికటు త్రిఫలా ముస్తం బిడం చైవ విడంగకమ్
ఏలా పత్రం చ చూర్ణాని సమభాగాని కారయేత్
సర్వ మేకీకృతం యావ ల్లవంగం తత్సమం భవేత్
సర్వ చూర్ణా ద్విగుణితం త్రివృచ్చూర్ణం ప్రదాపయేత్
సర్వ మేకీకృతం యావ త్తావ చ్ఛర్కరయాన్వితమ్
భోజనాదౌ తథా మధ్యే ఖాదే న్మాషాష్టకం శుభమ్
ఆమ్లపిత్తం నిహం త్యాశు విబంధం మలమూత్రయోః
అగ్నిమాంద్యభవాన్ రోగాన్ నాశయే దవికల్పతః
ప్రమేహాన్ వింశతిం చైవ సర్వదుర్నామనాశనమ్
అవిపత్తికరం చూర్ణం అగస్త్యవిహితం శుభమ్ ॥

సొంటీ, పిప్పలీ. మిరియాలూ, కరకవొలుపూ, తాడికాయబెరడూ, ఉసిరికపప్పూ, తుంగముస్తలూ, బిడాలవణమూ, వాయువిళంగాలూ, ఏలకులూ, ఆకుపత్రికమూ—ఇవి సమభాగాలు. వీటి అన్నిటితోనూ సమం లవంగాలు, వీటి అన్నిటికీ రెండురెట్లు తెగడ. వీటి అన్నిటికీ సమం కలకండ,

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది. ఇందులో వేసే తెగడ శుద్ధిచెయ్యాలి. కలకండ మద్రాసుది వెయ్యడం మంచిది. ఇది అగస్త్యుడు నిర్మించినది.

ఇది భోజనానికి ముందుగాని, భోజనం చేస్తూచేస్తూ గాని పుచ్చుకోవచ్చు.

ఇది అమ్లపిత్తమూ, మలబంధమూ, మూత్రబంధమూ పోగొడుతుంది అగ్ని మాంద్యమూ, అరుచీ, అజీర్తీ తగ్గిస్తుంది. వింశతి ప్రమేహాలలోనూ చాలాపనిచేస్తుంది. గ్రహణికి మంచిది.

## ౯ కకుభాది చూర్ణం

కకుభత్వ గ్వచా రాస్నా బలా నాగబలా భయా
శటీ పుష్కరమూలం చ పిప్పలీ విశ్వభేషజమ్
సర్వా ణ్యేతాని సంచూర్ణ్య సర్పిషా శాణమాత్రయా
భక్షయే త్ప్రాత రుత్థాయ సర్వహృద్రోగశాంతయే ॥

తెల్లమద్దిచెక్క, వస, సన్నరాస్నా, బలా, నాగబలా, కరకవొలుపు, కచ్చూరాలూ, పుష్కరమూలమూ, పిప్పళ్లూ, సొంటీ— ఇవి సమం.

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది. ప్రాతఃకాలం అరతులం చూర్ణం నేతితో కలిపి పుచ్చుకుంటే హృద్రోగాలన్నీ తగ్గిపోతాయి.

## ౧౦ పుష్యానుగ చూర్ణం

పాఠా జంబ్వామ్రయో ర్మధ్యం శిలాభేదం రసాంజనమ్
అంబష్ఠకీ మోచరస స్సమంగా పద్మకేసరమ్
బాహ్లీకాతివిషా ముస్తం బిల్వం లోధ్రం సగైరికమ్
కట్ఫలం మరిచం శుంఠీ మృద్వీకా రక్తచందనమ్
కట్వంగవత్సకానంతా ధాతకీ మధుకార్జునమ్
పుష్యేణోద్ధృత్య తుల్యాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్
తాని క్షౌద్రేణ సంయోజ్య పాయయే త్తండులాంబునా
అర్శస్సు చాతిసారేషు రక్తం యచ్చోప వేశ్యతే
దోషాగంతుకృతా యే చ బాలానాం తాం చ నాశయేత్
యోనిదోషం రజోదోషం శ్వేతం నీలం సపీతకమ్
స్త్రీణాం శ్యావారుణం యచ్చ తత్ ప్రసహ్య నివర్తయేత్

చూర్ణం పుష్యానుగం నామ హిత మాత్రేయపూజితమ్
అంబష్ఠా దక్షిణే ఖ్యాతా గృహ్ణంత్యన్యే తు లక్ష్మణాః ॥

పాఠా, నేరేడుగింజల పప్పూ, మామిడిజీడీ, కొండపిండివేళ్లూ, రసాంజనమూ, లక్ష్మణపంజీ, బూరుగుజిగురూ, మంజిష్ఠా, తామరకేసరాలూ, కుంకుమపువ్వూ. అతివసా, తుంగముస్తలూ, లొద్దుగుచెక్కా, మారేడువేరూ, గైరికమూ, కాయఫలమూ, మిరియాలూ, సొంటీ, ద్రాక్షపండూ, రక్తచందనమూ, పెదమానుచెక్కా, కొడిసెచెక్కా, సుగంధీ, ఆరెపువ్వూ, యష్టిమధుకమూ, తెల్లమద్దిచెక్కా—ఇవన్నీ సమభాగాలుగా గ్రహించి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

ఇవన్నీ పుష్యనక్షత్రంనాడు సంపాదించాలని ఈయోగం నిర్మించిన ఆత్రేయుని శాసనం, ఇందుకు ద్యోతకంగా వుండాలనే దీనికి పుష్యానుగం అని పేరు. ఇందులో చెప్పబడ్డ అంబష్ఠకి పాఠ కొందరూ, లక్ష్మణపంజి కొందరూ వాడుతున్నారు.

ఇది తేనెతో కలిపి పుచ్చుకుని కడుగు అనుపానం వాడాలి. ఇలా పుచ్చుకుంటే యిది మూలశంక, అతిసారం, రక్తపిత్తం, యోనిదోషం, రజోదోషం, తెల్లగానూ, నల్లగానూ, పసుపుపచ్చగానూ, తొగరురంగుగానూ స్త్రీలకు కలిగే స్రావమూ తగ్గిస్తుంది. చంటిపిల్లలకు వచ్చే రక్తవిరేచనాలున్నూ కడుతుంది.

## ౧౧ మహాద్రాక్షాది చూర్ణం

ద్రాక్షా దాడిమ ఖర్జూర చాతుర్జాత కటుత్రయమ్
తవక్షీరీ నారికేళం చందనం మధుకం శివమ్
ప్రియాలుమజ్జా హ్రీబేరం ఉశీరం జాతిపత్రకమ్
విదారీ గోక్షురం మోచా కపికచ్ఛూభవం తథా
జాతీఫలం చ తక్కోలం రుజ్మాంసా స్త్వల వంశజమ్
యవమజ్జా లోధ్రపుష్పం ముస్తా నాగబలా శణా
ద్వీజీరకే హ్యాజామోదం మిశ్రా తాళీసపత్రకమ్
సైంధవం ధాన్యకం భార్గీ శృంగీ భృంగీ పునర్నవా
అరుష్క రామబీజం చ సమ్యక్ స్మారితే మభ్రకమ్

పతి త్సర్వం సమం కృత్వా ద్విగుణాం శర్కరాం క్షిపేత్
అస్య చూర్ణస్య కర్షాంశం ఘృతక్షీరయుతం పిబేత్
దినపూర్వే తథా పశ్చా దృతుకాలే విశేషతః
క్షయం చ రక్తపిత్తం చ పాదదాహ మసృగ్దరమ్
వినిహంతి ప్రమేహం చ సోమరోగం చ శర్కరామ్
మూత్రాఘాతం మూత్రకృచ్ఛ్రం వాతకుండలికాం తథా
వాంత్యరోచక మత్యుగ్రం శ్వాసకాసజ్వరభ్రమమ్
పీనసం చ ప్రతిశ్యాయం ప్లీహానం చోదరామయమ్
ఆమ్లపిత్తాంగదాహం చ ధాతునాశం జరామయమ్
సర్వం దుర్నామరోగం చ తథా పాండుం చ కామలామ్
హృద్రోగం చ శిరశ్శూలం ఆనాహ మతిదారుణమ్
కండూతిం శీతపిత్తం చ విబంధా న్ద్వివిధా నపి
సంసేవ్యం భేషజం హ్యేవ వృద్ధోపి జనయే త్సుతమ్
పుత్రం సర్వగుణోపేతం శతాయుష మనామయమ్
మృతగర్భా చ యా నారీ యా చ గర్భావసారిణీ
సాపి సూతే సుతం తద్వ న్నారాయణ పరాయణమ్
వంధ్యాపి లభతే పుత్రం వృద్ధోపి తరుణాయతే
తురంగ మివ సంద్రుష్టో మాతంగబలవిక్రమః
సదా భేషజ్యసేవీ యో భవే న్మారుతి విక్రమః
మహాద్రాక్షాదిచూర్ణోయం సర్వరోగనికృంతనః ॥

ద్రాక్షపండూ, దానిమ్మబెరడూ, ఖర్జూరపుకాయలూ, దాల్చినచెక్కా, ఏలకులూ, ఆకుపత్రికమూ, నాగకేసరాలూ, సొంటీ, పిప్పళ్లూ, మిరియాలూ, తవాక్షీరీ, కొబ్బరికురిడీ, చందనమూ, యష్టిమధుకమూ, కరకవొలుపూ, సారపప్పూ, కురువేరూ, వట్టివేళ్లూ, జాపత్రీ, నేలగుమ్మడూ, పల్లేరుకాయలూ, బూరుగుజిగురూ, దూలగొండివిత్తులూ, జాజికాయా, తక్కోలాలూ, చెంగల్వకోష్టూ, మినుములూ, నువ్వులూ, వెదురుబియ్యమూ, యవలూ, లొద్దుగుపువ్వూ, తుంగముస్తలూ, నాగబలా, జనప

గింజలూ, జీలకర్రా, నల్లజీలకర్రా, అజామోదమూ, మెంతులూ, తాళీసపత్రీ, సైం-
ధవలవణమూ, ధనియాలూ, గంటుభారంగీ, కర్కాటకశృంగీ, గుంటకలగరసమూ అ-
మూ, తెల్లగలిజేరూ, నల్లజీడిపప్పూ, మామిడిజీడీ, శతపుటకృష్ణాభ్రకభస్మమూ — ఇవి
సమం. వీటి కన్నిటికీ రెండురెట్లు కలకండ,

వీటిలో మినుములూ, నువ్వులూ, వేయించడం వృద్ధవైద్యుల సంప్రదాయం.
కలకండ మద్రాసుది వాడాలి. ఈయోగం చెప్పినట్టు పనిచెయ్యాలంటే నూరుపు-
టాలూ పడిన కృష్ణాభ్రకం వాడాలి,

ఇవన్నీ మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

ఇది స్త్రీలకు ప్రత్యేకౌషధం. పురుషులున్నూ వాడవచ్చు.

వయస్సూ, బలమూ, స్థితీ చూసి మోతాదు నిర్ణయించుకునేది. అది నేతితో
కలిపి పుచ్చుకుని వేడిపాలు తాగాలి, ఇది పొద్దున్నా సాయంత్రమూ కూడా తప్ప-
కుండా వాడాలి, ఋతుదినాలు మూడూ తప్పకుండా వాడాలి.

ఇది రక్తపిత్తమూ, క్షయవ్యాధి, అరికాళ్ళమంటలూ, తెల్లకుసుమా, ప్రమేహ-
మూ, సోమరోగమూ, మూత్రంలో వుండే శర్కరా, మూత్రాఘాతమూ, మూత్రకృ-
చ్ఛ్రమూ, వాతకుండలీ, దారుణమైన వాంతీ, అరుచీ, వగర్పూ, దగ్గూ, జ్వరమూ,
భ్రమలూ, పీనసా, పడిసెమూ, ప్లీహవ్యాధులూ, ఉదరవ్యాధులూ, అమ్లపిత్తమూ,
శరీరంఅంతటా వుండే మంటలూ, ముసలితనంవల్ల వచ్చిన ధాతుక్షీణతా, మూలశం-
కలూ, పాండువ్యాధీ, కామెర్లూ, హృద్రోగాలూ, తలనొప్పీ, కడుపుబ్బరమూ,
దురదలూ, శీతపిత్తమూ, మలబంధమూ, మూత్రబంధమూ పోగొడుతుంది.. ఇది చాలా
కాలం పుచ్చుకుంటే వృద్ధునికైనా పుత్రసంతానం కలుగుతుంది. ఆకొడుకు ఏరోగాలూ
లేకుండా నూరేళ్లు బతుకుతాడు. గుణవంతుడున్నూ అవుతాడు. కడుపులోనే బిడ్డలు
చనిపోయే స్త్రీ, గర్భస్రావం కలిగే స్త్రీ కూడా సత్సంతానలాభం పొందుతుంది.
గొడ్రాలున్నూ సంతానవతి అవుతుంది, వృద్ధుడు పడుచువాడవుతాడు. బలశాలీ,
వేగవంతుడున్నూ కూడా అవుతాడు.

## ౧౨ హింగ్వష్టక చూర్ణం

త్రికటుక మజమోదా సైంధవం జీరకే ద్వే
సమధరణధృతానా మష్టమో హింగుభాగః

ప్రథమకబళభక్తం సర్పిషా చూర్ణమేత
జ్జనయతి జఠరాగ్నిం వాతరోగాంశ్చ హంతి ॥

సొంటీ, పిప్పళ్లూ, మిరియాలూ, అజామోదమూ, సైంధవలవణమూ, జీలకర్రా, నల్ల జీలకర్రా, ఇంగువా—ఇవి సమభాగాలు. ఇంగువ ఆవునేతితో వేయించాలి, పచ్చిది వాడగూడదు.

•

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

ఇది అనేకవిధాల వాడవచ్చు, వేడిఅన్నంమీద మూడువేళ్ళకి వచ్చే చూర్ణం వేసి, దానిమీద సలసల కాగుతున్న నెయ్యి పోసుకుని భోజనంలో అది ముందుగా తింటే ఆకలి హెచ్చుచేస్తుంది. గర్భవాతమున్నూ హరిస్తుంది.

## ౧౩ నారసింహచూర్ణం

శతావరీరజః ప్రస్థం ప్రస్థం గోక్షురకస్య చ
వారాహ్యా వింశతిపలం గుడూచ్యాః పంచ వింశతిః
భల్లాతకానాం ద్వాత్రింశ చ్చిత్రకస్య దశైవతు
తిలానాం శోధితానాం చ ప్రస్థం దద్యాత్సుచూర్ణితమ్
త్ర్యూషణస్య పలా న్యష్టౌ శర్కరాయా శ్చ సప్తతిః
మాక్షికం శర్కరార్థేన మాక్షికార్థేన వై ఘృతమ్
శతావరీసమం దేయం విదారీకందజం రజః
ఏత దేకీకృతం చూర్ణం స్నిగ్ధే భాండే నిధాపయేత్
పలార్థ ముపయుంజీత యథేష్టం చాపి భోజనమ్
మాసైక ముపయోగేన జరాం హంతి రుజా మపి
వలీపలితఖాలిత్యం మేహపాండ్వాఢ్యపీనసాగ్
హాం త్వష్టాదశకుష్ఠాని తథాష్టా వుదరాణి చ
భగందరం మూత్రకృచ్ఛ్రం గృధ్రసీం చ హలీమకమ్
క్షయం చైవ మహావ్యాధిం పంచ కాసాన్ సుదారుణాన్

అశీతింవాతజాన్ రోగాన్ చత్వారింశ చ్చ పైత్తికాన్
వింశతిం శ్లైష్మికాంశ్చాపి సంసృష్టాన్ సాన్నిపాతికాన్
సర్వా నర్శోగదాన్ హంతి వృక్ష మింద్రాశని ర్యథా
సకాంచనాభో మృగరాజవిక్రమ
స్తురంగమం చా ప్యనుయాతి వేగతః
స్త్రీణాం శతం గచ్ఛతి సాతిరేకం
ప్రకృష్టహృష్టస్య యథా విహంగః
పుత్రా న్సంజనయే ద్ధీమాన్ నరసింహనిభాన్ తథా
నారసింహ మిదం చూర్ణం సర్వరోగహరం నృణామ్ ॥

పిల్లితేగలు ఒకప్రస్థం, పల్లేరుకాయ లొక ప్రస్థం, నేలగుమ్మడుగడ్డ ఇరవైపలాలు, తిప్పసత్తు ఇరవై అయిదు పలాలు, జీడిగింజలపప్పు ముప్ఫయిరెండు పలాలు, చిత్రమూలం పదిపలాలు, నువ్వు లొక ప్రస్థం, సొంటి 8 పలాలు. పిప్పళ్లు 8 పలాలు. మిరియాలు 8 పలాలు. చక్కెర 70 పలాలు, తేనె 35 పలాలు. నెయ్యి 18పలాలు. నేలతాడి ఒక ప్రస్థం.

వీటిలో నువ్వులు వేయించాలి. మూలంలో తిప్పతీగె అనివుంది. అక్కడ తిప్పసత్తు అని వృద్ధవైద్యుల వ్యాఖ్యానమూ, వాడుకానూ, కొందరు శుద్ధిచేసి జీడిగింజలు వేస్తారు; కాని వాటిలోని పప్పు చాలా మంచిది. నిరపాయకరమున్నూ.

వీటిలో మూలికలు అన్నీ మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది. ఆ మెత్తని చూర్ణంలో చక్కెరా, తేనే, నెయ్యీ కలిపి నేతితో మాగిన కుండలో ఈచూర్ణం జాగ్రత్తచేసుకునేది.

ఇది దినానికి అర్థతులమువరకూ వాడవచ్చు, పథ్యంలేదు. అన్ని వస్తువులూ స్వేచ్ఛగా తినవచ్చు. బలకరాలైన వస్తువులు తినడం అవసరమున్నూ.

ఇది ఒక్క నెలదినాలు సేవించినంతే మాత్రానే వృద్ధులకు ముసలితనం బాధలు కనపడనివ్వదు, సకలవ్యాధులూ పోగొడుతుంది. శరీరం ముడతలు పడడమూ జుట్టు నెరియడమూ తగ్గిస్తుంది. మేహమూ, పాండువూ, పీనసా, అష్టాదశకుష్ఠులూ, ఎనిమిది ఉదరవ్యాధులూ, భగందరమూ, మూత్రకృచ్ఛ్రమూ, గృధ్రసీవాతమూ, హలీమకమూ, క్షయా, పంచకాసలూ, వాతవ్యాధులు అన్నీ, పిత్తవ్యాధులు 24న్నూ శ్లేష్మవ్యాధులు 20 న్నీ మూలశంకలూ పోగొడుతుంది.

ఇది ఏకొన్ని దినాలో కాక: ఎప్పుడూ సేవిస్తూ వుండడం చాలా మంచిది. ఆలా పుచ్చుకుంటే శరీరానికి బంగారపు ఛాయవంటి కాంతివస్తుంది. మంచి బలపరాక్రమాలూ వేగమూ కలుగుతాయి. చాలామంది స్త్రీలను సంతోషపెట్టగలుగుతాడు. మంచిసంతానం కలుగుతుంది.

## ౧౪ ఆకారకరభాది చూర్ణం

ఆకారకరభ శ్శుంఠీ కంకోలం కుంకుమం కణా
జాతీఫలం లవంగం చ చందనం చేతి కార్షికాన్
చూర్ణానిమాం స్తతః కుర్యా దహిఫేనం పలోన్మితమ్
సర్వ మేకీకృతం చూర్ణం మాషైకం మధునా లిహేత్
శుక్ర స్తంభకరం చూర్ణం పుంసా మానందకారకమ్
నారీణాం ప్రీతిజననం సేవేత నిశి కాముకః ॥

అక్కలకర్రా, సొంటీ, కంకోలం, కుంకుమపువ్వూ, పిప్పళ్లూ. జాజికాయా, లవంగాలూ, చందనమూ—ఇవి ఒక్కొక్క కర్షం, నల్లమందు ఒకపలం.

ఇవన్నీ మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది. మోతాదు 12 వడ్లగింజలయెత్తు. రాత్రిపూట తేనెతో పుచ్చుకోవాలి.

కొందరు ఇది తేనెతో మర్దించి మాత్రలు చేసివాడడం వుంది.

ఇది వీర్యవృద్ధి కలిగిస్తుంది; కాని వీర్యస్తంభనం దీని ముఖ్యగుణం. ఇది పుచ్చుకున్న రెండుగంటలలో చాలా గుణం యిస్తుంది. లేపనశక్తీ సంభోగశక్తీ బాగా హెచ్చుచేస్తుంది; కాని ఇది పుచ్చుకున్ననాటి రాత్రి భోజనం తగ్గించాలి. అప్పుడప్పుడు పాలు పుచ్చుకోవచ్చు. రాత్రి నిద్రవుండకపోవచ్చు; కనక, ఆపాలయినా తక్కువగానే పుచ్చుకోవాలి. ఇది దినదినమూ వాడగూడదు. ఇది తాత్కాలికమైన ఆనందం కలిగించడంలోనే పేరుపడింది. వారాని కొక్కనాడే వాడడం మంచిది. అంతకంటే తరుచువాడగూడదు.

## ౧౫ జాతీఫలాది చూర్ణం

జాతీఫలలవంగైలాపత్రత్వఙ్నాగకేసరైః
కర్పూరచందనతిలై స్త్వక్షీరీతగరామ్లైః

తాళీసపిప్పలీ పథ్యా స్థూలజీరకచిత్రకైః
శుంఠీవిడంగమరిచై స్సమభాగవిచూర్ణితైః
యావం త్యేతాని సర్వాణి కుర్యా ద్భంగాం చ తావతీమ్
సర్వచూర్ణసమా దేయా శర్కరా చ భిషగ్వరైః
కర్షమాత్రం తతః ఖాదే న్మధునా ప్లావితం సుధీః
అస్య ప్రభావా ద్గ్రహణీ కాసశ్వాసారుచి క్షయాః
వాతశ్లేష్మప్రతిశ్యాయాః ప్రశమం యాంతి వేగతః ॥

జాజికాయ, లవంగాలు, ఏలకులు, ఆకుపత్రికం, దాల్చినిచెక్క, నాగకేసరాలు, పారతికర్పూరం, చందనం, నువ్వులు, తవాక్షీరి, నందివర్ధనంవేరు, (ఇది దొరకక పోతే పిప్పలీమూలం) ఉసిరికపప్పు, తాళీసపత్రి, పిప్పళ్లు, కరకవొలుపు, జీలకర్ర, చిత్రమూలం, సొంటి, వాయువిళంగాలు, మిరియాలు— ఇవి సమభాగాలు, వీటి కన్నిటికీ సమం గంజాయిఆకు. వీటికన్నిటికీసమం చక్కెర,

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

స్థితిగతులను పట్టి మోతాదు నిర్ణయించుకుని తేనెతో పుచ్చుకోవాలి, గ్రహణికి ఇది చాలా శక్తిగల ఔషధం. దగ్గూ, ఉగర్పూ, అరుచీ, క్షయా, పడిసెమూ పోగొడుతుంది.

## ౧౬ హింగ్వాది చూర్ణం

హింగుపాఠాభయా ధాన్యం దాడిమం చిత్రకం శఠీ
అజమోదా త్రికటుకం హపుషా చామ్లవేతసమ్
అజగంధా తి_త్తిడీకం జీరకం పౌష్కరం వచా
చవ్యం క్షారద్వయం పంచలవణా నీతి చూర్ణయేత్
ప్రా గ్భోజనస్య మధ్యే వా చూర్ణ మేత త్ప్రయోజయేత్
పిబే ద్వా జీర్ణమద్యేన తక్రేణోష్ణోదకేన వా
గుల్మే వాతకఫోద్భూతే హృద్గ్రహేష్ఠీలికాసు చ
హృద్వస్తిపార్శ్వశూలేషు శూలే చ గుదయోనిజే

మూత్రకృచ్ఛ్రే తథాధ్మానే పాండురోగే రుచౌ తథా
హిక్కాయాం చ యకృత్ప్లీహ్ని కాసే శ్వాసే గలగ్రహే
గ్రహణ్యర్శోవికారేషు చూర్ణమేతత్ప్రశస్యతే
భావితం మాతులుంగస్య బహుశః స్వరసేన వా
కార్యాశ్చ గుటికా బహ్వ్యో వాతశ్లేష్మామయాపహాః ॥

వేయించిన యింగువా, పాఠా, కరకవోలుపూ, ధనియాలూ, దానిమ్మబెరడూ, చిత్రమూలమూ, కచ్చూరాలూ, అజామోదమూ, సొంటీ, పిప్పళ్లూ, మిరియాలూ, బోడతరమూ, అమ్లవేతసమూ, వాయింటాలూ, చింతపండూ, జీలకర్రా, పుష్కరమూలమూ, వసా, చవ్యమూ, సర్జిక్షారమూ, యవక్షారమూ, సైంధవలవణమూ, సౌవర్చలవణమూ, బిడాలవణమూ, వేయించిన సముద్రలవణమూ, కాచలవణమూ— ఇవి సమభాగాలు.

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

ఇది బలానుసారంగా బ్రాందీతోగాని, మజ్జిగతోగాని, వేడినీళ్ళతోగాని పుచ్చుకునేది. భోజనానికి ముందుగాని, భోజనంమధ్యగాని పుచ్చుకునేది.

ఇది మాదీఫలరసంతో ఏడెనిమిదిసార్లు బాగా భావనచేసి, చివరిసారి బాగా మర్దనాచేసి మాత్రలు కట్టినీన్నీ వాడవచ్చును.

ఇది వాతంవల్లా కఫంవల్లా పుట్టిన గుల్మాలు (బల్లలు) తగ్గిస్తుంది. హృద్రోగమూ, అష్ఠీలికావాతమూ తగ్గిస్తుంది. హృదయశూలా, వస్తి (పొత్తికడుపు) శూలా, పార్శ్వశూలా, గుదశూలా, యోనిశూలా, మూత్రకృచ్ఛ్రమూ, కడుపుబ్బరమూ, పాండురోగమూ, అరుచీ, ఎక్కిళ్లూ, యకృత్ప్లీహవ్యాధులూ, దగ్గూ, వగర్పూ, గళగ్రహమూ, గ్రహణీ, మూలశంకా పోగొడుతుంది.

## ౧౭ కపిత్థాష్టకచూర్ణం

అష్టౌ భాగాః కపిత్థస్య షడ్భాగా శర్కరా మతా
దాడిమం తింతిడీకం చ శ్రీఫలం ధాతకీ తథా
అజమోదా చ పిప్పల్యః ప్రత్యేకం స్యుస్త్రిభాగకాః
మరిచం జీరకం ధాన్యం గ్రంథికం వాలకం తథా

సౌవర్చలం యమానీ చ చాతుర్జాతం సచిత్రకమ్
నాగరం చైకభాగా స్యుః ప్రత్యేకం సూక్ష్మచూర్ణితమ్
కపిత్థాష్టకసంజ్ఞ స్స్యా చ్చూర్ణ మేత ద్గలామయార్
అతిసారం క్షయం గుల్మం గ్రహణీం చ వ్యపోహతి ॥

వెలగపండుగుజ్జు 8 భాగాలు. చక్కెర 6 భాగాలు. దానిమ్మ బెరడూ, చింత పండూ, మారేడుపండువరుగూ, ఆరెపువ్వూ, అజామోదమూ, పిప్పళ్లూ— ఇవి మూడేసి భాగాలు. మిరియాలూ, జీలకర్రా, ధనియాలూ, గ్రంధితగరమూ, కురు వేరూ, సౌవర్చలవణమూ, వామూ, దాల్చినిచెక్కా, ఏలకులూ, ఆకుపత్రికమూ, నాగకేసరాలూ, చిత్రమూలమూ, సొంటీ—ఇవి ఒక్కొక్క భాగం.

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది,

ఇది కంఠరోగాలూ, అతిసారమూ, క్షయా, గుల్మమూ, గ్రహణీ తగ్గించే స్తుంది. కోష్ఠానికి సంబంధించిన బాధలలో ఇది చాలా పనిచేస్తుంది.

## ౧౨ లవంగాది చూర్ణం

లవంగం శుద్ధకర్పూర మేలా త్వ జ్నాగకేసరమ్
జాతీఫల ముశీరం చ నాగరం కృష్ణజీరకమ్
కృష్ణాగురు స్తుగాక్షీరీ మాంసనీలోత్పలం కణా
చందనం తగరం వాలం కంకోలం చేతి చూర్ణయేత్
సమభాగాని సర్వాణి సర్వేభ్యోర్ధసితా భవేత్
లవంగాద్య మిదం చూర్ణం రాజార్హం వహ్నిదీపనమ్
రోచనం తర్పణం వృష్యం త్రిదోషఘ్నం బలప్రదమ్
హృద్రోగం కంఠరోగం చ కాసం హిక్కాం చ పీనసమ్
యక్ష్మాణం తమకశ్వాస మతీసార మురఃక్షతమ్
ప్రమేహారుచి గుల్మాదీ న్గ్రహణీ మపి నాశయేత్ ॥

లవంగాలూ, పచ్చకర్పూరమూ, ఏలకులూ, దాల్చినిచెక్కా, నాగకేసరాలూ, జాజి కాయా, వట్టివేరూ, సొంటీ, నల్లజీలకర్రా, కృష్ణాగురూ, తవాక్షీరీ, జటామాంసీ,

నల్లకలవపువ్వూ, పిప్పళ్లూ, చందనమూ, గ్రంధితగరమూ, కుమవేపూ, కంకోలమూ ఇవి సమభాగాలు. ఈమొత్తంలో సగం కలకండ.

ఇవి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

ఇది ఆకలి వృద్ధిచేస్తుంది. రుచిపుట్టిస్తుంది. తృప్తికలిగిస్తుంది. వీర్యవృద్ధి చేస్తుంది. బలంకలిగిస్తుంది. త్రిదోషాలూ సమస్థితికి తెస్తుంది. హృద్రోగమూ, కంఠరోగమూ, దగ్గూ, ఎక్కిళ్లూ, పీనసా, క్షయా, తమకశ్వాసా, అతిసారమూ, ఉరఃక్షతమూ, ప్రమేహమూ, గుల్మాలూ, గ్రహణీ తగ్గిస్తుంది.

## ౧౯ పంచసమ చూర్ణం

శుంఠీ హారీతకీ కృష్ణా త్రివృత్సౌవర్చలం తథా
సమభాగాని సర్వాణి సూక్ష్మచూర్ణాని కారయేత్
జ్ఞేయం పంచసమం చూర్ణం వేత చ్ఛూలహరం పరమ్
అధ్మానజఠరార్శోఘ్న మామవాతహరం స్మృతమ్ ॥

సొంటీ, కరకవోలుపూ, పిప్పళ్లూ, తెగడా, సౌవర్చలవణమూ ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది. ఇది శూలా, కడుపుబ్బరమూ, అగ్నిమాంద్యమూ, మూలశంకా, ఆమవాతమూ పోగొడుతుంది.

## ౨౦ ముసల్యాది చూర్ణం

ముసలీకందచూర్ణం తు గుడూచీసత్వసంయుతమ్
వానరీగోక్షురాభ్యాం చ శాల్మలీశర్కరామలైః
ఆలోడ్య ఘృతదుగ్ధేన పాయయే త్కామవర్ధనమ్ ॥

నేలతాడీ, తిప్పసత్తూ, దూలగొండివిత్తులూ, పల్లేరుకాయలూ, బూరుగువేళ్లూ, చక్కెరా, ఉసిరకపప్పూ—ఇవి సమభాగాలు. ఇవి కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

బలానుసారంగా మోతాదు నిర్ణయించుకుని నేతితో కలిపి పుచ్చుకుని వేడిపాలు పుచ్చుకోవాలి. ఇది వీర్యవృద్ధి చేస్తుంది. కామోద్రేకమున్నూ కలిగిస్తుంది.

గుంటకలగర సమూలం ఒక భాగం. నువ్వులు అర్ధభాగం, ఉసిరికపప్పు అర్ధభాగం.

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

ఇది చక్కెరతో గాని, బెల్లంతో గాని కలిపి పుచ్చుకుంటే గుడ్డితనం పోయి చూపు వస్తుంది. నడవలేనివాడు మదగజం లాగ నడుస్తాడు. మూగివాడు మహా వాచాలుడవుతాడు. చెవిటివాడు దూరధ్వనులు కూడా వినగలడు. సంపూర్ణా రోగ్యం కలుగుతుంది. నెరసిపోయిన వెంట్రుకలు నల్లబడతాయి. జీర్ణమయిన దంతాలు కొత్తవయి పాలరంగుతో మెరుస్తూ వుంటాయి.

## ౨౫ దశనసంస్కారచూర్ణం

శుంఠీ హరీతకీ ముస్తా ఖదిరం ఘనసారకమ్
గువాకభస్మ మరిచం దేవపుష్పం తథా త్వచమ్
శ్లక్ష్ణచూర్ణీకృతం యత్నా న్నిక్షిపే త్ఖల్లమధ్యతః
కఠినీసంభవం చూర్ణం ప్రక్షిపే త్తత్ర తత్సమమ్
ఏత ద్దశనసంస్కారచూర్ణం దంతాస్యరోగజిత్ ॥

సొంటి, కరకవొలుపు, తుంగముస్తలు, కవిరి, ముద్దపచ్చకర్పూరము, మాడ్చిన పచ్చిపోక, మిరియాలు, లవంగాలు, దాల్చినిచెక్క—ఇవి సమం. వీటి కన్నిటికీ సమం సీమసుద్ద.

ఇవన్నీ మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

కుంచెగా నమలిన పుల్లతో గాని, బ్రష్‌తో గాని యీ చూర్ణం దంతధావనాని కుపయోగిస్తే దంతవ్యాధులూ, ముఖవ్యాధులూ అన్నీ తగ్గిపోతాయి.

(నోటి దుర్వాసన పోతుంది. అరుచి పోతుంది.)

## ౨౬ వైశ్వానరచూర్ణం

మాణిమంథస్య భాగౌ ద్వౌ యమాన్యా స్తద్వ దేవ చ
భాగా స్త్రయో జమోదాయా నాగరా ద్భాగపంచకమ్
దశ ద్వౌ చ హరీతక్యా శ్లక్ష్ణచూర్ణీకృతా శ్శుభాః

మస్వారనాళత్రకేణ సర్పిషోష్ణోదకేన వా
పీతం జయతు త్యామవాతం గుల్మం హృద్వస్తిజాన్ గదాన్
ప్లీహానం గ్రంథిశూలాదీ నర్శాం స్యానాహ మేవ చ
నిబంధం వాతజాన్ రోగాన్ తథైవ హస్తపాదజాన్
వాతానులోమన మిదం చూర్ణం వైశ్వానరం స్మృతమ్ ॥

సైంధవలవణం 2 భాగాలు. వాము 2 భాగాలు. అజామోదం 3 భాగాలు. సొంటి 5 భాగాలు. కరకపొలుపు 12 భాగాలు.

ఇవన్నీ మెత్తగా దంచి వస్త్రగాలితంచేసేది.

వయోబలానుసారంగా మోతాదు నిర్ణయించి మజ్జిగతేట, పులికడుగు, మజ్జిగ, నెయ్యి, వేడినీళ్లు—వీటిలో దేనితోనైనా పుచ్చుకునేది. అనుపానద్రవం తాగడానికి చాలేటట్టు ఉండాలి.

ఇది ఆమవాతమూ, గుల్మమూ, వస్తివ్యాధులూ, ప్లీహవ్యాధులూ, గ్రంథులూ, శూలలూ, మూలశంకా, కడుపుబ్బరమూ, మలబంధమూ, వాతవ్యాధులూ పోగొడుతుంది.

వాతానులోమనం చెయ్యడంలో ఇది సాటిలేనిది.

ఈయోగంలో, కొన్నిచోట్ల "యమాన్యా స్తద్వదేవ చ" అన్నచోట "యావక్షారం తథైవ చ" అని పాఠాంతరం వుంది. అంటే కొన్ని గ్రంథాలలో వాముకి బదులు యవక్షారం చెప్పబడ్డది. అయితే, అంతఃపరిమార్జనం చెయ్యడంలో వాముకే మంచి శక్తి వుంది. ఏతావతా, వామూ, అజామోదమూ అని రెండుచోట్ల చెప్పడంవల్ల వాము 5 భాగాలు వేసుకునేది.

## ౨౭ పిప్పల్యాది చూర్ణం

పిప్పలీ త్రిఫలా దారు నాగరం సపునర్నవమ్
భాగై ర్ద్విపలికై రేషాం తత్సమం వృద్ధదారకమ్
కాంజికేన పిబే చ్చూర్ణం కర్షమాత్రప్రమాణతః
జీర్ణే చ పరిహారం స్యా ద్భోజనం సర్వకామికమ్
శ్లీపదం వాతరోగాం చ హన్యా త్ప్లీహాన మేవ చ
అగ్నిం చ కురుతే ఘోరం భస్మకం చ నియచ్ఛతి ॥

## ౨౧ శతావరీ చూర్ణం

శతావరీ గోక్షురం చ బీజం చ కపికచ్ఛుభమ్
గాంగేరుకీ చాతిబలా బీజ మిక్షురకోద్భవమ్
చూర్ణితం సర్వ మేకత్ర గోదుగ్ధేన పిబే న్నిశి
న తృప్తిం యాతి నారీభి ర్నర శ్చూర్ణప్రభావతః ॥

పిల్లితేగలూ, పల్లేరుకాయలూ, దూలగొండి విత్తులూ, నాగబలా, అతిబలా, నీరుగొబ్బివిత్తులూ—ఇవి సమం. ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితంచేసేది.

ఇది రాత్రిపూట భోజనంఅయినతరవాత బలానుసారంగా పుచ్చుకుని ఆవుపాలు వేడివి తాగేది. అవసరం అని తోస్తే చక్కెర చేర్చుకోవచ్చు, ఆవుపాలలో కలిపినీ పుచ్చుకోవచ్చు.

ఇది మిక్కుటంగా వీర్యవృద్ధి చేస్తుంది. కామోద్రేకం కలిగించి యౌవనసుఖానందాలు అనుభవింపచేస్తుంది.

## ౨౨ పునర్నవాది చూర్ణం

పునర్నవా దార్వ్యభయా పాఠా బిల్వం శ్వదంష్ట్రికా
బృహత్యౌ ద్వే రజన్యౌ ద్వే పిప్పలీ చిత్రకం వృషః
సమభాగాని సంచూర్ణ్య గవాం మూత్రేణ వా పిబేత్
బహుప్రకారం శ్వయథుం సర్వగాత్రవిసారిణమ్
హంతి శోథోదరా ణ్యష్టౌ వ్రణాం శ్చై వోద్ధతా నపి ॥

తెల్లగలిజేరువేరూ, దేవదారూ, కరకపొలుపూ, పాఠా, మారేడువేరూ, పల్లేరువెళ్లూ, వాకుడూ. నేలములకా, పసుపూ, మానుపసుపూ, పిప్పళ్ళూ, చిత్రమూలమూ, అడ్డసరపువేరుచెక్కా—ఇవి సమభాగాలు.

ఇవి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

వయోబలానుసారంగా యిది గోమూత్రంలోకలిపి పుచ్చుకుంటే శరీరం అంతటా వ్యాపించిన ఉబ్బురోగం—సర్వవిధాలదీ తగ్గిపోతుంది. ఉదరవ్యాధులున్నా ఇది పోగొడుతుంది. ఎటువంటి కురుపులనూ మాన్పుతుంది.

## ౨౩ మృగాంక చూర్ణం

ముక్తా శంఖ ప్రవాళాని వంగం చైవ సమాంశకమ్
నింబక్వాథేన సంమర్ద్య తతో గజపుటే పచేత్
సర్వతుల్యా తుగాక్షీరీ దరదం తత్కలాంశకమ్
ఏత త్సర్వం విచూర్ణ్యాథ పిప్పలీమధుసంయుతమ్
రక్తి ద్వయం ప్రదాతవ్యం కృచ్ఛ్రరోగ ప్రశాంతయే
క్షయం హంతి తథా కాసం యక్ష్మాణం శ్వాస మేవచ
స్వరభేదం జ్వరం మేహాన్ దోషత్రయసముత్థితాన్
మృగాంకచూర్ణ మేతద్ధి కాసరోగకులాంతకృత్ ॥

ముత్యాలూ, శంఖమూ, పగడమూ, వంగమూ—ఈభస్మాలు సమభాగాలు. వేపాకు రసంతో మర్దించి గజపుటం వేసేది. తరవాత సర్వసమానంగా తవాక్షీరీ, తవాక్షీరిలో 16 వ వంతు శుద్ధఇంగిలీకమూ కలిపేది. దీనికి సమంగా పిప్పళ్ళచూర్ణం కలిపి బలానుసారంగా తేనెతో పుచ్చుకునేది.

ఇది క్షయా, దగ్గూ, వగర్పూ, స్వరభేదమూ, జ్వరమూ, మేహాలూ పోగొడుతుంది.

ఇందులో పిప్పళ్ళచూర్ణం మాత్రం యెప్పటి కప్పుడు కలుపుకోడం మంచిది.

## ౨౪ భృంగరాజాది చూర్ణం

శ్లక్ష్ణీకృతం భృంగరాజస్య చూర్ణం
తిలార్థకం చామలకార్థకం చ
సశర్కరం భక్షయతో గుడైర్వా
న తస్య రోగా న జరా న మృత్యుః
అంధః పశ్యే, ద్గమనరహితో మత్తమాతంగగామీ,
మూకో వాగ్మీ, శ్రవణరహితో దూరశబ్దానుసారీ,
నీరు జ్మర్త్యో భవతి, పలితో నీలజీమూతకేశీ,
జీర్ణా దంతాః పునరపి నవాః క్షీరగౌరా భవంతి ॥

పిప్పళ్ళూ, కరకవోలుపూ, తాడికాయవోలుపూ, ఉసిరికపప్పూ, మానుపసుపూ సొంటీ, తెల్లగలిజేరువేరూ ఇవి రెండేసి పలాలు. వృద్ధదారకం 14 పలాలు.

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

ఇది పులికడుగుతో పుచ్చుకునేది. బోదరోగం పోగొడుతుంది. వాతవ్యాధులూ, ప్లీహవ్యాధులూ తగ్గించేస్తుంది. ఆకలి వృద్ధిచేస్తుంది. ముఖ్యంగా శ్లీపద వ్యాధులలో వాడతగ్గది.

## ౨౮ ఏలాది చూర్ణం

ఏలా లవంగ గజకేసర కోలమజ్జ
లాజ ప్రియంగు ఘన చందన పిప్పలీనామ్
చూర్ణాని మాక్షికసితాసహితాని లీఢ్వా
ఛర్దిం హరంతి కఫమారుతపిత్తజాం చ ।

ఏలకులూ, లవంగాలూ, నాగకేసరాలూ, రేగుగింజలోని పప్పూ, పేలాలూ, ప్రేంకణాలూ, తుంగముస్తలూ, చందనమూ, పిప్పళ్ళూ—ఇవి సమభాగాలు.

ఇవన్నీ కలిపి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

ఈచూర్ణంలో సమంగా చక్కెర కలిపి మోతాదు నిర్ణయించుకుని తేనెతో కలిపి పుచ్చుకునేది.

ఇది కఫంవల్లా, వాతంవల్లా, పిత్తంవల్లా పుట్టిన ఛర్ది పోగొడుతుంది.

## ౨౯ చతుస్సమ చూర్ణం

దీప్యకం సైంధవం పథ్యా నాగరం చ చతుస్సమమ్
చూర్ణం శూలం జయత్యాశు మందస్యాగ్నే శ్చ దీపనమ్ ॥

వామూ, సైంధవలవణమూ, కరకవోలుపూ, సొంటీ—ఇవి సమభాగాలు. ఇది మెత్తగా దంచి వస్త్రగాలితం చేసుకునేది.

ఇది మోతాదు నిర్ణయించుకుని మంచినీళ్ళతో పుచ్చుకునేది. ఇది సకల శూలలూ పోగొడుతుంది. ఆకలి వృద్ధిచేస్తుంది.

## ౩౦ అగ్నిముఖచూర్ణం

హింగుభాగో భవేదేకో వచా చ ద్విగుణా భవేత్
పిప్పలీ త్రిగుణా ప్రోక్తా శృంగబేరం చతుర్గుణమ్
యమానికా పంచగుణా షడ్గుణా చ హారీతకీ
చిత్రకం సప్తగుణితం కుష్టమష్టగుణం భవేత్
ఏతద్వాతహరం చూర్ణం పీతమాత్రం ప్రసన్నయా
పిబేద్దధ్నా మస్తునా వా సురయా కోష్ణవారిణా
సోదావర్త మజీర్ణం చ ప్లీహాన ముదరం తథా
అంగాని యస్య శీర్యంతి విషం వా యేన భక్షితమ్
అర్శోహరం దీపనం చ శూలఘ్నం గుల్మనాశనమ్
చూర్ణ మగ్నిముఖం నామ న క్వచి త్ప్రతిహన్యతే ॥

శోధించిన ఇంగువ 1 భాగం. వస 2 భాగాలు. పిప్పళ్లు 3 భాగాలు. సొంటి 4 భాగాలు. వాము 5 భాగాలు. కరకవొలుపు 6 భాగాలు. చిత్రమూలం 7 భాగాలు. చెంగల్వకోష్టు 8 భాగాలు.

ఇవి మెత్తగా దంచి వస్త్రగాలితం చేసేది.

ఇది మోతాదు నిర్ణయించుకుని మద్యంతో గాని, పెరుగుతో గాని, మజ్జిగతో గాని, బ్రాందీతో గాని, వేడినీళ్ళతోగాని పుచ్చుకునేది.

ఇది గర్భవాతం హరిస్తుంది. ఉదావర్తమూ, అజీర్ణమూ, ప్లీహవ్యాధులూ, ఉదరవ్యాధులూ, మూలశంకా, శూలలూ, గుల్మమూ, పోగొడుతుంది. ఆకలి హెచ్చుచేస్తుంది. విషదోషాలున్నూ తగ్గిస్తుంది. ఇది అమోఘంగా పనిచేస్తుంది.

## ౩౧ అశ్వగంధాదిచూర్ణం

అశ్వగంధా దశపలా తన్మాత్రో వృద్ధదారుకః
చూర్ణీకృత్యోభయం విద్వాన్ ఘృతభాండే నిధాపయేత్
కర్షైకం పయసా పీత్వా నారీభి ర్నైవ తృప్యతి
అగత్వా ప్రమదాం భూయో వలీపలితనాశనః ॥

పెన్నేరు పదిపలాలూ, వృద్ధదారుకం పది పలాలూ కలిపి మెత్తగా చూర్ణించి వస్త్ర గాలితం చేసి నేతితో మాగిన కుండలో ఉంచుకునేది. తరవాత ఆది కర్షం చొప్పున పాలతో పుచ్చుకుంటే ఎంతమంది స్త్రీలతో క్రీడించడానికి అయినా శక్తి కలుగుతుంది. వలీపలితా లుండవు.

## 32 అమ్లపిత్తాంతక చూర్ణం

ద్విజీరకమ్ యవానీ చ లవంగం విజయాం తథా
సర్వం సమం సమాదాయ సుభృష్టం చ విచూర్ణయేత్
ద్విక్షారం పంచ లవణం సమం పూర్వైశ్చ యోజయేత్
ద్విత్రిమాషమితం ఖాదే న్నారికేళఫలాంబునా
అమ్లపిత్తాంతకం చూర్ణ మమ్లపిత్తం సుదారుణమ్
అగ్నిమాంద్యం తథాజీర్ణం శూలరోగం చ దారుణమ్
అన్నద్రవాఖ్యం శూలం చ యచ్ఛూలం పరిణామజమ్
సానుబంధం హరే త్తూర్ణం భాస్కర స్తిమిరం యథా ॥

జీలకర్ర, పాజీర, వాము, లవంగాలు, కరకవోలుపు—ఇవి ఒక్కొక్కటి ఏడేసి తులాలు. ఇవి చక్కగా వేయించాలి. వేయించిన తరవాతే తూచుకోవాలి. తరవాత, సర్జక్షారం, యవక్షారం, సాముద్రలవణం, సైంధవలవణం, సౌవర్చలవణం, బిడాలవణం, కాచలవణం—ఇవి ఒక్కొక్కటి అయిదేసి తులాలు. ఇవీ, మొదటివీ కలిపి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసుకునేది.

ఇది రెండుమూడు మాషాల యెత్తు కొబ్బరికాయ నీటితో పుచ్చుకుంటే అమ్లపిత్తమూ, అగ్నిమాంద్యమూ, అజీర్ణమూ, శూలా, అన్నద్రవశూలా, పరిణామశూలా పోగొడుతుంది,

ఇది ప్రతీవైద్యుడు సిద్ధంచేసి ఉంచుకోతగ్గది.

## 33 త్రికటు చూర్ణం

పిప్పలీ మరిచం శుంఠీ త్రిభి స్త్ర్యూషణ ముచ్యతే
దీపనం శ్లేష్మ మేదోఘ్నం కుష్ఠపీనసనాశనమ్
జయే దరోచకం సామం మేహగుల్మగళామయాన్ ॥

పిప్పళ్ళూ, మిరియాలూ, సొంటీ—ఇవి మూడూ సమభాగాలుగా కలిపి చూర్ణించి వస్త్రగాలితం చేసుకునేది. ఇది అగ్నిదీప్తి కలిగిస్తుంది. కఫమూ, కొవ్వూ తగ్గిస్తుంది. కుష్ఠూ, పీనసా, అరోచకమూ, మేహాలూ, గుల్మాలూ గళరోగాలూ పోగొడుతుంది. ఆమపచనం చేస్తుంది.

## ౩౪ త్రిఫలాదిచూర్ణం

ఏకా హరీతకీ యోజ్యా, ద్వౌ చ యోజ్యౌ విభీతకౌ
చత్వా ర్యామలకా న్యేవ త్రిఫలా సా ప్రకీర్తితా
త్రిఫలా మేహశోథఘ్నీ నాశయే ద్విషమజ్వరాన్
దీపనశ్లేష్మపిత్తఘ్నీ కుష్ఠహంత్రీ రసాయనీ
సర్పిర్మధుభ్యాం సంయుక్తా సైవ నేత్రామయాన్ జయేత్ ॥

కరకకాయ ఒకటి, తాడికాయలురెండు. ఉసిరికాయలు నాలుగు. ఈలెక్కచొప్పున భాగాలు వేసుకుని మెత్తగా చూర్ణించి వస్త్రగాలితంచేసుకునేది.

వీటి వొలుపులు మాత్రమే వాడుకోవాలి, గింజలు తీసెయ్యాలి.

ఇది మేహఉబ్బు తగ్గిస్తుంది. విషమజ్వరాలు పోగొడుతుంది. దీపనకారి' శ్లేష్మమూ పిత్తమూ తగ్గిస్తుంది. కుష్ఠురోగం హరిస్తుంది. బలమూ పుష్టీ చేస్తుంది. నెయ్యీ తేనే కలిపి పుచ్చుకుంటే కంటిజబ్బులున్నూ తగ్గిస్తుంది.

## ౩౫ చాతుర్జాతకచూర్ణం

త్రిగంధ మేలా త్వక్పత్రై శ్చతుర్జాతం సకేసరైః
త్రిగంధం సచతుర్జాతం రూక్షోష్ణం లఘుపిత్తకృత్
వర్ణ్యం రుచికరంతీక్ష్ణం పిత్తశ్లేష్మామయాన్ జయాన్

ఏలకులూ, దాల్చినిచెక్కా, ఆకుపత్రికమూ—ఇవి మూడూ త్రిగంధం అని పేరు. వీటితో నాగకేసరాలు చేరిస్తే అది చాతుర్జాతం అనిపించుకుంటుంది.

ఈత్రిగంధానికీ, చాతుర్జాతానికీ గుణాలు ఒకటే.

ఇవి చూర్ణించి వస్త్రగాలితం చేసుకునేది.

ఇది రూక్షం, ఉష్ణవీర్యం, పిత్తకారి. ఇది శరీరానికి తేజస్సు కలిగిస్తుంది, రుచిపుట్టిస్తుంది. పిత్తవ్యాధులలోనూ, శ్లేష్మవ్యాధులలోనూ మిక్కిలీ ఉపయోగకరమైనది.

## ౩౬ గుడపిప్పలి

విడంగం త్ర్యూషణం కుష్ఠం హింగు ర్లవణపంచకమ్
త్రిక్షారం ఫేనకం వహ్ని శ్శ్రేయసీ చోపకుంచికా
తాలపుష్పోద్భవం క్షారం నాడ్యా కూష్మాండకస్య చ
అపామార్గస్య చించాయా చూర్ణాని చిక్కణాని చ
సర్వచూర్ణసమం దేయం చూర్ణ మత్ర కణోద్భవమ్
ఏతస్మా ద్విగుణా చ్చూర్ణాత్ పురాణో ద్యోగుడో గుడః
మర్దయిత్వా దృఢేపాత్రే మోదకా నుపకల్పయేత్
భక్షయే దుష్ణతోయేన ప్లీహానం హంతి దుస్తరమ్
యకృతం పంచగుల్మం చ ఉదరం సర్వరూపకమ్
జీర్ణజ్వరం తథా శోథం కాసం పంచవిధం తథా
అశ్విభ్యాం నిర్మితా శ్రేష్ఠా బాలానాం గుడపిప్పలీ ॥

వాయువిడంగాలు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, చెంగల్వకోష్టు, ఇంగువ, సాముద్రలవణం, సైంధవలవణం, సౌవర్చలవణం, కాచలవణం, బిడాలవణం, సర్జక్షారం, యవక్షారం, టంకణక్షారం, సముద్రఫేనం, చిత్రమూలం, గజపిప్పళ్లు, నల్లజీలకర్ర, తాళపుష్పక్షారం, కూష్మాండనాడీక్షారం, అపామార్గక్షారం, చించాక్షారం ఇవి సమభాగాలు. వీటికి అన్నిటికీ సమానం పిప్పళ్లు ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసేది. మొత్తం యీచూర్ణం యెంతో అంత పాతబెల్లం, ఇవి కలిపి మర్దించేది.

వయోబలానుసారంగా మోతాదు కల్పించుకని ఇది వేడినీళ్ళ అనుపానంతో వాడాలి.

ఇది ప్లీహవృద్ధి తగ్గిస్తుంది. యకృద్వృద్ధినీ హరిస్తుంది. పంచగుల్మాలూ, ఉదరవ్యాధులూ, జీర్ణజ్వరమూ, ఉబ్బు, దగ్గూ పోగొడుతుంది.

ముఖ్యంగా చంటిపిల్లలకోసం ఇది అశ్వినీదేవతలు కల్పించారు.

ఇందులో టంకణక్షారం అంటే పొంగించిన వెలిగారం. తక్కిన తాలపుష్ప క్షారమూ, కూష్మాండనాడీక్షారమూ, అపామార్గక్షారమూ, చించాక్షారమూ తయారు చేసుకోవాలి. క్షారాలు చేసుకునే విధం శార్ఙ్గధరసంహితలో ౧౧వ అధ్యాయం చివర వున్నది, చూసుకునేది.

## ౩౭ సమశర్కరచూర్ణం

లవంగజాతీఫలపిప్పలీనాం
భాగా న్ప్రకల్ప్యాక్షసమాన మేషామ్
పలార్ధ మేకం మరిచస్య దద్యాత్
పలాని చత్వారి మహౌషధస్య
సితాసమం చూర్ణ మిదం ప్రసహ్య
రోగా నిమా నాశు బలా న్నిహన్యాత్
కాసజ్వరారోచకమేహగుల్మ
శ్వాసాగ్నిమాంద్యగ్రహణీప్రదోషాన్ ॥

లవంగాలు, జాజికాయ, పిప్పళ్లు—ఇవి ఒక్కొక్కటి రెండేసి తులాలు. మిరియాలు నాలుగు తులాలు. సొంటి నాలుగుతులాలు. ఇవి అన్నీ కలిపి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసుకునేది. ఈచూర్ణానికి సమంగా కలకండ చూర్ణం కలిపి వాడుకునేది.

ఇది దగ్గులూ, జ్వరాలూ, అరోచకమూ, మేహాలూ, గుల్మాలూ, వగరూప్ప అగ్నిమాంద్యమూ, గ్రహణీ తగ్గిస్తుంది.

మూలంలో భాగాలు మరోవిధంగా వుండినా భైష్యరత్నావళి వినోదినీటీకా కారుడు నిర్ణయించిన ప్రకారం యిక్కడ భాగాలు రాయడ మైనది.

## ౩౮ పారాసీయాదిచూర్ణం

పారాసీయయమానికా ఘనకణా శృంగీ విడంగారుణా
చూర్ణం శ్లక్ష్ణతరం విలీఢ మపి తత్ క్షౌద్రేణ సంయోజితమ్
కాసం నాశయతి జ్వరం చ జయతి ప్రౌఢాతిసారం జయే
చ్ఛర్దిం మర్దయతి క్రిమీం స్తు నియతం కోష్ఠస్థ మున్మూలయేత్ ॥

పారాసీయవాము, తుంగముస్తలు, పిప్పళ్లు, కర్కాటకశృంగి, అతివస—ఇవి సమం. ఇవన్నీ కలిపి చూర్ణించి వస్త్రగాలితం చేసుకునేది.

ఇది తేనెతో పుచ్చుకుంటే దగ్గు, జ్వరం, అతిసారం, ఛర్ది తగ్గిస్తుంది. కోష్ఠంలో పేరుకుని వుండిన క్రిములను నాశనం చేస్తుంది.

## ౩౯ సైంధవాది చూర్ణం

సింధూత్థపథ్యామగధోద్భవవహ్ని చూర్ణ
ముష్ణాంబునా పిబతి యః ఖలు నష్టవహ్నిః
తస్యామిషేణ సఘృతేన వరం నవాన్నం
భస్మీభవ త్యశితమాత్ర మిహా క్షణేన ॥

సైంధవలవణం, కరకవోలుపు, పిప్పళ్లు, చిత్రమూలం—ఇవి సమం. ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసుకునేది.

ఇది వేడినీళ్ళలో కలిపి తాగేది.

ఇది పుచ్చుకుంటే మాంసమూ నెయ్యీ కలిసిన ఆహారం కూడా అప్పటికప్పుడే జీర్ణం అయిపోతుంది. ఇది భోజనం అయిన తరవాత వాడాలి.

## ౪౦ సారస్వత చూర్ణం

కుష్ఠాశ్వగంధసైంధవపిప్పలిమరిచద్విజీరకం శుంఠీ
పాఠాజమోదసహితా సమభాగా చూర్ణితా చ వచా
ప్రాతర్మధుసర్పిభ్యాం బిడాలపదమాత్ర మేత దనలిహ్యా
సప్తాహం పథ్యాశీ కిన్నరమధురస్వరో భవతి మర్త్యః
ద్విగుణీకృతే చ తస్మి న్మేధావీ భవతి మృష్టవాక్య శ్చ
త్రిగుణీకృతే చ తస్మిన్ శ్లోకసహస్రం పఠ త్యాశు
దుర్మేధసః కిలాయం భిక్షో రాచార్యలోకసేనేన
అప్రార్థితేన దత్తో యోగవరో నందనవిహారే ॥

చెంగల్వకోష్టూ, పెన్నేరూ, సైంధవలవణమూ, పిప్పళ్ళూ, మిరియాలూ, జీలకర్రా, నల్లజీలకర్రా, సొంటీ, పాఠా, అజామోదమూ—ఇవి సమభాగాలు. ఇవన్నీ యెంతో అంత వస. ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసుకునేది.

ఇది ఉదయం రెండుతులాల చూర్ణం తేనె నెయ్యి—వీటితో కలిపి పుచ్చుకునేది.

(ఈ మోతాదు చాలా పెద్దది. స్థితిగతులను పట్టి బాగా యోచించి నిర్ణయించుకునేది.)

ఇది యీవిధంగా ఏడుదినములు మాత్రం సేవించి పథ్యంగా వుంటే కిన్నరుల కంఠస్వరం వంటి మధురస్వరం పుట్టుతుంది. రెండువారాలు సేవిస్తే మహామేధావీ మధురభాషీ అవుతాడు. మూడు వారాలు సేవిస్తే వెయ్యిశ్లోకాలైనా ఏకసంథలో గ్రహించగలుగుతాడు.

నందనవిహారంలో ఆచార్యలోకసేనభిక్షువు ఈయోగం కోరకుండానే ఒక బుద్ధిహీనునకిచ్చాడు.

## ౪౧ బృహత్సారస్వత చూర్ణం

కుష్ఠాశ్వగంధే లవణాజమోదే
ద్వే జీరకే త్రీణి కటూని పాఠా
మాంగల్యపుష్పీ చ సమాని చూర్ణం
కృత్వా తు చూర్ణేన వచోద్భవేన
తుల్యేన యుక్తం బహుశో రసేన
తద్భావితం బ్రహ్మవినిర్మితాయాః
సర్పిర్మధుభ్యాం చ తతోఽక్షమాత్రామ్
లిహ్యాన్నరః సప్తదినం హితాశీ
సౌస్వర్య మిచ్ఛేన్ మనసశ్చ స్థైర్యమ్
మేధాం తథేచ్ఛేన్ ద్విగుణం చ కాలమ్
పఠే న్నరః శ్లోకసహస్ర మహ్న
తద్వత్ప్రయుక్తం ద్విగుణం చ కాలమ్
సారస్వత మిదం చూర్ణం బ్రహ్మణా నిర్మితం పురా
జగద్ధితార్థం లోకానాం దుర్మేధసాం విచేతసామ్ ।

చెంగల్వకోష్టూ, పెన్నేరూ, సైంధవలవణమూ, అజామోదమూ, జీలకర్రా, నల్లజీలకర్రా, సొంటీ, పిప్పళ్ళూ, మిరియాలూ, పాఠా, శంఖపుష్పి—ఇవి సమభాగాలు. వీటి అన్నిటితోనూ, సమానం వస. ఇవన్నీ కలిపి చూర్ణించి వస్త్రగాలితం చేసి, ఆచూర్ణం చాలామాట్లు సరస్వతీఆకురసంతో భావనచెయ్యాలి

తరవాత, అది, కర్షప్రమాణం తేనెతోనూ నేతితోనూ ఏడుదినాలు సేవించేది. ఆయేడుదినాలూ పథ్యంగా వుండేది ఇలాచేస్తే సుస్వరం పుడుతుంది. మనస్సుకి ధైర్యమున్నూ కలుగుతుంది. ఇదే 14 దినాలు సేవిస్తే మహామేధావి అవుతాడు. 28 దినాలు సేవిస్తే ఒక్క దినాన వెయ్యిశ్లోకాలు చదవగలడు.

(ఇందులో కూడా మోతాదు జాగ్రత్తగా నిర్ణయించుకోవాలి. కర్షం చాలా హెచ్చు)

## ४२ రామఠాది చూర్ణం

రామఠం రుచకం వహ్ని గ్త్వచా జీరకనాగరమ్
విడంగం చిత్రకం కుష్ఠం కణా మరీచ వేతసమ్
దీప్యకం చేతి సర్వాణి సమభాగాని కారయేత్
చూర్ణ ముష్ణాంబునా పీతం వహ్నివృద్ధికరం పరమ్ ॥

ఇంగువ, సౌవర్చలవణం, చిత్రమూలం, వస, జీలకర్ర, సొంటి, వాయువిడంగాలు, చిత్రమూలం, చెంగల్వకోష్టు, పిప్పళ్లు, మిరియాలు, అమ్లవేతసం, వాము—ఇవి సమభాగాలు. ఇవన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసుకునేది. ఇది వేడినీళ్ళతో పుచ్చుకుంటే ఆకలివృద్ధిచేస్తుంది.

ఇంగువ వేయించాలి. చిత్రమూలం రెండుమాట్లు చెప్పడం రెండుభాగాలు వెయ్యమనడం.

## ४३ చందనాది చూర్ణం

చందనం నలదం లోధ్రం ఉశీరం పద్మకేసరమ్
నాగపుష్పం తథాబిల్వం భద్రముస్తం సశర్కరమ్
హ్రీబేరం చైవ పాఠా చ కుటజస్య ఫలం త్వచమ్
శృంగబేరం చాతిఃషా ధాతకీ చ రసాంజనమ్

ఆమ్రాస్థి జంబూసారం చ తథా మోచరసోద్భవమ్
నీలోత్పలం సమఙ్గా చ సూక్ష్మైలా దాడిమత్వచః
చతుర్వింశతి రేతాని సమభాగాని కారయేత్
తండులోదకసంయుక్తం క్షౌద్రేణ సహ యోజయేత్
చలతాం చామగర్భాణాం స్తంభనం పరముచ్యతే
అశ్విభ్యాం విహితం పూర్వం రక్తపిత్తవినాశనమ్
హితం లోహితపిత్తీనాం అర్శస్సు లోహితేషు చ
మూర్ఛాతమోపసృష్టానాం తృషార్తానాం చ దాపయేత్ ॥

చందనం, జటామాంసి, లొద్దుగుచెక్క, వట్టివేళ్లు, తామరపువ్వుకేసరాలు, నాగకేసరాలు, మారేడు శెరూ, భద్రముస్తలు, కురువేరు, పాఠ, కొడిశపాలవిత్తులు, కొడిశచెక్క, సొంటి, అతివస, ఆరెపువ్వు, రసాంజనం, మామిడిజీడి, నేరేడుగింజలలోని పప్పు, బూరుగుజిగురు, నల్లకలవ, మంజిష్ఠ, ఏలకులు, దానిమ్మబెరడు—ఇవి సమభాగాలు. ఇవి అన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితంచేసుకునేది.

చూర్ణానికి సమం చక్కెర కలపాలి.

ఇది కలితో గాని, తేనెతోగాని పుచ్చుకుంటే రక్తపిత్తం తగ్గిపోతుంది. రక్తం పడే మూలశంక కూడా పోతుంది. మూర్ఛలున్నూ తగ్గిపోతాయి.

## శడ్వ్యోషాది చూర్ణం

వ్యోషం వత్సకబీజం చ నింబ భూనింబ మార్కవమ్
చిత్రకం రోహిణీః పాఠాం దార్వీ మతివిషాం సమామ్
శ్లక్ష్ణచూర్ణీకృతం సర్వం తత్తుల్యా వత్సకత్వచః
సర్వమేకత్ర సంయోజ్య పిబే త్తండులవారిణా
సక్షౌద్రం వా లిహే దేత త్పాచనం గ్రాహి భేషజమ్
తృష్ణారుచిప్రశమనం జ్వరాతీసారనాశనమ్
ప్రమేహః గ్రహణీదోషం గుల్మం ప్లీహాన మేవ చ
కామలాం పాండురోగం చ శ్వయథుః చ వినాశయేత్ ॥

సొంటి, పిప్పళ్లు, మిరియాలు, కొడిశపాలవిత్తులు, వేపపట్ట, నేలవేము, గుంటకలగర, చిత్రమూలం, కటుకరోహిణి, పాఠ, మానుపసుపు, అతివస—ఇవి సమభాగాలు. కొడిశపట్ట వీటికన్నిటికీ సమం. ఇవి మెత్తగా కొట్టి వస్త్రగాలితం చేసుకునేది.

దీని కనుపానం బియ్యపుకడుగు, లేక, తేనె.

ఇది ఆమపాచనం చేస్తుంది. విరేచనాలు కడుతుంది. దప్పిక, అరుచి తగ్గిస్తుంది. జ్వరాతిసారం పోగొడుతుంది. గ్రహణి తగ్గిస్తుంది. ప్రమేహం, గుల్మం, ప్లీహవృద్ధి, కామెర్లు, పాండురోగం, ఉబ్బు హరిస్తుంది.

## ౪౫ నవాయసలోహ చూర్ణం

త్ర్యూషణం త్రిఫలా ముస్తం విడంగం చిత్రకం సమమ్
నవాయో రజసో భాగా స్తచ్చూర్ణం మధుసర్పిషా
భక్షయే త్పాండుహృద్రోగకుష్ఠార్శః కామలాపహమ్ ॥

సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, తుంగముస్తలు, వాయువిడంగాలు, చిత్రమూలం—ఇవి సమభాగాలు. లోహభస్మం వీటికన్నిటికీ సమం—అంటే తొమ్మిది భాగాలు.

ముందు మూలికలన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసి తరవాత లోహభస్మం బాగా కలిపేది. ఇది వయోనుసారంగా నేతితో గాని, తేనెతో గాని, వాడితే పాండురోగం, హృద్రోగం, కుష్టు, మూలశంక, కామెర్లు పోగొడుతుంది.

## ౪౬ లవంగచతుస్సమ చూర్ణం

జాతీఫలం త్రిదశపుష్పసమన్వితం చ
జీరం చ టంకణయుతం చరకైః ప్రయుక్తమ్
చూర్ణాని మాక్షికసితాసహితాని లీఢ్వా
సామాతిసార మఖిలం గురు హంతి శూలమ్ ॥

జాజికాయ, లవంగాలు, జీలకర్ర, పొంగించిన వెలిగారం—ఇవి సమభాగాలు. ఇది తేనెతో గాని చక్కెరతో గాని పుచ్చుకుంటే అతిసారమూ, ఆమాతిసారమూ, శూలా పోగొడుతుంది.

## ౪౭ సర్వౌషధీ స్నాన చూర్ణం

మురామాంసీ వచా కుష్ఠం శైలేయం రజనీద్వయమ్
శటీచంపకముస్తం చ సర్వౌషధిగణ స్స్మృతః
సర్వౌషధ్యంబునా స్నానం బాలానాం గదనాశనమ్
గ్రహరక్షః ప్రశమన మాయుష్యం కాంతివర్ధనమ్ ॥

జటామాంసి, వస, చెంగల్వకోష్టు, భద్రముస్తలు, పసుపు, మానుపసుపు, కచ్చూరాలు, సంపంగెపువ్వు, తుంగముస్తలు—ఇది సర్వౌషధిగణం. ఇవన్నీ సమభాగాలుగా గ్రహించి మెత్తగా చూర్ణించి 20 తులాల చూర్ణం రెండుద్రోణాల నీళ్ళలో వేసి పొంగులువచ్చే దాకా కాచి సుఖోష్ణంగా వున్నప్పుడు ఈజలంతో పిల్లలకు స్నానం (అభ్యంగం) చేయిస్తే పిల్లలకు గల సర్వవ్యాధులూ తగ్గిపోతాయి. ఇది ఏ రోగాలూ రానివ్వదు. ఆయుస్సు వృద్ధిచేస్తుంది. శరీరానికి తేజస్సు కలిగిస్తుంది. గ్రహబాధలు పోగొడుతుంది.

ఆయుర్వేదగ్రంథాలలో సర్వౌషధిగణాలు మూడు కనపడతాయి. వాటిలో సంప్రదాయం తెలిసిన వృద్ధవైద్యులు ఈగణమే వాడుతున్నారు.

## ౪౮ ఏలాది చూర్ణం

ఏలాశ్మభేదకశిలాజతు గోక్షురాణా
మూర్వారుబీజలవణోత్తమకుంకుమానాం
చూర్ణాని తండులజలే లులితాని పీత్వా
ప్రత్యక్షమృత్యు రపి జీవతి మూత్రకృచ్ఛ్రీ ॥

ఏలకులు, కొండపిండివేళ్ళు, గోమూత్రశిలాజిత్తు, పల్లేరు, దోసవిత్తులు, సైంధవలవణం, కుంకుమపువ్వు, ఇవి సమభాగాలుగా గ్రహించి చూర్ణించి వస్త్రగాలితంచేసి బియ్యపు కడుగులో కలిపి పుచ్చుకుంటే ప్రాణాలుతీసే మూత్రకృచ్ఛ్రం కూడా తగ్గిపోతుంది.

## ౪౯ లవంగాది చూర్ణం

లవంగజాతీఫలపిప్పలీనాం భాగా శ్చ కల్ప్యాః కుసమానపూర్వాః
పలార్ధమానం మరిచం ప్రదేయం పలాని చత్వారి మహౌషధస్య

సితా సమ స్తేన సమాప్య చూర్ణం రోగా నిమా నాశు బలా న్నిహంతి
కాసజ్వరారోచకమేహగుల్మశ్వాసాగ్నిమాంద్యగ్రహణీవికారాన్ ॥

లవంగాలు, జాజికాయ, పిప్పళ్ళు—ఇవి కర్షం చొప్పున గ్రహించేది మిరియాలు రెండుకర్షాలు. సొంటి 4 పలాలు. వీటికన్నిటికీ సమం చక్కెర. ఇవన్నీ కలిపి చూర్ణంచేసి పుచ్చుకుంటే దగ్గు, జ్వరం, అరోచకం, మేహం, గుల్మం, శ్వాస, అగ్ని మాంద్యం, గ్రహణి నశిస్తాయి.

# లేహ్యాలు

## లేహ్యకల్పన

క్వాథాదీనాం పునఃపాకా ద్ఘనత్వం సా రసక్రియా
సోవలేహ శ్చ లేహ శ్చ ప్రాశ ఇత్యుచ్యతే బుధైః
సితా చతుర్గుణా కార్యా చూర్ణా చ్చ ద్విగుణో గుడః
ద్రవం చతుర్గుణం దద్యా దితి సర్వత్ర నిశ్చయః
సుపక్వే తంతుమత్త్వం స్యా దవలేహోప్సు మజ్జతి
స్థిరత్వం పీడితే ముద్రాం గంధవర్ణరసోద్భవః ॥

కషాయం, హిమం, ఫాంటం—అనే మూడురకాల కషాయమూ, చక్కెరతో పాకం పట్టితే అది అవలేహం, లేహం, ప్రాశం, రసక్రియ—అని పేరు. ఇందులో చక్కెర వేస్తే ప్రక్షేపచూర్ణాలకు నాలుగింతలూ, బెల్లం అయితే రెండింతలూ, నీళ్లు, పాలు మొదలైన ద్రవాలు నాలుగింతలూ చేర్చుకోవాలి. అది సరిగా పాకంవస్తే తీగలాగ సాగుతుంది. ఉండచేసి నీళ్ళలో పడేస్తే మునిగిపోతుంది. చేతితో నలిపితే గట్టిగా ఉంటుంది. చక్కని రంగూ, చక్కని పరిమళమూ కూడా ఉంటుంది.

### ౧ చ్యవనప్రాశావలేహ్యం

బిల్వాగ్నిమంథశ్యోనాక కాశ్మర్యః పాటలా బలా
పర్ణ్య శ్చతస్రః పిప్పల్యః శ్వదంష్ట్రా బృహతీద్వయమ్
శృంగీతామలకీ ద్రాక్షా జీవంతీ పుష్కరాగురుః
అభయా చామృతా ఋద్ధి ర్జీవకర్షభకౌ శటీ
ముస్తం పునర్నవా మేదా సూక్ష్మైలోత్పలచందనే
విదారీ వృషమూలాని కాకోలీ కాకనాశికా
ఏషాం పలోన్మితా న్భాగాన్ శతా న్యామలకస్య చ

పంచ, దద్యా త్తద్దైకధ్యం జలద్రోణే విపాచయేత్
జ్ఞాత్వా గతరసా న్యేతా న్యౌషధా న్యథ తం రసమ్
తం చామలక ముద్ధృత్య నిష్కులం తైలసర్పిషోః
పలద్వాదశకే భృష్ట్వా దత్వా చార్ధతులాం భిషక్
మత్స్యండికాయాః పూతాయాః లేహవ త్సాధు సాధయేత్
షట్పలం మధున శ్చాత్ర సిద్ధశీతే ప్రదాపయేత్
చతుష్పలం తుగాక్షీర్యాః పిప్పల్యా ద్విపలం తథా
పల మేకం విదధ్యా చ్చ త్వగేలా పత్రకేసరమ్
ఇత్యయం చ్యవనప్రాశః పరము క్తో రసాయనః
కాసశ్వాసహర శ్చైవ విశేషే ణోపదిశ్యతే
క్షీణక్షతానాం వృద్ధానాం బాలానాం చాంగవర్ధనః
స్వరక్షయ మురోరోగం హృద్రోగం వాతశోణితమ్
పిపాసాం మూత్రశుక్రస్థాన్ దోషాం శ్చైవాపకర్షతి
అస్య మాత్రాం ప్రయుంజీత నోపరుధ్యా చ్చ భోజనమ్
అస్య ప్రయోగా చ్చ్యవనః సువృద్ధోభూ త్పున ర్యువా
మేధాం స్మృతిం కాంతి మనామయత్వం
ఆయుఃప్రకర్షం బల మింద్రియాణామ్
స్త్రీషు ప్రహర్షం పర మగ్నివృద్ధిం
బలప్రసాదం పవనానులోమ్యమ్ ॥
రసాయన స్యాస్య నరః ప్రయోగా
ల్లభేత జీర్ణోపి కుటీప్రవేశాత్
జరాకృతం పూర్వ మపాస్య రూపం
బిభర్తి రూపం నవయౌవనస్య
సితామత్స్యండికాలాభే ధాత్ర్యా శ్చ మృదుభర్జనమ్
చతుర్భాగజలే ప్రాయో ద్రవ్యం గతరసం భవేత్ ॥

మారేడు, నెల్లి, దుండిగం, పెగ్గుమ్మడు, కలిగొట్టు, బల, మాషపర్ణి, ముద్గపర్ణి, సాలపర్ణి, పృశ్నిపర్ణి, పిప్పళ్లు, పల్లేరు, వాకుడు, పెద్దములక, కర్కాటకశృంగి, నేలఉసిరిక, ద్రాక్షపండు, మనుబాల, పుష్కరమూలం, అగురుచెక్క, కరక వొలుపు, తిప్పతీగ, ఋద్ధి, జీవకం, ఋషభకం, కచ్చూరాలు, తుంగముస్తలు, గలిజేరు, మేద, పిన్నియేలకులు, నల్లకలువ, చందనం, నేలగుమ్ముడు, అడ్డసరంవేళ్లు, కాకోళి, కాకిదొండ—ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క పలం గ్రహించి మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి 500 ఉసిరికాయలున్నూ చేర్చి నాలుగోవంతు మిగిలేట్టు కాచాలి. తరవాత, ఉసిరికాయలు తీసి కషాయం వడబోసుకుని ఉంచుకోవాలి. ఆవుసిరికాయలు చల్లబడ్డతరవాత గింజలుతీసి పారేసి ఆగుజ్జు, ఆరుపలాల ఆవు నెయ్యి, ఆరుపలాల నువ్వులనూనె కలిపి దాంతో వేయించి ఉంచుకోవాలి.

తరవాత ఆకషాయంలో నాలుగువందలతులాలు చక్కెర కలిపి లేహపాకం పట్టి, అందులో 48 తులాల తేనె, వేయించిన ఉసిరికగుజ్జూ కలపాలి. మరిన్నీ, తవాక్షీరి నాలుగుపలాలు, పిప్పళ్ళు రెండుపలాలు, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు— అవి ఒక్కొక్కటి రెండేసి తులాలు—ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి, వస్త్రగాలితంచేసి—ఇదిన్నీ ఆపాకంలో కలపాలి. ఇది చ్యవనప్రాశం.

కషాయంలో చేర్చి ఉడికబెట్టేటప్పుడు 500 ఉసిరికాయలున్నూ విడిగా కాక ఒకగుడ్డలో మూటగట్టి అందులో వేసుకోవడం మంచిది. అలాచేస్తే ఉసిరికాయలు సులభంగా వేరుపడతాయి. ఆఉసిరికాయలు చల్లబడనిచ్చి గింజలు తీసివేసి గట్టిగుడ్డలో వేసి పిసికితే పైకి మెత్తని గుజ్జు వస్తుంది. ఈశలూ, నారా గుడ్డలో మిగిలిపోతుంది. పిండిజల్లెడలో పామిన్నీ ఈశలుతీసెయ్యవచ్చు. ఎలాగయినా అందులో పీచు లేకుండా చేసుకోవడం అవసరం.

ఇది దగ్గు, వగర్పు పోగొడుతుంది. వృద్ధులకు ఇది మిక్కిలీ మంచిది. రక్తమాంసాలు క్షీణించినవారికీ, బాలురకూ కూడా మిక్కిలీ మేలుచేస్తుంది. మరిన్నీ స్వరం క్షీణించడమూ, హృద్రోగమూ, ఉరఃక్షతమూ, వాతరక్తమూ, దప్పిక, మూత్రంలోనూ వీర్యంలోనూ ఉండే దోషాలూ పోగొడుతుంది. అతివృద్ధుడైన చ్యవనుడు ఇది సేవించి మళ్లీ యువకుడై సకలసుఖాలూ అనుభవించాడు.

మేధ, జ్ఞాపకశక్తి, కాంతి, ఆరోగ్యం, ఆయువు, బలం, స్త్రీలతో రమించే శక్తి, మిక్కిలీ ఆకలి, వాతానులోమ్యం కలిగిస్తుంది. వృద్ధుడైన పురుషుడు కూడా

కుటీప్రవేశం చేసి ఇది పుచ్చుకుంటే ముసలితనంవల్ల కలిగే బాధ లన్నీ పోయి మిక్కిలీ సుఖపడతాడు.

## ౨ వాసాకూష్మాండలేహ్యం

పంచాశచ్చ పలం గ్రాహ్యం కూష్మాండా త్స్విన్న మాజ్యతః
గ్రాహ్యం పలశతం ఖండం వాసాక్వాథాఢకే పచేత్
ముస్తా ధాత్రీ శుభా భార్గీ త్రిసుగంధై శ్చ కార్షికైః
ఐలేయవిశ్వధన్యాక మరిచై శ్చ పలాంశికైః
పిప్పలీ కుడవం చైవ మధుమానీం ప్రదాపయేత్
కాసం శ్వాసం క్షయం హిక్కాం రక్తపిత్తం హలీమకమ్
హృద్రోగ మమ్లపిత్తం చ పీనసం చ వ్యపోహతి ॥

బూడిదగుమ్మడికాయ, పైపెచ్చూ లోపలి గురుగూతీసివేసిన ముక్క యాభైపలాలు చిన్నచిన్నముక్కలు చేసి ఒక్క ప్రస్థం నేతిలో తేనెరంగు వచ్చేటట్టు వేయించేది. ఒక ఆఢక పరిమాణంగల అడ్డసరపుకషాయంలో నూరుతులాల చక్కెర కలిపి బాగా పాకంపట్టి, అందులో వేయించిన గుమ్మడిముక్కలూ,—

తుంగముస్తలు, ఉసిరికపప్పు, తవాక్షీరి, గంటుభారంగి, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం—ఇవి రెండేసి తులాలు. కూతురుబుడమ, సొంటి, ధనియాలు, మిరియాలు—ఇవి ఒక్కొక్కటి పలం. పిప్పళ్ళు 32 తులాలు. ఇవిన్నీ కలిపి చూర్ణించి వస్త్రగాలితంచేసి యీ చూర్ణమూ,

ఎనిమిదిపలాల తేనే కలిపి దించుకుని జాగ్రత్తచేసుకునేది.

ఇది దగ్గు, వగర్పు, క్షయ, ఎక్కిళ్ళు, రక్తపిత్తం, హలీమకం, హృద్రోగం, ఆమపిత్తం, పీనస పోగొడుతుంది.

## ౩ లవంగాద్యవలేహ్యం

లవంగం పిప్పలీ శుంఠీ మరిచం జీరకద్వయమ్
కేసరం తగరం చైవ ఏలా జాతీఫలం తుగా
కట్ఫలం తేజపత్రం చ పద్మబీజం సచందనమ్

కంకోల మగురుం చైవ ఉశీర మభ్రకం తథా.
కర్పూరం జాతికోశం చ ముస్తం మాంసీ యవ స్తథా
ధాన్యకం శతపుష్పా చ లవంగం సర్వతుల్యకమ్
సర్వచూర్ణద్విగుణితాం శర్కరాం వినియోజయేత్
సర్వరోగం నిహంత్యాశు అమ్లపిత్తం సుదారుణమ్
అగ్నిమాంద్య మజీర్ణం చ కామలా పాండురోగనుత్
బలపుష్టికరం చైవ విశేషా చ్ఛుక్రవర్ధనమ్
గ్రహణీం సర్వరూపాం శ్చ అతిసారం సుదుర్జయమ్
అశ్విభ్యాం నిర్మితం హంతి లవంగాద్య మిదం శుభమ్ ॥

లవంగాలు, పిప్పళ్ళు, సొంటి, మిరియాలు, జీలకర్ర, నల్లజీలకర్ర, నాగకేసరాలు, గ్రంధితగరం, ఏలకులు, జాజికాయ, తవాక్షీరి, కాయఫలం, ఆకుపత్రికం, తామర గింజలు, చందనం, కంకోలాలు, అగురుచెక్క, వట్టివేళ్ళు, అభ్రకభస్మం, పచ్చకర్పూరం, జాపత్రి, తుంగముస్తలు, జటామాంసి, యవలు, ధనియాలు, పెద్దసోపు-ఇవి సమభాగాలు. వీటి కన్నిటికీ సమం లవంగాలు. ఇవన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసి రెండురెట్లు చక్కెరతో పాకంపట్టి కావలసినంత తేనె కలిపి పుచ్చుకునేది.

ఇది సర్వరోగాలూ హరిస్తుంది. ముఖ్యంగా అమ్లపిత్తమూ, అజీర్ణమూ, అగ్నిమాంద్యమూ, కామెర్లూ, పాండురోగమూ తగ్గించేస్తుంది. బలమూ పుష్టీ కలిగిస్తుంది. వీర్యవృద్ధిచేస్తుంది సర్వవిధాల గ్రహణులూ, అతిసారాలు పోగొడుతుంది.

## ౪ ముస్తకాదిమోదకం

త్రికటు త్రిఫలా చిత్రం లవంగం జీరకద్వయమ్
యమాన్యౌ ద్వే మధురికా నాగవల్లీదళం తథా
శతపుష్పావరీధాన్యం చాతుర్జాతం తథా తుగా
మేథీ జాతీఫలం గ్రాహ్యం ప్రత్యేకం కర్షసమ్మితమ్
ముస్తకం షట్పలం దేయం సితా చ ద్విగుణా మతా
గ్రహణీం హంత్యతీసారం మందాగ్నిత్వ మరోచకమ్

అజీర్ణ మామదోషం చ విషూచీ మపి దారుణమ్
పుష్టిం దేహస్య జనయే ద్బలవర్ణాగ్నివృద్ధికృత్
వలీపలితదౌర్బల్యం క్షపయే త్కృశతా మపి ॥

సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరక, తాడి పుష్కరికలు, చిత్రమూలం, లవంగాలు, జీలకర్ర, నల్లజీలకర్ర, వాము, అజామోదం, సోపు, తమలపాకులు, సదాప, పిల్లి తేగలు, ధనియాలు, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు, తవా క్షీరి, మెంతులు, జాజికాయ—ఇవి ఒక్కొక్కటి రెండేసి తులాలు. తుంగముస్తలు 48 తులాలు. ఇవన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితంచేసి రెండురెట్లు చక్కరతో పాకంపట్టి తగినంత తేనె కలిపి పుచ్చుకుంటే గ్రహణి, అతిసారం, అగ్నిమాంద్యం, అరోచకం, అజీర్ణం, ఆమదోషం, విషూచి (కలరా) పోగొడుతుంది. శరీరపుష్టి కలిగిస్తుంది, బలం, కాంతి వృద్ధిచేస్తుంది ఆకలి పుట్టిస్తుంది. శరీరం ముడతలు పడడం, జుట్టు నెరియడం, నరాల దౌర్బల్యం పోగొడుతుంది. చిక్కిపోయినవారికి చాలా మంచిది.

## ౫ శ్రీ కా మే శ్వ ర మో ద కం

ధాత్రీ సైంధవ కుష్ఠ కట్ఫల కణా శుంఠీ యమానీద్వయమ్
యష్టీ జీరయుగం చ ధాన్యక శటీ శృంగీ వచా కేసరమ్
తాళీశం త్రిసుగంధికం సమరిచం పథ్యాక్ష మేథి స్నుహమ్
చూర్ణీకృత్య మనాక్ స్వబీజసహితం భృష్ట్వాతు శక్రాశనమ్
సర్వేషాం ద్విగుణాం సితాం సువిమలాం యత్నా ద్భిషక్ నిక్షిపేత్
క్షౌద్రం చాపి ఘృతం ప్రశస్తదివసే కుర్యా చ్ఛుభాన్ మోదకాన్
కర్పూరై రవచూర్ణితా నపి హితాన్ దత్వా తిలాన్ భర్జితాన్
గోప్యోయం క్షితిమండలే మితధియాం పాడండినా మగ్రతః
ఆధివ్యాధిహరః పరం క్షయహరః కుష్ఠాపహారో బృంహణః
స్త్రీణాం తోషకరో ముఖద్యుతికరః శుక్రాగ్నివృద్ధిప్రదః
కాసశ్వాసబలాసరోగనిచయ ప్రధ్వంసనః ప్రాణినామ్
ప్రోక్తో బ్రహ్మసుతేన సర్వసుఖదః కామేశ్వరో మోదకః

గ్రహగణపరిహీనః సర్వశాస్త్రప్రవీణః
కలితవిమలకీర్తిః ప్రాప్తకందర్పమూర్తిః
విగతసకలభీతి ర్గీతవాద్యాంగనీతి
ర్భవతి భువి సదేవో యేన భుక్తః పయశ్చాత్
రహసి యువతిఖేలాసంపుటాకర్షహార్షాత్
గమయతి యువతీనాం కేళికౌతూహలేన
యది కథ మపి భుక్తో భోజనాదావథాంతే
సురతరభస ముచ్చై ర్నష్టకామం ప్రకామమ్
యస్మా న్నవ్యబృహస్పతి స్తనుధియా యస్మా త్సదా వీర్యవాన్
యస్మా దున్మదదాక్షిణాత్య యువతీ సంభోగకౌతూహలీ
యస్మా త్కావ్యకుతూహలం సుకవితా సంజాయతే లీలయా
శ్రీమద్భిః ప్రతివాసరం క్షితితలే సంసేవ్యతాం మోదకః ॥

ఉసిరికపప్పు, సైంధవలవణం, చెంగల్వకోష్టు, జాయఫలం, పిప్పళ్లు, సొంటి, వాము, అజామోదం, యష్టిమధుకం, జీలకర్ర, నల్లజీలకర్ర, ధనియాలు, కచ్చూరాలు, కర్కాటకశృంగి, వస, నాగకేసరాలు, తాళీసపత్రి, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, మిరియాలు, కరకవోలుపు, తాడికాయబెరడు—ఇవి సమ భాగాలు. ఇవన్నీ కలిపి యెంతో కొద్దిగా వేయించిన కొడిశపాలవిత్తులు అంత. పచ్చకర్పూరంతో సువాసింపజేసి వేయించిన నువ్వులున్నూ అంత. ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితంచేసి రెండురెట్ల చక్కెరతో పాకం పట్టేది. అవునెయ్యీ, తేనె తగినంత చేర్చుకునేది.

ఇది ఆధివ్యాధులను హరిస్తుంది. క్షయ, కుష్టు పోగొడుతుంది. రక్తమాంసాలు పెంచి శరీరానికి పుష్టికలిగిస్తుంది. స్త్రీలను సంతోషపెడుతుంది. ముఖాలకు కాంతికలిగిస్తుంది. వీర్యం, జఠరాగ్ని వృద్ధిచేస్తుంది. కాస, శ్వాస, బలాస మనే కంఠగతముఖరోగం పోగొడుతుంది. ఇది యెప్పుడూ వాడుతూ వుండే పురుషుడు ఎందరు స్త్రీల నైనా సంతోషపెట్టగలడు. సూక్ష్మబుద్ధి, బలశాలీ, కవీ, అయి చిరకాలం జీవించగలుగుతాడు.

## ఉమేథీమోదకం

త్రికటు త్రిఫలా ముస్త జీరకద్వయ ధాన్యకమ్
కట్ఫలం పౌష్కరం శృంగీ యమానీ సైంధవం బిడం
తాళీశం కేసరం పత్రం త్వగేలా చ ఫలం తథా
జాతీకోశం లవంగం చ మురా కర్పూర చందనమ్
యావం త్యేతాని చూర్ణాని తావదేవ తు మేథికా
సంచూర్ణ్య మోదకః కార్యః పురాతనగుడేన తు
ఘృతేన మధునా కించి త్ఖాదే దగ్నిబలం ప్రతి
అగ్నిం చ కురుతే దీప్తం సామే మేదే మహౌషధమ్
బలవర్ణకరో హ్యేష సంగ్రహా గ్రహణీహరః
ప్రమేహాన్ వింశతిం హంతి మూత్రాఘాతాం స్తథాశ్మరీమ్
పాండురోగం తథా కాసం యక్ష్మాణం హంతి కామలామ్
స్తనౌ తు పతితౌ గాఢౌ స్యాతాం తాళఫలోపమౌ
దృష్టిప్రసాదనం చైవ నారీణాం చైవ పుత్రదః
భాషితః కామదేవేన మేథీమోదకసంజ్ఞకః ॥

సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరక, తాడి, వుసిరికలు, తుంగముస్తలు, జీలకర్ర, నల్లజీలకర్ర, ధనియాలు, కాయఫలం, పుష్కరమూలం, కర్కాటకశృంగి, వాము, సైంధవలవణం, బిడాలవణం, తాళీసపత్రి, నాగకేసరాలు, ఆకుపత్రికం, దాల్చిని చెక్క, ఏలకులు, జాజికాయ, జాపత్రి, లవంగాలు, మురామాంసి, పచ్చకర్పూరం, చందనం—ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి యెంతో మెంతులు అంత. ఇవన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసి రెండురెట్లు పాతబెల్లంతో పాకంపట్టి తగినంత ఆవునెయ్యి, తేనె చేర్చి అగ్నిబలానుసారంగా పుచ్చుకునేది.

ఇది జఠరదీప్తి కలిగిస్తుంది. ఆమదోషం తగ్గించేస్తుంది. గ్రహణి హరిస్తుంది. బల్లం, కాంతి వృద్ధిచేస్తుంది. వింశతి ప్రమేహాలూ, మూత్రాఘాతాలూ, అశ్మరీ, పాండురోగం, దగ్గు, క్షయ, కామెర్లు తగ్గించేస్తుంది, స్త్రీలకు వాలిపోయిన స్తనాలు తాళఫలాలలాగ దృఢపడతాయి. చూపు వృద్ధిచేస్తుంది. స్త్రీలకు సంతాన ఫలం కలిగిస్తుంది.

## ౭ బృహజ్జీరకాదిమోదకం

జీరకం కృష్ణజీరం చ కుష్ఠం శుంఠీ చ పిప్పలీ
మరిచం త్రిఫలా త్వక్ చ పత్ర మేలా చ కేసరమ్
శుభా లవంగం శైలేయం చందనం శ్వేతచందనమ్
కాకోలీ క్షీరకాకోలీ జాతీకోషఫలే తథా
యష్టీమధురికా మాంసీ ముస్తం సచలకం శటీ
ధన్యాకం దేవతాడం చ మురా ద్రాక్షా నఖీ తథా
శతపుష్పా వక్మకం చ మేథీ చ సురదారు చ
సజలం నాలుకా చైవ సైంధవం గజపిప్పలీ
కర్పూరం వనితా చైవ కుందఖోటీ సమాంశకమ్
లోహ మభ్రక వంగానాం ద్విభాగం తత్ర దాపయేత్
ఏతాని సమభాగాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్
సర్వచూర్ణసమం దేయం భృష్టజీరకచూర్ణకమ్
సితా ద్విగుణితా దేయా మోదకం పరికల్పయేత్
ఘృతేన మధునా మిశ్రం మోదకం చ భిషగ్వరః
భక్షయే త్ప్రాతరుత్థాయ యథాదోషం యథాబలః
గవ్యం సశర్కరం చైవ చానుపానం ప్రయోజయేత్
అశీతిం వాతజాన్ రోగాన్ చత్వారింశ చ్చ పైత్తికాన్
సర్వాం స్తా న్నాశయ త్యాశు వృక్ష మింద్రాశని ర్యథా
నానావర్ణ మతీసారం విశేషా దామసంభవమ్
శూల మష్టవిధం హంతి చాప్యోరోగం చిరోద్భవమ్
జీర్ణజ్వరం చ సతతం విషమజ్వర మేవ చ
స్త్రీణాం చై వానపత్యానాం దుర్బలానాం చ దేహినామ్
పుష్కృ త్పుత్రకృ చ్చైవ బలవర్ణకరం పరమ్
సూతికారోగ మత్యుగ్రం నాశయే న్నాత్రసంశయః

ప్రదరం నాశయ త్యాశు సూర్య _స్తమ ఇవోదితః
దాహం సార్వాంగకం చైవ వాతపిత్తోత్థితం చ యత్
అయం సర్వగదచ్ఛేకీ జీరకాద్యో హి మోదకః ॥

జీలకర్ర, నల్లజీలకర్ర, చెంగల్వకోష్టు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరక, తాడి, వుసిరికలు, దాల్చినిచెక్క, ఆకుపత్రికం, ఏలకులు, నాగకేసరాలు, తవాక్షీరి, లవం గాలు, తుంగముస్తలు, చందనం, రక్తచందనం, కాకోళి, క్షీరకాకోళి, జాజికాయ, జాపత్రి, యష్టిమధుకం, మధురిక, జటామాంసి, భద్రముస్తలు, గోమూత్రశిలాజిత్తు, కచ్చూరాలు, ధనియాలు, దేవదాళి, ద్రాక్షపండు, ముర, నఖంచిప్పలు, సదాప, పద్మకాష్ఠం, మెంతులు, దేవదారు, కురువేరు, నళిక, సైంధవలవణం, గజపిప్పళ్ళు, పచ్చకర్పూరం, ప్రేంకణం, కుందఖోటి—ఇవి ఒక్కొక్క భాగం. లోహభస్మం, అభ్రకభస్మం, వంగభస్మం—ఇవి రెండేసిభాగాలు. ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసుకునేది. ఇవన్నీ కలిపి యెంతో దోరవేయించిన జీలకర్రచూర్ణం అంత.

ఈచూర్ణా లన్నీ కలిపి రెండింతల చక్కెరతో పాకంపట్టి తగినంత తేనే, ఆవునెయ్యీ కలిపి వయస్సు ననుసరించీ, అవస్థ ననుసరించీ మోతాదు కల్పించుకుని పుచ్చుకునేది దీనికి అనుపానం చక్కెర కలిపిన ఆవుపాలు.

ఇది అశీతివాతరోగాలూ, ఇరవైనాలుగు పిత్తరోగాలూ పోగొడుతుంది. రక రకాల అతిసారం, ముఖ్యంగా ఆమాతిసారం, అష్టవిధశూలలు, జీర్ణించిన మూల శంకలు, జీర్ణజ్వరాలూ, విషమజ్వరాలూ తగ్గించేస్తుంది. రజస్వల కానిస్త్రీలకు రజో దర్శనం కలిగిస్తుంది. సంతానం లేని స్త్రీలకు సంతానం కలిగిస్తుంది. కృశించిన స్త్రీ లకు రక్తమాంసాలు పెంచి పుష్టి కలిగిస్తుంది. బలం కాంతీ కూడా కలిగిస్తుంది. ఉగ్ర మైన సూతికారోగమున్నూ తగ్గించేస్తుంది. ప్రదరం, సర్వాంగతాపం పోగొడుతుంది.

## ౮ శివా మోదకం

శివా తామలకీ మూర్వా శతపుష్పా నిశాద్వయమ్
ఆత్మగుప్తా బలా బిల్వం దేవపుష్పం శతావరీ
మురా మధురికా మాంసీ విశాలీ విశ్వభేషజమ్
అనంతామలకీ శ్యామా భార్గీ కరికణా కణా

చాతుర్జాతం చతుర్బీజం చందనం రక్తచందనమ్
ముసలీ వాజిగంధా చ బీజం గోక్షురసంభవమ్
సర్వాణ్యేతాని తుల్యాని ద్రాక్షా సర్వసమా మతా
సితా ద్రాక్షాసమా చైవ తాన్యేతాని మధునా సహ
సంమర్ద్య మోదకాన్ కృత్వా మాషకప్రతిమాన్ భిషక్
ఏకైక మేషాం పయసా ప్రాతః ప్రాతః ప్రయోజయేత్
బాలానాం సర్వరోగఘ్నం పుష్టికృద్బలవర్ధనమ్
పరం వహ్నికరం మేధ్యం ఆయుష్యం గ్రహదోషహృత్
భగవత్యా సముదితం శివాయై లోకమంగళమ్
ఏతన్మోదక మీశేన యుగే భగవతా కృతే ।

కరకపొలుపు, నేలఉసిరిక, చాగ, సదాప, పసుపు, మానుపసుపు, తూలగొండి గింజలు, బళ, మాశేఖగుజ్జు, లవంగాలు, పిల్లితేగలు, మురామాంసి, మధురిక, జటామాంసి, నేలగుమ్ముడు, సొంటి, సుగంధి, ఉసిరికపప్పు, నల్లసుగంధి, గంటుభారంగి, గజపిప్పళ్లు, పిప్పళ్ళు, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు, మెంతులు, నల్లజీలకర్ర, వాము, చందనం, రక్తచందనం, నేలతాడి, పెన్నేరు, పల్లేరుకాయలు—ఇవి సమభాగాలు. ఇవన్నీ మెత్తగాచూర్ణించి వస్త్రగాలితం చేసి వుంచుకునేది.

తరవాత, ఈచూర్ణం, దీనంత ద్రాక్షపండు, ద్రాక్షపండంత చక్కెర—ఇవి మూడూ చేర్చి వలసినంత తేనె కలిపి ముద్దచేసుకునేది. ద్రాక్ష మెత్తగా చిలకగొట్టి మరీ కలుపుకునేది. ఇది పూటకి అరతులం చొప్పున పిల్లల కిచ్చేది.

ఇది ప్రత్యేకం పిల్లల నిమిత్తం ఏర్పడ్డది. ఇది పొద్దుటిపూటమాత్రమే వాడాలి. అనుపానం వెచ్చనిపాలు, ఇది సర్వరోగాలూ హారిస్తుంది, పుష్టి, బలం కలిగిస్తుంది. ఆకలి వృద్ధిచేస్తుంది, జ్ఞాపకశక్తి, బుద్ధిసూక్ష్మత కలిగిస్తుంది. గ్రహదోషాలు హరించి ఆయువు వృద్ధిచేస్తుంది.

## — గుడకూష్మాండావలేహ్యం

కూష్మాండకాత్పలశతం సుస్విన్నం నిష్కులీకృతమ్
పస్థం చ ఘృతతైలస్య తస్మిం స్తప్తే నిధాపయేత్

త్వక్పత్రధాన్యకవ్యోషజీరకైలాద్వయానలమ్
గ్రంథికం చవ్య మాతంగ పిప్పలీ విశ్వభేషజమ్
శృంగాటకం కశేరుం చ ప్రలంబం తాలమస్తకమ్
చూర్ణీకృతం పలాంశం చ గుడస్య తులయా పచేత్
శీతీభూతే పలాన్యష్టౌ మధునస్సంప్రదాపయేత్
కఫపిత్తానిలహరం మందాగ్నీనాం చ శస్యతే
కృశానాం బృంహణం శ్రేష్ఠం వాజీకరణ ముత్తమమ్
ప్రమదాసు ప్రసక్తానాం యే చ స్యుః క్షీణరేతసః
క్షయేణ తు గృహీతానాం పరమేత ద్భిషగ్జితమ్
కాసం శ్వాసం జ్వరం హిక్కాం హంతి ఛర్ది మరోచకమ్
గుడకూష్మాండకం ఖ్యాత మశ్విభ్యాం సముదాహృతమ్
ఖండకూష్మాండవ త్పాత్రం స్విన్నకూష్మాండక ద్రవః ॥

బూడిదగుమ్మడిపండు, పైపెచ్చూ, లోపలిగురుగూ, తీసినది నూరుపలాలు. అది చిన్న చిన్న ముక్కలుగా కోసి ద్రోణంనీళ్ళలో వేసి నాలుగోవంతు మిగిలేటట్టు వుడికించి అర్థప్రస్థం ఆవునెయ్యీ, అర్థప్రస్థం నువ్వులనూనే కలిపి దానితో ముక్కలు దోరగా వేయించి ఉంచుకోవాలి.

దాల్చినిచెక్క, ఆకుపత్రికం, ధనియాలు, సొంటి. పిప్పళ్లు, మిరియాలు, జీలకర్ర, నల్లజీలకర్ర, పెద్దయాలకులు, చిన్న యాలకులు, చిత్రమూలం, గ్రంధితగరం, చవ్యం, గజపిప్పళ్ళు, సొంటి, పరికెగడ్డ, నమ్మదుంప, నేలతాడి— ఇవి ప్రక్షేప ద్రవ్యాలు. ఇవన్నీ ఒక్కొక్క పలం గ్రహించి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసుకుని వుంచుకునేది.

పైని నాలుగోవంతు మిగిలివున్న కషాయంలో నూరుపలాల పాతబెల్లం కలిపి పాకంపట్టి, అందులో, వేయించివుంచుకున్న గుమ్మడిముక్కలూ, చూర్ణమూ కలిపి, అందులో 8 పలాల తేనె కలిపి వాడుకునేది.

ఇది త్రిదోషాలనూ జయిస్తుంది. అగ్నిమాంద్యం పోగొడుతుంది. కృశించిన వారికి రక్తమాంసాలు పెంచి శరీరపుష్టి కలిగిస్తుంది. వీర్యవృద్ధీ. నరములకు బింకమూ కలిగిస్తుంది, అతి సంభోగంవల్ల శుక్రక్షీణం పొందినవారికీ, క్షయవ్యాధి అంకురించిన

వారికీ ఇది మంచి ఔషధం. మరిన్నీ, ఇది, దగ్గు, వగర్పు, జ్వరాలు, ఎక్కిళ్ళు, ఛర్ది, అరోచకం కూడా పోగొడుతుంది.

## ౧౦ కంటకార్యాద్యవలేహ్యం

కంటకారీతులాం నీరద్రోణే పక్త్వా కషాయకమ్
పాదశేషం గృహీత్వా చ తస్మిన్ చూర్ణాని దాపయేత్
పృథక్పలాని చైతాని గుడూచీ చవ్య చిత్రకాః
ముస్తం కర్కటశృంగీ చ త్ర్యూషణః ధన్వయాసకః
భార్గీ రాస్నా శటీ చైవ శర్కరా పలవింశతిః
ప్రత్యేకం చ పలాన్యష్టౌ ప్రదద్యాత్ ఘృతతైలయోః
పక్త్వా లేహత్వ మానీయ శీతే మధుపలాష్టకమ్
చతుష్పలం తుగాక్షీర్యాః పిప్పలీనాం చతుష్పలమ్
క్షిప్త్వా నిదధ్యాత్ సుదృఢే మృణ్మయే భాజనే శుభే
లేహోఽయం హంతి హిక్కార్తిశ్వాసకాసాన శేషతః ॥

వాకుడు సమూలం రెండువందల పలాలు రెండు ద్రోణాల నీళ్ళలో నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. ఆకషాయంలో 20 పలాల చక్కెర పాకం పట్టి, ఎనిమిది పలాల ఆవునెయ్యి, ఎనిమిది పలాల నువ్వులనూనె అందులో చేర్చేది.

తిప్పసత్తు, చవ్యం, చిత్రమూలం, తుంగముస్తలు, కర్కాటకశృంగి, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, దూలగొండివేళ్ళు, గంటుభారంగి, సన్నరాస్న, కచ్చూరాలు–ఇవి ఒక్కొక్క పలం చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితంచేసి అది ఆపాకంలో కలిపి దించుకునేది. చల్లబడ్డ తరవాత అందులో ఎనిమిది పలాల తేనె కలుపుకుని వాడుకునేది. నాలుగుపలాల తవాక్షీరీ, నాలుగుపలాల పిప్పళ్ళూ కూడా చూర్ణించి వస్త్రగాలితంచేసి అందులో కలుపుకునేది.

ఇది ఎక్కిళ్లు, వగర్పు, దగ్గు పూర్తిగా పోగొడుతుంది.

## ౧౧ అశ్వగంధాదిలే[illegible]

సజాతీఫలం వ్యోషసిందూరసేవ్యం [illegible]
విడంగం చ కోష్ఠం లవంగం సుగంధీ [illegible]

ఖరా రాష్ట్రిచోరా వరాహీ ద్విజీరం
శతావ ర్యజామోదకం మాగధీ
మూలకం కోమలీ వాలుకం స
త్వనర్ష్యమూలం సమం సర్వ
వస్త్రాని తులాశ్వగంధీ
సచూర్ణీకృతం మాక్షికాజ్యైస్సితై
న్స్యాత్సుపాకేన మృద్వగ్నినా పాచయే
ల్లేహ్యా మంచ ద్విశాలం చ సేవ్యం
మహామేహామూర్ఛాపురాణజ్వరం
సర్వవాతాని గుల్మాని కాసాదికం
శ్వాస ఛర్దిం చ పాండుం
మహా సశ్మరీరోగముఖ్యాఖిలారు
గ్వినాశం మహాకాంతిదం పుష్టిదం దీపనం చ
సుధాధామసంకాశయుక్తం సుమాంగల్య
యుక్తం మనస్థైర్యదం బుద్ధిదం
చాశ్వగంధాఖ్య లేహ్యాం పురా
శంభునా నిర్మితం పథ్య మిచ్ఛా కరోతి ॥

జాజికాయ, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, రససిందూరం, చవ్యం, వాయువిడంగాలు, చెంగల్వకోష్టు, లవంగాలు, సుగంధ, వాము, సన్నరాస్న, కచోరాలు, నేలతాడి, జీలకర్ర, నల్లజీలకర్ర, పిల్లితేగలు, అజామోదం, పిప్పలికట్టె, కన్నెకోమలి, కురు వేరు, తెల్లగలిజేరు—ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిసి యెంతో పెన్నేరు అంత. ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితంచేసి రెండురెట్లు చక్కెరతో పాకం పట్టి, తగినంత ఆవునెయ్యీ తేనే కలిపి వాడుకునేది ఇచ్ఛాపథ్యం చేస్తే చాలు.

ఇది ప్రమేహాలు, మూర్ఛలు, పురాణజ్వరాలు, సర్వవాతాలు, గుల్మం, దగ్గు, వగర్పు, ఛర్ది, పాండువు, మూత్రాశ్మరి మొదలైన రోగాలు హరిస్తుంది, కాంతి, పుష్టి, వీర్యవృద్ధీ కలిగిస్తుంది. మనస్థైర్యం, సూక్ష్మబుద్ధీ, ప్రసాదిస్తుంది.

## ౧౨ మదనకామేశ్వర లేహ్యం

లవంగం చ త్వక్పత్ర ఏలా మరీచం
కణా కృష్ణ కస్తూరి జాతీఫలం చ
అహీఫేనజాపత్రతక్కోలచోరం
మధూకం సుతాలీశపత్రం చ సేవ్యం
ద్విజీరే చ రాస్నా సుకర్కాటశృంగీ
విళంగం చ దీప్యా కరీపిప్పలీనాం
సుతీక్ష్ణం మృతాభ్రం మృతస్స్వర్ణవంగా
ప్రవాళం సుముక్తాగురూ చందనం చ
విదారీ వరీ వాశ వారాహి మాషా
బలా శాల్మలీ మర్కటీ చాశ్వగంధీ
క్షితీశర్కరా త్వక్చ గోక్షూర రంభా
ప్రియాళుశ్చ ద్రాక్షాథ ఖర్జూరగంధీ
చణా కుంకుమా సింధుగాంధారపత్రం
ఘృతం శర్కరా క్షౌద్రకం లేహ్యమిశ్రం
ఇదం మాషమాత్రప్రమాణేన భుక్త్వా
సితక్షీరపానా ద్రమంతే శతస్త్రీః
మహాపుష్టికారీ మహాజీర్ణకారీ
చిరంవీర్యధారీ క్షుధాధిక్యహారీ
బలానశ్వాసకాసప్రసేకం సశూలం
తనుక్షీణహా కామదండస్య వృద్ధిం
శివం నిర్మితం మదనకామేశ్వరాఖ్యః ॥

లవంగాలు, దాల్చిని, ఆకుపత్రికం, - ఏలకులు, మిరియాలు, పిప్పళ్లు, కృష్ణాగరు, కస్తూరి, జాజికాయ, నల్లమందు, జాపత్రి, తక్కోలాలు, కచ్చూరాలు, యష్టిమధుకం, తాళీసపత్రం, శేవ్యం, తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర, రాతిపండు, కర్కాటక

శృంగి, వాయువిడంగాలు, వాము, గజపిప్పళ్లు, లోహభస్మం, అభ్రకభస్మం, సువర్ణ భస్మం, వంగభస్మం, ప్రవాళభస్మం, ముత్యభస్మం, అగరుచెక్క, మంచిగంధపు పొట్టు, నేలగుమ్మడి, పిల్లితేగలు, అడ్డసరపాకు, నేలతాడి, కారుమినుము, బల, బూరుగుజిగురు, పెద్దమూలగొండిగింజలు, పెన్నేరు, భూశర్కర, గొబ్బివిత్తులు, పల్లేరుకాయలు, అరటిదుంప, ఖర్జూరపువేళ్లు, ద్రాక్షపళ్ళు, ఖర్జూరపుకాయలు, గ్రంథితగరం, కారుసెనగలు, కుంకుమపూవు, సైంధవలవణం—ఇవి ఒక్కొక్కతులం చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితంచేసి వుంచుకునేది. 60 తులాల వెన్నలో 20 తులాల గంజాయి రెండుదినాలు నాననిచ్చి తరవాత ఆవెన్న కాచి ఆ నెయ్యి లేహపాకంలో చేర్చుకోవాలి. గంజాయి పారేసేది. చూర్ణానికి మూడు రెట్ల చక్కెరతో పాకంపట్టేది తగినంత ఆవునెయ్యీ తేనే చేర్చుకునేది. ఈ లేహ్యం మోతాదు పావుతులం. రాత్రి భోజనానంతరం సేవించి వెంటనే చక్కెర కలిపిన వేడిపాలు పుచ్చుకోవాలి. ఇది దారుణంగా మలబంధం కలిగిస్తుంది కనక రాత్రి మాత్రమే యిది పుచ్చుకుని, ఉదయం సునాముఖీ చేర్చిన ఖండార్ద్రకం పుచ్చుకోవాలి.

ఇది రక్తపుష్టీ, వీర్యవృద్ధీ, నరాలకు బింకమూ సంభోగసౌఖ్యమూ కలిగిస్తుంది. వీర్యస్తంభనం చేస్తుంది. జీర్ణకారి. శ్వాసకాసలు, శూల, కార్శ్యం పోగొడుతుంది. ఇది వైద్యుని సలహాతో వాడడం మంచిది.

## ౧౩ సుగంధ్యాది లేహ్యం

సంగృహ్య శారిబాం ప్రస్థం జలద్రోణే విపాచయేత్
అష్టభాగావశిష్టం తత్కషాయం వస్త్రగాలితమ్
త్రిప్రస్థం శర్కరా తస్మిన్ ప్రక్షిపేత్పాకసిద్ధయే
ప్రక్షేపార్థం సుగంధిస్స్యా దేకప్రస్థం సుచూర్ణితం
జీరద్వయం నాగరం చ త్వగేలా నాగకేసరమ్
లవంగం ముస్తకం ధాత్రీ విడంగం శైలవాలుకమ్
ఉశీరం చందనం ధాన్యం విషధారి తుగా శటీ
పలమానం చోపచీనీ ద్రాక్షా ఖర్జూరకాః పృథక్
పలద్వాదశకం సమ్యక్చూర్ణితం వస్త్రగాలితమ్

మధుప్రస్థం ఘృతప్రస్థం నిక్షిపే త్తు_శతో భిషక్
భక్షయే త్తోలమానేన శుచిర్భూత్వా దినేదినే
రక్తదోషాన్ ప్రమేహాంశ్చ పైత్తికాన్ మూత్రకృచ్ఛ్రకాన్
సర్వవ్రణగణం, శ్వేతకుష్ఠం వ్యాచుచ్ఛాలకం తథా
రక్తకాసం చోపదంశ మర్శాంసి బహుమూత్రకమ్
నాశయే దవికల్పేన వ్యాశ్విభ్యాం నిర్మితః పురా ॥

ఒకప్రస్థం సుగంధి మెత్తగా చూర్ణించి ఒక ద్రోణం నీళ్ళలో కలిపి ఎనిమిదోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. ఆకషాయంలోమూడుప్రస్థాల చక్కెర కలిపి పాకం పట్టాలి. ప్రత్యేకంగా సుగంధి ఒకప్రస్థం, జీలకర్ర, సొంటి, దాల్చినిచెక్క, ఏలకులు, నాగకేసరం. లవంగాలు, తుంగముస్తలు, ఉసిరికపప్పు, వాయువిడంగాలు, కూతురుబుడమ, వట్టివేరు, చందనం, ధనియాలు, విషకంట్రకాలు, తవాక్షీరి, కచ్చూరాలు—ఇవి ఒక్కొక్కపలం, ఫిరంగిచెక్క, ద్రాక్షపండు, ఖర్జూరపుకాయలు—ఇవి ఒక్కొక్కటి పన్నెండేసిపలాలు. ఇవన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసి ఆపాకంలో కలిపేది. ఒకప్రస్థం నెయ్యి, ఒకప్రస్థం తేనె కూడా చేర్చి దినానికొక్క తులంచొప్పున వాడుకునేది.

ఇది రక్తదోషాలు, ప్రమేహాలు, పిత్తవ్యాధులు, మూత్రకృచ్ఛ్రలు, సర్వవ్రణాలు, శ్వేతకుష్ఠు, వ్యాచుచ్ఛాల, రక్తకాస, సవాయి, మూలశంకలు, బహుమూత్రం పోగొడుతుంది.

## ౧౪ శైలూషాదిరసాయనం

శైలూషం మధుకం ద్రాక్షా ప్రస్థం ప్రస్థం పృథక్ పృథక్
ఖండయిత్వా భాండగర్భే జలద్రోణద్వయే పచేత్
అష్టభాగావశేషం చ కషాయం సుపరిశ్రుతమ్
సర్పిషః ప్రస్థయుగ్మం చ పచే త్తత్పృథుమాగ్నినా
చందనద్వితయం ధాన్యం వరాళం నాగకేసరమ్
కచోరం పత్రకం యష్టి ర్జాతీఫలకటుత్రయమ్
ద్రాక్షా ఖర్జూర రాస్నా చ భార్గీ మంజిష్ఠ శారిబా

త్రిఫలా మోచ తక్కోల ముశీరద్వితయం తథా
ఏకైకం పలయుగ్మం చ సూక్ష్మచూర్ణం చ కారయేత్
ఖండప్రస్థద్వయం పక్వే మేళయిత్వా శనైశ్శనైః
క్షౌద్రప్రస్థం ప్రదాతవ్యం శీతే చాపి ప్రయత్నతః
ప్రాతరుత్థాయ సేవేత కర్షమాత్రం దినేదినే
రక్తమేహం సురామేహం మూత్రమేహం చ శర్కరామ్
ఇక్షుమేహం మహామేహం వసామేహం హారిద్రకమ్
లాలామేహం తంతుమేహం మంజిష్ఠాం సికతాం తథా
శుక్లమేహం శిలామేహం ఖజ్జలీం మేహదాహకమ్
సర్వాన్వింశతిమేహాంశ్చ ప్రదరం రక్తపైత్తికమ్
ఋతుశూన్యం చ ఋతుశూలం కరపాదవిదాహకమ్
వ్రణం చ పిటకాః గ్రంధిం వాతమేహవిదాహకమ్
పిపాసా కంఠశోషం చ హృత్తాపం పాదశోషకమ్
కాసశ్వాసం కఫోద్రేకం మూర్ఛాం సర్వాం చ విద్రధిమ్
క్షయాన్వింశతికాన్ హన్యా జ్జిహ్వావదనశోషణమ్
ఏతాన్ సర్వాన్నిహంత్యాశు నాత్ర కార్యా విచారణా
అశ్విభ్యాం నిర్మితం పూర్వం శైలూషాదిరసాయనమ్ ।

మారేడువేరుపట్ట, యష్టిమధుకం, ద్రాక్షపండు—ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రస్థం గ్రహించి మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి ఎనిమిదో వంతు మిగిలేటట్టు కషాయం కాచి వడబోసి వుంచుకునేది. అందులో రెండుప్రస్థాల చక్కెరచేర్చి సన్నమంటమీద పాకం పట్టాలి. పాకం సిద్ధం అయిన తరవాత అందులో రెండుప్రస్థాల ఆవునెయ్యి చేర్చాలి.

చందనం, రక్తచందనం, ధనియాలు, లవంగాలు, నాగకేసరాలు, కచ్చూరాలు. ఆకుపత్రికం, యష్టిమధుకం, జాజికాయ, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, ద్రాక్షపండు, ఖర్జూరపుకాయలు, సన్నరాస్న, గంటుభారంగి, మంజిష్ఠ, సుగంధి, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, బూరుగుజిగురు, తక్కోలాలు

వట్టివేరు, కురువేరు—ఇవి రెండేసిపలాలు గ్రహించి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసి అపునేయి కలిపిన పాకం దించి అందులో కలియబెట్టేది. తరవాత అందులో ఒక్కప్రస్థం తేనె కలిపి వయోవస్థానుసారం వాడుకునేది.

ఇది రక్తమేహం, సురామేహం, మొదలైన వింశతిమేహాలు, ప్రదరం, రక్తపిత్తం, ఋతుశూన్యత, ఋతుశూల, అరిచేతులు అరికాళ్ళు మంట, వ్రణాలు, పిటకలు, గ్రంథులు, వాతమేహం, విదాహం, దప్పిక. కంఠంఆర్చుకుపోవడం, హృదయతాపం, పాదశోష, శ్వాసకాసలు, కఫోద్రేకం, మూర్ఛలు, విద్రధి, క్షయ, నాలుకఆర్చుకుపోవడం, ముఖం ఆర్చుకుపోవడం పోగొడుతుంది.

## ౧౫ మధుస్నుహీ రసాయనం

ఫలత్రయం కటుత్రయం సుయోజయే ద్విమగ్వర
స్త్రిజాతకం యమానియుగ్మవహ్నిజీరకం తథా
రాస్న భార్గి వహ్ని చవ్య ధాన్యయుగ్మజీరకం
మాంసి కుష్ఠ వజ్రకేశ్య శారిబా వశాహ్వకం
అశ్వగంధిసంయుతం పృథక్చ కర్షసంయుతం
మధుస్నుహీ చ తత్సమా సశర్కరా సమాక్షికమ్
గోఘృతం సుపక్వకం రసాయనం మనోహరమ్
మేహపైత్యవాతకుష్ఠగుల్మశూలహారకమ్
సప్తధాతువర్ధనం సుదీపనం యశస్కరమ్
పూజ్యపాదనిర్మితం రసాయనం సుపూజితమ్॥

కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, వాము, కురాసానివాము, చిత్రమూలం, జీలకర్ర, సన్నరాస్న, గంటుభారంగి, పిప్పళ్ళు, చవ్యం, ధనియాలు, మెంతులు, నల్లజీలకర్ర, జటామాంసి, చెంగల్వకోష్టు, వట్టివేళ్లు, సుగంధి, నేలతాడి, పెన్నేరు—ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్కకర్షం. ఇవన్నీ యెంతో అంత ఫిరంగిచెక్క. ఇవన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసి ఉంచుకునేది.

రెండు రెట్లు చక్కెర పాకంపట్టి తగినంత ఆవునెయ్యి, ఈచూర్ణమూ అందులో పోసి కలిపి తేనెకూడా చేర్చి పుచ్చుకునేది.

ఇది మేహాలు, వాతాలు, కుష్ఠు, గుల్మాలు, శూల హరిస్తుంది. సప్తధాతువులకు పుష్టి కలిగిస్తుంది. ఆకలి హెచ్చుచేస్తుంది.

## ౧౬ కూష్మాండ లేహ్యం

నిష్కులీకృతకూష్మాండఖండం పలశతం పచేత్
నిక్షిప్య ద్వితులం నీర మర్థశిష్టం చ గృహ్యతే
తాని కూష్మాండఖండాని పీడయే ద్దృఢవాససా
ఆతపే శోషయే త్కించి చ్చూర్ణలాగ్రై ర్బహుశోవ్యధేత్
క్షిప్త్వా తామ్రకటాహే చ దద్యా దష్టపలం ఘృతమ్
తేన కించి ద్భర్జయిత్వా పూర్వోక్తం తజ్జలం క్షిపేత్
ఖండా త్పలశతం దత్వా సర్వ మేకత్ర పాచయేత్
సుపక్వే పిప్పలీ శుంఠీ జీరాణాం ద్విపలం పృథక్
పృథక్పలార్థం ధాన్యాకం పత్రైలామరిచత్వచమ్
చూర్ణీకృత్య క్షిపే త్తత్ర ఘృతార్థం క్షౌద్ర మావిహేత్
ఖాదే దగ్నిబలం దృష్ట్వా రక్తపిత్తక్షయీ జ్వరీ
శోష స్తృష్ణా తమచ్ఛర్ది కాసశ్వాసక్షతాతురః
కూష్మాండకావలేహోయం బాలవృద్ధేషు యుజ్యతే
ఉరస్సంధానకృ ద్వృష్యో బృంహణో బలకృ న్మతః ॥

పైబెరడూ, లోపలి గురుగూ తీసిన బూడిదగుమ్మడి కాయ నూరుపలాలు గ్రహించి సన్నని ముక్కలుగా కోసి రెండువందల పలాల నీళ్ళలో కలిపి సగం మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. బాగా వుడికిన ఆముక్కలు గట్టిగా పిడిచి కొంచెం ఎండబెట్టి ఎనిమిదిపలాల ఆవునేతితో దోరగావేయించి ఆకషాయంలో వేసి, నూరుపలాల చక్కెర కూడా చేర్చి లేహ్యపాకం వచ్చేటట్టు కాచాలి.

పిప్పళ్ళు, సొంటి, జీలకర్ర—ఇవి రెండేసిపలాలు. ధనియాలు, ఆకుపత్రికం, ఏలకులు, మిరియాలు, దాల్చినిచెక్క—ఇది ఒక్కొక్కటి అరపలం. ఇవి మెత్తగా

చూర్ణించి వస్త్రగాలితంచేసి ఆపాకంలో కలిపి నాలుగుపలాల తేనెకూడా కలిపి వాడుకునేది.

జఠరాగ్నిబలం గుర్తించి మోతాదు నిర్ణయించుకోవాలి. రక్తపిత్తం, క్షయ, జ్వరం, శోష, దప్పిక, కళ్ళుతిరగడం, ఛర్ది, శ్వాసకాసలు, క్షతక్షీణం, పోగొడుతుంది. అన్నరసం గుండెల కెగతన్నితే అది దింపుతుంది. ఇది వీర్యవృద్ధి కలిగిస్తుంది. శరీరానికి రక్తమాంసాలు పెంచి పుష్టి కలిగిస్తుంది. బలంచేస్తుంది.

## ౧౭ బిల్వాది లేహ్యం

త్రింశత్పలం బిల్వమూలం అర్ధకుంభాంభసా పచేత్
అష్టభాగావశేషేస్మిన్ కషాయ మవతారయేత్
త్రింశత్పలం గుడం దత్వా కించిత్పక్వం చ కారయేత్
త్రిపలం శృంగిబేరస్య మరీచస్య చతుష్పలమ్
పిప్పల్యాః కుడవార్ధం చ చవికాయాః ప్రకుంచకమ్
ముష్టిం తాళీసపత్రస్య ముష్ట్యర్థం కేసరస్య చ
ద్విపలం పిప్పలీమూలం చిత్రకస్య పలం తథా
పృథ క్త్రిజాతకం చైవ కర్షం జీరపలద్వయమ్
చూర్ణం తస్మిన్ వినిక్షిప్య యుక్త్యా పుష్పరసం క్షిపేత్
ఏత ద్బిల్వాదికం లేహ్యం సర్వఛర్దినివారణమ్
హృద్రోగకామిలాగుల్మగ్రహణ్యారుచిపీనసమ్
హిక్కా కాస క్రిమి శ్వాస ప్లీహానాహగరామయాన్
అర్శాంసి పాండురోగం చ హన్యా త్కాలే నిషేవితః ॥

మారేడువేళ్లు 30 పలాలు గ్రహించి మెత్తగా చితకగొట్టి ఒక ద్రోణంనీళ్ళలో కలిపి ఎనిమిదోభాగం మిగిలేటట్లు కషాయం కాచి వడబోసుకునేది. అందులో 30 పలాలు పాతబెల్లం కలిపి పాకంపట్టి—సొంటి 3 పలాలు. మిరియాలు 4 పలాలు. పిప్పళ్లు 2 పలాలు. చవ్యం ఒకపలం. తాళీసపత్రి ఒకపలం. నాగకేసరాలు అరపలం. పిప్పలిమోడి రెండుపలాలు. చిత్రమూలం ఒకపలం. దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం ఒక్కొక్క కర్షం. జీలకర్ర రెండుపలాలు—ఇవన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితంచేసి అందులో వేసి కలియబెట్టి తగినంత తేనె కలుపుకుని వాడుకునేది.

ఇది సర్వఛర్దులూ తగ్గించేస్తుంది. హృద్రోగం, కామెర్లు గుల్మాలు, గ్రహణి, అరుచి, పీనస, ఎక్కిళ్లు, దగ్గు, కృములు, వగర్పు, ప్లీహావృద్ధి, ఆనాహం, విషదోషాలు, మూలశంకలు, పాండువు—ఇవన్నీ పోగొడుతుంది.

## ౧౮. కుటజాద్యవలేహ్యం

కుటజత్వక్పలశతం జలే ద్రోణే విపాచయేత్
అష్టభాగావశేషం తు కషాయ మవతారయేత్
వస్త్రపూతం పునః క్వాథం పచే ల్లేహత్వ మాగతమ్
భల్లాతకవిడంగాని త్రికటు త్రిఫలా తథా
రసాంజనం చిత్రకం చ కుటజస్య ఫలాని చ
వచా మతివిషాం బిల్వం ప్రత్యేకం చ పలంపలమ్
త్రింశత్పలం గుడం చైవ చూర్ణీకృత్య నిధాపయేత్
మధునః కుడవం దద్యా ద్ఘృతస్య కుడవం తథా
లేహోఽయం శమయ త్యర్శో యన్య రక్తసముద్భవమ్
వాతికం పైత్తికం చైవ శ్లైష్మికం సాన్నిపాతికమ్
యే చ దుర్నామజా రోగా స్తాన్ సర్వా న్నాశయ త్యపి
అమ్లపిత్త మతీసారం పాండురోగ మరోచకమ్
గ్రహణీ మార్తవం కార్శ్యం శ్వయథుం కామలా మపి
అనుపానం ఘృతం దద్యా న్మధు తక్రం జలం పయః
అనేకరోగనాశాయ కౌటజో లేహ్య ఉచ్యతే ॥

పచ్చికొడిశచెక్క నూరుపలాలు గ్రహించి మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్లలో కలిపి ఎనిమిదో వంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. శుద్ధిచేసిన జీడిగింజలు, వాయువిళంగాలు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకతాడివుసిరికలు, రసాంజనం, చిత్రమూలం, కొడిశపాలవిత్తులు, వస, అతివస, మారేడుగుజ్జు—ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క పలం గ్రహించి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితంచేసి వుంచుకునేది.

ఆకషాయంలో 30 పలాల పాతబెల్లం పాకంపట్టి అందులో యీచూర్ణమూ, నాలుగుపలాల ఆవునెయ్యీ, నాలుగుపలాల తేనే చేర్చి కలియబెట్టి వయోబలావస్థాను సారంగా వాడుకునేది.

ఇది సకలరకాల మూలశంకలూ పోగొడుతుంది. అమ్లపిత్తం, అతిసారం' పాండురోగం, అరోచకం, గ్రహణి, స్త్రీలకు రజస్సంబంధంగా వచ్చిన కృశత్వం, ఉబ్బు, కామెర్లు పోగొడుతుంది.

---

# తైలాలు

## స్నేహద్రవ్యకల్పన

కల్కా చ్చతుర్గుణీకృత్య ఘృతం వా తైల మేవవా
చతుర్గుణే ద్రవే సాధ్యం తస్య మాత్రా పలోన్మితా ॥

తైలంలోనూ ఘృతంలోనూ చేర్చే మూలికలు ముందుగా నూరి ముద్దగా చెయ్యాలి. ఆమూలికలముద్ద పేరు కల్కం. తైలమో ఘృతమో ఏది చెయ్యదలుచుకుంటే అది ఆకల్కద్రవ్యాలకు నాలుగురెట్లు చేర్చుకోవాలి. వాటిలో చేర్చే కషాయాలూ మొదలైన ద్రవద్రవ్యాలు ఆచమురుకి నాలుగురెట్లు చేర్చుకోవాలి.

నిక్షిప్య క్వాథయే త్తోయం క్వాథ్యద్రవ్యా చ్చతుర్గుణమ్
పాదశిష్టం గృహీత్వా తు స్నేహా స్తై నైవ సాధయేత్ ॥

ఆకషాయం చేసే విధానం — క్వాథ్యం అంటే కషాయంలో చేర్చవలసిన మూలికలు. వాటి మొత్తానికి నీళ్ళు నాలుగురెట్లు చేర్చి నాలుగోభాగం మిగిలేటట్టూ కాచాలి. ఆకషాయం వడబోసుకుని తైలాదులలో చేర్చుకోవాలి.

## క్వాథ్యమూ — జలమూ

చతుర్గుణం మృదుద్రవ్యే కఠినేష్టగుణం జలమ్
తథా చ మధ్యమద్రవ్యే దద్యా దష్టగుణం పయః
అత్యంతకఠినద్రవ్యే నీరం షోడశికం మతమ్
మృద్వాది క్వాథ్యసంయోగే దద్యాదష్టగుణం పయః ॥

తిప్పతీగ మొదలైనవి మృదుద్రవ్యాలు. వాటికషాయం చెయ్యాలంటే వాటికి నాలుగురెట్లు జలంపోసి కాచి నాలుగోవంతు మిగల్చాలి. దశమూలాలు మొదలైనవి మధ్యమద్రవ్యాలు. వాటికషాయం చెయ్యాలంటే జలం వాటికి యెనిమిదిరెట్లు చేర్చి ఎనిమిదోవంతు మిగిలేటట్టు కాచాలి. దేవదారు మొదలైనవి కఠినద్రవ్యాలు. వాటితో

కషాయం చెయ్యాలంటే జలం వాటికి పదహారురెట్లు చేర్చుకుని పదహారోవంతుమిగిలే టట్టు కాచుకోవాలి. మృదుద్రవ్యాలూ కఠినద్రవ్యాలూ చేర్చి కషాయం చెయ్యాలంటే జలం వాటికి ఎనిమిదిరెట్లు చేర్చుకుని ఎనిమిదోవంతు మిగిలేటట్టు కాచుకోవాలి.

## క్వాథ్య పరిమాణాలు

కర్షాదితః పలం యావ త్క్షిపే త్షోడశికం జలమ్
తదూర్ధ్వం కుడవం యావత్ క్షిపే దష్టగుణం జలమ్
ప్రస్థాదితః క్షిపే న్నీరం ఖారీ యావ చ్చతుర్గుణమ్ ॥

క్వాథ్యద్రవ్యపరిమాణాన్ని పట్టి కూడా యీజలప్రమాణం మారుతుంది. క్వాథ్యం, కర్షం మొదలు పలం దాకా వుంటే పదహారు రెట్లు నీళ్ళు చేర్చుకోవాలి. పలం మొదలు కుడవందాకా వుంటే ఎనిమిదిరెట్లు నీళ్ళు చేర్చుకోవాలి. కుడవం మొదలు ఖారీప్రమాణందాకా వుంటే నీళ్లు నాలుగురెట్లు చేర్చుకోవాలి.

## కల్కప్రమాణం

అంబుక్వాథరసై ర్యత్ర పృథ క్స్నేహస్య సాధనమ్
కల్క స్యాంశం తత్ర దద్యా చ్చతుర్థం షష్ఠ మష్టమమ్
దుగ్ధే దధ్ని రసే తక్రే కల్కో దేయోష్టమాంశకః
కల్కస్య సమ్య క్పాకార్థం తోయ మత్ర చతుర్గుణమ్ ॥

కల్కద్రవ్యం గుణం తైలానికీ ఘృతానికీ పట్టా లంటే వాటితో పాటు శుద్ధజలమో, కషాయమో, రసమో, పాలుమొదలైనవో చేర్చి మరీ కాచాలి. ఆకాచడంలో, శుద్ధజలం మాత్రమే పొయ్యవలసివుంటే కల్కం ఆజలంలో నాలుగోవంతు ఉండాలి. కషాయం పొయ్యవలసివుంటే అందులో కల్కం ఆరోవంతు ఉండాలి. పాలు, పెరుగు, మజ్జిగ, మాంసరసము—ఇవి చేర్చవలసివుంటే వాటిలో కల్కం యెనిమిదోవంతు ఉండాలి. కల్కం చక్కగా పక్వం కావడానికి దానికి నాలుగురెట్లు జలం కూడా చేర్చుకోవాలి.

## ద్రవద్రవ్య పరిమాణం

ద్రవాణి యత్ర స్నేహేషు పంచాదీని భవంతి హి
తత్ర స్నేహసమా న్యాహు ర్యథాపూర్వం చతుర్గుణమ్ ॥

తైలంగాని, ఘృతంలో గాని కాచేటప్పుడు ద్రవద్రవ్యాలు అయిదో అయిదింటికంటే యెక్కువో ఉండినట్టయితే, అవి, ఒక్కొక్కటి ఆచమురు ఎంతో అంతంత చేర్చుకోవాలి. అయిదింటికంటె తక్కువగా వుంటే అవన్నీ కలిపి చమురుకంటే నాలుగు రెట్లు యెక్కువగా వుండాలి.

## కల్కాదులు చెప్పకపోతే?

ద్రవేణ కేవలే నైవ స్నేహపాకో భవే ద్యది
తత్రాంబుపిష్టః కల్కః స్స్యా జ్జలం చాత్ర చతుర్గుణమ్
క్వాథేన కేవలే నైవ పాకో యత్రేరితః క్వచిత్
క్వాథద్రవ్యస్య కల్కోపి తత్ర స్నేహే ప్రయుజ్యతే ॥

కొన్ని యోగాలలో క్వాథలు (కషాయాలు) మాత్రమే చెప్పి కల్కద్రవ్యాలు చెప్పకపోవచ్చు. అలాంటప్పుడు ఆకషాయద్రవ్యమే నీళ్ళతో నూరి కల్కంచేసుకోవాలి. అలాంటి చమురువంట చేసేటప్పుడు అందులో నాలుగురెట్లు నీళ్ళున్నూ చేర్చుకోవాలి.

## పుష్పాలే కల్కం అయితే?

పుష్పకల్కస్తు యస్స్నేహ స్తత్ర తోయం చతుర్గుణమ్
స్నేహే స్నేహాష్టమాంశ శ్చ పుష్పకల్కః ప్రయుంజతే ॥

పువ్వులతోనే కల్కం చెప్పినప్పుడు అందులో చమురుకి నాలుగురెట్లు జలం చేర్చుకోవాలి. పుష్పకల్కం చమురులో నాలుగోవంతు తీసుకోగూడదు. ఎనిమిదోవంతు తీసుకోవాలి.

## జలాదులు చెప్పకపోతే?

జలస్నేహౌషధానాం చ ప్రమాణం యత్ర నేరితమ్
తత్ర స్యా దౌషధా త్స్నేహ స్స్నేహా త్తోయం చతుర్గుణమ్
గంధద్రవ్యాణి చేచ్ఛంతి కల్కస్యార్ధాంశకాని చ
స్నేహపాకవిధా యత్ర క్షీర మేకస్తు కథ్యతే
తోయాదీనా మనిర్దేశే క్షీరమేవ చతుర్గుణమ్
ద్రవాంతరేణ యోగే తు క్షీరం స్నేహసమం విదుః ॥

ఏయోగంలో నైనా కల్క-ద్రవ్యాలూ, చమురూ, జలమూ చెప్పి వాటి ప్రమాణాలు చెప్పకపోతే, కల్కం యెంతో కొంత నిర్ణయించుకుని తైలమో ఘృతమో దానికి నాలుగు రెట్లు చేర్చుకోవాలి. ఆచమురుకంటే నాలుగురెట్లు జలం చేర్చుకోవాలి, కల్కంలో సుగంధద్రవ్యాలు చేర్చుకోదలిచితే కల్కంలో సగం చేర్చుకోవాలి. ఏదైనా యోగంలో జలాదులు లేక ఒక్క పాలే చెప్పి దాని ప్రమాణం చెప్పకపోతే, పాలు చమురుకంటే నాలుగురెట్లు చేర్చుకోవాలి. మరికొన్ని ద్రవద్రవ్యాలు కూడా చెబితే పాలు చమురుతో సమంగా చేర్చుకోవాలి.

స్వరసక్షీరదమాంసలైః పాకో యత్రేరితః క్వచిత్
జలం చతుర్గుణం తత్ర వీర్యాధానార్థ మావపేత్
నముంచతి రసం ద్రవ్యం క్షీరాదిభి రుపస్కృతమ్
సమ్యక్పాకో నజాయేత తస్మా త్తోయం చతుర్గుణమ్ ॥

స్వరసము, పాలు, పెరుగు—వీటిలో యేదయినా తైలంలో గాని ఘృతంలో గాని చేర్చవలసివుంటే అందులో నీళ్ళు చమురుకంటే నాల్గురెట్లు చేర్చుకోవాలి. ఇలా చెయ్యడం ఆచమురుకి మూలికల శక్తి సంక్రమించడానికి, పాలు పెరుగు మొదలైన వాటిలో మునిగివుండిన మూలికాద్రవ్యాలలోవున్న రసం బయటికి రాదు. అంచేతనే నాల్గురెట్లు నీళ్ళు చేర్చుకోవాలి.

## కల్కాదుల క్రమం

ఆదౌ కల్కః ప్రదాతవ్యో గంధద్రవ్యం తతఃపరమ్
తైల ముత్తార్య దాతవ్యం శిహ్లకం కుంకుమం నఖమ్
గంధచందనకర్పూర మేలాబీజం లవంగకమ్ ॥

తైలమో ఘృతమో కాచేటప్పుడు ద్రవద్రవ్యంలో ముందు కల్కం చేర్చి కాచాలి, తరవాత పరిమళద్రవ్యాలు చేర్చాలి. దించిన వెంటనే శిలారసమూ, కుంకుమపువ్వూ, నఖంచిప్పలూ, గంధకమూ, చందనమూ, పచ్చకర్పూరమూ, ఏలకులూ, లవంగాలూ చూర్ణించి చేర్చాలి.

## గంధద్రవ్యాలు

ఏలా చందనకుంకుమాగురుమురాతక్కోలమాంసీశటీ
శ్రీవాస చ్ఛదగ్రంథిపర్ణ శశభృత్ క్షోణీధ్రజోశీరకమ్

కస్తూరీ నఖపూతితైలజలముక్ మేథీలవంగాదికమ్
గంధద్రవ్య మిదం ప్రదేయ మఖిలం శ్రీవిష్ణుతైలాదిషు ॥

శ్రీవిష్ణుతైలం మొదలైనవాటిలో చేర్చతగ్గ సుగంధద్రవ్యాలు—ఏలకులు, చందనం, కుంకుమపువ్వు, అగురుచెక్క, మరువం, తక్కోలాలు, జటామాంసి, కచోరాలు, మడ్డిపాలు, భూర్జపత్రం, పచ్చాకు, పచ్చకర్పూరం, గోమూత్రశిలాజతు, వట్టివేళ్ళు, కస్తూరి, నఖంచిప్పలు, పునుగు, తుంగగడ్డలు, మెంతులు, లవంగాలు—ఇత్యాదులు.

## ఘృతతైలపాకాలు తెలుసుకోవడం

వర్తివత్స్నేహకల్కస్స్యా ద్యదాంగుల్యా వివర్తితః
శబ్దహీనోగ్ని నిక్షిప్తః స్నేహస్సిద్ధో భవేత్తదా
యదా ఫేనోద్గమ స్తైలే ఫేనశాంతి శ్చ సర్పిషి
గంధవర్ణరసోత్పత్తిః స్నేహస్సిద్ధో భవేత్తదా ॥

తైలమూ, ఘృతమూ పక్వం అయినప్పుడు కల్కంతీసినలిపితే వత్తిలాగ అవుతుంది, ఆచమురు నిప్పుమీద చిలికితే చిటపటశబ్దం లేకుండా మండుతుంది. అప్పుడు ఆచమురు సిద్ధంఅయినట్టు తెలుసుకోవాలి. మరిన్నీ తైలం సరిగా పక్వం అయితే అందులో నురగ పుట్టుతుంది. ఘృతం సరిగా పక్వం అయితే నురగ పోతుంది. దీన్నిబట్టిన్నీ తైలమూ, ఘృతమూ సిద్ధం అయినట్టు తెలుసుకోవచ్చు. మంచి సువాసనా మంచిరంగూ, రసమూ కలుగుతాయి. వీటినిబట్టిన్నీ ఘృతతైలాలు సిద్ధం అయినట్టు తెలుసుకోవచ్చు.

## పాకాలు మూడురకాలు

స్నేహపాక స్త్రిధా ప్రోక్తో మృదు ర్మధ్యః ఖర స్తథా
ఈషత్సరసకల్క స్తు స్నేహపాకో మృదు ర్భవేత్
మధ్యపాకస్య సిద్ధి శ్చ కల్కే నీరసకోమలే
ఈషత్కఠినకల్క శ్చ స్నేహపాకో భవేత్ఖరః
తదూర్ధ్వం దగ్ధపాకస్స్యా ద్దాహకృ న్నిష్ప్రయోజనః
ఆమపక్వ శ్చ నిర్వీర్యో వహ్నిమాంద్యకరో గురుః ॥

ఘృతపాకమూ, తైలపాకమూ, మృదుపాకమూ మధ్యపాకమూ ఖరపాకమూ అని మూడురకాలు. కల్క-ద్రవ్యంలో కొంచెం స్వరసం మిగిలివుంటే అది మృదుపాకం. కల్క-ద్రవ్యంలో ద్రవం కొంచెమైనా లేకుండా అది మృదువుగా వుంటే అది మధ్య పాకం. కల్కం కొంచెం గట్టిగా వుంటే అది ఖరపాకం. అంతకి ఎక్కువగా వుంటే అది దగ్ధపాకం అనిపించుకుంటుంది. అది నిష్ప్రయోజనం. స్వరసం బాగా మిగిలివుంటే అది ఆమపాకం. అదిన్నీ చెడ్డదే. అది అగ్నిమాంద్యం పుట్టిస్తుంది.

## మరో పద్ధతి

స్నేహపాకో భవేత్కల్కే మృదు రంగుళిలేపిని
నగృష్ణా త్యంగుళిం మధ్య శీర్యమాణే ఖరః స్మృతః ॥

ఘృతమూ తైలమూ సిద్ధం అయిందో లేదో చూడాలంటే మరో ఉపాయం వుంది. కల్కం మెత్తగా వుండి వేళ్ళకు అంటుకుంటూ వుంటే అది మృదుపాకం. వేళ్ళకు అంటుకోకుండా వుంటే అది మధ్యపాకం. నలిపితే పొడి అయిపోతే అది ఖరపాకం.

## పాకగుణాలు

నస్యార్థే స్యా న్మృదుః పాకః మధ్యమ స్సర్వకర్మసు
అభ్యంగార్థః ఖరః ప్రోక్త యుంజ్యా దేవం యథోదితమ్ ॥

ఉపయోగాల ననుసరించి ఈమూడురకాల పాకాలూ సిద్ధంచేసుకోవాలి, నస్యం కోసం అయితే మృదుపాకం మంచిది. లోపలికి పుచ్చుకోడాని కయితే మధ్యమ పాకం మంచిది. అభ్యంగానికి (తలంటుకూ, మర్దనకూ) ఖరపాకం మంచిది,

## పాకకాలం

ఘృతతైలగుడాదీం శ్చ సాధయే న్నైకవాసరే
ప్రకుర్వం త్యుషితా స్తేతే విశేషా ద్గుణసంచయమ్ ॥

ఘృతమూ, తైలమూ మొదలైనవి ఒక్కదినాన వంటచెయ్యగూడదు. కల్కమూ, చూర్ణమూ, కషాయాలూ, రసాలూ మొదలైనవి ఉన్నవి అన్నీ కలిపి రెండుమూడు దినాలు ఊరనిచ్చి తరవాత సన్నని మంటమీద రెండుమూడుదినాలకు తక్కువ కాకుండా వంటచెయ్యాలి. ఇలా చేస్తేనే అవి బాగా గుణకరాలవుతాయి.

# తైలాలు

## నారాయణ తైలం

అశ్వగంధా బలా బిల్వం పాటలా బృహతీద్వయమ్
శ్వదంష్ట్రాతిబలా నింబ స్యోనాకం చ పునర్నవా
ప్రసారిణీ మగ్నిమంథః కుర్యా ద్దశపలం పృథక్
చతుర్ద్రోణే జలే పక్త్వా పాదశేషం శృతం నయేత్
తైలాఢకేన సంయోజ్య శతావర్యా రసాఢకమ్
క్షిపే త్తత్ర చ గోక్షీరం తైలా త్తస్మా చ్చతుర్గుణమ్
శనై ర్విపాచయే దేభిః కల్కైః ద్విపలికైః పృథక్
కుష్ఠైలా చందనం మూర్వా వచా మాంసీ ససైంధవైః
అశ్వగంధా బలా రాస్నా శతపు ష్పేంద్రదారుభిః
పర్ణీచతుష్టయే నైవ తగరే ణైవ సాధయేత్
త త్తైలం నావనేభ్యంగే పానే వస్తే చ యోజయేత్
పక్షఘాతం హను స్తంభం మన్యా స్తంభం గళగ్రహమ్
ఖల్లిత్వం బధిరత్వం చ గతిభంగం కటిగ్రహమ్
గాత్రశోషేంద్రియధ్వంసా వసృక్ఛుక్రే జ్వరక్షయే
అంత్రవృద్ధిం కురండం చ దంతరోగం శిరోగ్రహమ్
పార్శ్వశూలం చ పాంగుల్యం బుద్ధిహానిం చ గృధ్రసీమ్
అన్యాం శ్చ విషమా న్వాతాన్ జయే త్సర్వాంగసంశ్రయాన్
అస్య ప్రభావా ద్వంధ్యాపి నారీ పుత్రం ప్రసూయతే
మర్త్యో గజో వా తురగ స్తైలాభ్యంగా త్సుఖీభవేత్
యథా నారాయణో దేవో దుష్టదైత్యవినాశనః
తథైవ వాతరోగాణాం నాశనం తైల ముత్తమమ్ ॥

పెన్నేరు, బల, మారేడువేళ్లు, పొడిరివేళ్లు, వాకుడు, నేలములక, పల్లేరుసమూలం, అతిబల, వేపవేరుపట్ట, దుందిలం, గలిజేరు, ప్రసారిణి, నెల్లిపట్ట, ఇవి కషాయ ద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి పదేసిపలాలు కలిపి, మెత్తగా చూర్ణించి ఎనిమిది ద్రోణాల నీళ్ళలో కలిపి రెండుద్రోణాలు మిగిలేటట్టు కాచి చల్లారిన తరవాత వడ బోసుకునేది.

ఆకషాయంలో ఒక ఆఢకం తైలమూ, పిల్లితేగల రసం ఆఢకమూ, నాలుగు ఆఢకాలు (ఒక ద్రోణం) ఆవుపాలూ కలపాలి.

చెంగల్వకోష్టు, ఏలకులు, చందనం, చాగనార, వస, జటామాంసి, సైంధవ లవణం, పెన్నేరు, బల, సన్నరాష్ట్ర, సదాప, దేవదారు, ముయ్యాకుపొన్న, కోల పొన్న, కారుమినుము, కారుపెసర, గ్రంథితగరము—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి రెండేసిపలాలు చూర్ణించి, నీళ్ళతో రుబ్బి తైలాదులు కలిసిన పైకషాయంలో కలిపి వంటచెయ్యాలి.

పైనిచెప్పిన విధంగా వంట పూర్తిచేసి వడబోసుకునేది.

ఇది నశ్యంచెయ్యడానికీ, మర్దనకూ, లోపలికి పుచ్చుకోడానికీ, వస్తికర్మకూ కూడా మిక్కిలి శ్రేష్ఠమైనది.

ఇది పక్షవాతమూ, హనుస్తంభమూ, మన్యాస్తంభమూ, శిరోగ్రహమూ, ఖల్లి వాతమూ, బధిరవాతమూ, గతిభంగమూ, కటిగ్రహమూ, గాత్రశోష, ఇంద్రియ నష్టమూ, రక్తశుక్రదోషాలూ, జ్వరమూ, క్షయా, అంత్రవృద్ధీ, కురండమూ, దంత రోగాలూ, శిరోగ్రహమూ, పార్శ్వశూలా, పంగుత్వమూ, బుద్ధినాశమూ, గృధ్రసీ వాతమూ, ఇంకా శరీరం ఆశ్రయించుకుని వుండే అనేక వాతవ్యాధులూ పోగొడుతుంది. ఈతైలం ప్రభావంవల్ల గొడ్రాలు కూడా సంతానవంతురాలు అవుతుంది. ఈతైలం మర్దిస్తే మనుష్యులకూ, గుర్రాలకూ, ఏనుగులకూ సంభవించే బెణుకులూ, కముకు దెబ్బలూ తగ్గిపోతాయి. ఇది సమస్తవాతవ్యాధులూ అమోఘంగా కుదురుస్తుంది.

## ౨ ఇరిమేదాదితైలం

ఇరిమేదత్వచం క్షుణ్ణాం పచేచ్ఛతపలోన్మితామ్
జలద్రోణేన తత్కాథం గృహ్ణీయాత్పాదశేషితమ్
తైలస్యార్ధాఢకం దత్వా కల్కైః కర్షమితైః పచేత్

ఇరిమేదలవంగాభ్యాం గైరికాగురుపద్మకైః
మంజిష్ఠాలోధ్రమధుకై ర్లాక్షాన్యగ్రోధముస్తకైః
త్వగ్జాతీఫల కర్పూరం కంకోలఖదిరై స్తథా
పతంగధాతకీపుష్పం సూక్ష్మై లా నాగకేసరైః
కల్పలేన చ సంసిద్ధం తైలం ముఖరుజం జయేత్
ప్రదుష్టమాంసచలితం శీర్ణదంతం చ సౌషిరమ్
శ్యావదంతం ప్రహర్షం చ విద్రధిం క్రిమిదంతకమ్
దంతస్ఫుటం చ దౌర్గంధ్యం జిహ్వాతాల్వోష్ఠజాం జయేత్ ॥

నల్లతుమ్మపట్ట పచ్చిది నూరుపలాలు మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్లలో వేసి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. ఆకషాయంలో నువ్వులనూనె అర్ధఆఢకంపోసి నల్లతుమ్మపట్ట, లవంగాలు, కావిరాయి, అగరుచెక్క, పద్మకాష్ఠం, మంజిష్ఠం, లొద్దుగుచెక్క, యష్టిమధుకం, లక్క, మర్రిపట్ట, తుంగముస్తలు, దాల్చినిచెక్క, జాజికాయ, పచ్చకర్పూరం, కంకోలం, చంద్రచెక్క, పతంగచెక్క, ఆరెపువ్వు, సన్నఏలకులు, నాగకేసరాలు, కాయఫలం—ఇవి ఒక్కొక్కటి కర్షంచొప్పున చూర్ణించి రుబ్బి ఆకల్కమున్నూ ఆకషాయంలో చేర్చి వంట చేసి వడబోసుకునేది.

ఇది ముఖరోగా లన్నీ పోగొడుతుంది. మాంసంచెడి కదులుతున్న దంతాలు గట్టిపరుస్తుంది. పళ్ళపోట్లు తగ్గిస్తుంది. శ్యావదంతం, దంతహర్షం, విద్రధి, పుప్పిపళ్ళు, దంతస్ఫుటం, దుర్గంధం తగ్గిస్తుంది. నాలుక, తాలువు, పెదవులూ—వీటికి సంబంధించిన సకలరోగాలున్నూ పోగొడుతుంది.

## ౩ భృంగామలక తైలం

భృంగం చామలకం ప్రస్థం తైలం ప్రస్థం చ పాదశః
రోహిణీ మధుకం కుష్ఠం ఉశీరం చందనోత్పలం
ముస్తా జీరః కుమార్యేకం క్షాళితం మస్తునోద్వయమ్
తైలం పక్వం శృతం నస్య్య కాసంగశీతం సముద్ధరేత్
శిరోభ్యంజన నస్యాభ్యాం శిరోరోగనివారణమ్

అక్షిరోగ మపస్మారం కర్ణశూలం నివారయేత్
ఉన్మాదకఫరోగఘ్నం సర్వరోగనివారణమ్
కేశానాం భృంగసాదృశ్యం దేహకాంతివివర్ధనమ్
సర్వరోగవినిర్ముక్త్యై నిత్యనాథేన భాషితమ్ ॥

గుంటకలగరస్వరసం ఒక ప్రస్థం. ఉసిరికాయల రసం ఒక ప్రస్థం. నువ్వుల నూనె ఒక ప్రస్థం. కటుకరోహిణి, యష్టిమధుకం, చెంగల్వకోష్టు, వట్టివేళ్ళు, చందనం, నల్లకలువదుంపలు, తుంగముస్తలు, జీలకర్ర—ఇవి ఒక్కొక్కటి నాలుగేసి తులాలు. కలబందరసం ఒక ప్రస్థం. మజ్జిగ తేట రెండుప్రస్థాలు. ఇవన్నీ కలిపి, మూలికలు దంచి మెత్తగా నీళ్ళతో రుబ్బి అందుచేర్చి వండి వడబోసుకునేది.

దీంతో తల అంటుకున్నా, నస్యంచేసుకున్నా శిరోరోగాలన్నీ పోతాయి. కంటిజబ్బులూ, అపస్మారమూ, చెవిపోట్లూ, ఉన్మాదమూ, కఫప్రకోపమూ కూడా తగ్గిపోతాయి. శిరోజాలు తుమ్మెదరెక్కల్లాగ నల్లబడతాయి. దేహకాంతి వృద్ధి అవుతుంది.

N. B. నువ్వులనూనెకు బదులు ఇప్పు డందరూ కొబ్బరినూనె వాడుతున్నారు. నేనూ అలాగే చేస్తున్నాను. నువ్వులనూనెతో చేస్తే చాలామందికి వ్యతిరేకఫలితాలు కలుగుతున్నాయి. ఇది చాలా ఆలోచించి చేసుకోడం మంచిది.

### ౪ పునర్నవా తైలం

పునర్నవాపలశతం జలద్రోణే విపాచయేత్
తేన పాదావశేషేణ తైలప్రస్థం విపాచయేత్
త్రికటు త్రిఫలా శృంగీ ధన్యాకం కట్ఫలం తథా
శటీ దారు ప్రియంగుశ్చ దేవదారు హరేణుభిః
కుష్ఠం పునర్నవామూలం యమానీ కారవీ తథా
ఏలా త్వచం పద్మకం చ పత్రం నాగరకేసరమ్
ఏషాం చ కార్షికం కల్కైః పేషయిత్వా వినిక్షిపేత్
కామలాం పాండురోగం చ హాలీమక మథాపి వా
రక్తపిత్తం ప్రమేహంశ్చ కాసం శ్వాసం భగందరమ్

ప్లీహానముదరం చైవ జ్వరం జీర్ణం వ్యపోహతి
కురుతే చ పరాం కాంతిం దీపయ త్యనలం ద్రుతమ్
తైలం పౌనర్నవం నామ మలవ్యాధీన్ నియచ్ఛతి ॥

గలిజేరు సమూలం నూరుపలాలు చితకగొట్టి రెండు ద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగో వంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. అందులో నువ్వులనూనె రెండు ప్రస్థాలు కలిపేది. మరిన్నీ—సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకవొలుపు, తాడికాయ వొలుపు, ఉసిరికపప్పు, కర్కాటకశృంగి, ధనియాలు, కాయఫలం, కచ్చూరాలు, మానుపసుపు, ప్రేంకణాలు, దేవదారుచెక్క, రేణుకలు, చెంగల్వకోష్టు, గలిజేరి వేరు, వాము, నల్లజీలకర్ర, ఏలకులు, దాల్చినిచెక్క, పద్మకాష్ఠం, అనుపత్రికం, నాగకేసరాలు—ఇవి ఒక్కొక్క కర్షం చొప్పున చూర్ణించి నీటితో రుబ్బి ఆముద్ద కషాయంలో కలిపి వండివడబోసుకునేది.

ఇది కామెర్లు, పాండువు, హలీమకం, రక్తపిత్తం, ప్రమేహాలు, దగ్గు, వగర్పు, భగందరం, ప్లీహ, ఉదరవ్యాధులు, జీర్ణజ్వరములు, పోగొడుతుంది. దేహకాంతి వృద్ధిచేస్తుంది. అగ్నిదీప్తి కలిగిస్తుంది. మలవ్యాధులను తగ్గిస్తుంది.

## ౫ వాసాచందనాదితైలం

చందనం రేణుకా పూతి ర్హ్యయగంధా ప్రసారిణీ
త్రిసుగంధి కణామూలం నాగకేసర మేవ చ
మేదే ద్వే చ త్రికటుకం రాస్నా మధుక శైలజమ్
శటీ కుష్ఠం దేవదారు వనితా చ విభీతకమ్
ఏతేషాం పలితై ర్భాగైః పచే త్తైలాఢకం భిషక్
వాసాయా శ్చ పలశతం జలద్రోణే విపాచయేత్
లాక్షారసాఢకం చైవ తథైవ దధిమస్తుకమ్
చందనం చామృతా భార్గీ దశమూలం నిదిగ్ధికా
ఏతేషాం వింశతిపలం జలద్రోణే విపాచయేత్
పాదశేషే స్థితే క్వాథే తైలం తేనైవ సాధయేత్
కాసాన్ జ్వరాన్ రక్తపిత్తం పాండురోగం హలీమకమ్

కామలాం చ క్షతక్షీణం రాజయక్ష్మాణ మేవ చ
శ్వాసాన్ పంచవిధాన్ హంతి బలవర్ణాగ్నిపుష్టికృత్
తైలం వాసాచందనాది కృష్ణాత్రేయేణ భాషితమ్ ॥

చందనం, రేణుకలు, గానుగచెక్క, పెన్నేరు, ప్రసారిణి, దాల్చినిచెక్క, ఏలకులు, అనుపత్రికం, పిప్పలిమూలం, నాగకేసరం, మేద, మహామేద, సొంటి, పిప్పలి, మిరియాలు, సన్నరాస్న, యష్టిమధుకం, కచ్చూరాలు, చెంగల్వకోష్టు, దేవదారు, త్రేంకణాలు, తాడికాయ—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కపలం మెత్తగా దంచి, నీటితో రుబ్బి ఉంచుకోవాలి. అడ్డసరపుచెక్క నూరుపలాలు చితకగొట్టి రెండుద్రోణాల నీళ్లలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్లు కాచివడబోసుకునేది. 8శరావాల లక్కబియ్యం దంచి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్లు కాచి అదిన్నీ వడబోసుకునేది. చందనం 20 పలాలు, తిప్పతీగ 20 పలాలు, గంటుభారంగి 20 పలాలు, దశమూలాలు ఒక్కొక్కటి 20 పలాలు, వాకుడు 20 పలాలు ఇవన్నీ కలిపి మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాలనీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచివడబోసుకునేది.

ఈమూడుకషాయాలూ కలిపి, అందులో రెండు ఆఢకాల పెరుగుతేట కలిపి, ఆద్రవద్రవ్యంలో రెండు ఆఢకాల నువ్వులనూనె, పైనిచెప్పిన కల్కం ముద్ద కలిపి వండి వడబోసుకునేది.

ఇది దగ్గూ, జ్వరాలూ, రక్తపిత్తమూ, పాండువూ, హాలీమకమూ, కామెర్లూ, క్షతక్షీణమూ, రాజయక్ష్మ, వగర్పులూ పోగొడుతుంది. బలమూ, అగ్నిదీప్తి శరీరానికి కాంతీ కలిగిస్తుంది.

## ౭ విడంగాద్యతైలం

తులామానం విడంగస్య సోమవల్ల్యాః పలం శతమ్
జలద్రోణే విపక్తవ్యం చతుర్భాగావశేషితమ్
ఏతత్క్వాథే పచే త్తైలం ద్వాత్రింశత్పలమానకమ్
విడంగో వారుణీ వహ్ని ర్లాంగలీ చ ప్రసారిణీ
దాసీ కురండకం చైవ కట్ఫల స్త్ర్యూషణం వరా

రాస్నా చైరండమూలం చ ప్రత్యేకం శుక్తిసమ్మితమ్
కల్కార్థం దీయతే తత్ర శనై ర్మృద్వగ్నినా పచేత్
కోశ కండూ జ్వరా నాహ హృల్లాసారుచి పీనసాన్
గ్రహణీ పాండుతా మూర్ఛాః క్రిమీం శ్చాంతర్బహిశ్చరాన్
విడంగాద్య మిదం తైలం నాశయే న్నాత్ర సంశయః॥

నూరుపలాల వాయువిడంగాలూ, నూరుపలాలు బావంచాలూ మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. అందులో నాలుగు ప్రస్థాల నువ్వులనూనె చేర్చేది.

వాయువిడంగాలు, వారుణి, చిత్రమూలం, పొత్తిదుంప, ప్రసారిణి, పచ్చ ములుగోరింట, గోరింట, కాయఫలం, సొంటి, పిప్పలి, మిరియాలు, కరకతాడిఉసిరి కలు, సన్నరాస్న, ఆముదపువేరు—ఇవి ఒక్కొక్కటి నాలుగేసి తులాలు. ఇవన్నీ మెత్తగా దంచి నీళ్ళతోరుబ్బి ఆద్రవద్రవ్యంలో చేర్చేది ఇది కల్కం. ఇదంతా సన్నని మంటమీద వండి వడబోసుకునేది.

ఇది కోశమూ, దురదలూ, జ్వరాలూ. ఆనాహము, హృద్రోగాలు, అరుచీ, పీనసా, గ్రహణీ, పాండువూ, మూర్ఛా, కడుపులోవుండే క్రిములూ, పైని ఉండే పేలు మొదలైన క్రిములూ నాశనంచేస్తుంది.

## ౭ బృహద్గ్రహణీమిహిర తైలం

తైలం ప్రస్థమితం గ్రాహ్యం తక్రం దద్యా చ్చతుర్గుణమ్
కుటజం ధాన్యకం చైవ గ్రాహ్యం పలశతం పృథక్
తయోః క్వాథం పచే ద్ద్రోణే అంబుపాదావశేషితమ్
ఏకీకృత్య పచే ద్వైద్యః కల్కం కర్షమితం పృథక్
ధాన్యకం ధాతకీ లోధ్రం సమంగాతివిషా శివా
లవంగం వాలకం చైవ శృంగాటకరసాంజనమ్
నాగపుష్పం పద్మకం చ గుడూచీంద్రయవం తథా
ప్రియంగు కటుకీ పద్మకోశీరం తగరం తథా

శరమూలం భృంగరాజః కేశరాజః పునర్నవా
అగ్నుమంబూకదంబానాం వల్కలాని చ దాపయేత్
గ్రహణీం హంతి తత్ శీఘ్రం వలీపలితనాశనమ్
హంతి సర్వా నతీసారాన్ గ్రహణీం సర్వరూపిణీమ్
జ్వరం తృష్ణాం తథా శ్వాసం కాసం హిక్కాం వమిం భ్రమిమ్
సోపద్రవం కోష్ఠరుజం నాశయేత్ సద్య ఏవహి
వశీకరణ మేతద్ధి పుష్యయోగేన పాచయేత్
గ్రహణీమిహిరం నామ తైలం భువనమంగలమ్ ॥

నూరుపలాల కొడిశచెక్క (పచ్చిది), ధనియాలు నూరుపలాలు—ఇవి మెత్తగా దంచి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగో భాగం మిగిలేటట్టు కాచి వడబోసుకునేది.

ధనియాలు, ఆరెపువ్వు, లొద్దుగుచెక్క, మంజిష్ఠ, అతివస, కరక్కాయ, లవంగాలు, కురువేరు, సింగాడిదుంపలు, (నాగుదుంపలు) రసాంజనం, నాగకేసరాలు, పద్మకాష్ఠం, తిప్పతీగ, కొడిశపాల, ప్రేంకణం, కటుకరోహిణి, పద్మకేసరాలు, గ్రంధితగరం, దర్భవేళ్లు, గుంటకలగర, గలిజేరు, మామిడిపట్ట, నేరేడుపట్ట, కడిమిపట్ట, ఇవికల్కద్రవ్యాలు. ఇవన్నీ మెత్తగా దంచి నీటితోరుబ్బి ఆకషాయంలో కలిపేది.

అందులో రెండు ప్రస్థాల నువ్వులనూనె, ఎనిమిది ప్రస్థాల మజ్జిగా కూడా కలిపి వండి వడబోసుకునేది.

ఇది సర్వాతిసారాలూ, అన్నివిధాల గ్రహణులూ, జ్వరములూ, తృష్ణా, వగర్పూ, దగ్గూ, ఎక్కిళ్ళూ, వాంతులూ, త్రిప్పటం, ఉదరబాధలూ నశింపచేస్తుంది.

## ౮ శ్రీ బిల్వ తైలం

బాలబిల్వం పలశతం జలద్రోణే విపాచయేత్
పాదావశేషే తస్మింస్తు తైలప్రస్థం విపాచయేత్
ధాత్రీరసం తైలసమం ద్విగుణం ఛాగదుగ్ధకమ్
కల్కీకృత్య పచేద్ధీమాన్ ధాత్రీం లాక్షాం తథాభయామ్
ముస్తకం చందనోదీచ్యే సరలం దేవదారు చ

వాతరక్తం నిహంత్యాశు నానాదోషసముద్భవమ్
అష్టాదశవిధం కుష్ఠం హంతి వర్ణాగ్నివర్ధనమ్
క్రిమిం దుష్టవ్రణాం శ్చైవ దాహం కండూం నిహంతి చ
అస్వేదనం మహాస్వేద మభ్యంగా దేవ నశ్యతి ।

అడ్డసరం కషాయం రెండుప్రస్థాలు. తిప్పతీగ 64 పలాలు ద్రోణంనరనీళ్ళలో నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది నీళ్ళు రెండుప్రస్థాలు,. ఆవనూనె రెండు ప్రస్థాలు, ఇవన్నీ కలిపేది.

గలిజేరు, పసుపు, వేపపట్ట, వంగవేళ్లు, దానిమ్మ బెరడు, వాకుడు, పెద్ద ములక, కలుగ్రానుగువేరుపట్ట, అడ్డసరంపట్ట, వావిలిపట్ట, చేనుపాల్ల, ఉమ్మెత్తఆకు, ఉత్తరేణి, జయంతిక, నేపాళపువేరు, త్రిఫలాలు,— ఇవి రెండేసి కర్షాలు. వసనాభి రెండుపలాలు. సొంటి, పిప్పళ్ళు, మిరియాలు—ఇవి ఒక్కొక్కటి మూడేసిపలాలు. ఇవన్నీ కల్కద్రవ్యాలు. ఇవి మెత్తగా దంచి నీళ్ళతో రుబ్బి ఆద్రవద్రవ్యాలలో కలిపి వండి వడబోసుకునేది.

నానాదోషాలవల్లా పుట్టిన వాతరక్తమూ అష్టాదశకుష్టువులూ ఇది అమోఘంగా పోగొట్టుతుంది. శరీరానికి కాంతి ఎక్కువచేస్తుంది. అగ్నిదీప్తి కలిగిస్తుంది. క్రిములు, దుష్టవ్రణాలు, మంట, దురదలు పోగొడుతుంది. అసలే చెమటపట్టకపోవడం, చెమట ఎక్కువగా పట్టడమున్నా తగ్గిస్తుంది. అభ్యంగానికిది చాలా మంచిది.

## ౧౧ బృహత్సోమరాజీతైలం

సోమరాజీతులాక్వాథే తథా దద్రుహనస్య చ
గోమూత్రస్య తథా పాత్రే కల్కం దత్వా విచక్షణః
విపచేత్ కార్షికై ర్భాగైః ప్రస్థం తైలం తు సార్షపమ్
చిత్రకం లాంగలాఖ్యా చ నాగరం కుష్ఠ మేవ చ
హరిద్రా నక్తమాలం చ హరితాళం మనశ్శిలా
ఆస్ఫోతార్కకరవీరం సప్తపర్ణం చ గోమయమ్
ఖదిరో నింబపత్రం చ మరిచం కాసమర్దకమ్
ఏతాని శ్లక్ష్ణపిష్టాని కల్కం దత్వా విచక్షణః

హంతి సర్వాణి కుష్ఠాని క్రిమిదుష్టవ్రణాని చ
కిటిభం దద్రుజాతం చ గాత్రవైవర్ణ్య మేవ చ
విశీర్ణచర్మమాంసానాం దృఢీకరణ ముత్తమమ్
పాండురోగం తథా కండూం విసర్పం హంతి దారుణమ్
యే చాన్యే త్వగ్గతా రోగా స్తాం తు శీఘ్రం వ్యపోహతి ।

బావంచాలు నూరుపలాలు చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. తగిరిసె గింజలున్నూ నూరుపలాలు చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలోకలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. ఈ రెండు కషాయాలూ ఒక అఢకం గోమూత్రమూ చేర్చి అందులో రెండుప్రస్థాల ఆవ నూనె కలిపేది.

చిత్రమూలం, పొత్తిదుంప, సొంటి, చెంగల్వకోష్టు, పసుపు, కలుద్రానుగు, తాళకం, మణిశిల, అడవిపుల్లె, జిల్లేడువేరు, కరవీరవేరు, సప్తపర్ణి, గోమయం, చంద్రచేవ, వేపఆకులు, మిరియాలు, కసివిందవేళ్లు—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి రెండేసి తులాలు మెత్తగా దంచి రుబ్బి, ఆముద్ద అద్రవద్రవ్యాలలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది నానారకాలకుష్ఠురోగమూ పోగొడుతుంది. క్రిములు, దుష్టవ్రణాలు, కిటిభం, దద్దుర్లు, పాండువు, గురదలు, విసర్పి తగ్గిస్తుంది. ముడతలు పడ్డచర్మమూ, శిథిలమైన మాంసమూ గట్టిపరచి శరీరానికి మంచి రంగూ, కాంతీ కలిగిస్తుంది. చర్మరోగాలు సమస్తమూ పోగొడుతుంది.

## ౧౨ బృహన్మరిచాది తైలం

మరిచం త్రివృతా దంతీ క్షీర మార్కం శకృద్రసః
దేవదారు హరిద్రే ద్వే మాంసీ కుష్ఠం సచందనమ్
విశాలా కరవీరం చ హరితాలం మనశ్శిలా
చిత్రకో లాంగలాఖ్యా చ విడంగం చక్రమర్దకమ్
శిరీషం కుటజో నింబః సప్తపర్ణః స్నుహామృతా
శంపాకో నక్తమాలోబ్దం ఖదిరం పిప్పలీ వచా

జ్యోతిష్మతీ చ పలికా విషస్య ద్విపలం భవేత్
ఆఢకం కటుతైలస్య గోమూత్రం చ చతుర్గుణమ్
మృత్పాత్రే లోహపాత్రే వా శనై ర్మృద్వగ్నినా పచేత్
పక్త్వా తైలవరం హ్యేత న్మర్దయే త్కుష్ఠకాన్ వ్రణాన్
పామా విచర్చికా దద్రు కండూ విస్ఫోటకాని చ
వలయః పలితం ఛాయా నీలీ వ్యంగం తథైవ చ
అభ్యంగేణ ప్రణశ్యంతి సౌకుమార్యం చ జాయతే
ప్రథమే వయసి స్త్రీణాం యాసాం నస్యంతు దీయతే
వరా మపి జరాం ప్రాప్య న స్తనా యాంతి నమ్రతామ్
బలీవర్ద స్తురంగో వా గజో వా వాయుపీడితః
ఏభి రభ్యంజనై ర్గాఢం భవే న్మారుతవిక్రమః ॥

మిరియాలు, తెగడ, నేపాళపువేరు, జిల్లేడుపాలు, గోమయరసం, దేవదారు, పసుపు, మానుపసుపు, జటామాంసి, చెంగల్వకోష్టు, చందనం, విశాల, కరవీరవేరు, తాళకం, మణిశిల, చిత్రమూలం, పొత్తిదుంప, వాయువిడంగాలు, తెగిరిసెవిత్తులు, దిరిసెన పట్ట, కొడిశచెక్క, వేపపట్ట, సప్తపర్ణి, పాలచెముడు, తిప్పతీగ, రేలగుజ్జు, కలుగొనుగు, తుంగముస్తలు, చంద్రచేవ, పిప్పళ్ళు, వస, జ్యోతిష్మతి—ఇవి ఒక్కొక్క పలం. నాభి రెండుపలాలు, ఇవి కల్కద్రవ్యాలు. ఇవి మెత్తగాదంచి నీళ్ళతో నూరి ఉంచుకునేది. ఆవనూనె ఆఢకమూ, దానికి నాలుగురెట్లు గోమూత్రమూ చేర్చి అందులో పైని చెప్పిన కల్కం ముద్ద కలిపి సన్నమంటతో వండి వడబోసుకునేది.

ఇది సమస్తకుష్ఠులనూ నాశనంచేస్తుంది. వ్రణాలు, తామర, విచర్చిక, దద్దుర్లు, దురదలు, విస్ఫోటం, వ్యంగం, నీలి, పోగొడుతుంది. శరీరంముడతలు తీరి దృఢం అవుతుంది. తెల్లవెంట్రుకలు నల్లబడతాయి. సౌకుమార్యం కలుగుతుంది. స్త్రీలకు యౌవనం రాగానే ఇది కొన్నాళ్ళు నస్యంచేస్తే ముసలితనం వచ్చినా స్తనాలు వాలిపోవు. ఎద్లు, గుర్రాలు, ఏనుగులు—వీటికి వాతరోగం వస్తే ఈతైలం మర్దించేది. దాంతో అవి పూర్వంకంటే వడిగా పరుగెత్తగలుగుతాయి.

## ౧౩ హిమసాగర తైలం

శతావరీరసప్రస్థే విదార్యా స్స్వరసే తథా
కూష్మాండకరస ప్రస్థే ధాత్ర్యా శ్చ స్వరసే తథా

శాల్మల్యాః స్వరసప్రస్థే తథా గోక్షురకస్య చ
నారికేళరసప్రస్థే తిలతైలస్య ప్రస్థతః
కదల్యాః స్వరసప్రస్థే క్షీరప్రస్థచతుష్టయే
అస్యౌషధస్య కల్కస్య ప్రత్యేకం కర్షసమ్మితమ్
చందనం తగరం వాప్యం మంజిష్ఠా సరళాగరు
మాంసీ మురా చ శైలేయం యష్టీ దారు నఖీ శివా
పూతికా పీతికాపత్రం కుందురు ర్నలికా తథా
వరీ లోధ్రం తథా ముస్తం త్వగేలా పత్ర కేసరమ్
లవంగం జాతికోశం చ తథా మధురికా శటీ
చందనం గ్రంథిపర్ణం చ కర్పూరం లాభతః క్షిపేత్
అస్య తైలస్య సిద్ధస్య శృణు వీర్య మతఃపరమ్
ఉచ్చైః ప్రపతితో వాయో ర్గజతో వాజిన స్తథా
ఉష్ట్రితో లోష్ఠపాతాచ్చ పంగూనాం పీతసర్పిణామ్
ఏకాంగశోషిణాం చైవ తథా సర్వాంగశోషిణామ్
క్షతానాం క్షీణశుక్రాణా మత్యంతక్షయరోగిణామ్
హనుమన్యాహతానాం చ దుర్బలానాం తథైవ చ
శోషిణాం లంబజిహ్వానాం తథా మిన్మిణభాషిణామ్
అత్యంతదాహయుక్తానాం క్షీణానాం వాతరోగిణామ్
ఏత త్తైలవరం శ్రేష్ఠం విష్ణునా పరికీర్తితమ్
హిమసాగర మాఖ్యాతం సర్వవాతవికారనుత్
యే వాతప్రభవా రోగా యే చ పిత్తసముద్భవాః
శిరోమధ్యగతా యే చ శాఖా మాశ్రిత్య యే స్థితాః
తే సర్వే ప్రశమం యాంతి తైలస్యాస్య ప్రసాదతః ॥

పిల్లితేగలరసం రెండుప్రస్థాలు. నేలగుమ్ముడురసం రెండుప్రస్థాలు. బూడిదగుమ్మడికాయలరసం రెండుప్రస్థాలు. ఉసిరికాయలరసం రెండుప్రస్థాలు. బూరుగు

చెక్కరసం రెండుప్రస్థాలు. సమూలం పల్లేరురసం రెండుప్రస్థాలు. కొబ్బరికాయల నీరు రెండుప్రస్థాలు. అరటిదుంపరసం రెండుప్రస్థాలు. ఆవుపాలు ఎనిమిది ప్రస్థాలు. ఇవన్నీ కలిపి వీటిలో రెండుప్రస్థాల నువ్వులనూనె చేర్చేది.

చందనం, గ్రంథితగరం, చెంగల్వకోష్టు, మంజిష్ట, సరళాగరు, జటామాంసి, ముర, సదాప, యష్టిమధుకం, దేవదారు, నఖం, కరకపొలుపు, పూతిక, పసుపు, ఆకుపత్రికం, కుంకుమపువ్వు, నలిక, పిల్లితేగలు, లొద్దుగుచెక్క, తుంగముస్తలు, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు, లవంగాలు, జాపత్రి, కచ్చూరాలు, సోపు, రక్తచందనం, గ్రంధిపర్ణం, పచ్చకర్పూరం—ఇవి కల్కద్రవ్యాలు. వీటిలో దొరికిన వన్నీ చేర్చి మెత్తగాదంచి నీటితోరుబ్బి ఆద్రవద్రవ్యంలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది చాలాగొప్పతైలం. లొట్టిపిట్టమీదినుంచయినా, ఏనుగుమీదినుంచయినా' గుర్రంమీదినుంచయినా, ఎత్తయిన ఏవస్తువుమీదినుంచయినా పడికముకుదెబ్బలు తిన్నవారికి మర్దనా చేస్తే ఇది ఆబాధలన్నీ పోగొడుతుంది. కుంటితనం పోగొడుతుంది. పీనసర్పులకూ, ఏకాంగశోష సర్వాంగశోష వచ్చినవారికీ, క్షతులకూ, క్షీణశుక్రులకూ, క్షయరోగులకూ, మెడమీదా, దవడమీదా దెబ్బలు తగిలినవారికీ, దుర్బలులకూ ఇది చాలా మేలుచేస్తుంది. నాలుక నేలాడుతూవుండేవారికీ, ముద్దమాటలుగలవారికీ, శరీరం అంతా మంటలతో బాధపడేవారికీ, వాతరోగులకూ చాలా మంచిది.

## ౧౪ మహాబలాతైలం

జలామూలకషాయస్య దశమూలీకృతస్య చ
యవకోలకులత్థానాం క్వాథస్య పయస స్తథా
అష్టావష్టౌ శుభాభాగా స్తైలా దేక స్తదేకతః
పచే దారోప్య మధురంగణం సైంధవసంయుతమ్
తథాగురు సర్జరసం సరళం దేవదారు చ
మంజిష్ఠాం చందనం కుష్ఠ మేలాం కాలానుసారకమ్
మాంసీ శైలేయకం పత్రం తగరం శారిబాం వచామ్
శతావరీ మశ్వగంధాం శతపుష్పాం పునర్నవామ్
తత్సాధుసిద్ధం సౌవర్ణే రాజతే మృణ్మయేపి వా

ప్రక్షిప్య కలశే సమ్యగాత్మగుప్తాం నిధాపయేత్
బలాతైల మిదం నామ్నా సర్వవాతవికారనుత్
యథా బల మతో మాత్రాం సూతికాయై ప్రదాపయేత్
యా చ గర్భార్థినీ నారీ క్షీణశుక్ర శ్చ యఃపుమాన్
క్షీణధాతౌ మర్మమృతే భిహతే మథితే థవా
భగ్నే శ్రమాభిపన్నే చ సర్వథైవోపయోజయేత్
సర్వానాక్షేపకాదీం శ్చ వాతవ్యాధీన్ వ్యపోహతి
హిక్కాం కాస మధోమంథం గుల్మం శ్వాసం సుదుస్తరమ్
షణ్మాసా నుపయుజ్యేత దంత్రవృద్ధి మపోహతి
నష్టధాతు శ్చ పురుషో భవే చ్చ స్థిరయావనః
ఏతద్ధి రాజ్ఞా కర్తవ్యం రాజపాత్రా శ్చ యే నరాః
సుఖిన స్సుకుమారా శ్చ బలిన శ్చైవ యే నరాః ॥

బలామూలకషాయం 16 ప్రస్థాలు. దశమూలకషాయం 16 ప్రస్థాలు. యవలు రేగు చెక్క ఉలవలు—ఇవి సమభాగాలుగా వేసుకుని చేసిన కషాయం 16 ప్రస్థాలు. పాలు 16 ప్రస్థాలు. నువ్వులనూనె రెండుప్రస్థాలు. ఇవి ద్రవద్రవ్యాలు.

జీవకం, ఋషభకం, మేద, మహామేద, కాకోళి, క్షీరకాకోళి, యష్టిమధుకం, మాషపర్ణి, ముద్గపర్ణి, జీవంతి, సైంధవలవణం, అగురుచెక్క, సర్జరసం, సరళ దేవదారు, మంజిష్ఠ, చందనం చెంగల్వకోష్టు, ఏలకులు, మామెన, జటామాంసి, శైలేయకం, ఆకుపత్రికం, గ్రంథితగరం, సుగంధి, వస, పిల్లితేగలు, పెన్నేరు, సదాప గలిజేరు—ఇవి కల్కద్రవ్యాలు. ఇవన్నీ చితకగొట్టి, నీటితోరుబ్బి ఆముద్ద ఆద్రవ ద్రవ్యంలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది బంగారుపాత్రలో గాని, వెండిపాత్రలో గాని, మట్టిపాత్రలో గాని జాగ్రత్తపరుచుకుని వాడేది.

ఇది సకలవాతాలూ హరిస్తుంది. బలానుసారంగా మోతాదు ఏర్పరచి సూతికాస్త్రీలకు ఇస్తే సకలవ్యాధులూ పోగొడుతుంది. గర్భవతి కావాలనుకునే స్త్రీకీ వీర్యవృద్ధి కోరుకునే పురుషునకూ ఇది వరప్రసాదం, ఆక్షేపకాదిసకలవాతాలూ ఇది, తగ్గిస్తుంది. ఎక్కిళ్ళు, దగ్గులు, వగర్పులు, గుల్మం తగ్గించేస్తుంది, ఆరుమాసాలు

వాడితే ఇది అంత్రవృద్ధి హరిస్తుంది, ఇది రాజులూ, రాజపురుషులూ, సుఖవంతులూ, సుకుమారులూ వాడతగ్గది.

## ౧౫ బృహన్మాష తైలం

### ఇదే సప్తప్రస్థమహామాషతైలం

మాషక్వాథే బలాక్వాథే రాస్నాయా దశమూలజే
యవకోలకులుత్థానాం ఛాగమాంసభవే పృథక్
ప్రస్థే తైలస్య చ ప్రస్థం క్షీరం దత్వా చతుర్గుణమ్
రాస్నాత్మగుప్తా సింధూత్థ శతాహ్వైరండముస్తకైః
జీవనీయబలావ్యోషైః పచేద్దత్తసమైర్భిషక్
హస్తకంపే శిరఃకంపే బాహుశోషేపబాహుకే
బాధిర్యే కర్ణశూలే చ కర్ణనాదే చ దారుణే
విశ్వాచ్యామర్దితే కుబ్జే గృధ్రస్యామపతానకే
వస్త్యభ్యంజనపానేషు నావనే చ ప్రయోజయేత్
మాషతైలమిదం శ్రేష్ఠ మూర్ధ్వజత్రుగదాపహమ్
క్వాథప్రస్థాః షడేవాత్ర విభక్త్యంతేన సూచితాః ॥

మినుముల కషాయం రెండుప్రస్థాలు, బలాకషాయం రెండుప్రస్థాలు, సన్నరాస్న కషాయం రెండుప్రస్థాలు, దశమూలాల కషాయం రెండుప్రస్థాలు, యవలు, రేగుచెక్క, ఉలవలు—ఇవి సమభాగాలుగా వేసుకుని చేసిన కషాయం రెండుప్రస్థాలు, మేకమాంసం కషాయం రెండుప్రస్థాలు, నువ్వులనూనె రెండుప్రస్థాలు.

(ఇలాగ కషాయాలు, నూనెతో సహా ఏడూ, ఒక్కొక్క ప్రస్థంచొప్పున పడడంవల్లనే దీనికి సప్తప్రస్థమహామాషతైలం అని పేరు ద్రవద్రవ్యాలు ద్విగుణం వేసుకోవాలి కనక టీకలో రెండేసి ప్రస్థాలు చెప్పడమైనది)

ఈయేడు ద్రవద్రవ్యాలలోనూ 16 ప్రస్థాల ఆవుపాలు చేర్చాలి.

సన్నరాస్న, దూలగొండివేళ్ళు, సైంధవలవణం, సదాప, ఆముదపుచెట్టువేళ్లు, తుంగముస్తలు, మనుబాల, కాకోళి, క్షీరకాకోళి, మేద, మహామేద, ముద్గపర్ణి, మాషపర్ణి, జీవకం, ఋషభకం, యష్టిమధుకం, బల, సొంటి, పిప్పలి, మిరియాలు—

ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి కర్షంచొప్పున వేసుకుని మెత్తగా దంచి నీళ్ళతో రుబ్బి, అముద్ద ఆద్రవద్రవ్యాలలో కలుపుకుని వండివడబోసుకునేది.

ఇది బాహుకంపం, శిరఃకంపం, బాహుశోష, అపబాహుకం, చెవుడు, చెవిపోట్లు, చెవిలోహోరు, విషూచి, అర్దితవాతం, కుబ్జకం, గృధ్రసి, అపతానకం, ఈ వ్యాధులలో ఇదివస్తికర్మ చెయ్యవచ్చు, దీంతోతలంటవచ్చు, లోపలికివ్వవచ్చు, నస్యం చెయ్యవచ్చు, ఇది యీవ్యాధుల నన్నిటినీ పోగొడుతుంది. ఊర్ధ్వజత్రువ్యాధులను కూడా అన్నిటినీ జయిస్తుంది.

## ౧౬ నిరామిష మహా మాష తైలం

దశమూలాఢకం పక్త్వా జలద్రోణేం ఘ్రిశోషితే
తద్వన్మాషాఢకక్వాథే తైలప్రస్థం పయస్సమే
కల్కైః శ్రేతైశ్చ మతిమాన్ సాధయే న్మృదు నాగ్నినా
అశ్వగంధా శటీ దారు బలా రాస్నా ప్రసారిణీ
కుష్ఠం పరూషకం భార్ఙ్గ్యౌ విదార్యా పునర్నవా
మాతులుంగఫలాజాజ్యో రామఠం శతపుష్పికా
శతావరీ గోక్షురకం పిప్పలీమూల చిత్రకా
జీవనీయగణం సర్వం సంహృత్యైవ ససైంధవమ్
తత్సాధుసిద్ధం విజ్ఞాయ మాషతైల మిదం మహత్
వస్త్యభ్యంజనపానేషు నావనేషు ప్రశస్యతే
పక్షాఘాతే హనుస్తంభే అర్దితే సాపతంత్రకే
అపబాహుకవిశ్వచ్యోః ఖాంజపాంగుల్యయో రపి
శిరామన్యాగ్రహే చైవ అధిమంథే చ వాతికే
శుక్రక్షయే కర్ణనాదే కర్ణక్ష్వేడే చ దారుణే
కలాయఖంజకే యునే భైషజ్య మిద మాదిశేత్ ॥

దశమూలాలు అన్నీ కలిపి నాలుగుప్రస్థాలు వేసుకుని మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసి వుంచుకునేది. మిను

ములు నాలుగుప్రస్థాలు మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగో వంతు మిగిలేటట్టు కాచి వడబోసి ఉంచుకునేది. ఈరెండు కషాయాలూ, రెండు ప్రస్థాల నువ్వులనూనె కలిపి పొయ్యిమీద పెట్టేది. నూనె సమం పాలుచేర్చేది.

పెన్నేరు, కచ్చూరాలు, దేవదారు, బల, సన్నరాస్న, ప్రసారణి, చెంగల్వకోష్టు, పరూషకం, గంటుభారంగి, నేలగుమ్మడు, గలిజేరు, మాదీఫలం, జీలకర్ర, నల్లజీలకర్ర, వేయించినయింగువ, సదాప, పిల్లితేగలు, పల్లేరువేళ్ళు, మోడి, చిత్రమూలం, మనుబాల, యష్టిమధుకం, మేద, మహామేద, కాకోళి, క్షీరకాకోళి, మాషపర్ణి, ముద్గపర్ణి, జీవకం, ఋషభకం—ఇవి కల్కద్రవ్యాలు. ఇవన్నీ ఒక్కొక్క కర్షంచొప్పున చేర్చి మెత్తగా దంచి నీళ్ళతో రుబ్బి ఆద్రవద్రవ్యంలో కలుపుకుని వండి వడబోసుకునేది.

ఇది వస్తికర్మకు, తలంటుకు, లోపలికి, నస్యకర్మకు వాడవచ్చు.

ఇది పక్షవాతం, హనుస్తంభం, అర్దితవాతం, అపతంత్రకం, అపబాహుకం, కుంటితనం, నరాలు లాగడం, అధిమంథం, మొదలైన సకలవాతవ్యాధులూ పోగొడుతుంది. శుక్రక్షయం, కర్ణనాదం మొదలైనవిన్నీ తగ్గిస్తుంది.

## ౧౭ మహాకుక్కుటమాంసతైలం

మాషస్యార్ధాఢకం దేయం దశమూల్యాస్తులార్ధకమ్
బలామూలం చ తస్యార్ధం కేతకీనాం తథైవ చ
దక్షమాంసపలత్రింశత్ ఝింటికా పంచవింశతిః
జలద్రోణద్వయే పక్త్వా పాదశేషే వతారితే
తిలతైలస్య చ ప్రస్థం పయో దత్వా చతుర్గుణమ్
జీవనీయాని యాన్యష్టౌ మంజిష్ఠా చవ్యకట్ఫలమ్
వ్యోషం రాస్నా కణామూలం మధుకం పుష్కరం తథా
మాషాత్మగుప్తే సైరండా శతాహ్వా లవణత్రయమ్
కృష్ణాశ్వగంధా హ్యమృతా యమానీంద్రవరీ శటీ
నాగరం మాగధీ ముస్తం వర్షాభూ రజనీద్వయమ్
శతావరీ బృహత్యౌ చ ఏతైః రక్షనమన్వితైః
పక్షాఘాతేషు సర్వేషు అర్దితే చ హనుగ్రహే

మంద్రశ్రుతౌ చాశ్రవణే తిమిరే చ త్రిదోషజే
హస్తకంపే శిరఃకంపే గాత్రకంపే శిరోగ్రహే
శస్తం కలాయఖంజే చ గృధ్రస్యామపబాహుకే
బాధిర్యే కర్ణనాదే చ సర్వవాతవికారనుత్
దండాపతానకే చైవ మన్యాస్తంభే విశేషతః
హనుస్తంభే ప్రశస్తం స్యాత్ సూతికాతంకనాశనమ్
త్వాచ్యం మాంసప్రదం చైవ శుక్రాగ్ని బలవర్ధనమ్
అండవృద్ధ్యంత్రవృద్ధిం వా వాతరక్తం చ నాశయేత్ ॥

మినుములు రెండుప్రస్థాలు. దశమూలాలు అన్నీ కలిపి యాభైపలాలు. బల ఇరవై అయిదుపలాలు. పెంగలి వేళ్ళు ఇరవైఅయిదుపలాలు. కోడిమాంసం ముప్ఫయి పలాలు. ములుగోరింట వేళ్లు ఇరవైఅయిదుపలాలు. ఇవన్నీ కలిపి మెత్తగా చితక గొట్టి నాలుగుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసు కునేది.

ఈకషాయంలో రెండుప్రస్థాల నువ్వులనూనె, ఎనిమిది ప్రస్థాల నీళ్లున్నూ కలిపేది.

మనుబాల, యష్టిమధుకం, మేద, మహామేద, కాకోళి, క్షీరకాకోళి, మాష పర్ణి, ముద్గపర్ణి, జీవకం, ఋషభకం, మంజిష్ఠ, చవ్యం, కాయఫలం, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, సన్నరాస్న, పిప్పలిమోడి, యష్టిమధుకం, పుష్కరమూలం, మినుములు, దూలగొండివేళ్లు, ఆముదపుచెట్టువేళ్ళు, సదాప, బిడాలవణం, సైంధవ లవణం, సౌవర్చలవణం, పిప్పళ్లు, పెన్నేరు, తిప్పతీగ, వాము, కోడిశపాలవిత్తులు, పిల్లితేగలు, కచ్చూరాలు, సొంటి, చిన్నయేలకులు, తుంగముస్తలు, గలిజేరు, పసుపు, మానుపసుపు, పిల్లితేగలు, వాకుడు, నేలములక, ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొ క్కటి కర్షం చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి నీళ్ళతో రుబ్బి ఆకషాయంలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది పక్షవాతం, అర్దితవాతం, హనుగ్రహం, మాట సరిగా వినబడకపోవడం అసలే వినబడకపోవడం, త్రిదోషాలవల్ల పుట్టిన రేచీకటి, హస్తకంపం, శిరఃకంపం, శరీరంవొణకడం, శిరోగ్రహం, కలాయఖంజవాతాలు, గృధ్రసి, అపబాహుకం, చెవిలోహోరు, దండాపతానకం, మన్యాస్తంభం, హనుస్తంభం, సూతికావ్యాధులు

పోగొడుతుంది. చర్మం దృఢపరుస్తుంది. మాంసవృద్ధిచేస్తుంది. వీర్యవృద్ధి, అగ్ని దీప్తి, శరీరబలం కలిగిస్తుంది. అండవృద్ధి, అంత్రవృద్ధి, వాతరక్తం పోగొడుతుంది.

## ౧౮ బృహత్సైంధవాదితైలం

సైంధవం శ్రేయసీ రాస్నా శతపుష్పా యమానికా
సర్జికా మరిచం కుష్ఠం శుంఠీ సౌవర్చలం బిడమ్
వచాజమోదా మధుకం, జీరకం పౌష్కరం కణా
ఏతా న్యర్ధపలాంశాని శ్లక్ష్ణపిష్టాని కారయేత్
ప్రస్థ మైరండతైలస్య ప్రస్థాంబు శతపుష్పజమ్
కాంజికం ద్విగుణం దత్వా తథా మస్తు శనైః పచేత్
సిద్ధ మేత త్ప్రియోక్తవ్య మామవాతహరం పరమ్
పానాభ్యంజనవస్తౌ చ కురుతేగ్ని బలం భృశమ్ ॥
వాతార్తరక్షణే శస్తం కటీజానూరుసంధిజే
శూలే హృత్పార్శ్వపృష్ఠేషు కృచ్ఛ్రేశ్మరినిపీడితే ॥

సదాపకషాయం రెండు ప్రస్థాలు, పులికడుగు నాలుగుప్రస్థాలు, పెరుగుమీదితేట నాలుగుప్రస్థాలు, ఆముదం రెండుప్రస్థాలు ఇవి ద్రవ ద్రవ్యాలు. అన్నీ కలిపి వుంచుకునేది.

సైంధవలవణం, గజపిప్పలి, సన్నరాస్న, సదాప, వాము, సర్జక్షారం. మిరియాలు, చెంగల్వకోష్టు, సొంటి, సౌవర్చలవణం, బిడాలవణం, వస, అజామోదం, యష్టిమధుకం, జీలకర్ర, పుష్కరమూలం, పిప్పళ్ళు,—ఇవి కల్కద్రవ్యాలు, ఇవి ఒక్కొక్కటి నాలుగేసితులాలు తీసుకుని, అన్నీ మెత్తగా దంచి నీళ్ళతో రుబ్బి ఆ ద్రవద్రవ్యాలలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది ఆమవాతవ్యాధిని పోగొడుతుంది. లోపలికి పుచ్చుకోవచ్చు. తల అంటుకోవచ్చు. వస్తికర్మలో వాడవచ్చు. ఇది అగ్ని దీప్తి కలిగిస్తుంది. నడుము, తొడలు, మోకాళ్ళు, కీళ్లు,—వీటిలో పుట్టిన వాతసంబంధమైన బాధలన్నీ పోగొడుతుంది. పక్కలు, వీపు, హృదయం—వీటిలో పుట్టే పోట్లున్నూ తగ్గిస్తుంది. మూత్రకృచ్ఛ్రం, మూత్రాశ్మరీకూడా జయిస్తుంది.

## ౧౫ ప్రమేహమిహిర తైలం

శతపుష్పా దేవకాష్ఠం, ముస్తకం చ నిశాద్వయమ్
మూర్వా కుష్ఠం వాజిగంధా చందనద్వయ రేణుకమ్
కటుకీ మధుకం రాస్నా త్వగేలా బ్రహ్మయష్టికా
చవికా ధాన్యకం వత్సా, పూతికా గురు, పత్రకమ్
త్రిఫలా నలికా బాలా బలా చాతిబలా తథా
మంజిష్ఠా సరళం పద్మం లోధ్రం మధురికా వచా
అజాజీ చోశీరజాతీ వాసా తగరపాదుకా
ఏతేషాం కార్షికై ర్భాగై స్తైలప్రస్థం విపాచయేత్
శతావర్యా రసం తుల్యం లాక్షారసం చతుర్గుణమ్
మస్తు లాక్షారసైస్తుల్యం క్షీరం తుల్యం ప్రదాపయేత్
ద్రవై శ్శైత్తైః పచే త్తైలం గంధం దత్వా యథాక్రమమ్
ఏతత్తైలవరం శ్రేష్ఠ మభ్యంగా న్మారుతాపహమ్
విషమాఖ్యాన్ జ్వరాన్ హంతి మేదోమజ్జాగతా నపి
వాతికం పైత్తికం చైవ శ్లైష్మికం సాన్నిపాతికమ్
క్షీణేంద్రియే తథా శస్తం ధ్వజభంగే విశేషతః
దద్యా త్తైలం విశేషేణ ఫల మస్య చ కథ్యతే
దాహం పిత్తం పిపాసాం చ ఛర్దిం చ ముఖశోషణమ్
ప్రమేహా న్వింశతిం చైవ నాశయే దవికల్పతః
ప్రమేహమిహిరం నామ్నా రతినాథేన భాషితమ్ ।

సదాప, దేవదారు, తుంగముస్తలు, పసుపు, మానుపసుపు, చాగనార, చెంగల్వ కోష్టు, పెన్నేరు, చందనం, రక్తచందనం, రేణుకలు, కటుకరోహిణి, యష్టిమధుకం, సన్నరాస్న, దాల్చినిచెక్క, ఏలకులు, గంటుభారంగి, చవ్యం, ధనియాలు, కొడిశపాలవిత్తులు, కానుగుచెక్క, అగరుచెక్క, ఆకుపత్రికం, కరకవోలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, నల్లకలువ, కురువేరు, బల, అతిబల, మంజిష్ఠ, సరళ

దారు, పద్మకాష్ఠం, లొద్దుగుచెక్క, సాలామిశ్రి, వస, జీలకర్ర, వట్టివేరు, జాజికాయ, అడ్డసరంపట్ట, గ్రంథితగరం—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి రెండేసి తులాలచొప్పున గ్రహించి మెత్తగా చితకగొట్టి నీటితో రుబ్బి ఉంచుకునేది.

నువ్వులనూనె రెండు ప్రస్థాలు. పిల్లితేగలరసం రెండుప్రస్థాలు. లక్కబియ్యపుకషాయం ఎనిమిది ప్రస్థాలు. పెరుగుమీదితేట ఎనిమిది ప్రస్థాలు. ఆవుపాలు ఎనిమిది ప్రస్థాలు.

ఈద్రవద్రవ్యాలన్నీ కలిపి, ఇందులో ఆకల్కం ముద్ద కలిపి వండివడబోసుకునేది.

ఈతైలంతో తలఅంటుకుంటే వాతవ్యాధులు తొలగిపోతాయి. మేదోగతాలూ, మజ్జాగతాలూ అయిన విషమజ్వరాలు తగ్గిపోతాయి. శుక్రనష్టం, ధ్వజభంగం పోతాయి. శరీరం మంటలు, దప్పిక, ఛర్ది, ముఖంశోషించడం, వింశతిప్రమేహాలు, తగ్గిపోతాయి.

## ౨౦ చందనాది తైలం

ద్రవ్యాణి చందనాదేస్తు చందనం రక్తచందనమ్
పత్త్రంగ మథ కాలీయాగురు కృష్ణాగురూణి చ
దేవద్రుమ స్సరళశ్చ పద్మకం తూణికోపి చ
సిహ్లకః కుంకుమం నఖ్యం జాతీఫలక మశ్రి చ
జాతీపత్రం లవంగం చ సూక్ష్మైలా మహతీ చ సా
కంకోలఫలకం త్వక్చ పత్రకం నాగకేసరమ్
వాలకం చ తథోశీరం మాంసీ దారు సితాపి వా
మురా కర్పూరకం చాపి శైలేయం భద్రముస్తకమ్
రేణుకా చ ప్రియంగుశ్చ శ్రీవాసో గుగ్గులు స్తథా
లాక్షా నఖం చ రాలం చ ధాతకీకుసుమం తథా
ఏతాని శాణమానాని కల్కీకృత్య శనైః పచేత్
తైలం ప్రస్థమితం సమ్యగేత త్పాత్రే శుభే క్షిపేత్
అనేనాభ్యక్తగాత్ర స్తు వృద్ధో శీతినమోపి యః

శుభ్రో భవతి శుక్రాఢ్యః స్త్రీణా మత్యంతవల్లభః
వంధ్యాపి లభతే గర్భం షండోపి తరుణాయతే
అపుత్రః పుత్ర మాప్నోతి జీవేచ్చ శరదాం శతమ్
చందనాదిమహాతైలం రక్తపిత్తం క్షయం జ్వరమ్
దాహం స్వేదం చ దౌర్గంధ్యం కుష్ఠం కండూం వినాశయేత్ ॥

చందనం, రక్తచందనం, పతంగిచెక్క, అగురు, కృష్ణాగురు, దేవదారు, సరళదారు, పద్మకాష్ఠం, నందివర్ధనంవేరు, నేలములక, కుంకుమపువ్వు, జాజికాయ, జాపత్రి, లవంగం, దాల్చినిచెక్క, తమపత్రికం, నాగకేసరాలు, కురువేరు, వట్టివేరు, జటామాంసి, గానుపసుపు, చక్కెర, పచ్చకర్పూరం, శిలాజిత్తు, తుంగముస్తలు, రేణుకలు, ప్రేంకణాలు, సరళనిర్యాసం, మహిషాక్షిగుగ్గులు, లక్కవియ్యం, నఖం చిప్పలు, అంగుబంక, ఆరెపువ్వు—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి అరతులంచొప్పున గ్రహించి మెత్తగా దంచి నీళ్లతో రుబ్బి ఒకప్రస్థం నువ్వులనూనెలో కలిపి నాలుగుప్రస్థాల మంచినీళ్లున్నూ చేర్చి వండి వడబోసుకునేది.

దీంతో తలంటుకుంటే వృద్ధుడైనా యువకు డవుతాడు. వీర్యవృద్ధి పొంది అనేకమంది స్త్రీలతో రమించగలుగుతాడు. గొడ్రాలికి సంతానం కలుగుతుంది. మరిన్నీ ఇది రక్తపిత్తం, క్షయ, జ్వరం, మంటలు, ఎక్కువచెమట, శరీరదుర్వాసన, కుష్ఠు, దురదలు పోగొడుతుంది.

## ౨౧ క్షారతైలం

బాలమూలకశుంఠీనాం క్షారః క్షారయుగం తథా
లవణాని చ పంచైవ హింగుశిగ్రుమహౌషధమ్
దేవదారు వచా కుష్ఠం శతపుష్పా రసాంజనమ్
గ్రంథికం భద్రముస్తం చ కల్కైః కర్షమితైః పృథక్
తైలప్రస్థం చ విపచేత్ కదళీబీజపూరయోః
రసాభ్యాం మధుశుక్తేన చాతుర్గుణ్యమితేన చ
పూయస్రావం కర్ణనాదం శూలం బధిరతాం కృమీన్
అన్యాంశ్చ కర్ణజాన్ రోగాన్ ముఖరోగాంశ్చ నాశయేత్ ॥

లేతమల్లింగి క్షారం, సొంటిక్షారం, సర్జక్షారం, యవక్షారం, సైంధవలవణం, సౌవర్చ లవణం, బిడాలవణం, సముద్రలవణం, కాచలవణం, ఇంగువ, మునగపట్ట, సొంటి, దేవదారు, వస, చెంగల్వకోష్టు, సదాప, రసాంజనం, గ్రంథితగరం, తుంగముస్తలు, ఇవి ఒక్కొక్క కర్షం చొప్పున గ్రహించి మెత్తగాదంచి, అది రెండుప్రస్థాల నువ్వుల నూనెలో కలిపి, అందులో, అరటిదుంపరసం యెనిమిదిప్రస్థాలు, మాదీఫలరసం యెనిమిదిప్రస్థాలు, మధుసూక్తం యెనిమిది ప్రస్థాలు చేర్చి వండి వడబోసుకునేది.

ఇది దినమ్ము నాలుగేసిచుక్కలు చెవుల్లో వేసుకుంటూ వుంటే చెవులనుంచి చీము కారడం, చెవిలో హోరు, చెవిపోటు, చెముడు, చెవిలో కృములు, ఇంకా అనేకకర్ణవ్యాధులూ తగ్గిపోతాయి. ముఖరోగాలున్నూ నశిస్తాయి.

## ౨౨ కాసీసాది తైలం

కాసీసం లాంగలీ కుష్ఠం శుంఠీ కృష్ణా చ సైంధవమ్
మనశ్శిలాశ్వమారశ్చ విడంగం చిత్రకో వృషః
దంతీ కోశాతకీబీజం హేమాహ్వా హరితాళకమ్
కల్కైః కర్షమితై రేతైః తైలప్రస్థం విపాచయేత్
సుధార్కపయసీ దద్యా త్పృథ గ్ద్విపలసమ్మితే
చతుర్గుణం గవాం మూత్రం దత్వా సమ్యక్ప్రసాధయేత్
కథితం ఖరనాథేన తైల మర్శోవినాశనమ్
క్షారవ త్పాతయ త్యేత దర్శాం స్యభ్యంగితో భృశమ్
వలిం న దూషయ త్యేత త్క్షారకర్మకరం స్మృతమ్ ॥

అన్నభేది, పొత్తిదుంప, చెంగల్వకోష్టు, సొంటి, పిప్పళ్ళు, సైంధవలవణం, మణిశిల, వాడగన్నేరువేళ్లు, వాయువిళంగాలు, చిత్రమూలం, అడ్డసరప్పట్ట, నేపాళపువేళ్లు, చేదుబీరగింజలు, ఉమ్మెత్తవేళ్ళు, అరిదళం—ఇవి ఒక్కొక్కటి కర్షం చొప్పున గ్రహించి మెత్తగా కొట్టి, నువ్వులనూనె రెండుప్రస్థాలలో కలిపేది. మరిన్ని, ఆ నూనెలోచెముడుపాలు రెండుపలాలు, జిల్లేడుపాలు రెండుపలాలు, ఎనిమిదిప్రస్థాలు గోమూత్రము కలిపి వండివడబోసుకునేది.

ఇది మూలశంక పోగొడుతుంది. ఈతైలం మొలకలకు పూసేది. అవి రాలి పోతాయి. ఇది క్షారకర్మలాగ పనిచేస్తుందే; కాని గుదస్థానంలోని వళులకు ఏమా

త్రమూ అపాయకరం కాదు. మరన్నీ ఇది చంటిపిల్లల అహిపూతన మొదలైనవ్యాధు లనుకూడా పోగొడుతుంది,

చెముడుపాలు తియ్యడం మాత్రం చాలా కష్టం, చాలా జాగ్రత్తగా తియ్యాలి.

## ౨౩ మహాభృంగరాజ తైలం

ఆనూపదేశసంభూతం గృహీత్వా మార్కవం శుభమ్
సుధౌతం జర్జరీకృత్య స్వరసం తస్య చాహరేత్
చతుర్గుణేన తేనైవ తైలప్రస్థం విపాచయేత్
క్షీరపిష్టైరిమైర్ద్రవ్యైస్సంయోజ్య మతిమాన్ భిషక్
మంజిష్ఠా పద్మకం లోధ్రం చందనం గైరికం బలా
రజన్యౌ కేశరం చైవ ప్రియంగుర్మధుయష్టికా
ప్రపౌండరీకం గోపీ చ పలికాన్యత్రదాపయేత్
నస్యకర్మణ్యం తతో జ్ఞాత్వా శుభే భాండే నిధాపయేత్
కేశపాతే శిరోదుష్టే మన్యాస్తంభే గలగ్రహే
శిరఃకర్ణాక్షిరోగేషు నస్యేభ్యంగే చ యోజయేత్
కుంచితాగ్రానతిస్నిగ్ధాన్ కచాన్ కుర్యాద్బహూంస్తథా
ఖాలిత్యమింద్రలుప్తం చ తైలమేతద్వ్యపోహతి ॥

నీటిప్రదేశంలో మొలిచిన గుంటకర్ణి తెచ్చి చక్కగా కడిగి మెత్తగా దంచి స్వరసం తీసుకోవాలి, అది యెనిమిది ప్రస్థాలు. నువ్వులనూనె రెండుప్రస్థాలు. ఇవి ద్రవ ద్రవ్యాలు.

మంజిష్ఠ, పద్మకాష్ఠం, లొద్దుగుచెక్క, చందనం, వంటజేగురు, బల, పసుపు, మానుపసుపు, నాగకేసరం, ప్రేంకణాలు, యష్టిమధుకం, తెల్లతామరపువ్వు, సుగంధి—ఇవి ఒక్కొక్క పలం చొప్పున గ్రహించి మెత్తగా దంచి పాలతో రుబ్బి పైనిచెప్పిన ద్రవద్రవ్యాలలో చేర్చి వండి వడబోసుకునేది.

జుట్టురాలడం, మన్యాస్తంభం, గలగ్రహం, శిరోరోగాలు, కర్ణరోగాలు, నేత్రరోగాలు— ఇవన్నీ పోగొడుతుంది. జుట్టు నల్లబరుస్తుంది. జుట్టు పెంచుతుంది. పేనుకొరుకుడు పోగొడుతుంది.

ఈతైలంతో నస్యం చేసుకుంటూ, తల అంటుకోవాలి. నస్యం దినమూ రెండుముక్కుల్లోనూ నాలుగేసి చుక్కలు వేసుకుంటూ వుంటే చాలు ఆంధ్రదేశంలో భృంగామలకం లాగ వంగదేశంలో దీనివాడకం యెక్కువ.

### ౨౪ కుంకుమాది తైలం

కుంకుమం చందనం లాక్షా మంజిష్ఠా మధుయష్టికా
కాలీయక ముశీరం చ పద్మకం నీలముత్పలమ్
న్యగ్రోధపాదాః, ప్లక్షస్య మూలాం, పద్మస్య కేసరమ్
ద్విపంచమూలసహితైః కషాయైః పలికైః పృథక్
జలాఢకం విపక్తవ్యం పాదశేష మథోద్ధరేత్
మంజిష్ఠా మధుకం లాక్షా పత్తంగమధుయష్టికే
కర్షప్రమాణై రేతైస్తు తైలస్య కుడవం పచేత్
అజాక్షీరం ద్విగుణితం శనై ర్మృద్వగ్నినా పచేత్
సమ్యక్పక్వం వరం హ్యేత న్ముఖవర్ణప్రసాదనమ్
నీలికా పిడకా వ్యంగా నభ్యంగా దేవ నాశయేత్
సప్తరాత్రప్రయోగేణ భవే త్కాంచనసన్నిభమ్
కుంకుమాద్య మిదం తైల మశ్విభ్యాం నిర్మితం పురా ॥

కుంకుమపువ్వు, రక్తచందనం, లక్కబియ్యం, మంజిష్ఠ, యష్టిమధుకం, మానుపసుపు, వట్టివేళ్ళు, పద్మకాష్ఠం, నల్లకలువ, మర్రివూడలు, జువ్విబెరుపట్ట, తామరపువ్వుకేసరాలు, దశమూలాలు—అంటే, మారేడువేళ్లు, నెల్లివేళ్లు, పెగ్గుమ్ముడు, కలిగొట్టు, శాలిపర్ణి, పృశ్నిపర్ణి, ముద్గపర్ణి, మాషపర్ణి, వాకుడు, నేలములక—ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క పలం గ్రహించి మెత్తగా చూర్ణించి అర్ధద్రోణం నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసివుంచుకునేది.

మంజిష్ఠ, యష్టిమధుకం, లక్కబియ్యం, రక్తచందనం, యష్టిమధుకం, ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి కర్షం చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి, నీళ్ళతో గుబ్బి పైని చెప్పిన కషాయంలో కలిపేసి. మరిన్నీ ఆకషాయంలో అర్ధప్రస్థం నువ్వులనూనె, ఒకప్రస్థం మేకపాలున్నూ కలిపి వండి వడబోసుకునేది.

దీంతో తల అంటుకుంటే నీలిక, పిడక, వ్యంగాదులూ నశించిపోతాయి. దినమ్మా ఒక్క వారందినాలు వాడితేనే ఇలాంటి ఫలం కలుగుతుంది.

కల్కద్రవ్యాలలో యష్టిమధుకం రెండుమాట్లు చెప్పడానికి కారణం అది రెండు కర్షాలని చెప్పడానికి. వృద్ధవైద్యులు ఈయోగంలో దశమూలాలు మానేసి దానికి బదులుగా పద్మకింజల్కాలు వాడుతున్నారు. మరిన్నీ, ఇందులో కషాయ ద్రవ్యాలలో వున్న కుంకుమపువ్వు కషాయసాధనలో మానేసి, వృద్ధవైద్యులు తైలం సిద్ధం అయిన తరవాత అందులో వేసి ఉంచుతున్నారు,

## ౨౫ విడంగాది తైలం

విడంగమరిచార్కేషు నాగరే చిత్రకే తథా
భద్రదార్వేలకాఖ్యే చ సర్వేషు లవణేషు చ
తైలం పక్వం పిబేద్వాపి శ్లీపదానాం నివృత్తయే ॥

వాయువిడంగాలు, మిరియాలు, జిల్లేడువేరుచెక్క, సొంటి, చిత్రమూలం, దేవదారు, ఏలకులు, సైంధవలవణం, సముద్రలవణం, సౌవర్చలవణం, బిడాలవణం, కాచలవణం ఇవన్నీ సమభాగాలు. వీటి మొత్తానికి నాలుగురెట్లు నువ్వులనూనె, నూనెకు నాలుగు రెట్లు జలం, మూలికలన్నీ మెత్తగా దంచి ద్రవద్రవ్యంలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది లోపలికి వాడవచ్చు. పైకిరాసి మర్దనాచెయ్యవచ్చు. ఇది బోదకాలు వ్యాధి తగ్గించేస్తుంది.

## ౨౬ హింగ్వాది తైలం

హింగుకాసీససింధూత్థై శృంఠీవత్రకచిత్రకైః
సహాసారాబ్ధిఫేనేందుక్షారత్రయనిశాయుగైః
విపక్వం సార్షపం తైలం పుష్పసంజననం పరం
రజఃకృచ్ఛ్రహరం చాపి యోనిశూలనిషూదనమ్ ॥

ఇంగువ, కాసీసభస్మం, సైంధవలవణం, సొంటి, ఆకుపత్రికం, చిత్రమూలం, ముసాంబరం, సముద్రపునురుగు, పచ్చకర్పూరం, సర్జక్షారం, యవక్షారం, వెలిగారం, పసుపు, మానుపసుపు,—ఇవన్నీ మెత్తగా దంచి నీటితో రుబ్బి ముద్దచేసి, ఈమూలికలకు నాలుగురెట్లు ఆవనూనె, నూనెకు నాలుగురెట్లు నీళ్లూ కలిపి వండివడబోసుకునేది.

ఇది వయోబలావస్థలను అనుసరించి పాలలో కలిపి లోపలికిస్తే ఋతురక్తం సరిగా జారీ కాని స్త్రీలకు ఆబాధ పోతుంది. కన్యలు రజస్వలలు అవుతారు. యోని శూల కూడా తగ్గిపోతుంది.

## ౨౭. కనకతైలం

మధుకస్య కషాయేణ తైలస్య కుడవం పచేత్
కల్కైః ప్రియంగుమంజిష్ఠాచందనోత్పలకేసరైః
కనకం నామ తత్తైలం ముఖకాంతికరం పరమ్
అభీరునీలికావ్యంగశోధనం పరమార్చితమ్ ॥

యష్టిమధుకం 64 తులాలు మెత్తగా చితకగొట్టి ఎనిమిది ప్రస్థాలనీళ్ళలో కలిపి రెండు ప్రస్థాలు మిగిలేటట్టు కాచి వడబోసేది. ఆకషాయంలో 64 తులాలు నువ్వులనూనె చేర్చేది.

ప్రేంకణం, మంజిష్ఠ, రక్తచందనం, నల్లకలువదుంప, నాగకేసరాలు—ఇవి నాలుగేసి తులాల చొప్పున గ్రహించి చూర్ణించి నీళ్లతో రుబ్బి చేర్చి పండివడబోసుకునేది.

ఇది అభీరు, నీలిక వ్యంగం మొదలైన చర్మదోషాలు అన్నీ పోగొట్టి ముఖానికి కాంతి, వర్చస్సూ కలిగిస్తుంది.

## ౨౮. శ్రీగోపాలతైలం

రసాధకం శతావర్యాః కూష్మాండాడామలయో స్తథా
వాజీగంధా సహచర బలానాం చ శతం పృథక్
పరిపచ్యాంభసాం ద్రోణే పాదశేషేవతారయేత్
పంచమూలం మహా ద్వ్యాఘ్రీ మూర్వా కేతకపూతికాః
పారిభద్రం చ సర్వేషాం గ్రాహ్యాం దశపలం శుభమ్
క్వాథయిత్వా జలద్రోణే తత్పాద మవశేషయేత్
ఆఢకం తిలతైలస్య కల్కైః శ్చైతై శ్చ సంపచేత్
అశ్వగంధా చోరపుష్పీ పద్మకం కంటకారికా

బలాగురు ఘనం పూతిశిహ్వాకాగురు చందనమ్
చందనం త్రిఫలా మూర్వా జీవనీయకటుత్రియమ్
పూతికుంకుమకస్తూర్యః చాతుర్జాతం చ శైలజమ్
నఖముక్త మృణాలాని నీలోత్పల ముశీరకమ్
మాంసీ మురా సురతరు వచా దాడిమ తుంబురు
బుద్ధివృద్ధీ దమనకం క్షుద్రైలార్థపలం పృథక్
ఏత త్తైలవరం హంతి వాతపిత్తకఫోద్భవాన్
వ్యాధీ నశేషాన్, జనయే త్స్మృతిం మేధాం ధృతిం ధియమ్
వాతరోగా న్విశేషేణ ప్రమేహాన్ హంతి వింశతిమ్
గర్భం సంస్థాపయేత్ స్త్రీణాం సర్వం శూలం వ్యపోహతి
మూత్రకృచ్ఛ్రమపస్మార మున్మాదాన్ నిఖిలా నపి
స్థవిరోపి జరాజీర్ణ స్తైల స్యాస్య నిషేవణాత్
లీలయా ప్రమదానాం చ ఉన్మదానాం శతం జయేత్
తిష్ఠే ద్యస్య గృహే తైలం శ్రీగోపాలాభిదం శుభమ్
న తత్ర భూతా స్సర్పంతి న పిశాచా న రాక్షసాః
న దారిద్ర్యం భవే త్తస్య విఘ్నః కశ్చి న్న జాయతే
అశ్విభ్యాం నిర్మితం హ్యేత ద్విశ్వకల్యాణహేతవే ॥

పిల్లితేగలరసం 8 ప్రస్థాలు. బూడిదగుమ్మడికాయలరసం 8 ప్రస్థాలు. ఉసిరికాయలరసం 8 ప్రస్థాలు. అశ్వగంధ, ములుగోరింట, బల,—ఇవి ఒక్కొక్కటి నూరేసి పలాలు రెండేసి ద్రోణాలలో వేసి ఎనిమిదేసి ప్రస్థాలు మిగులునట్లు కాచేది. మారేడు, దుండిగం, గుమ్మడి, కలిగొట్టు, తక్కిల—ఇవి ఒక్కొక్కటి పదేసి పలాలు. వావడు, చాగనార, మొగలిచన్నులు, గానుగుచెక్క, వావిలిచెక్క,—ఇవి ఒక్కొక్కటి పదేసిపలాలు. ఈనూరుపలాలూ మెత్తగా చితకకొట్టి రెండు ద్రోణాల నీళ్ళలో కలిపి ఎనిమిది ప్రస్థాలు మిగిలేటట్టు కాచాలి. మొత్తం ఈయేడు రకాల కషాయాలూ రసాలూ కలిపి వాటిలో 8 ప్రస్థాల నువ్వుల నూనె చేర్చేది. ఇవి ద్రవద్రవ్యాలు.

పెన్నేరు, చోరపుష్పి, పద్మకాష్ఠం, వాకుడు, బల, అగురుచెక్క, తుంగముస్తలు, గానుగచెక్క, శిలారసం, అగురుచెక్క, (రెండోమాటు) చందనం, రక్తచందనం, కరకతాడిపుసిరికలు, చాగ, మనుబాల, కాకోళి, క్షీరకాకోళి, మేద, మహామేద, ముద్గపర్ణి, మాషపర్ణి, జీవకం, ఋషభకం, యష్టిమధుకం, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, కుంకమపువ్వు, కస్తూరి, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం నాగకేసరాలు, గోమూత్రశిలాజిత్తు, నఖంచిప్పలు, తుంగముస్తలు, తామరతూడు, నల్లకలువదుంపలు, వట్టివేళ్లు, జటామాంసి, దేవదారు, వస, దానిమ్మబెరడు, తుంబుర్లు, ఋద్ధి, వృద్ధి, దమనం, చిన్నఏలకులు,—ఇవి ఒక్కొక్కటి నాలుగేసితులాలు ఇవి కల్కద్రవ్యాలు. ఇవన్నీ మెత్తగా చూర్ణించి నీళ్ళతో ఉబ్బి ద్రవద్రవ్యంలో కలిపి వండివడబోసుకునేది.

ఈతైలం వాతంవల్లా పిత్తంవల్లా కఫంవల్లా పుట్టిన సకలవ్యాధులూ తగ్గించేస్తుంది. బుద్ధిబలమూ, జ్ఞాపకశక్తీ, ధైర్యమూ కలిగిస్తుంది. వాతరోగాలూ, ముఖ్యంగా ప్రమేహాలు తగ్గించేస్తుంది. స్త్రీలకు గర్భంనిలుపుతుంది. శూల, మూత్రకృచ్ఛ్రము, అపస్మారం, ఉన్మాదం బాగొడుతుంది. తరుచుగా ఈతైలంతో తల అంటుకుంటూ వుంటే వృద్ధుడు కూడా పడుచువాడవుతాడు.

## ౨౯ రాస్నా పూతిక తైలం

దశమూల బలా దారు హ్యశ్వగంధా శతావరీ
వరుణైరండ నిర్గుండీ తర్కారీ శిగ్రు మోరటమ్
సహాచరం చిత్రమూలం కరంజాంకోలమూలకమ్
పునర్నవం చ భూపీలు హ్యర్కపుష్పీ దురాలభా
జీవంతీ విషతిందు శ్చ వాతారీ హింస్రశిగ్రుకమ్
ఆలర్కయునకోలం చ కుళుత్థానాం కషాయకమ్
ఏతేషాం చ సమం రాస్నా పూతికం చ తయో స్సమమ్
అష్టభాగావశేషం తు కషాయ మవతారయేత్
తత్పాదం తిలతైలం చ హ్యజాక్షీరం చ తత్సమమ్
గుగ్గులుం తగరం మాంసీ త్రికటుత్రిఫలాని చ
చాతుర్జాతం కచోరం చ విడంగామరదారు చ

హింగు రాస్నా వచా కిక్వా పాఠా యష్టిక చిత్రకమ్
ప్రియంగుపిప్పలీమూలం చందనం చవ్యదీప్యకమ్
వరాళం చంపకం కుష్ఠం మంజిష్ఠా మిశి సర్షపాః
జాతీఫలం సుగంధం చ పాఠోశీరం సమాంశకమ్
ఏత త్తైలస్య వష్ఠాంశం కల్కద్రవ్యాణి దాపయేత్
సుముహూర్తే సునక్షత్రే నవవస్త్రేణ పీడయేత్
పాదలేపనస్యాద్యై శ్శిరోవస్తిషు యోజితమ్
ధనుర్వాతేంతరాయామే గృధ్రస్యా మపబాహుకే
ఆక్షేపకే వ్రణాయామే విశ్వాచ్యా మపపంత్రకే
ఆఢ్యవాతే హనుస్తంభే శిరోవాతే పతానకే
భ్రూశంఖ కర్ణనాసాక్షి జిహ్వాస్తంభే చ దారుణే
కలాయఖంజతాపంగుసర్వాంగైకాంగమారుతే
అర్దితే పాదహర్షే చ పక్షాఘాతే ప్రశస్యతే
ఊరుస్తంభం సుప్తవాతం నాశయే న్నాత్రసంశయః
రాస్నాపూతికనా మైత త్తైల మాత్రేయనిర్మితమ్॥

దశమూలాలు, బల, మానుపసుపు, పెన్నేరు, పిల్లితేగలు, ఉలిమిడిపట్ట, ఆముదపు వేళ్ళు, వావిలిచెక్క, తక్కోల, మునగవేరుపట్ట, చాగనార, పచ్చగోరింట, చిత్రమూలం, కానుగువేరుపట్ట, ఊడుగువేరుపట్ట, గలిజేరు, నేలగోగు, అర్కపుష్పి, తూలగొండివేళ్ళు, మనుబాల, విషముష్టి, ఆముదపుచెట్టువేళ్ళు, జటామాంసి, మునగపట్ట, యెర్రపత్తిపట్ట, యవలు, రేగుపట్ట, ఉలవలు—ఇవి సమభాగాలు. వీటికన్నిటికీ సమం సన్నరాస్న. వీటికన్నిటికీ సమం కానుగుపట్ట. ఇవన్నీ మెత్తగా చితకగొట్టి ఆరురెట్లు నీళ్ళలో కలిపి ఎనిమిదోభాగం మిగిలేటట్టు కషాయం కాచుకొని వడబోసుకునేది. ఆకషాయంలో నాలుగోవంతు నువ్వులనూనె. మేకపాలు కషాయముతో సమానం. ఇవి ద్రవద్రవ్యాలు.

మహిషాక్షిగుగ్గులు, గ్రంథితగరము, జటామాంసి, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకవోలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, దాల్చినిచెక్క,

ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు, కచ్చూరాలు, వాయువిడంగాలు, దేవదారు, ఇంగువ, సన్నరాస్న, వస, కటుకరోహిణి, పాఠ, యష్టిమధుకం, చిత్రమూలం, త్రేంకణం, పిప్పలిమోడి, రక్తచందనం, చవ్యం, నాము, లవంగాలు, సంపంగె పువ్వులు, చెంగల్వకోష్టు. మంజిష్ఠ, పెద్దసోపు, ఆవాలు, జాజికాయ, సుగంధి, పాఠ, వట్టివేళ్ళు,—ఇవి కల్కద్రవ్యాలు. వీటి మొత్తం నూనెలో ఆరోవంతు అయేటట్లు సమభాగాలుగా గ్రహించి చూర్ణించి నీళ్ళతో రుబ్బి ద్రవద్రవ్యాలలో కలిపి వండివడ బోసుకునేది.

ఇది లోపలి కివ్వవచ్చు, పైని పూయవచ్చు, నస్యానికివాడవచ్చు, శిరోవస్తిగా వాడవచ్చు.

ఇదిధనుర్వాతం, అంతరాయామం, గృధ్రసి, అపబాహుకం, ఆక్షేపకం, విశ్వాచీవాతం, అపతంత్రకం, ఆఢ్యవాతం, హనుస్తంభం, శిరోవాతం, అపతానకం, భ్రూశంఖకర్ణనాసాక్షిజిహ్వలను బాధించే వాతం, కలాయఖంజపంగువాతాలు, పక్షవాతం, సర్వాంగవాతం, అర్దితవాతం, పాదహర్షం, ఊరుస్తంభం, సుప్తవాతం, ఇవన్నీ పోగొడుతుంది.

### 30 అశ్వగంధాబలాలాక్షాతైలం

అశ్వగంధా బలా లాక్షా ప్రస్థం ప్రస్థం పృథక్పృథక్
జలద్రోణే విపక్తవ్యం చతుర్భాగావశేషితమ్
తైలం త్రిమానకం దద్యా త్తైలా న్మస్తు చతుర్గుణమ్
అశ్వగంధా బలా రాస్నా కాంతి కుష్ఠా బ్దచందనమ్
నిశా తిక్తా శతాహ్వా చ లాక్షామూర్వా సమూలికా
సురధాతు స్సుమంజిష్ఠా మధుకోశీరశారిబా
భార్గీపుష్కరమూలం చ సరళా గ్రంథికం తథా
సమభాగాని సర్వాణి కల్కీకృత్య ప్రదాపయేత్
సర్వజ్వరహరం, హంతి. శోఫం చ పరిబృంహితమ్
కాసశ్వాసహరం చైవ సర్వధాతువివర్ధనమ్
పక్షఘాతహరం చైవ గ్రహాపస్మారదాహనుత్

వీత దభ్యంజనే శ్రేష్ఠం క్షుమవాధిహరం పరమ్
అశ్వగంధాబలాలాక్షా తైలం విశ్వహితాయ చ ॥

పెన్నేరు, బల, లక్క బియ్యం—ఇవి ఒక్కొక్క ప్రస్థం. ఇవి మూడూ మెత్తగా చితకగొట్టి రెండు ద్రోణాల నీళ్ళలో కలిపి, నాలుగో భాగం మిగిలేటట్టు కాచి వడ బోసుకునేది. అందులో ఆరుమానికల నువ్వులనూనె, ఇరవైనాలుగు మానికల పెరుగుమీది తేటా చేర్చేది. ఇదిద్రవద్రవ్యం.

పెన్నేరు, బల, సన్నరాస్న, రేణుకలు, చెంగల్వకోష్టు, తుంగముస్తలు, చందనం, పసుపు, కటుకరోహిణి, సదాప, లక్కబియ్యం, చాగ, దేవదారు, ఉసిరికపప్పు, మంజిష్ఠ, యష్టిమధుకం. వట్టివేరు, సుగంధి, గంటుభారంగి, పుష్కరమూలం, సరళదారు, గ్రంధితగరం,—ఇవన్నీ కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి నాలుగేసి తులాలు గ్రహించి మెత్తగా చూర్ణించి, నీళ్ళతో రుబ్బి ఆద్రవద్రవ్యాలలో కలిపివండి వడబోసుకునేది.

ఇదిశరీరానికి మర్దనా చేసుకుంటే సర్వజ్వరాలూ హరిస్తుంది. ఉబ్బు, దగ్గు, వగర్పు, పక్షవాతం, గ్రహదోషాలు, అపస్మారం, క్షయ పోగొడుతుంది. సర్వ ధాతువులనూ వృద్ధిచేస్తుంది.

---

# ఘృతాలు

## ౧ కల్యాణఘృతం

త్రిఫలా ద్వే నిశే కాంతీ సారిబే ద్వే ప్రియంగుకా
శాలిపర్ణీ పృశ్నిపర్ణీ దేవదా ర్వేలవాలుకమ్
నతం విశాలా దంతీ చ దాడిమం నాగకేసరమ్
నీలోత్పలైలా మంజిష్ఠా విడంగం కుష్టపద్మకమ్
జాతీపుష్పం చందనం చ తాలీసం బృహతీ తథా
ఏతైః కర్షసమైః కల్కై ర్జలం దత్వా చతుర్గుణమ్
ఘృతప్రస్థం పచే ద్ధీమా నపస్మారే జ్వరే క్షయే
ఉన్మాదే వాతరక్తే చ కాసే మందానలే తథా
ప్రతిశ్యాయే కటే శూలే తృతీయక చతుర్థకే
మూత్రకృచ్ఛ్రే విసర్పే చ కండూపాండ్వామయే తథా
విషద్వయే ప్రమేహేషు సర్వథై వోపయుజ్యతే
వంధ్యానాం పుత్రదం భూతయక్షురక్షోహరం స్మృతమ్ ॥

కరకవోలుపు, తాడికాయవోలుపు, ఉసిరికపప్పు, పసుపు, మానుపసుపు, రేణుకలు, పాలసుగంధి, నల్లసుగంధి, ప్రేంకణం, ముయ్యాకుపొన్న, నక్కతోకపొన్న, దేవదారు, తూతురుబుడమ, గ్రంథితగరం, విశాల, నేపాళపువేళ్ళు, దానిమ్మబెరడు, నాగకేసరాలు, నల్లకలువ, ఏలకులు, మంజిష్ఠ, వాయువిడంగాలు, చెంగల్వకోష్టు పద్మకాష్ఠం, జాజికాయ, చందనం, తాళీసం, పెద్దములక,—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి రెండేసితులాలు. ఇవన్నీ కలిపి మెత్తగా నలగకొట్టి, నీటితో రుబ్బి ఆముద్ద రెండుప్రస్థాల ఆవునేతితో కలిపేది. మరిన్నీ, ఆనేతిలో ఎనిమిది ప్రస్థాల నీళ్ళు కలిపి వండి వడబోసుకునేది.

ఇది, ఉన్మాదం, వాతరక్తం, దగ్గులు, అగ్నిమాంద్యం, రొంప, అపస్మారం జ్వరం, క్షయ, కటిశూల, తృతీయకచాతుర్థికజ్వరాలు, మూత్రకృచ్ఛ్రం, విసర్పం,

మూరదలు, పాండురోగం, స్థావరజంగమవిషాలు, ప్రమేహాలుపోగొడుతుంది. వంధ్యా స్త్రీలకు పుత్రసంతానం కలిగిస్తుంది. సమస్త గ్రహబాధలున్నూ నశింపచేస్తుంది.

## ౨ ఫలఘృతం

త్రిఫలా మధుకం కుష్ఠం ద్వే నిశే కటురోహిణీ
విడంగం పిప్పలీ ముస్తం విశాలా కట్ఫలం వచా
ద్వే మేదే ద్వే చ కాకోల్యౌ సారిబే ద్వే ప్రియంగుకా
శతపుష్పా హింగురాస్నా చందనం రక్తచందనమ్
జాతీపుష్పం తుగాక్షీరీ కమలం శర్కరా తథా
అజమోదా చ దంతీ చ కల్కై రేతైశ్చ కార్షికైః
జీవన్త్యైకవర్ణాయా ఘృతప్రస్థం చ గోః క్షిపేత్
చతుర్గుణేన పయసా పచే దారణ్యగోమయైః
సుతిథౌ పుష్యనక్షత్రే మృద్భాండే తామ్రజే తథా
తతః పిబే చ్ఛుభదినే నారీ వా పురుషోథ వా
ఏత త్సర్పి ర్నరః పీత్వా స్త్రీషు నిత్యం వృషాయతే
పుత్రా నుత్పాదయే ద్ధీమాన్ వంధ్యాపి లభతే సుతమ్
అనాయుషం యా జనయే ద్యా చ సూతా పురస్థితా
పుత్రం ప్రాప్నోతి సా నారీ బుద్ధిమంతం శతాయుషమ్
ఏత త్ఫలఘృతం నామ భారద్వాజేన భాషితమ్
అనుక్తం లక్ష్మణామూలం క్షిపం త్యత్ర చికిత్సకాః ॥

కరకతాడిఉసిరికలు, యష్టిమధుకం, చెంగల్వకోష్టు, పసుపు, మానుపసుపు, కటుక రోహిణి, వాయువిడంగాలు, పిప్పళ్ళు, తుంగముస్తలు, పెద్దపాపరవేళ్ళు, కాయ ఫలం, వస, మేద, మహామేద, కాకోలి, క్షీరకాకోలి, పాలసుగంధి, నల్లసుగంధి, ప్రేంకణం, సదాప, ఇంగువ, (వేయించింది) సన్నరాస్న, చందనం, రక్తచందనం, జాపత్రి, తవాక్షీరి, తామరపువ్వు, చక్కెర. అజామోదం, నేపాళపువేళ్ళు ఇవికల్క ద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క కర్షం చొప్పున గ్రహించి మెత్తగా కొట్టి నీళ్ళతో రుబ్బిఉంచుకునేది.

శరీరం అంతా ఒక్కటే రంగూ, దూడలు బతికీ ఉండిన ఆవుపాలలోనుంచి తీసిన నెయ్యి రెండుప్రస్థాలు. అనేతికి నాలుగురెట్లు ఆవుపాలు. వీటిలో ఆకల్కం ముద్ద కలిపి అడవియెరుపిడకలతో వండి వడబోసుకునేది.

ఇది పురుషులకు మిక్కిలీ వీర్యవృద్ధి కలిగించి ఎంతోమంది స్త్రీలతో రమించే శక్తి యిస్తుంది. వంధ్యా స్త్రీలకు పుత్రసంతానప్రాప్తి కలిగిస్తుంది. బిడ్డలు బతకని స్త్రీలకు ఇది వరప్రసాదం. వారి బిడ్డలు దీర్ఘాయుష్మంతు లవుతారు.

ఇందులో చెప్పకపోయినా అనుభవపరులైన వృద్ధవైద్యులు లక్ష్మణామూలం కూడా కల్కద్రవ్యాలలో చేర్చుకోడం సంప్రదాయంగా వుంది.

## 3 కుమారకల్యాణఘృతం

శంఖపుష్పీ వచా బ్రాహ్మీ కుష్ఠం త్రిఫలయా సహ
ద్రాక్షా సశర్కరా శుంఠీ జీవంతీ జీరకం బలా
శఠీ దురాలభా బిల్వం దాడిమం సురసా స్థిరా
ముస్తం పుష్కరమూలం చ సూక్ష్మైలా గజపిప్పలీ
ఏషాం కర్షసమై ర్భాగై ర్ఘృతప్రస్థం విపాచయేత్
కషాయే కంటకార్యాశ్చ క్షీ రే తస్మింశ్చతుర్గుణే
ఏత త్కుమారకల్యాణం ఘృతరత్నం సుఖప్రదమ్
బలవర్ణకరం ధన్యం పుష్ట్యాయు రతివర్ధనమ్
ఛాయాసర్వగ్రహాలక్ష్మీ క్రిమిదంతగదాపహమ్
సర్వబాలామయం హంతి దంతోద్భేదం విశేషతః ॥

శంఖపుష్పి, వస, సరస్వతీఆకు, చెంగల్వకోష్టు, కరకతాడిఉసిరికలు, ద్రాక్షపండు, చక్కెర, సొంటి, మనుబాల, జీలకర్ర, బల, కచ్చూరాలు, దూలగొండి వేళ్ళు, మారేడువేళ్ళు, దానిమ్మబెరడు, తులసి, శాలిపర్ణి, తుంగముస్తలు, పుష్కరమూలం, చిన్నఏలకులు, గజపిప్పళ్ళు,—ఇవి కల్కద్రవ్యాలు.

ఇందులో రెండో బంతిలో జీరకం అనేదానికి బదులుగా కొందరు జీవనీయ గణం వాడుతున్నారు. జీవనీయగణం అంటే మనుబాల, యష్టిమధుకం, మేద, మహామేద, కాకోలి, క్షీరకాకోలి, మాషపర్ణి, ముద్గపర్ణి, జీవకం, ఋషభకం, అని జీలకర్రకు బదులుగా ఇవి వేసుకుంటే చాలా యెక్కువ పనిచేస్తుంది.

ఈ కల్కద్రవ్యాలన్నీ ఒక్కొక్కటి కర్షంచొప్పున తీసుకుని, కలిపి, మెత్తగా దంచి నీళ్ళతో రుబ్బి ఉంచుకునేది.

ఆవునెయ్యి రెండుప్రస్థాలు. వాకుడు స్వరసం ఎనిమిదిప్రస్థాలు. ఆవుపాలు ఎనిమిది ప్రస్థాలు.

ఈ ద్రవద్రవ్యాలన్నీ కలుపుకుని, వీటిలో ఆ కల్కంముద్ద చేర్చి వండి వడబోసుకునేది.

ఇది చంటిపిల్లలకు చాలా మేలు చేస్తుంది, బలం కలిగిస్తుంది, శరీరకాంతి వృద్ధి చేస్తుంది, పుష్టిచేసి దీర్ఘాయుర్దాయం సమకూరుస్తుంది, సర్వగ్రహబాధలూ తగ్గిస్తుంది, క్రిములు నాశనంచేస్తుంది, దంతవ్యాధు లన్నీ పోగొడుతుంది, సమస్తబాలవ్యాధులూ తగ్గించేస్తుంది, ముఖ్యంగా దంతాలు వచ్చేటప్పుడు కలిగే వ్యాధులన్నీ ఇది పోగొడుతుంది.

## ౪ వర్ణక ఘృతం

మధుకం చందనం కంగు సర్షపం పద్మకం తథా
కాలీయకం హారిద్రా చ లోధ్ర మేభి శ్చ కల్కితైః
విపచే ద్ధి ఘృతం వైద్య స్తత్పక్వం వస్త్రగాలితమ్
పాదాంశం కుంకుమం సిద్ధం క్షిప్త్వా మందానలే పచేత్
తత్సిద్ధం శిశిరే నీరే ప్రక్షిప్యాకర్షయే త్తతః
తదేత ద్వర్ణకం నామ ఘృతం వక్త్రప్రసాదనమ్
అనేనాభ్యాసలిప్తం హి వలీభూత మపి క్రమాత్
నిష్కలంకేందుబింబాభం స్యా ద్విలాసవతీముఖమ్ ॥

యష్టిమధుకం, చందనం, ప్రేంకణం, ఆవాలు, పద్మకేసరాలు, సుగంధి, పసుపు, లొద్దుగుచెక్క — ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి పలంచొప్పున గ్రహించి మెత్తగా దంచి, నీళ్ళతోరుబ్బి రెండుప్రస్థాల ఆవునేతిలో కలిపి, అందులో ఎనిమిది ప్రస్థాల నీళ్లున్నూ చేర్చి దింపబోయేటప్పుడు రెండుపలాల మైనం వేసి, కరిగించి, ఒక తులం కుంకుమపువ్వున్నూ కలిపి వేడిగా వుండగానే వడబోసుకునేది.

చల్లబడితే ఇది గట్టిపడి, వెన్నలా వుంటుంది, కనక, వేడికొంచెం తగ్గాక సీసాలలో గాని, డబ్బాలలో గాని పోసి ఉంచుకునేది.

ఇది స్త్రీలకు మొగం మెరుగుగా వాడుకునేది. దినదినమూ మొగానికి ఇది రాసి బాగా మర్దనా చేసుకుని కడిగేసుకుంటూవుంటే ముడతలు పడ్డ మొగం కూడా నునుపుతేరి చంద్రబింబంలా వుంటుంది.

## ౫ బృ హ ద శ్వ గ ం ధా ఘృ త ం

అశ్వగంధా పలశతం శుభదేశసముద్భవమ్
పుణ్యేహని సమాహృత్య సాధయేత్ శ్లక్ష్ణకుట్టితమ్
ద్రోణేంభసి పచేత్తావ ద్యావత్పాదావశేషితమ్
సర్పిః ప్రస్థం పచేత్తేన గవ్యక్షీరం చతుర్గుణమ్
కషాయం భాగమాంసస్య దద్యాచ్ఛతావరీరసస్య చ
కల్కానిశ్లక్ష్ణపిష్టాని తదామూని ప్రదాపయేత్
కాకోలీయుగ మృద్ధీ ద్వే మేదే ద్వే చాథ జీరకమ్
స్వయంగుప్తా వృషభక మేలాం మధుకమేవ చ
మృద్వీకాం శూర్పపర్ణ్యౌ చ జీవంతీం చపలాం బలామ్
నారాయణీం విదారీం చ దత్వా సమ్యగ్విపాచయేత్
సితా మాక్షికయోశ్శీతే కృష్ణాయాః కుడవౌ పృథక్
లీఢ్వా పాణితలం భుంజ్యాత్ పరిహారవివర్జితమ్
క్షీణేంద్రియాః క్షీణశుక్రా వృద్ధా బాలా స్తథాబలాః
హీనమాంసాశ్చ యే కేచిత్ ప్రాశ్యేదం మాత్రయా ఘృతమ్
ఓజః స్వాస్థ్యం చ తేజశ్చ ప్రసాద మింద్రియస్య చ
లభతే సూర్యసంకాశో భ్రాజతే విగతజ్వరః
వృద్ధో వృషాయతే స్త్రీషు నిత్యం షోడశవర్షవత్
నారీణాం చ శతం గచ్ఛేత్ న చ శుక్రక్షయో భవేత్
వంధ్యా చ లభతే పుత్రం బుద్ధిమేధాసమన్వితమ్

మాసమాత్రప్రయోగేణ వలీపలితనాశనమ్
ఖాలిత్యం తిమిరం వ్యాధీన్ వాతికాన్ కఫపిత్తజాన్
పంచకాసాన్ క్షయం శ్వాసం హిక్కాం చ విషమజ్వరమ్
హంతి సర్వాన్ గదాన్ శీఘ్ర మశ్విభ్యాం నిర్మితం పురా ॥

నూరుపలాల పెన్నేరు మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్లలో కలిపి నాలుగో పాలు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. మేకమాంసం రెండువందల పలాలు మెత్తగా నరికించి నాలుగుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగో వంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. ఈరెండుకషాయాలూ కలిపి అందులో రెండుప్రస్థాల ఆవునెయ్యీ, ఎనిమిది ప్రస్థాల ఆవుపాలూ కూడా చేర్చేది.

కాకోళి, క్షీరకాకోళి, ఋద్ధి, వృద్ధి, మేద, మహామేద, జీలకర్ర, పల్లేరు గింజలు, ఋషభకం, ఏలకులు, యష్టిమధుకం, ద్రాక్షపండు, మాషపర్ణి, ముద్గపర్ణి, జీవంతి, పిప్పళ్ళు, బల, పిల్లితేగలు, నేలగుమ్మడు,—ఇవి కల్కద్రవ్యాలు. ఇవన్నీ కలిపి మెత్తగా దంచి నీళ్ళతో రుబ్బి యీముద్ద పైని చెప్పిన ద్రవద్రవ్యాలలో చేర్చి వండివడబోసుకునేది.

ఇది చల్లబడిన తరవాత ఒకకుడవం చక్కెరా, ఒకకుడవం తేనే కూడా కలుపుకునేది. అయితే, వృద్ధవైద్యులు ఈరెండువస్తువులూ ఘృతంఅంతలోనూ కలిపివుంచక ప్రతీ మోతాదులోనూ కొంతకొంత కలుపుకోమని చెప్పడం వుంది.

ఇంద్రియాలు పట్టుతప్పినవారూ, శుక్రక్షీణం పొందినవారూ, వృద్ధులూ, బాలకులూ, బలహీనులూ, రక్తమాంసాలు క్షీణించినవారూ ఇది బలానుసారంగా సేవిస్తే ఓజస్సూ, స్వాస్థ్యమూ, తేజస్సూ, ఇంద్రియబలమూ కలిగి సూర్యబింబంలా వెలిగిపోతూ వుంటారు. వృద్ధుడు కూడా పదహారేళ్ల యువకుడులాగ అనేకమంది స్త్రీలతో రమించగలుగుతాడు. వంధ్యాస్త్రీలకు సత్సంతానం కలుగుతుంది. ఒక్కమాసం సేవించినంతమాత్రానే యీగుణాలు కలుగుతాయి. శరీరంమీదిముడతలు తగ్గిపోతాయి. వెంట్రుకలు నల్లబడతాయి. దృష్టిమాంద్యం కూడా తగ్గిపోతుంది. వాతవ్యాధులూ కఫవ్యాధులూ హరిస్తాయి. పంచకాసలూ, క్షయ, శ్వాసలు, ఎక్కిళ్లు, విషమజ్వరం తగ్గిపోతాయి.

## ఛాగలాదితైలం

అజం చర్మవినిర్ముక్తం త్యక్తశృంగఖురాదికమ్
పంచమూలీద్వయం చైవ జలద్రోణే విపాచయేత్

తేన పాదావశేషేణ ఘృతప్రస్థం విపాచయేత్
జీవనీయై స్సయష్ట్యాహ్వైః క్షీరం చైవ శతావరీ
ఛాగలాద్య మిదం నామ్నా సర్వవాతవికారనుత్
అర్దితే కర్ణశూలే చ బాధిర్యే మూకమిన్మినే
జడగద్గదపంగూనాం ఖంజే గృధ్రసికుబ్జయోః
అపతానేపతంత్రే చ సర్పి రేతత్ప్రశస్యతే
పృథగ్ద్వితులా పంచమూలద్వంద్వాజమాంసయోః
నిక్వాథ్య సలిలద్రోణే క్వాథే పాదావశేషితే ॥

చర్మమూ, కొమ్ములూ, గిట్టలూ మొదలైనవి తీసివేసిన మేకమాంసం 50 పలాలు రెండుద్రోణాల నీళ్లలో నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకుని ఉంచుకునేది. దశమూలాలు అన్నీ కలిపి యాభైపలాలు రెండు ద్రోణాల నీళ్ళలో నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసి ఉంచుకునేది. ఈరెండు కషాయాలూ కలిపి అందులో రెండుప్రస్థాల ఆవునెయ్యి చేర్చి పొయిమీద ఉంచుకునేది.

మనుబాల, యష్టిమధుకం, మేద, మహామేద, కాకోలి, క్షీరకాకోలి, మాష పర్ణి, ముద్గపర్ణి, జీవకం, ఋషభకం, మళ్లీ యష్టిమధుకం–ఇవికల్కద్రవ్యాలు. ఇవన్నీ కలిపి 66 తులాలు. ఇవి మెత్తగా దంచి నీళ్లతో రుబ్బి అముద్ద ఆద్రవద్రవ్యాలలో కలుపుకునేది. మరిన్నీ ఆద్రవద్రవ్యాలలో నాలుగుప్రస్థాల ఆవుపాలు, నాలుగు ప్రస్థాల, పిల్లితేగల రసమూ కూడా చేర్చుకోవాలి.

ఇవన్నీ కలిపి వండి వడబోసుకునేది.

ఇది అర్దితవాతం, కర్ణశూల, బధిరత్వం, మూద్దమాటలు, గద్గదవచనాలు, చురుకు తనంలేకపోవడం. కుంటితనం, ఖంజవాతం, గృధ్రసి, కుబ్జకం, అపతానం, అప తంత్రం ఇవన్నీ పోగొడుతుంది.

## ౭ బృహచ్ఛాగలాద్యఘృతం

ఛాగమాంసతులాం గృహ్యా దశమూల్యాః పలం శతమ్
అశ్వగంధాపలశతం వాట్యాలకశతం తథా
ఘృతాఢకం పచే త్తోయై శ్చతుర్భాగావశేషితైః

# ఘృతాలు

క్షీరం స్నేహసమం దద్యాత్ శతావర్యా రసం తథా
తామ్రపాత్రే దృఢే చైవ శనై ర్మృద్వగ్నినా పచేత్
అస్యౌషధస్య కల్కస్య ప్రత్యేకం శుక్తిసమ్మితమ్
జీవంతీ మధుకం ద్రాక్షా కాకోల్యౌ నీల ముత్పలమ్
ముస్తం సచందనం రాస్నా పర్ణినీద్వయశారిబే
మేదే ద్వే చ తథా కుష్ఠం జీవకర్షభకౌ శఠీ
దార్వీ ప్రియంగు త్రిఫలా నతం తాలీసపద్మకౌ
ఏలా పత్రం వరీ నాగం జాతీకుసుమధాన్యకమ్
మంజిష్ఠా దాడిమం దారు రేణుకం శైలవాలుకమ్
విడంగం జీరకం చైవ పేషయిత్వా వినిక్షిపేత్
వస్త్రపూతే చ శీతే చ శర్కరాప్రస్థసంయుతమ్
నిధాపయేత్ స్నిగ్ధభాండే మార్దే వా భాజనే శుభే
అస్యౌషధస్య సిద్ధస్య శృణువీర్య మతఃపరమ్
దేవదేవం నమస్కృత్య సంపూజ్య గణనాయకమ్
పిబేత్ పాణితలం తస్య వ్యాధిం వీక్ష్యానుపానతః
సర్వవాతవికారేషు అపస్మారే విశేషతః
పక్షాఘాతే తథోన్మాదే ఆధ్మానే కోష్ఠసంగ్రహే
కర్ణరోగే శిరోరోగే బాధిర్యే చాపతంత్రకే
భూతోన్మాదే చ గృధ్రస్యాం సోదరే చాక్షివాతజే
పార్శ్వశూలే చ హృచ్ఛూలే బాహ్యాయామార్దితే తథా
వాతకంటకహృద్రోగమూత్రకృచ్ఛ్రే సపంగుకే
క్రోష్టుశీర్షే తథా ఖంజే కుబ్జే చాఢ్యాని మిన్మనే
అపతానేంతరాయామే రక్తపిత్తే తథోర్ధ్వగే
అనాహార్యోవికారేషు చాతుర్థకజ్వరేపి చ
మానుగ్రహే తథా శోషే క్షీణే చైవాపబాహుకే

దండాపతానకే భగ్నే దాహే చాక్షేపకే తథా
జీర్ణజ్వరే విషే కుష్ఠే శేఫస్తంభే మదాత్యయే
అథ్యవాతేగ్నిమాంద్యే చ వాతరక్తగదేషు చ
ఏకాంగరోగిణే చైవ తథా సర్వాంగరోగిణే
హస్తకంపే శిరఃకంపే జిహ్వాస్తంభే జడే భ్రమే
క్షీణేంద్రియే నష్టశుక్రే శుక్రనిస్సరణే తథా
స్త్రీణాం వాతాస్రపాతే చ పటలే చాక్షిస్పందనే
ఏకాంగస్పందనే చైవ సర్వాంగస్పందనే తథా
నాగాదిపతితే వాతే స్త్రీణామప్రాప్తిహేతుకే
అభిచారికదోషే చ ధనసంతాపసంభవే
యే వాతప్రభవా రోగా యే చ పిత్తసముద్భవాః
శిరోమధ్యగతా యే చ జంఘాపార్శ్వాదిసంస్థితాః
మాతృగ్రహాభిభూతశ్చ శిశుర్యచ్ఛ విశుష్యతి
ప్రక్షీణబలమాంసశ్చ నవర్త్మగమనక్షమః
ఘృతే నానేన సిధ్యంతి వజ్రముక్తిరివాసురాన్
నిహంతి సకలాన్ రోగాన్ ఘృతం పరమదుర్లభమ్
రసాయనం వహ్నిబలప్రదం చ
వపుఃప్రకర్షం విదధాతి రూపమ్
దత్త్వాబలేంద్రేణ సమానతేజా
దీర్ఘాయుషం పుత్రశతం కరోతి
స్త్రీణాం శతం గచ్ఛతి చాతిరేకం
న యాతి తృప్తిం సరసం సమాంగః
అపుత్రిణీ పుత్రశతం కరోతి
శతాయుషం కామసమం బలిష్ఠమ్
మహాఘృతం నామ తు ఛాగలాద్యం

వినిర్మితం వాతవిషూదనం చ
శివం శుభం రోగభయాపహం చ
చకార హారీతముని ర్మహర్షిః ॥

నపుంసకంమేకమాంసం నూరుపలాలు మెత్తగానరికించి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకుని వుంచుకునేది. దశమూలాలున్నూ అన్నీ కలిపి నూరుపలాలు మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకుని వుంచుకునేది. పెన్నేరున్నూ నూరుపలాలు మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకుని వుంచుకునేది. బల నూరుపలాలు మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసివుంచుకునేది.

ఈనాలుగు కషాయాలున్నూ, రెండు ఆఢకాల ఆవునెయ్యిన్నీ, రెండు ఆఢకాల ఆవుపాలున్నూ, రెండు ఆఢకాల పిల్లితేగల రసమున్నూ కలిపి పాత్రలో పోసి పొయ్యిమీద వుంచేది.

మునుబాల, యష్టిమధుకం, ద్రాక్షపండు, కాకోలి, క్షీరకాకోలి, నల్లగలువ, తుంగముస్తలు, చందనం, సన్నరాస్న, మాషపర్ణి, ముద్గపర్ణి, పాలసుగంధి, నల్లసుగంధి, మేద, మహామేద, చెంగల్వకోష్టు, జీవకం, ఋషభకం, కచ్చూరాలు, మానుపసుపు, ప్రేంకణాలు, కరక, తాడకాయ, ఉసిరికపప్పు, గ్రంథితగరం, తాళీసపత్రికం, పద్మకాష్ఠం, ఏలకులు, ఆకుపత్రికం, పిల్లితేగలు, నాగకేసరాలు, జాపత్రి, ధనియాలు, మంజిష్ఠ, దానిమ్మబెరడు, దేవదారు, రేణుకలు, మాతురుబుడమ, వాయువిడంగాలు, జీలకర్ర—ఇవి కల్కద్రవ్యాలు. ఇవన్నీ ఒక్కొక్కటి నాలుగేసితులాల చొప్పున వేసుకుని మెత్తగా దంచ నీళ్ళతో రుబ్బి, ఆముద్ద పొయ్యిమీద పెట్టివుంచిన ద్రవద్రవ్యాలలో కలిపి వండి వడబోసుకునేది. వడబోసిన తరవాత అందులో ఒక ప్రస్థం చక్కెర కలిపి జాగ్రత్త చేసి వాడుకునేది.

వయస్సునూ, బలమునూ, స్థితినిపట్టి యిది అరతులందాకా మోతాదు ఏర్పరుచుకోవచ్చును.

వాతవ్యాధులు, అపస్మారం, పక్షవాతం, ఉన్మాదం, ఆధ్మానం, మలబంధం, కర్ణరోగం, శిరోరోగం, బధిరత్వం, అపతంత్రకం, భూతోన్మాదం, గృధ్రసి, ఉదరవ్యాధులు, పార్శ్వశూల, హృచ్ఛూల, బాహ్యాయామం, అర్దితవాతం, వాతకంటకం, హృద్రోగం, మూత్రకృచ్ఛ్రం, కుంటితనం, క్రోష్టుకశీర్షం, ఖంజవాతం,

కుబ్జకవాతం, మూద్దమాటలు, అపతానం, అంతరాయామం, రక్తపిత్తం, ముఖ్యంగా ఊర్ధ్వగతరక్తపిత్తం, ఆనాహం, మూలశంకలు, చాతుర్థికజ్వరం, హనుస్తంభం, శోష, అపబాహుకం, దండాపతానకం, మంటలు, ఎముకలు విరగడం, ఆక్షేపకం, జీర్ణజ్వరాలు, విషదోషాలు, కుష్ఠు, శేఫస్తంభం, మదాత్యయం, అధ్యవాతం, అగ్నిమాంద్యం, వాతరక్తం, ఏకాంగవాతం, సర్వాంగవాతం, బాహుకంపం, శిరఃకంపం, జిహ్వాస్తంభం, భ్రమ, జడత్వం, ఇంద్రియక్షీణత, శుక్రనష్టం, ఋతుదోషాలు, పటలం, కళ్ళు అదరడం, ఏకాంగస్పందనం, సర్వాంగస్పందనం, గుర్రంఏనుగు మొదలైన వాహనాల మీదనుంచి పడ్డప్పుడు సంభవించే వాతప్రకోపం, కోరిన స్త్రీ లభించనందున కలిగే శారీరక మానసిక బాధలు, అభిచారికదోషాలు, ధననష్టంవల్ల కలిగే సంతాపం, సమస్త వాతవ్యాధులు, సకలపిత్తవ్యాధులు, గ్రహబాధలు, ఇది అమోఘంగా పోగొడుతుంది. చిక్కిపోయిన పిల్లలకు, రక్తమాంసాలు క్షీణించినవారికి, నడవశక్తిలేనివారికి ఈఘృతం మిక్కిలీ మేలుచేస్తుంది.

ఇది గొప్పరసాయనం. మిక్కిలీ అగ్నిదీప్తి కలిగించి, శరీరపుష్టీ, సౌందర్యమూ, వీర్యవృద్ధీ అధికంచేస్తుంది. ఇది చాలాకాలం పుచ్చుకున్న పురుషుడు అనేక మంది స్త్రీలతో రమించగలుగుతాడు. వంధ్యాస్త్రీలు సంతానఫలం పొందుతారు.

గమనిక:— స్త్రీ సంతానవంతురాలు కాకపోతే. మనలో దోషం అంతా స్త్రీదే అనే భావం వుంది. అనేకులు స్త్రీకి మాత్రమే చికిత్సచేయిస్తారు. అనేక మంది స్త్రీలకు భూతచికిత్సా, తీర్థయాత్రలూ కూడా చేయించే అచారం కూడా మనలో వుంది. అయితే చాలాచోట్ల సంతానం కలగని లోపం పురుషులవల్ల కూడా సంభవిస్తూవుంటుంది. ఇది గుర్తించినవారూ, చికిత్సకు అంగీకరించే పురుషులూ కూడా చాలా అరుదుగా వుంటారు. నాఅనుభవం చెబుతాను. నేను అయిదారు స్థలాలలో స్త్రీలకేకాక పురుషులకునూ, చికిత్స చేశాను. అంతకుపూర్వం స్త్రీలకెన్ని చికిత్సలు చేసినా కలగని సంతానం పురుషులకు కూడా చికిత్స చేశాక కలిగింది. తరుచు సంతానం కలిగి నష్టపోయే సందర్భాల్లో కూడా నేను ఉభయులకూ చికిత్స చేశాను. తన్మూలంగా కలిగిన సంతానం నిలిచివుంది. నేను వాడిన ఔషధాలు ముఖ్యంగా స్త్రీలకు కుమారకల్పద్రుమఘృతమూ, పురుషులకు ఈబృహచ్ఛాగలాది ఘృతమూనూ, పురుషులకు ఇది చెయ్యగల మేలు, నాఅనుభవంలో, సిద్ధమకరధ్వజం కూడా చెయ్యలేదు. వైద్యసోదరులు ఇది పరిశీలించి చూస్తారని నమ్ముతున్నాను.

## ౮ పునర్నవా ఘృతం

**పునర్నవాతులాం గృహ్యా జలద్రోణే విపాచయేత్**
**చతుర్భాగావశేషేణ ఘృతప్రస్థం విపాచయేత్**

భూనింబవిజ యాశుంఠీశోథఘ్నా మరదారుభిః
కాసం శ్వాసం జ్వరం హంతి శోథం చాపి సుదారుణమ్ ॥

గలిజేరు నూరుపలాలు మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్లలో కలిపి నాలుగో వంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. అందులో రెండుప్రస్థాల ఆవునెయ్యి చేర్చేది.

నేలవేము, గంజాయి, సొంటి, తెల్లగలిజేరు, దేవదారు—ఇవి కల్కద్రవ్యాలు ఇవి ఒక్కొక్కటి నాలుగేసి తులాల చొప్పున గ్రహించి మెత్తగా దంచి నీటితో రుబ్బి ఆకషాయంలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది దగ్గులు, వగర్పులు, ఉబ్బు, జ్వరం పోగొడుతుంది.

## ఛా గా ది ఘృ త ం

అజామాంసం తులామానం వాసకస్య పలం శతమ్
అశ్వగంధాపలశతం కటాహే సముధిక్షిపేత్
జలద్రోణే పృథక్పక్త్వా చతుర్భాగావశేషితైః
కషాయై ర్విపచే ద్ధవ్యం ప్రస్థద్వయమితం ఘృతమ్
ఛాగక్షీరం ఘృతసమం దద్యా త్కల్కాని యాని చ
అష్టవర్గః పంచమూలీ చాతుర్జాత శ్శతావరీ
త్రికటుత్రిఫలా యష్టీ విదారీ శాల్మలీ వచా
శంఖపుష్పీ సుధామూలీ ముసలీ చవికా తథా
కపికచ్ఛుకబీజం చ దీప్యా ఖదిరజీరకౌ
సూక్ష్మైలా మేథికా భార్ఙీ ప్రత్యేకం శుక్తిమానతః
సంగృహ్యా సాధయే త్సర్పిః శనై ర్మృద్వగ్నినా భిషక్
రాజయక్ష్మణి దుస్సాధ్యే సర్వకాసగదేషు చ
స్వరభేదే క్షయే కాసే ధ్వజభంగే జ్వరే తథా
ప్రమేహే మూత్రకృచ్ఛ్రే చ రక్తపిత్తే త్వరోచకే
ఛాగలాద్యఘృతం శస్తం సర్వరోగవినాశనమ్ ॥

మేకమాంసం నూరుపలాలు రెండుద్రోణాల నీళ్ళలోకలిపి కాచి వడబోసుకుని వుంచుకునేది. అడ్డసరపుపట్ట నూరుపలాలు చితకగొట్టి రెండుద్రోణాల నీళ్లలో కలిపి కాచి వడబోసి వుంచుకునేది. పెన్నేరు నూరుపలాలు మెత్తగా దంచి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి కాచి వడబోసివుంచుకునేది. ఇవి మూడూ చేర్చి అందులో నాలుగుప్రస్థాల ఆవునెయ్యి, మేకపాలు నాలుగుప్రస్థాలూ కలిపేది.

మేద, మహామేద, జీవకం, ఋషభకం, ఋద్ధి, వృద్ధి, కాకోలి, క్షీరకాకోలి, మారేడు, దుండిగం, పెగ్గుమ్మడి, కలిగొట్టు, తక్కోల, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు, పిల్లితేగలు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకతాడిఉసిరికలు, యష్టిమధుకం, నేలగుమ్మడు, బూరుగుపట్ట, వస, శంఖపుష్పి, సాలామిశ్రి, నేలతాడి, చవ్యం, దూలగొండివిత్తులు, వాము, చంద్రచేవ, జీలకర్ర ఏలకులు, మెంతులు, గంటుభారంగి,—ఇవి కల్క ద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి నాలుగేసి తులాల చొప్పున చేర్చుకుని మెత్తగా దంచి నీటితో రుబ్బి—యీముద్ద ఆర్ద్రవద్రవ్యాలలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది రాజయక్ష్మ, దగ్గులు, స్వరభేదం, క్షయ,ధ్వజభంగం, జ్వరం, ప్రమేహం, మూత్రకృచ్ఛ్రం, రక్తపిత్తం, అరోచకం ఇవి పోగొడుతుంది.

## ౧౦ కుంకుమాదిఘృతం

మధుకం క్షీరకాకోలీ దుర్వార్యా దశమూలికా
తులామానాని సర్వాణి జలద్రోణే పచే త్పృథక్
పాదావశేషితైః క్వాథై ర్ఘృతం కుంకుమమూర్ఛితమ్
ఘృతా చ్చతుర్గుణం చాజం క్షీరం దత్వా విపాచయేత్
ద్రవ్యాణి యాని పేష్యాణి తాని వక్ష్యా మ్యతఃపరమ్
జీవనీయగణో ముస్తం లవంగం కుంకుమం వచా
నీలోత్పలం బలా వ్యోషం పృశ్ని పర్ణీ హరేణుకా
చన్మకాగాలుక శ్ఛిన్నా ప్రియంగు శ్శైలవాలుకమ్
ఏలాద్వయం తుగా ధాత్రీ ప్రసూనం మాలతీభవమ్
హపుషా చవికా పత్రం తాళీసం నాగకేసరః
వరదా జీరకౌ దీప్యా ప్రత్యేకం కర్షసమ్మితః

సర్వా ణ్యేతాని సంహృత్య శనై ర్మృద్వగ్నినా పచేత్
హంతి యక్ష్మాణ మత్యుగ్రం కాసం శ్వాసం క్షయం జ్వరమ్
రక్తపిత్తం ప్రమేహం చ కుంకుమాదిఘృతం శుభమ్ ॥

యష్టిమధుకం, క్షీర కాకోలి, వాకుడు, దశమూలాలు.—ఇవి నాలుగూ ఒక్కొక్కటి నూరేసి పలాలు మెత్తగా దంచి రెండేసి ద్రోణాల నీళ్ళలో కలిపి వేరువేరుగా నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసివుంచుకునేది.

మనుబాల జీవకం. ఋషభకం. మేద, మహా మేద, కాకోలి. క్షీర కాకోలి, యష్టి మధుకం, మాషపర్ణి. ముద్గపర్ణి, తుంగముస్తలు, లవంగాలు, కుంకమపువ్వు, వస, నల్ల కలువ, జల, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, పృశ్నిపర్ణి, రేణుకలు, నేలగుమ్ముడు, తిప్ప తీగ, ప్రేంకణాలు, కూతుసుబుడమ, చిన్న ఏలకులు, పెద్దయేలకులు, తవాక్షీరి, ఉసిరిక పప్పు, మాలతిపువ్వులు, బోడతరం, చవ్యం, ఆకుపత్రికం, తాళీసపత్రి, నాగకేసరాలు, పెన్నేరు, జీలకర్ర, వాము,—ఇవి కల్కద్రవ్యాలు—ఇవి ఒక్కొక్కటి కర్షం చొప్పునచేర్చుకుని మెత్తగా దంచి నీటితో రుబ్బి వుంచుకోవాలి.

ఇలాగ పైని చెప్పిన నాలుగు కషాయాలూ, ఈకల్కంముద్దా, కుంకమపూవు తో మూర్ఛితం అయిన ఆవునెయ్యి నాలుగుప్రస్థాలూ, నేతికి నాలుగురెట్లు మేక పాలూ—ఇవన్నీ కలిపి వండి వడబోసుకునేది.

ఇది క్షయ, కాస, శ్వాస, రాజయక్ష్మ, జ్వరం, రక్తపిత్తం, ప్రమేహాలు పోగొడుతుంది.

## ౧౧ సా ర స్వ త ఘృ త ం

సమూలం పత్ర మాదాయ బ్రాహ్మీం ప్రక్షాళ్య వారిణా
ఉలూఖలే క్షోదయిత్వా రసం వస్త్రేణ గాలయేత్
రసే చతుర్గుణే తస్మిన్ ఘృతప్రస్థం విపాచయేత్
ఔషధాని తు పేష్యాణి తానీమాని ప్రదాపయేత్
హరిద్రా మాలతీ కుష్ఠం త్రివృతా సహరీతకీ
ఏతేషాం పలికాన్ భాగాన్ శేషాణి కార్షికాని చ
పిప్పల్యోథ విడంగాని సైంధవం శర్కరా వచా

సర్వ మేత త్సమాలోడ్య శనై ర్మృద్వగ్నినా పచేత్
ఏత త్ప్రాశితమాత్రేణ వాగ్విశుద్ధిః ప్రజాయతే
సప్తరాత్రప్రయోగేణ కిన్నరైః సహగీయతే
అర్ధమాసప్రయోగేణ సోమరాజీవపుర్భవేత్
మాసమాత్రప్రయోగేణ శ్రుతమాత్రం తు ధారయేత్
హంత్యష్టాదశకుష్ఠాని అర్శాంసి వివిధాని చ
పంచ గుల్మాన్ ప్రమేహాంశ్చ కాసం పంచవిధం తథా
వంధ్యానా మపి నారీణాం నరాణా మల్పరేతసామ్
ఘృతం సారస్వతం నామ బలవర్ణాగ్నివర్ధనమ్ ॥

సరస్వతీ తీగ పచ్చిది సమూలంగా తెచ్చి కడిగి రోటిలో వేసిదంచి స్వరసం తియ్యాలి. అది యెనిమిది ప్రస్థాలు. ఆవునెయ్యి రెండుప్రస్థాలు.

పసుపు, మాలతీపుష్పం, చెంగల్వకోష్టు, తెగడ, కరకవొలుపు—ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్కపలం. పిప్పళ్లు, వాయువిళంగాలు, సైంధవలవణం, చక్కెర, వస—ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క కర్షం. ఇవి కల్కద్రవ్యాలు. ఇలాగ యీపది వస్తువులూ మెత్తగా దంచి సైంధవం తప్పించి మెత్తగా నీళ్ళతో నూరి అముద్ద పైనిచెప్పిన ద్రవద్రవ్యాలలో కలిపి వండి వడబోసుకు నేది.

ఇది పుచ్చుకుంటే వాక్శుద్ధి కలుగుతుంది. ఏడురాత్రులు పుచ్చుకున్నంతమాత్రాన కిన్నరులతో సమంగా పాడగలడు. రెండువారాలు పుచ్చుకున్నంతమాత్రాన శరీరానికి చంద్రకాంతివంటి వర్చస్సు కలుగుతుంది. ఒక్కనెలదినాలు పుచ్చుకున్నంత మాత్రాన ఏమయినా ఒక్కమాటు వింటే మళ్ళీ చదవగలడు. అంటే ఏకసంథాగ్రాహి కాగలడు.

మరిన్నీ, యిది, అష్టాదశకుష్ఠరోగాలు, రకరకాల మూలశంకలు, అయిదు గుల్మాలు, ప్రమేహాలు, దగ్గులు పోగొడుతుంది. పురుషులకు వీర్యవృద్ధి కలిగిస్తుంది స్త్రీలకు సంతానలాభం కలిగిస్తుంది. బలమూ, శరీరకాంతీ, అగ్నిదీప్తి కలిగిస్తుంది.

ఇప్పటివారు దీన్ని బ్రాహ్మీఘృతం అని వాడుతున్నారు.

## ౧౨ వ్యాఘ్రీ ఘృ త ం

వ్యాఘ్రీస్వరసవిపక్వం రాస్నావాట్యాలగోక్షురవ్యోషైః
సర్పి స్స్వరోపఘాతం హన్యా త్కాసం చ పంచవిధమ్
శుష్కద్రవ్య ముపాదాయ స్వరసానా మసంభవే
వారిణ్యష్టగుణే సాధ్యం గ్రాహ్యం పాదావశేషితమ్ ॥

సన్నరాస్న, బల, పల్లేరువేళ్ళు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు—ఇవి కల్కద్రవ్యాలు. ఇవన్నీ సమభాగాలుగా గ్రహించుకోవాలి ఇవన్నీ కలిపి యెంతో అంతకు నాలుగు రెట్లు ఆవునెయ్యి. ఆవునేతికి నాలుగురెట్లు వాకుడు స్వరసం. కల్కద్రవ్యాలు యథాప్రకారంగా మెత్తగా దంచి నీళ్ళతో నూరి ద్రవద్రవ్యాలలో కలపాలి. వాకుడు పచ్చిది దొరకకపోతే ఎండుది తెచ్చి మెత్తగా చితకగొట్టి, దాని కెనిమిదిరెట్లు నీళ్ళు చేర్చి నాలుగోవంతుమిగిలేటట్టు కాచి వడబోసుకునేది. అకషాయమే ఆవు నేతికి నాలుగురెట్లు చేర్చుకునేది.

ఈఘృతం స్వరోపఘాతం పోగొడుతుంది. అంటే ఇది పుచ్చుకుంటే బొం గురుపోయిన కంఠం బాగుపడుతుంది. స్వరానికి మాధుర్యమున్నూ కలుగుతుంది. మరిన్నీ యిది పంచకాసలనున్నూ పోగొడుతుంది.

## ౧౩ పంచతిక్త ఘృతం

వృషనింబామృతా వ్యాఘ్రీపటోలానాం కృతేన చ
కల్కేన పక్వం సర్పి స్తు నిహన్యా ద్విషమజ్వరాన్
పాండు కుష్ఠం విసర్పం చ క్రిమీ నర్శాంసి నాశయేత్ ॥

అడ్డసరం (పచ్చిది), వేపపట్ట, తిప్పతీగ, వాకుడు, చేదుపొట్ల—ఇవి పంచతిక్తాలు ఇవి అయిదూ సమభాగాలుగా గ్రహించాలి. వీటికి నాలుగురెట్లు ఆవునెయ్యి నేతికి నాలుగురెట్లు మంచినీళ్లు. కల్కద్రవ్యాలు మెత్తగా దంచి చూర్ణంచేసి నీళ్ళతో రుబ్బి ద్రవద్రవ్యాలలో చేర్చుకుని వండి వడబోసుకునేది.
ఇది విషమజ్వరాలు, పాండువు, కుష్ఠులు, విసర్పం, క్రిములు, మూలశంకలు పోగొడు తుంది. (రక్తశుద్ధికి వాడేవాటిలో ఇదొకటి)

## ౧౪ పంచతిక్త గుగ్గులు ఘృతం

నింబామృతా వృషపటోలనిదిగ్ధికానాం
భాగాన్ పృథగ్దశపలాన్ విపచే ద్ఘటేపామ్
అష్టాంశశేషితరసేన సునిశ్చితేన
ప్రస్థం ఘృతస్య విపచే త్పిచుభాగకల్కైః
పాఠా విడంగ సురదారు గజోపకుల్యా
ద్విక్షార నాగర నిశా మిషి చవ్య కుష్ఠైః
తేజోవతీ మరిచ వత్సక దీప్య కాగ్ని
రోహిణ్యరుష్కర వచా కణమూలయుక్తైః
మంజిష్ఠయాతివిషయా వరయా యవాన్యా
సంశుద్ధగుగ్గులు పలై రపి పంచసంఖ్యైః
తత్సేవితం విధమతి ప్రబలం సమీరం
సంధ్యస్థిమజ్జగత మప్యథ కుష్ఠ మీదృక్
నాడీవ్రణార్బుదభగందరగండమాలా
జత్రూర్ధ్వసర్వగదగుల్మగుదోత్థమేహాన్
యక్ష్మారుచిశ్వసనపీనసకాసశోష
హృత్పాండురోగగలవిద్రధివాతరక్తమ్ ॥

ముందుగా అయిదుపలాల మహిషాక్షిగుగ్గులు గుడ్డను మూటగట్టి త్రిఫలకషాయంతో డోలాయంత్రవిధిగా స్విన్నంచెయ్యాలి. తరవాత వేపపట్ట 10 పలాలు, తిప్పతీగ 10 పలాలు, అడ్డసరపుపట్ట 10 పలాలు, చేదుపొట్ల సమూలం పదిపలాలు, వాకుడు సమూలం 10 పలాలు మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాలనీళ్ళలో కలిపి ఎనిమిదో వంతు మిగిలేటట్టు కాచి వడబోసుకోవాలి. స్విన్నం అయిన గుగ్గులుమూట ఆగుడ్డతోటే యీకషాయం కాగేటప్పుడు అందులో వేస్తే కరిగిపోతుంది. కషాయం వేడిగా వుండగానే వడబోసుకునేది. గుగ్గులు పూర్తిగా కరిగివుండకపోతే కషాయంలో మూటమూటగానే వుండగా పిసికితే కలిసిపోతుంది.

పాఠ, వాయువిడంగాలు, దేవదారు, గజపిప్పలి, సర్జక్షారం, యవక్షారం, సొంటి, పసుపు, సదాప, చెవ్యం, చెంగల్వకోష్టు, జ్యోతిష్మతి, మిరియాలు, కొడిశపాల విత్తులు, జీలకర్ర, చిత్రమూలం, కటుకరోహిణి, జీడిగింజలు, వస, పిప్పలిమోడి, మంజిష్ఠ, అతివస, కరక, తాడి, ఉసిరికలు, వాము,—ఇవి కల్కద్రవ్యాలు. ఇవన్నీ మెత్తగా చూర్ణించి నీళ్ళతో రుబ్బి, యీముద్దా, రెండుప్రస్థాల ఆవునెయ్యీ ఆకషాయంలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది వాతరక్తం, కుష్టు, పోగొడుతుంది. కుష్టువు, సంధిగతం అయినా, అస్థిగతం, అయినా, మజ్జాగతం అయినా ఇది నశింపచేస్తుంది. మరిన్నీ, నాడీవ్రణం, అర్బుదం, భగందరం, గండమాల, ఊర్ధ్వజత్రురోగాలు, గుల్మం, మూలశంకలు, మేహం, రాజయక్ష్మ, అరుచి, వాతం, పీనస, కాస, శోష, హృద్రోగం, పాండువ్యాధి, గళవిద్రధి—వీటినిన్నీ జయిస్తుంది.

## ౧౫ భూనింబాదిఘృతం

భూనింబ నింబ త్రిఫలా పటోల
కరంజ జాతీ ఖదిరాశనానామ్
సతోయ కల్కైర్ఘృత మాశు పక్వం
సర్వోపదంశాపహరం ప్రదిష్టమ్ ॥

నేలవేము, వేపపట్ట, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, చేదుపొట్ల, గానుగవిత్తులు, జాపత్రి, చంద్రచేవ, నల్లమద్దిపట్ట—ఇవి ఒక్కొక్కటి ఎనిమిదేసిపలాలు వేసుకుని మెత్తగా దంచి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది.

అందులో రెండుప్రస్థాలు ఆవునెయ్యి చేర్చేది.

నేలవేము, వేపపట్ట, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, చేదుపొట్ల, కానుగవిత్తులు, జాపత్రి, చంద్రచేవ, నల్లమద్దిపట్ట—ఇవి కల్కద్రవ్యాలు. (కషాయద్రవ్యాలున్నూ ఇవే. పరిమాణం మాత్రమే భేదం) ఈకల్కద్రవ్యాలు ఒక్కొక్కటి ఒక్కొక్క పలం చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి నీటితో రుబ్బి ఈముద్దగూడా కషాయంలోకలుపుకుని వండి వడబోసుకునేది.

సకలవిధాల సవాయివ్యాధులూ దీంతో నశించి పోతాయి.

## ౧౬. బృహత్పంచగవ్యఘృతం

ద్వేపంచమూలే త్రిఫలాం రజన్యౌ కుటజత్వచమ్
సప్తపర్ణ మపామార్గం నీలినీం కటురోహిణీమ్
శంపాకం ఫల్గుమూలం చ పౌష్కరం సదురాలభమ్
ద్విపలాని జలద్రోణే పక్త్వా పాదావశేషితే
భార్గీ పాఠా త్రికటుకం త్రివృతా నిచులాని చ
శ్రేయసీ చాఢకీ మూర్వా దంతీ భూనింబచిత్రకౌ
ద్వే శారిబే రోహితకం భూతీకాం మదయంతికామ్
క్షిపేత్పిష్ట్వాక్షమాత్రాణి తైః ప్రస్థం సర్పిషః పచేత్
గోశకృద్రసదధ్యమ్లక్షీరమూత్రైశ్చ తత్సమైః
పంచగవ్య మిదం ఖ్యాతం మహ త్తదమృతోపమమ్
అపస్మారే జ్వరే కాసే శ్వయథౌ వుదరే తథా
గుల్మార్శఃపాండ్వరోగేషు కామలాయాం హలీమకే
అలక్ష్మీగ్రహరక్షోఘ్నం చాతుర్థకవినాశనమ్ ॥

మారేడువేరుపట్ట, దుండిగం, పెద్దుమ్మడు, కలిగొట్టు, తక్కోల, శాలిపర్ణి, పృశ్నిపర్ణి, వాకుడు, నేలములక, పల్లేరు, కరకతాడి ఉసిరికలు, పసుపు, మానుపసుపు, కొడిశచెక్క, సప్తపర్ణి, ఉత్తరేణివేళ్ళు, నీలిచెట్టువేళ్ళు, కటుకరోహిణి, రేలచెక్క, కాకోదుంబరికవేళ్లు, పుష్కరమూలం, దూలగొండివేళ్లు,—ఇవి ఒక్కొక్కటి రెండేసిపలాలు చేర్చుకుని, మెత్తగా దంచి రెండుద్రోణాలనీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. ఇందులో రెండుప్రస్థాలు ఆవునెయ్యి, రెండుప్రసాలు గోమయరసం, రెండుప్రస్థాలు ఆవుపెరుగుమీదితేట, రెండుప్రస్థాలు ఆవుపాలు, రెండుప్రస్థాలు గోమూత్రం కలిపేది.

గంటుభారంగి, పాఠ, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, తెగడ, ప్రబ్బలి, గజపిప్పలి, చిరికందులు, చాగనార, నేపాళపువేళ్ళు, నేలవేము, చిత్రమూలం, పాలసుగంధి, నల్లసుగంధి, ములుమోదుగుపట్ట, వాము, అడవిమల్లె—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క కర్షం చొప్పున గ్రహించి మెత్తగా దంచి నీళ్ళతో రుబ్బి ఆద్రవద్రవ్యాలలో కలిపి వండివడబోసుకునేది.

ఇది అపస్మారం, జ్వరం, దగ్గులు, ఉబ్బు, ఉదరవ్యాధులు, గుల్మం, మూలశంక, పార్శ్వశూలం, కామెర్లు, హలీమకం, గ్రహబాధలు, చాతుర్థికజ్వరమూ పోగొడుతుంది.

## ౧౭ మహాదాడిమాది ఘృతం

దాడిమస్య ఫలప్రస్థం ప్రస్థం చ యవతండులమ్
కులుత్థప్రస్థ మాదాయ ఘృతప్రస్థం విపాచయేత్
శతావరీరసప్రస్థం గవ్యదుగ్ధం చ తత్సమమ్
కల్కైః సార్థం పిచు ర్ద్రాక్షా ఖర్జూరం త్రిఫలా తథా
రేణుకా చాష్టవర్గం చ దేవదారు నిశాద్వయమ్
జింగీ కుష్ఠక మేలా చ విదా ర్యతిబలా తథా
శిలా త్వచ ముశీరం చ శుద్ధం కృష్ణాభ్రచూర్ణకమ్
ప్రమేహా న్వింశతిం హంతి శ్లేష్మజాన్ సన్నిపాతజాన్
బృంహాణాం చ విశేషేణ సర్వమేహహరం పరమ్
అశ్విభ్యాం నిర్మితం సిద్ధం దాడిమాద్య మిదం మహత్ ॥

ఒక ప్రస్థం దానిమ్మపళ్ళు మెత్తగాదంచి యెనిమిది ప్రస్థాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. యవలు ఒకప్రస్థం మెత్తగా చితకగొట్టి యెనిమిదిప్రస్థాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. నల్ల ఉలవలు ఒకప్రస్థం మెత్తగా చితకగొట్టి యెనిమిది ప్రస్థాల నీళ్ళలోకలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది ఈమూడు కషాయాలూ, రెండు ప్రస్థాల పిల్లితేగలరసం, రెండుప్రస్థాలు ఆవుపాలు, రెండుప్రస్థాల ఆవునెయ్యి— ఇవన్నీ కలిపేది.

ద్రాక్షపండు, ఖర్జూరపుకాయలు, కరక, తాడికాయ, ఉసిరికలు, రేణుకలు, మేద, మహామేద, జీవకం, ఋషభకం, ఋద్ధి. వృద్ధి, కాకోళి, క్షీరకాకోళి, దేవదారు, పసుపు, మానుపసుపు, మంజిష్ఠ, చెంగల్వకోష్టు, ఏలకులు, నేలగుమ్ముడు, అతిబల, గోమూత్రశిలాజిత్తు, దాల్చినిచెక్క, వట్టివేరు, కృష్ణాభ్రకం—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి మూడేసితులాలు గ్రహించి మెత్తగా దంచి, నీళ్ళతో రుబ్బి ఆద్రవద్రవ్యాలలో కలుపుకుని వండి వడబోసుకునేది.

ఇది ఇరవైప్రమేహాలూ, నానారకాలూ పోగొడుతుంది. శరీరానికిపుష్టి కలిగి స్తుంది.

## ౧౮ అమృతప్రాశఘృతం

ఛాగమాంసతులాం చైవ వాజిగంధాం తథైవ చ
జలద్రోణే విపక్తవ్యం కుర్యాత్పాదావశేషితమ్
ఘృతప్రస్థం పచేత్తేన ఛాగీక్షీరం చతుర్గుణమ్
మూర్ఛనార్థే ప్రదాతవ్యం కుంకుమం చ ద్వికార్షికమ్
బలామూలం చ గోధూమం చాశ్వగంధా తథామృతా
గోక్షురం చ త్రికటుకం కశేరుం చ సధన్యకమ్
తాలాంకురం త్రైఫలం చ కస్తూరీ బీజవానరీ
మేదే ద్వే చ తథా కుష్ఠం జీవకర్షభకా శటీ
దార్వీ ప్రియంగు మంజిష్ఠా నతం తాలీసపత్రకమ్
ఏలా పత్రం త్వచం నాగం జాతీకుసుమరేణుకమ్
సరళం జాతికోశం చ సూక్ష్మైలోత్పలశారిబా
మూలం బింబన్య జీవంతీ ఋద్ధి వృద్ధీ ఉదుంబరమ్
ప్రత్యేకం కర్షమాత్రాణి పేషయిత్వా వినిక్షిపేత్
వస్త్రపూతే సుశీతే చ సితాం దద్యాచ్ఛరావకమ్
కర్షమాత్రం తతః ఖాదేదుష్ణదుగ్ధానుపానతః
బృంహణీయం విశేషేణ బలపుష్టికరం సదా
ప్రమేహాన్ ధ్వజభంగాంశ్చ నాశయేదవికల్పతః
ఏతద్వృష్యకరం సర్పిః కాశీరాజేన నిర్మితమ్
దృష్టం సిద్ధఫలం హ్యేతద్వాజీకరణముత్తమమ్
అమృతప్రాశనామేదం సర్వామయనిషూదనమ్
శిరోరోగే నష్టశుక్రే స్త్రీషు నష్టార్తవాసు చ
న చ శుక్రం క్షయం యాతి బలం హానం న చ వ్రజేత్

కాసార్శ ఆమశూలఘ్నం కోష్టబద్ధహరం వరమ్
సిద్ధఘృతస్య యోగేన స్థిరం భవతి యౌవనమ్ ॥

మేకమాంసం నూరుపలాలు రెండు ద్రోణాలనీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసివుంచుకునేది. అలాగే నూరుపలాల పెన్నేరున్నూ మెత్తగా చితకగొట్టి రెండు ద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసివుంచుకునేది. ఈరెండుకషాయాలూ చేర్చి అందులో రెండు ప్రస్థాల ఆవునెయ్యి, ఎనిమిదిప్రస్థాల మేకపాలు కలిపి వుంచుకునేది. ఘృతమూర్ఛనకోసం అందులో నాలుగుతులాల కుంకమ పువ్వు కలిపివుంచుకోవాలి.

బల, గోధుమలు, పెన్నేరు, తిప్పతీగ, పల్లేరుకాయలు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, తుంగముస్తలు. ధనియాలు, మణిశిల, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు. కస్తూరి, దూలగొండిగింజలు, మేద, మహామేద, చెంగల్వకోష్టు, జీవకం, ఋషభకం, కచ్చూరాలు, మానుపసుపు, ప్రేంకణాలు, మంజిష్ట, గ్రంధిశగరం, తాలీసపత్రి, ఏలకులు, ఆకుపత్రికం, దాల్చినచెక్క, నాగకేసరాలు, జాపత్రి, రేణుకలు, సరళకాష్టం, జాజికాయ, చిన్నఏలకులు, నల్లకలువదుంప, సుగంధి, దొండవేరు, మునుబాల ఋద్ధి, వృద్ధి, మేడిపట్ట, —ఇవి కల్కద్రవ్యాలు.

ఇవన్నీ మెత్తగా దంచి, నీటితో రుబ్బి ఆద్రవద్రవ్యాలలో కలుపుకుని వండి వడబోసుకునేది. దానిలో అర్థప్రస్థం చక్కెరకూడా కలిపేది.

ఇది బృంహణం. అనగా చిక్కిపోయిన శరీరం రక్తమాంసాలు పెట్టి పుష్టి కలిగిస్తుంది. ప్రమేహాలు, ధ్వజభంగం పోగొడుతుంది. వీర్యపుష్టి కలిగిస్తుంది. వాజీకరౌషధాలలోఇది చాలా గొప్పది. శిరోరోగం, శుక్రనష్టం, స్త్రీల ఆర్తవదోషాలు, తగ్గిస్తుంది, ఇది పుచ్చుకున్న పురుషులకు ధాతుక్షీణత, బలహాని యెప్పుడూ కలగవు. దగ్గు మూలశంకలు, ఆమశూల, మలబంధం, కూడా పోగొడుతుంది.

## ౧౫ మ హా త్రి ఫ లా ది ఘృ త ం

త్రిఫలాయా రసప్రస్థం ప్రస్థం భృంగరజస్య చ
వృషస్య చ రస ప్రస్థం శతావర్యాశ్చ తత్సమమ్
అజాక్షీరం, గుడూచ్యాశ్చ ఆమలక్యా రసం తథా
ప్రస్థం ప్రస్థం సమాహృత్య సర్వై రేభి ర్ఘృతం పచేత్

కల్కః కణా సితా ద్రాక్షా త్రిఫలా నీల ముత్పలమ్
మధుకం క్షీరకాకోలీ మధుపర్ణీ నిదిగ్ధికా
తత్సాధుసిద్ధం విజ్ఞాయ శుభే భాండే నిధాపయేత్
ఊర్ధ్వపాన మధఃపానం మధ్యేపానం చ శస్యతే
యావంతో నేత్రరోగాంస్తాన్ పానా దేవాపకర్షతి
రక్తజే రక్తదుష్టే చ రక్తే చాతిస్రుతే పి చ
నక్తాంధ్యే తిమిరే కాచే నీలికాపటలార్బుదే
అభిష్యందే ధిమంథే చ పక్ష్మకోపే చ దారుణే
నేత్రరోగేషు సర్వేషు వాతపిత్తకఫేషు చ
అదృష్టిం మందదృష్టిం చ కఫవాతప్రదూషితామ్
సర్వతో వాతపిత్తాభ్యాం సకండ్వాసన్నదూరదృక్
గృధ్రదృష్టికరం సద్యో బలవర్ణాగ్నివర్ధనమ్
సర్వనేత్రామయం హన్యాత్ త్రిఫలాద్యం మహా ఘృతమ్ ।

త్రిఫలాల కషాయం ఒక ప్రస్థం, గుంటకర్ణిఆకురసం ఒకప్రస్థం, అడ్డసరంరసం ఒక ప్రస్థం, పిల్లితేగలరసం ఒకప్రస్థం, మేకపాలు ఒకప్రస్థం, తిప్పతీగకషాయం ఒక ప్రస్థం, ఉసిరికాయలరసం ఒకప్రస్థం, ఆవునెయ్యి ఒకప్రస్థం. ఈద్రవద్రవ్యా లన్నీ కలిపి ఉంచుకునేది.

పిప్పళ్లు, చక్కెర, ద్రాక్షపండు, కరకతాడిఉసిరికలు, నల్లకలువ, యష్టిమధుకం, క్షీరకాకోలి, తిప్పతీగ, వాకుడు—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి రెండేసి తులాల చొప్పున గ్రహించి చూర్ణించి నీళ్ళతో రుబ్బి ఆద్రవద్రవ్యాలలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది సర్వనేత్రవ్యాధులూ పోగొడుతుంది. వాతపిత్తకఫాలవల్లపుట్టిన నేత్రవ్యాధులనున్నూ పోగొడుతుంది. తీక్ష్ణమైన దృష్టికలిగిస్తుంది. బలం, కాంతి, అగ్నిదీప్తి కలిగిస్తుంది.

## ౨౦ కుంకుమాదిఘృతం

కుంకుమేన సితాభ్యాం చ కణయా వహ్నివారిణా
ఘృతం పక్వం సిరాకుర్యా న్నీలికాం ముఖదూషికామ్

సిధ్మార్శః త్వఙ్గదాన్ సర్వాన్ వ్యాధీన్ కఫసముద్భవాన్
శిరోఽర్తిం నాశయే చ్చాశు లావణ్యం జనయే త్పరమ్
జగతా ముపకారాయ దస్రాభ్యాం విహితం త్విదమ్
పానేభ్యంగే తథా నస్యే యుక్త్యా యోజ్యం విచక్షణైః ॥

కుంకుమపువ్వు, పసుపు, మానుపసుపు, పిప్పళ్లు— ఇవి నాలుగేసి తులాలు గ్రహించి మెత్తగా చూర్ణించి అది అర్థప్రస్థం ఆవునేతిలో కలిపేది, మరన్నీ ఆ నేతిలో చిత్రమూల కషాయం రెండుప్రస్థాలున్నూ కలిపి వండి వడబోసుకునేది.

ఇదిలోపలికి పుచ్చుకోవచ్చు. పైని పూసుకోవచ్చు. దీంతో నస్యం కూడా చేసుకోవచ్చు. ఇలా చేస్తే ఇది నీలిక మొదలైన ముఖరోగాలన్నీ తగ్గించేస్తుంది. చర్మవ్యాధులు పోగొడుతుంది. కఫం అణిచివేస్తుంది, తలనొప్పి తగ్గిస్తుంది. శరీరానికీ ముఖ్యంగా ముఖానికీ లావణ్యం కలిగిస్తుంది. స్నోలువగైరా పైపూతలకు ఆశపడటం కంటే ఇది ముఖానికి మర్దనాచేసుకుంటూ వుంటే చాలా ఎక్కువ లావణ్యం కలుగుతుంది.

## ౨౧ కుమారకల్పద్రుమఘృతం

పంచాశచ్ఛాగమాంసస్య దశమూల్యా స్తథైవ చ
జల మష్టగుణం దత్వా క్వాథయే న్మృదునాఽగ్నినా
చతుర్భాగావశేషం చ క్వాథం దద్యా త్ప్రయత్నతః
గవ్యం ప్రస్థద్వయం సర్పి ర్గృహ్ణీయా త్కుశలో భిషక్
క్షీరం ఘృతసమం దద్యా న్నారాయణ్యా రసం తథా
తామ్రే వా మృణ్మయే పాత్రే తదేకత్ర పచే చ్ఛనైః
కుష్ఠం శటీ చ మేదే ద్వే జీవకర్షభకా తథా
ప్రియంగు త్రిఫలా దారు పత్ర మేలా శతావరీ
కాశ్మరీ మధుకం క్షీరకాకోలీ ముస్త ముత్పలమ్
జీవనీ చందనం చైవ కాకోలీ శారిబాయుగమ్
శ్వేతవట్యాలజం మూలం మూలం చ శరపుంఖజమ్

విదారీద్వయమంజిష్ఠా పర్ణినీద్వయ మేవ చ
నాగపుష్పం తథా దారుహరిద్రా రేణుకం తథా
జ్యోతిష్మతీభవం మూలం శంఖినీ నీలినీ వచా
అగురుత్వగ్లవంగం చ కుంకుమం నిక్షిపే త్తతః
ఏతేషాం కార్షికం కల్కం దత్వా శుభదినే సుధీః
శుభనక్షత్రయోగే చ సంపూజ్య గణనాయకమ్
శంకరం చ మృడానీం చ నమస్కృత్యాతిభక్తితః
పాకం కుర్యా త్ప్రయత్నేన విజాన న్మంత్ర పూర్వకమ్
సిద్ధశీతే క్షిపే త్తత్ర పారదం పరినిర్మలమ్
సుజీర్ణం శోధితం చాభ్రం గంధకం కార్షికం న్యసేత్
తతః పుష్పరసం తత్ర ప్రస్థార్థం చ వినిక్షిపేత్
కాచసంపుటకే వాన్యపాత్రే వా స్థాపయే త్సుధీః
పరాశరమునిః ప్రీతికరుణావారిధి ర్ముదా
వంధ్యామయవినాశాయ శిశుకల్పద్రుమం ఘృతమ్
చకారాస్య ప్రసాదేన జన్మవంధ్యా లభే త్సుతమ్
ఖాదే త్కర్షద్వయం సర్పి ర్దత్వా విప్రాయ సాదరమ్
అనుపానం ప్రకుర్వీత పయ శ్ఛాగం విశేషతః
గవ్యం వాపి పిబే త్క్షీరం శీతం పలయుగం తథా
ఘృతస్యాస్య సుశిద్ధస్య గుణాన్ శృణు సమాహితః
అస్య ప్రసాదాత్ షండోపి వంధ్యాయాం జనయే త్సుతమ్
రజోదోషేణ యా దుష్టా శుక్రదోషేణ యోఽపి చ
స్త్రీ గర్భస్థగదే నైవ పీడితా యా చ సర్వదా
యా చ పుష్పం నవిందేత బుకునా పీడితా చ యా
భూత్వా భూత్వా చ నశ్యంతి సుతా యాసాం ముహుర్ముహుః
అనేకౌషధయోగేన మంత్రయోగేన వా పునః

అనేకవ్రతయోగేన యాసాం పుత్రో న జాయతే
తాసాం కామసమాః పుత్రా జాయంతే చిరజీవినః
ఏతత్ ఘృతం గృహే యస్య న తస్య కులిశాద్భయమ్
న రాక్షసైః పిశాచైశ్చ గృహ్యాతే తస్య బాలకః
నోపసర్పతి సర్పోఽపి దర్పాత్తస్య గృహాంతికమ్ ॥

మేకమాంసం యాభైపలాలూ, దశమూలాలు యాభైపలాలూ ఎనిమిది రెట్ల నీళ్ళలో వేసి నాలుగోవంతు మిగిలేటట్టు కషాయం కాచి చల్లారిన తరవాత వడబోసుకునేది. అందులో నాలుగుప్రస్థాల ఆవునెయ్యి చేర్చేది. ఆవుపాలు నాలుగుప్రస్థాలూ, పిల్లితేగల రసం నాలుగుప్రస్థాలూ కూడా అందులో చేర్చేది. ఇది ద్రవద్రవ్యం.

చెంగల్వకోష్టు, కచ్చూరాలు, మేద, మహామేద, జీవకం, ఋషభకం, క్షీరకాకోళి, కరకపోలువు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, దేవదారు, ఆకుపత్రికం, ఏలకులు, పిల్లితేగలు, పెగ్గుమ్మడు, యష్టిమధుకం, క్షీరకాకోళి, తుంగముస్తలు, నల్లకలువదుంప, మనుబాల, చందనం, కాకోళి, నల్లసుగంధి, తెల్లసుగంధి, బలామూలం, సొంపలివేళ్లు, నేలగుమ్మడు, మంజిష్ఠ, శాలిపర్ణి, పృశ్నిపర్ణి, నాగకేసరాలు, మానుపసుపు, రేణుకలు, జ్యోతిష్మతివేళ్లు, చోరపుష్పి, నీలివేళ్లు, వస, అగురుచెక్క, లవంగాలు, కుంకుమపువ్వు,—ఇవి కల్కద్రవ్యాలు, ఇవి ఒక్కొక్కటి కర్షం చొప్పున గ్రహించి మెత్తగా దంచి నీటితో రుబ్బి ద్రవద్రవ్యంలో కలిపి వండి చల్లారిన తరవాత రెండుతులాలు పాదరసమూ, రెండుతులాలు గంధకమూ కలిపి చేసిన కజ్జలీ రెండుతులాల కృష్ణాభ్రకభస్మమూ, ఒకప్రస్థం తేనే కలిపేది.

కషాయంలో వేసే మేకమాంసం నపుంసకమేక మాంసంగా వుండాలి. ఆడమేకదీ మొగమేకదీ కూడా పనికిరాదు.

ఇది గొడ్రాలితనం పోగొట్టే గొప్ప ఔషధం.

ఇది పూటకు పావులాయెత్తు చొప్పున మేకపాలలోగాని, అవి దొరకనియెడల ఆవుపాలలో గాని కలిపి పుచ్చుకునేది లేక పంచదారతో కలిపి నాకి, తరవాతనైనా పాలుపుచ్చుకునేది. ముందు మేకపాలు చూచుకునేది. అవి దొరకనియెడలనే ఆవుపాలు.

ఇది స్త్రీలూ పురుషులూ కూడా పుచ్చుకోవచ్చు. స్త్రీలకు మాత్రం ప్రధానం కొన్ని సందర్భాలలో పురుషులకు బృహచ్ఛాగలాది ఘృతం మంచిది.

ఇది సేవిస్తే నపుంసకునకున్నూ సంభోగశక్తే కాదు సంతానమున్నూ కలుగు.

తుంది. గొడ్రాలు బిడ్డలను కంటుంది. రజోదోషం పోగొడుతుంది. గర్భం నిలవని స్త్రీలకూ, బిడ్డలు బతకని స్త్రీలకూ ఇది చాలా మంచిది. గర్భం నిలవని స్త్రీలకూ, సంతానం నిలవని స్త్రీలకూ అనేకమందికి నేనిది వాడాను. ఈవివరాలు ఇంకా చూడదలిచేవారు బృహచ్ఛాగలాది ఘృతయోగంలో గమనిక చూసేది.

## ౨౨ అశ్వగంధా ఘృతం

పాదకల్కేశ్వగంధాయాః క్షీరే దశగుణే పచేత్
ఘృతం పేయం కుమారాణాం పుష్టికృద్బలవర్ధకమ్ ॥

పెన్నేరుదుంపకు నాలుగురెట్లు ఆవునెయ్యి. ఆవునేతికి పదిరెట్లు ఆవుపాలు. పాలతో సమం జలం. పెన్నేరు మెత్తగా దంచి నీటితో రుబ్బి అది ద్రవద్రవ్యంలో కలిపి వండివడబోసుకునేది.

చిక్కిపోతున్న పిల్లలకు ఇది చాలామంచిది. బలమూ పుష్టీ, తేజస్సూ కలిగించి ఇది వారిని దీర్ఘాయుష్మంతులను చేస్తుంది.

నాఅనుభవంలో ఇది అనేసులకు చాలా మేలుచేసింది. ఇది ఎంత తేలికగా కనపడుతుందో అంత ఘనమైనది. పిల్లలకు రకరకాల రసవీర్యవిపాకాలు గల అనేకమూలికలు కలిసిన మందులకంటే ఇది చాలా ఉత్తమం.

కొందరు పెన్నేరు చతుర్భాగావశిష్టంగా కషాయం తయారుచేసుకుని ఆకషాయం (కొలత) ఎంతో అంత కలకండపొడి కలిపి పాకం పట్టిన్నీ వాడతారు. సరియైన పాకం తయారైతే అయిదారుమాసాలు నిలుస్తుంది. నిరభ్యంతరంగానూ వాడుకోవచ్చు. అయితే, నెయ్యి అయితే పాకంకంటే ఎక్కువ పనిచేస్తుంది. రుచికోసం నేతిలో కూడా కలకండ కలుపుకోవచ్చు. ఇది బజారుబాలామృతాల కంటే చాలా శ్రేష్ఠం.

## ౨౩ బాలచాంగేరీ ఘృతం

చాంగేరీస్వరసే సర్పి శ్ఛాగక్షీరసమం పచేత్
కపిత్థ వ్యోష సింధూత్థ సమంగోత్పలవాలకైః
సబిల్వధాతకీమోచైః సిద్ధం సర్వాతిసారనుత్
గ్రహణీం దుస్తరాం హంతి బాలానాం తు విశేషతః ॥

ఏలగుజ్జు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, సైంధవలవణం, మంజిష్ట, నల్లకలువదుంప, కురువేరు, మారేడుపండు, ఆరెపువ్వు, బూరుగుబంక—ఇవి కల్క-ద్రవ్యాలు. ఇవి సమభాగాలుగా గ్రహించేది, వీటిమొత్తం ఎంతో దానికినాలుగురెట్లు ఆవునెయ్యి. అవునేతికి రెండురెట్లు పులిచింతాకురసం, పులిచింతాకురసంతో సమంగా మేకపాలు.

కల్క-ద్రవ్యాలు మెత్తగాదంచి నీళ్ళతోరుబ్బి ద్రవద్రవ్యాలలో కలిపి వండి వడబోసుకునేది.

ఇది గ్రహణీ, అతిసారమూ కడుతుంది. ఇది ముఖ్యంగా చంటిపిల్లలకోసం ఉద్దేశించబడ్డది.

## ౨౪ అష్టమంగళ ఘృతం

వచా కుష్ఠం తథా బ్రాహ్మీ సిద్ధార్థక మథాపి చ
శారిబా సైంధవం చైవ పిప్పలీ ఘృత మష్టమమ్
మేధ్యం ఘృత మిదం సిద్ధం పాతవ్యం చ దినేదినే
దృఢస్స్మృతిః క్షిప్రమేధాః కుమారో బుద్ధిమాన్ భవేత్
న పిశాచా న రక్షాంసి న భూతా న చ మాతరః
ప్రభవంతి కుమారాణాం పిబతా మష్టమంగలమ్ ॥

వస, చెంగల్వకోష్టు, సరస్వతీఆకు, తెల్లఆవాలు, సుగంధి, సైంధవలవణం, పిప్పళ్ళు—ఇవి కల్క-ద్రవ్యాలు. ఇవన్నీ సమభాగాలుగా 64తులాలు మొత్తం చేర్చుకునేది. ఈమొత్తం మెత్తగాచూర్ణించి నీటితో రుబ్బి రెండుప్రస్థాల ఆవునేతిలోకలిపి అందులో నాలుగుప్రస్థాల జలమున్నూ కలిపి వండి వడ బోసుకునేది.

దినమ్మూ ఇది చంటిపిల్లలకూ బాలబాలికలకూ ఇచ్చేది. దీనివల్ల మేధాశక్తి వృద్ధి చెందుతుంది. జ్ఞాపకశక్తి దృఢపడుతుంది. సూక్ష్మబుద్ధిన్నీ ఏర్పడుతుంది. గ్రహబాధలన్నీ తొలగిపోతాయి.

## ౨౫ ఫలకల్యాణ ఘృతం

మంజిష్ఠా మధుకం కుష్ఠం త్రిఫలా శర్కరా బలా
మేదే పయస్యా కాకోలీ మూలం చైవాశ్వగంధజమ్

అజమోదా హరిద్రే ద్వే హింగుః కటుకరోహిణీ
ఉత్పలం కుముదం ద్రాక్షా కాకోల్యౌ చందనద్వయమ్
ఏతేషాం కార్షికై ర్భాగై ర్ఘృతప్రస్థం విపాచయేత్
శతావరీరసక్షీరం ఘృతా ద్దేయం చతుర్గుణమ్
సర్పిరేత న్నరః పీత్వా నిత్యం స్త్రీషు వృషాయతే
పుత్రా న్సంజనయే న్నారీ మేధాఢ్యాన్ ప్రియదర్శనాన్
యా చైవాస్థిరగర్భా స్యా ద్యా చ వా జనయే న్మృతమ్
అల్పాయుషం వా జనయే ద్యా చ కన్యాం ప్రసూయతే
యోనిదోషే రజోదోషే పరిస్రావే చ శస్యతే
ప్రజావర్ధన మాయుష్యం సర్వగ్రహనివారణమ్
నామ్నా ఫలఘృతం హ్యేత దశ్విభ్యాం పరినిర్మితమ్
అనుక్తం లక్ష్మణామూలం క్షిపం త్యత్ర చికిత్సకాః ॥

మంజిష్ఠ, యష్టిమధుకం, చెంగల్వకోష్టు, కరకవాలుపు, తాడికాయబెరడు, ఉసిరిక పప్పు, చక్కెర, బల, మేద, మహామేద, కాకోళి, క్షీరకాకోళి, పెన్నేరు, అజమోదం, పసుపు, మానుపసుపు, ఇంగువ, కటుకరోహిణి, నల్లకలువదుంప, తెల్లకలువదుంప, ద్రాక్షపండు, చందనం, రక్తచందనం,- ఇవి కల్కద్రవ్యాలు. ఇవన్నీ మెత్తగా చితకగొట్టి నీళ్ళతో రుబ్బి ఉంచుకునేది.

ఆవునెయ్యి రెండుప్రస్థాలు. పిల్లితేగలరసం ఎనిమిది ప్రస్థాలు. ఆవుపాలు ఎనిమిది ప్రస్థాలు. ఇవి మూడూకలిపి ఆకల్కంముద్ద యిందులో చేర్చి వండి వడబోసుకునేది

ఇది స్త్రీలకు సంతానసౌభాగ్యం కలిగిస్తుంది. గొడ్రాళ్ళకు తప్పకుండా సంతాన ప్రాప్తి కలిగిస్తుంది. గర్భం నిలవని స్త్రీలకు, మృతశిశువులను కనే స్త్రీలకూ, శిశువులు తరచు చనిపోయే స్త్రీలకూ యిది చాలా మేలు చేస్తుంది. తరుచు ఆడపిల్లలనే కనే స్త్రీల కిది పురుషసంతతి కలిగిస్తుంది. యోనిదోషాలూ, రజోదోషాలూ, పరిస్రావమూ పోగొడుతుంది. ఆరోగ్యకరం.

## ౨౬ సోమఘృతం

సిద్ధార్థకం వచా బ్రాహ్మీ శంఖపుష్పీ పునర్నవా
పయస్యాభయయష్ట్యాహ్వాం కటుకా చ ఫలత్రయమ్

శారిబే రజనీ పాఠా భృంగ దారు సువర్చలాః
మంజిష్ఠా త్రిఫలా శ్యామా వృషపుష్పం సగైరికమ్
ధీమాన్ పక్త్వా ఘృతప్రస్థం సహ్య ఙ్మంత్రాభిమంత్రితమ్
ద్విమాసగర్భిణీ నారీ షణ్మాసా నుపయోజయేత్
సర్వాఙ్గం జనయేత్పుత్రం సర్వామయవివర్జితమ్
అస్య ప్రయోగాత్కుక్షిస్థం స్ఫుటవంధ్యా హరత్యపి
యోనిదుష్టాశ్చ యా నార్యో రేతోదుష్టాశ్చ యే నరాః
స్త్రీణాం పుంసాం దోషహరం ఘృత మేత దనుత్తమమ్
వంధ్యాపి లభతే పుత్రం శూరం పండితమానినమ్
జడగద్గదమూకత్వం పానా దేవాపకర్షతి
సప్తరాత్రప్రయోగేణ నర శ్శ్రుతిధరో భవేత్
నాగ్ని ర్దహతి తద్వేశ్మ న వజ్ర ముపహంతి చ
న తత్ర మ్రియతే బాలో యత్రాస్తే సోమసంజ్ఞితమ్ ॥

తెల్లతివాలు, వస, సరస్వతీఆకు, శంఖపుష్పి, తెల్లగలిజేరు, క్షీరకాకోలి, చెంగల్వ కోష్టు, యష్టిమధుకం, కటుకరోహిణి, ద్రాక్షపండు, పెగ్గుమ్మడు, చిట్టీతపళ్ళు, నల్లసుగంధి, తెల్లసుగంధి, పసుపు, పాఠ, గుంటకలగర, దేవదారు, సౌవర్చలవణం మంజిష్ఠ, కరకతాడివుసిరికలు, ప్రేంకణం, అడ్డసరపుపువ్వులు, వంటజేగురు—ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి కర్షం చొప్పున గ్రహించి మెత్తగా చితకగొట్టి నీళ్ళతో రుబ్బి ఉంచుకునేది.

రెండుప్రస్థాల ఆవు నేతిలో ఈముద్దా, ఎనిమిది ప్రస్థాల నీళ్లూ కలిపి వండి వడబోసుకునేది.

ఇది స్త్రీలకు సంతానఫలం కలిగిస్తుంది. గర్భవతులు రెండోమాసం వచ్చింది మొదలు ఎనిమిదోమాసం నిండేదాకా ఇది పుచ్చుకోడం మంచిది. దీంతో స్త్రీల యోనిదోషాలూ, పురుషుల శుక్రదోషాలూపోతాయి. దేహదార్ఢ్యమూ, సూక్ష్మ బుద్ధీ, వర్చస్సూ గల సంతానం కలిగించడంలో ఇదిప్రత్యేకశక్తి కలది. మరీన్నీ ఇది జడత్వమూ, మూగతనమూ, ముద్దమాటలూ కూడా పోగొడుతుంది. ఇది ఏడుం రాత్రులు వాడినంతమాత్రాన స్త్రీపురుషులు ఏకసంథాగ్రాహు లవుతారు.

## ౨౭ గోధూమాది ఘృతం

గోధూమాత్తు పలశతం నిఃక్వాథ్య సలిలాఢకే
పాదశేషే చ పూతే చ ద్రవ్యాణీమాని దాపయేత్
గోధూమం యుంజాతఫలం మాషం ద్రాక్షా పరూషకమ్
కాకోలీ క్షీరకాకోలీ జీవంతీ సశతావరీ
అశ్వగంధా సఖర్జూరా మధుకం త్ర్యూషణం సితా
భల్లాతక మాత్మగుప్తా సమభాగాని కారయేత్
ఘృతప్రస్థం పచేదేవం క్షీరం దత్వా చతుర్గుణమ్
మృద్వగ్నినా చ సిద్ధే తు ద్రవ్యాణ్యేతాని నిక్షిపేత్
త్వగేలా పిప్పలీ ధాన్యం కర్పూరం నాగకేసరమ్
యథాలాభం వినిక్షిప్య సితా క్షౌద్రం పలాష్టకమ్
దత్వేక్షుదండే నాలోడ్య విధివ ద్వినియోజయేత్
శాల్యోదనేన భుంజీత పిబే న్మాంసరసేన వా
కేవలస్య పిబే దస్య పలమాత్రం ప్రమాణతః
నచాస్య లింగశైథిల్యం న చ శుక్రక్షయో భవేత్
బల్యం పరం వాతహరం శుక్రసంజననం పరమ్
మూత్రకృచ్ఛ్రప్రశమనం వృద్ధానాం చాపి శస్యతే ।

గోధుమలు నూరుపలాలు, అవి మెత్తగాచూర్ణించి ఒకద్రోణంనీళ్లలో కలిపి 4 ప్రస్థాలు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. అందులో రెండుప్రస్థాల ఆవునెయ్యీ, ఆవుపాలు ఎనిమిది ప్రస్థాలూ చేర్చికలిపేది. ఇది ద్రవద్రవ్యం.

గోధుమలు, తాటిమొవ్వ, మినుములు, ద్రాక్షపండు, ముద్దఖర్జూరం, కాకోలి, క్షీరకాకోలి, మనుబాల, పిల్లితేగలు, పెన్నేరు, ఖర్జూరకాయలు, యష్టిమధుకం సొంటి, పిప్పళ్లు, మిరియాలు, చక్కెర, నల్లజీడిగింజలు, (వీటికి బదులు రక్తచందనం, వేసుకోవచ్చు) దూలగొండిగింజలు, —ఇవి కల్కద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి నాలుగేసి తులాలు గ్రహించి మెత్తగా చూర్ణించి నీళ్లతో రుబ్బి అది ఆద్రవద్రవ్యంలో చేర్చి వండి వడబోసుకునేది.

తరవాత, దాల్చినిచెక్క, ఏలకులు, పిప్పళ్లు, ధనియాలు, పచ్చకర్పూరం, నాగకేసరాలు—ఇవి ప్రక్షేపద్రవ్యాలు. ఇవి ఒక్కొక్కటి పదేసి తులాలచొప్పున గ్రహించి చూర్ణించి వస్త్రగాలితంచేసి, ఆచూర్ణమూ, 8పలాల చక్కెరా, 8పలాల తేనే కలిపి వాడుకునేది.

ఇది శాల్యన్నంతో భుజించవచ్చు, లేక ఇది చప్పరించి, మింగి మాంసరసం పుచ్చుకోవచ్చు. ప్రత్యేకంగాకూడా పుచ్చుకోవచ్చు. ఇది నిత్యమూ సేవిస్తూవుండే పురుషునకు లింగశైథిల్యం సంభవించదు. వీర్యమున్నూ క్షీణించిపోదు. ఇది మిక్కిలి బలకరం, వాతహరం. వీర్యవృద్ధికరం. మరిన్నీ, ఇది మూత్రకృచ్ఛ్రం పోగొడుతుంది. వృద్ధులకు చాలామంచిది.

## ౨౮. రోహీతకఘృతం

రోహీతకత్వచః శ్లక్ష్ణాత్ పలానాం పంచవింశతిం
కోలద్విప్రస్థసంయుక్తం కషాయ ముపకల్పయేత్
పలికైః పంచకోలైశ్చ తైస్సర్వైశ్చాపి తుల్యయా
రోహీతకత్వచా పిష్టైః ఘృతప్రస్థం విపాచయేత్
ప్లీహాభివృద్ధిం శమయే దేతదాశు ప్రయోజితమ్
తథాగుల్మజ్వరశ్వాసక్రిమిపాండుత్వకామలాః ॥

ములుమోదుగుపట్ట, 25పలాలు, రేగుపట్ట 2ప్రస్థాలు. ఇవి పచ్చివి మెత్తగా చితకగొట్టి నాలుగురెట్లు నీళ్లు పోసి, నాలుగోభాగం మిగిలేటట్టు కాచి వడబోసుకునేది.

ఆకషాయంలోఆవునెయ్యి రెండుప్రస్థాలు చేర్చేది. పిప్పళ్ళు, పిప్పలిమోడి, చవ్యం, చిత్రమూలం, సొంటి—ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క పలం. ములుమోదుగుపట్ట అయిదుపలాలు. ఇవన్నీకలిపిమెత్తగానీళ్ళతోరుబ్బి అందులోకలిపి వండివడబోసుకునేది.

ఇది ప్లీహాభివృద్ధి తగ్గించేస్తుంది. గుల్మం, జ్వరం, శ్వాసలు, క్రిమి, పాండు, కామెర్లు, హరించేస్తుంది.

## ౨౯. మహారోహీతకఘృతం

రోహీతకాత్పలశతం క్షోదయే ద్బదరాఢకమ్
సాధయిత్వా జలద్రోణే చతుర్భాగావశేషితమ్

ఘృతప్రస్థం సమావాప్య ఛాగక్షీరం చతుర్గుణమ్
తస్మిన్ దద్యా దిమాన్ కల్కాన్ సర్వాన్ తా నక్షసమ్మితాన్
వ్యోషం ఫలత్రికం హింగు ర్యమానీం తుంబురుం బిడమ్
అజాజీం కృష్ణలవణం దాడిమం దేవదారు చ
పునర్నవాం విశాలాం చ యవక్షారం సపౌష్కరమ్
విడంగం చిత్రకం చైవ హపుషాం చవికాం వచామ్
ఏభి ర్ఘృతం విపక్వం తు స్థాపయే ద్భాజనే శుభే
పాయయే త్త్రిపలాం మాత్రాం వ్యాధిం బల మవేక్ష్య చ
రసకే నాథ యూషేణ పయసా వాపి భోజయేత్
ఉపయుక్తఘృతే త్వస్మిన్ వ్యాధీన్ హన్యా దిమాన్ బహూన్
యకృత్ప్లీహోదరం చైవ ప్లీహశూలం యకృ త్తథా
కుక్షిశూలం చ హృచ్ఛూలం పార్శ్వశూల మరోచకమ్
విబద్ధశూలం శమయే త్పాండురోగం సకామలామ్
ఛర్ద్యతీసారశూలఘ్నం తంద్రా జ్వరవినాశనమ్
మహారోహీతకం నామ ప్లీహానం హంతి దారుణమ్ ॥

ములు మోదుగుపట్ట నూరుపలాలు. రేగుపట్ట ౨౪ పలాలు. ఇవి రెండూ మెత్తగా చితకగొట్టి రెండుద్రోణాల నీళ్ళలో కలిపి నాలుగోవంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. ఆ కషాయంలో రెండుప్రస్థాల ఆవునెయ్యి, ఆవునేతికి నాలుగురెట్లు మేకపాలు చేర్చేది. సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకతాడివుసిరికలు, ఇంగువ, వాము, తుంబుర్లు, బిడాలవణం, కురాసానివాము, సౌవర్చలవణం, దానిమ్మపండుబెరడు, దేవదారు, గలిజేరు, సప్తపర్ణి, యవక్షారం, పుష్కరమూలం, వాయువిడంగాలు, చిత్రమూలం, చవ్యం, బోడతరం, వస, — ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్కకర్షం గ్రహించి మెత్తగా చూర్ణించి, నీళ్ళతో రుబ్బి అందులో చేర్చి వండి వడబోసుకునేది.

ఇది యకృత్ప్లీహవృద్ధి, ప్లీహశూల, కుక్షిశూల, హృచ్ఛూల, పార్శ్వశూల, అరోచకం, మలబద్ధం, పాండువు, కామెర్లు, ఛర్ది, అతిసారం, తంద్ర, జ్వరం పోగొడుతుంది.

# కజ్జలీ ఔషధాలు

---

## ౧ శ్రీ జయమంగళరసం

హింగూలసంభవం సూతం గంధకం టంకణం తథా
తామ్రం వంగం మాక్షికం చ సైంధవం మరిచం తథా
సమం సర్వం సమాహృత్య ద్విగుణం స్వర్ణభస్మకమ్
తదర్థం కాంతలోహం చ రూప్యభస్మాపి తత్సమమ్
ఏత త్సర్వం విచూర్ణ్యాథ భావయే త్కనకద్రవైః
శేఫాలీదలజై శ్చాపి దశమూలరసేన చ
కిరాతతిక్తకక్వాథై స్త్రివారం సాధయే త్సుధీః
భావయిత్వా తతః కార్యా గుంజాద్వయమితా వటీ
అనుపానం ప్రయోక్తవ్యం జీరకం మధుసంయుతమ్
జీర్ణజ్వరం మహాఘోరం చిరకాలసముద్భవమ్
జ్వర మష్టవిధం హంతి సాధ్యాసాధ్య మథాపి వా
పృథ గ్దోషాం శ్చ వివిధాన్ సమస్తాన్ విషమజ్వరాన్
మేదోగతం మాంసగత మస్థిమజ్జగతం తథా
అంతర్గతం మహాఘోరం బహిస్థం చ విశేషతః
నానాదోషోద్భవం చైవ జ్వరం శుక్రగతం తథా
నిఖిలం జ్వరనామానం హంతి శ్రీశివనిర్మితః
బలపుష్టికరం చైవ సర్వరోగ నిబర్హణః ॥

ఇంగిలీకంలోనుంచి తీసి శుద్ధిచేసిన రసం 1 భాగం. గంధకం, పొంగించిన వెలిగారం, తామ్రభస్మం, వంగభస్మం, హేమమాక్షికభస్మం, సైంధవలవణం, మిరియాలు— ఇవన్నీ ఒక్కొక్క భాగం. స్వర్ణభస్మం రెండుభాగాలు. కాంతభస్మం, రజతభస్మం— ఇవన్నీ ఒక్కొక్క భాగం చొప్పున గ్రహించి ముందు నల్లపుమ్మెత్తాకు రసంతోనూ,

తరవాత క్రమంగా వావిలిఆకురసంతోనూ, దశమూలకషాయంతోనూ, సెలసేము కషాయంతోనూ నూరేసికొట్లు మర్దనాచేసేది. వయోబలానుసారంగా మోతాదు నిర్ణయించుకొని జీలకర్రకషాయంలో తేనెకలిపి అది అనుపానంగా వాడేది.

ఇది ఎంతకాలంగా వుండిన జీర్ణజ్వరం అయినా తగ్గించివేస్తుంది. అష్టవిధజ్వరాలూ, సమస్తవిషమజ్వరాలూ తగ్గిస్తుంది. మేదోగతమూ, మాంసగతమూ, అస్థిగతమూ, అంతర్గతమూ, బాహిరమూ, నానాదోషాలవల్ల పుట్టినదీ, శుక్రగతమూ— ఇవే కాక జ్వరం అనే పేరుగల దేన్నయినా పోగొడుతుంది. బలమూ, పుష్టీ కలిగిస్తుంది. తన్మూలంగా సర్వరోగాలనూకూడా తగ్గించేస్తుంది. క్షయకు సంబంధించిన జ్వరానికిది చాలా మంచిది.

## ౨ బృహత్కస్తూరీభైరవరసం

మృగమదశశి సూర్యాధాతకీ శూకశింబీ
రజత కనకముక్తా విద్రుమం లోహపాత్రాః
క్రిమిరిపు ఘనవిశ్వావారి తాలాభ్రధాత్రీ
రవిదళరసపిష్టం కస్తూరీభైరవోయమ్
కస్తూరీభైరవః ఖ్యాత స్సర్వజ్వరవినాశనః
ఆర్ద్రికస్య రసైః పేయో విషమజ్వరనాశనః
ద్వంద్వజాన్ భౌతికాన్వాపి జ్వరాన్ కామాదిసంభవాన్
అభిచారకృతాం శ్చైవ తథా శస్త్రకృతాన్ పునః
నిహన్యా ద్భక్షణా దేవ డాకిన్యాదియుతాం స్తథా
బిల్వచూర్ణసిరకాభ్యాం మధునా సహ పానతః
ఆమాతిసారం గ్రహణీం జ్వరాతీసార మేవ చ
అగ్నిదీప్తికర శ్శాంతః కాసరోగనికృంతనః
క్షపయే ద్భక్షణా దేవ మేహరోగం హలీమకమ్
జీర్ణజ్వరం నూతనం వా ద్వ్యైకాలీనం చ సంతతమ్
ప్రక్షిప్తం భౌతికం వాపి హంతి సర్వా న్విశేషతః
ఏకాహికం ద్వ్యాహికం వా త్र्याహికం చాతురాహికమ్

పాంచాహికం షష్ఠసంఖ్యం పాక్షికం మాసికం పునః
సర్వాన్ జ్వరాన్ నిహంత్యాశు భక్షణా దార్ద్రిద్రవైః ॥

కస్తూరి, పచ్చకర్పూరం, తామ్రభస్మం, అరెపువ్వు, దూలగొండి వేళ్ళు, రజతభస్మం, స్వర్ణభస్మం, మౌక్తికభస్మం, ప్రవాళభస్మం, లోహభస్మం, పాత, వాయువిడంగాలు, తుంగముస్తలు, సొంటి, కురువేరు, తాళకం, అభ్రకం, ఉసిరికపప్పు— ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి మెత్తగాచూర్ణించి జిల్లేడు ఆకుల రసంతో మర్దించి చిన్నపెసరగింజలవలె మాత్రలుకట్టి వాడుకునేది.

అల్లపురసం దీనికి చాలామంచి అనుపానం. మారేడువేళ్ళకషాయంలో తేనె కలిపికూడా పుచ్చుకోవచ్చు. స్థితిగతులనుబట్టి ఇంకా అనేక అనుపానాలతోనూ వాడుకోవచ్చు.

ఇది వేరువేరుగా త్రిదోషజ్వరాలూ, ద్వంద్వజ్వరాలూ, సన్నిపాతజ్వరాలూ, కామజ్వరమూ, అభిచారజ్వరమూ, శస్త్రకృతజ్వరమూ, భూతజ్వరాలూ పోగొడుతుంది. మారేడువేరుచూర్ణంతో కలిపి మారేడువేరు కషాయంలో తేనెచేర్చి దానితో పుచ్చుకుంటే ఆమాతిసారమూ, గ్రహణీ, జ్వరాతిసారమూ పోగొట్టి అగ్నిదీప్తి కలిగించి దగ్గులు తగ్గిస్తుంది. మరిన్నీ, ఇది మేహమూ, హలీమకమూ, జీర్ణజ్వరాలూ, నవజ్వరాలూ, సంతత, సతత, ఏకాహిక, ద్వ్యహిక, త్ర్యాహిక, చాతుర్థిక, పాంచాహిక, షాష్ఠాహిక, పాక్షిక, మాసజ్వరాలున్నూ తగ్గించేస్తుంది.

అనుభవంలో: ఇది ప్రలాపం బాగా కడుతుంది.

## 3 వసంతకుసుమాకరం

పృథ గ్ద్వౌ హాటకం చంద్రం త్రయో వంగాహికాంతజమ్
చత్వార స్సూత మభ్రం చ ప్రవాళం మౌక్తికం తథా
భావనా గవ్యదుగ్ధేక్షువాసా శ్రీద్విజలై ర్హిశా
మోచకందరసై స్సప్త క్రమా ద్భావ్యం పృథక్పృథక్
శతపత్రరసే నైవ మాలత్యాః కుసుమై స్తథా
పశ్చా న్మృగమదై ర్భావ్యం సుసిద్ధో రసరా డ్భవేత్
కుసుమాకరవిఖ్యాతో వసంతపదపూర్వకః
వల్లద్వయమిత స్సేవ్య స్సితాజ్యమధుసంయుతః

వలీపలితహృన్మేధ్యః కామద స్సుఖద స్సదా
మేహాఘ్నః పుష్టిద శ్శ్రేష్ఠః పరం వృష్యో రసాయనః
ఆయుర్వృద్ధికరః పుంసాం ప్రజాజనన ముత్తమమ్
క్షయకాసతృషోన్మాదశ్వాసరక్తవిషార్తిజిత్
హంతి పాండ్వామయాన్ శూలాన్ మూత్రాఘాతాశ్మరీం హరేత్
యోగవాహీ త్రిదోషఘ్నం సేవ్యం కాంతిశ్రీబలవర్ధనమ్
మదనం మదయు న్మద ముజ్వలా రుక్
ప్రమదానివహాః సతివిహ్వలకున్
సురతై స్సుఖదై ర్గతివిద్యచనై
ర్భవసారజుషా మయ మేవ సుహృత్ ॥

సువర్ణభస్మం, రజతభస్మం, రెండేసి భాగాలు. వంగభస్మం, నాగభస్మం, కాంతభస్మం మూడేసిభాగాలు. రససిందూరం, అభ్రకభస్మం, ప్రవాళభస్మం, మౌక్తికభస్మం, నాలుగేసిభాగాలు. ఇవన్నీ చేర్చి, ఆవుపాలు, చెరుకువేళ్ళరసం, అడ్డసరపుపువ్వుల రసం, చందనకషాయం, వట్టివేరు కురువేళ్ళ కషాయాలు, పసుపుకషాయం, అరటి దుంపరసం, తామరపువ్వులరసం, జాజిపువ్వులరసం— వీటితో ఏడేసిమాట్లు (మర్దనా కాదు) భావనచెయ్యాలి. చివర కస్తూరితో భావనచేసేది. అంటే ఒకతులం కస్తూరి పదహారుతులాలు పన్నీటితో నూరి ఒకదినం ఉంచి దానితో భావనచేసేది.

ఇందులో సూతం అన్నచోట రససిందూరమే కాని రసభస్మం వెయ్యగూడదు. మకరధ్వజం, షడ్గుణబలిజారితమకరధ్వజం, సిద్ధమకరధ్వజం— రససిందూరానికి బదులు బంగారం తీసివేసి ఇవి వేసుకోడం మరీ మంచిది. ముత్యాలు భస్మం చెయ్యగూడదు. మంచిముత్యాలు యథాశాస్త్రంగా శుద్ధిచేసి కల్వంలో వేసి పన్నీటితో నూరి అముద్దయెండనిచ్చి అది వేసుకోవాలి.. మరిన్ని ఇది ఆయారసాలతో ఏడేసి మాట్లు భావనచెయ్యాలి కాని మర్దనా చెయ్యగూడదు. కస్తూరిభావన అయిన తరవాత దానితోనే మర్దించి కుప్పెలు కట్టుకునేది.

ఒక తులం 80 మోతాదులు చేసుకోవచ్చు. ఇది స్థితిగతులను బట్టి అనేక అనుపానాలతో వాడుకునేది.

ఇది వలీపలితాలు పోగొడుతుంది. మేధ వృద్ధిచేస్తుంది. కామోద్రేకం సుఖం కలిగిస్తుంది. ప్రమేహాలు హరిస్తుంది. పుష్టి, బలము కలిగిస్తుంది. వీర్యవృద్ధి చేస్తుంది.

గోప్యరసాయనం. ఆయుర్వృద్ధికరం. సంతానమున్నూ కలిగిస్తుంది. క్షయ, కాస, దప్పిక, ఉన్మాదం, శ్వాస, రక్తదోషాలూ పోగొడుతుంది. పాండువు, శూల, మూత్రాఘాతం, మూత్రాశ్మరి హరిస్తుంది. కాంతి, వర్చస్సు వృద్ధిచేస్తుంది. ఇది సేవించిన పురుషుడు అనేకమంది స్త్రీలతో సుఖించగలడు.

## ౪ యోగేంద్రరసం

విశుద్ధం రససిందూరం తదర్ధం శుద్ధహాటకమ్
తత్సమం కాంతిలోహం చ తత్సమం చాభ్రమేవ చ
విశుద్ధం మౌక్తికం చైవ వంగం చ తత్సమం మతమ్
కుమారికారసై ర్భావ్యం ధాన్యరాశౌ దినత్రయమ్
తతో రక్తిద్వయమితాం వటీం కుర్యా ద్విచక్షణః
యోగవాహీ రసో హ్యేష స్సర్వరోగకులాంతకః
వాతపిత్తభవాన్ రోగాన్ ప్రమేహాన్ బహుమూత్రతామ్
మూత్రాఘాత మపస్మారం భగందరగుదామయమ్
మూర్ఛోన్మాదం చ యక్ష్మాణం పక్షాఘాతం హతేంద్రియమ్
శూలామ్లపిత్తకం హంతి భాస్కర స్తిమిరం యథా
త్రిఫలారసయోగేన శుభయా సితయాపి వా
భక్షయిత్వా భవే ద్రోగీ కామరూపి సుదర్శనః
రాత్రౌ సేవ్యం గవాం క్షీరం కృశానాం చ విశేషతః
యోగేంద్రాఖ్యో రసో నామ్నా కృష్ణాత్రేయవినిర్మితః ॥

రససిందూరం రెండుభాగాలు. స్వర్ణభస్మం, కాంతభస్మం, అభ్రకభస్మం, మౌక్తికభస్మం, ప్రవాళభస్మం— ఇవి ఒక్కొక్క భాగాలు. ఇవన్నీ కలిపి కలబందరసాన మర్దించి అముద్ద మూడుదినాలు ధాన్యరాశిలో ఉంచి తరవాత రెండుగురివిందగింజల యెత్తున వాడుకునేది.

ఇది గోప్యరసాయనం. యోగవాహి. వాతపిత్తరోగాలూ, ప్రమేహాలూ, బహుమూత్రవ్యాధీ, మూత్రాఘాతమూ, అపస్మారమూ, భగందరమూ, మూలశంకా, మూర్ఛలూ, ఉన్మాదమూ, యక్ష్మ, పక్షవాతమూ, శుక్రనష్టమూ, శూలా, అమ్ల

పిత్తమూ పోగొడుతుంది. త్రిఫలకషాయంలో చక్కెర కలిపి అది అనుపానంగా పుచ్చుకుంటే చక్కని వర్చస్సు కలుగుతుంది. రాత్రి ఆవుపాలు పుచ్చుకుంటే ఈమందు కృశించిపోయినవారికి రక్తమాంసాలు పెంచి జవసత్వాలు వృద్ధిచేస్తుంది.

## బృహద్వాతచింతామణి

భాగత్రయం స్వర్ణభస్మ ద్విభాగం రూప్య మభ్రకమ్
లోహాత్పంచ ప్రవాళం చ మౌక్తికం త్రయసమ్మితమ్
భస్మసూతం సప్తకం చ కన్యారసవిమర్దితమ్
వల్లమాత్రా వటీ కార్యా భిషగ్భిః పరియత్నతః
యథావ్యాధ్యనుపానేన నాశయే ద్రోగసంకులమ్
వాతరోగం పిత్తకృతం నిహంతి నాత్ర చింతనమ్
వృద్ధోపి తరుణస్పర్ధీ కందర్పసమవిక్రమః
దృష్ట స్సిద్ధఫల శ్చాయం వాతచింతామణి స్స్వహా ॥

స్వర్ణభస్మం 3 భాగాలు, రజతభస్మం, అభ్రకభస్మం రెండేసిభాగాలు. లోహభస్మం 5 భాగాలు. ప్రవాళభస్మం, మౌక్తికభస్మం మూడేసిభాగాలు. రససిందూరం 7 భాగాలు. ఇవన్నీ కలిపి కలబందరసాన మర్దించి ఒక్క గురివిందగింజయెత్తున మాత్రలు చేసుకుని వాడుకునేది.

తగిన అనుపానం వాడితే యిది సమస్తవ్యాధులూ పోగొడుతుంది. వృద్ధుడైనా యువకుడై మన్మథుణ్ణి మించివుంటాడు.

## ఉరసరాజరసం

పలైకం శుద్ధసూతస్య వ్యోమసత్వం చ కార్షికమ్
తదర్ధం కాంచనం దేయం కన్యారసవిమర్దితమ్
లోహం రూప్యం మృతం వంగం వాజిగంధాం లవంగకమ్
జాతీకోశం తథా క్షీరకాకోలీం చ తదర్ధతః
కాకమాచీరసైః పిష్ట్వా పంచగుంజామితా వటీ
క్షీరం చ శర్కరాతోయం అనుపానం ప్రకల్పయేత్

పక్షాఘాతే ర్దితే వాతే హనుస్తంభే పతంత్రకే
ధనుస్తంభే పతానే చ బాధిర్యే మస్తకభ్రమే
సర్వవాతవికారేషు రసరాజః ప్రకీర్తితః
బల్యో వృష్యశ్చ భోగ్యశ్చ వాజీకరణ ఉత్తమః ॥

రససింధూరం 8 తులాలు, అభ్రకభస్మం రెండుతులాలు, స్వర్ణభస్మం ఒకతులం. ఇవి మూడూ కామంచిఆకు రసాన బాగా మర్దించి ఉంచేది. లోహం, రజతం, వంగం, పెన్నేరు, లవంగాలు, జాపత్రి, క్షీరకాకోళి— ఇవి ఒక్కొక్కటి అర తులం చొప్పున చేర్చి మెత్తగా దంచి పై మర్దతో కలిపి మళ్ళీ కామంచిఆకు రసాన బాగా మర్దించి కందిగింజలంతేసి మాత్రలు చేసుకుని వాడేది

దీని కనుపానం చక్కెరకలిపిన పాలు.

ఇది పక్షవాతం, అర్దితవాతం, హనుస్తంభం, అపతంత్రకం, ధనుస్తంభం, అపతానకం, చెవుడు, తలతిప్పు, సర్వవాతవికారాలున్నూ పోగొడుతుంది. బలం చేస్తుంది. వీర్యవృద్ధి, ఐహికసుఖాలు కలిగిస్తుంది.

## ౭ భాగవృద్ధి మహాలక్ష్మీ విలాసరసం

హేమభస్మం చ భాగైకం రౌప్యభస్మం ద్విభాగికమ్
శుల్బభస్మం త్రయోభాగం కాంతిభస్మం చతుర్థకమ్
పంచమం తీక్ష్ణభస్మం చ షష్ఠం మాండూరభస్మకమ్
నిశ్చంద్రం వ్యోమకం చైవ భస్మం సప్త చ భాగికమ్
అష్టమం వంగభస్మం చ నవమం నాగభస్మకమ్
దశమం మౌక్తికం చైవ ఏకాదశం ప్రవాళకమ్
సర్వే స్సమం హింగుళోత్థరససింధూర మేవ చ
మర్దయే ద్భావయే ద్ద్రవ్యం భావనా జాతిపత్రకమ్
త్రికటుత్రిఫలా చైవ చాతుర్జాతం చ కుంకుమమ్
మృగనాభిరసం భావ్యం సప్తాహం చ భిషగ్వరైః
మాషమాత్రప్రయోగేణ సితాజ్యమధుసంయుతమ్
రాజరోగం నిహం త్యాశు క్షయం పాండుం వినాశయేత్

ఛర్ద్యాద్యజం మూర్ఛరోగం చ శ్వాసం కాసం చ కామలామ్
దీర్ఘతాపం చ గుల్మం చ సర్వశూలాని నాశయేత్
ఉన్మాదం చ మతిభ్రంశం అష్టోదరమహాగదాన్
ప్రమేహాన్ వింశతిం చైవ షండత్వం చ జ్వరం జయేత్
చంచలా సుప్తిరోగం చ గ్రహణీరోగ మేవ చ
మందాగ్నిం కుష్ఠరోగం చ మూలరోగం భగందరమ్
వాతశూలహరం వృష్యం అత్యంత మతిదీపనమ్
తుష్టిపుష్టికరం బల్యం కఫవాతవినాశనమ్ ॥

స్వర్ణభస్మం 1 భాగం, రజతభస్మం 2 భాగాలు, తామ్రభస్మం 3 భాగాలు, కాంతభస్మం 4 భాగాలు, లోహభస్మం 5 భాగాలు, మాండూరభస్మం 6 భాగాలు, నిశ్చంద్రకమైన అభ్రకభస్మం 7 భాగాలు, వంగభస్మం 8 భాగాలు, నాగభస్మం 9 భాగాలు, మౌక్తికభస్మం 10 భాగాలు, ప్రవాళభస్మం 11 భాగాలు, ఇవన్నీ ఎంతో అంత ఇంగిలీకరససిందూరం. ఈవస్తువు లన్నీ కలిపి జాపత్రికషాయం, త్రికటుకషాయం, త్రిఫలకషాయం, చాతుర్జాతకషాయం, కుంకుమపువ్వు కషాయం, కస్తూరికషాయం— వీటితో మర్దనా చేసి మాషమాత్రం నెయ్యి చక్కెరలతో వాడేది.

ఇది రాజయక్ష్మ, క్షయ, పాండురోగం, మూర్ఛలు, ఉబ్బసం, కామెర్లు, గుల్మం, తాపం, శూలలు, ఉన్మాదం, ఉదరరోగాలు, వింశతిప్రమేహాలు, షండత్వం, జ్వరాలూ, సుప్తిరోగం, గ్రహణి, దగ్గులు, వగర్పులు, ప్లీహవ్యాధులు, ఛర్ది, అగ్నిమాంద్యం, కుష్ఠరోగం, మూలశంకలు, భగందరం, వాతశూల పోగొడుతుంది. ఆకలి వృద్ధిచేస్తుంది. వీర్యవృద్ధి, తుష్టి, పుష్టి, కలిగిస్తుంది. బలకరం. కఫవ్యాధులకు తిరుగులేని ఔషధం.

## రాబాలసూర్యోదయం

సూతం త్రైగుణ్యగంధం పరిమిత మమృతం భానుతీక్ష్ణం చ నేత్రమ్
ఆహూతం తచ్చతుర్థం గగనశరయుతం కాంతతార్కేచ తుల్యే
మారీచం చైకయుక్తం త్రిచతురసహితం నాగవంగం క్రమేణ
తే రమ్యం సూక్ష్మమర్ద్యం మునిరసమథితం చాటరూషేక్షురాభ్యామ్

ఏత ద్దద్యా న్నిహంతి జ్వరకులగహనం శ్వాసకాసం చ ఛర్దిమ్
పాండుం శూలప్రమేహా నజయతి గుదరుజాః ప్లీహగుల్మా నశేషాన్
వాతవ్యాధేః కుఠారః క్షయజకఫరుజో రాజయక్ష్మాదిరోగా
నామ్నాయం బాలసూర్యోదయ ఇతి కథితో విష్ణవేయం ప్రసిద్ధః ॥

పాదరసం 1 భాగం, గంధకం 3 భాగాలు, నాభి 3 భాగాలు, తామ్రభస్మం, లోహభస్మం రెండేసిభాగాలు. గవ్వలభస్మం 4 భాగాలు. అభ్రకభస్మం, కాంతభస్మం, రజతభస్మం అయిదేసిభాగాలు. మిరియాలు ఒకభాగం, నాగభస్మం 3 భాగాలు, వంగభస్మం 4 భాగాలు. ఇవన్నీ కలిపి అవిసిఆకురసం, అడ్డసరంరసం, పల్లేరురసం- వీటితో లెస్సగామర్దించేది.

ఇది సమస్తజ్వరాలూ తగ్గించేస్తుంది. శ్వాస, కాస, ఛర్ది, పాండువు, శూల, ప్రమేహాలు, మూలశంక, ప్లీహవ్యాధులు, గుల్మం, సకలదుర్లక్షణాలతో కూడిన క్షయ, వాతవ్యాధులు, సమస్తకఫవ్యాధులు, రాజయక్ష్మ మొదలైన సకలరోగాలూ నశింపచేస్తుంది.

## ౯ బృహత్సోమనాథరసం

హింగూలసంభవం సూతం పాలిధారసమర్దితమ్
రండాశోధితగంధం చ తేనైవ కజ్జలీకృతమ్
తద్వయో ర్ద్విగుణం లోహం కన్యారసవిమర్దితమ్
అభ్రకం వంగకం రౌప్యం ఖర్పరం మాక్షికం తథా
సువర్ణం చ సమం సర్వం ప్రత్యేకం చ రసార్ధకమ్
తత్సర్వం కన్యకాద్రావై ర్మర్దయే ద్భావయే త్తథా
శేకపర్ణీరసే నైవ గుంజాద్వయవటీం హితామ్
మధునా భక్షయే చ్చాపి సోమరోగనివృత్తయే
ప్రమేహాన్ వింశతిం హంతి బహుమూత్రం చ సోమకమ్
మూత్రాతిసార మత్యుగ్రం మూత్రాఘాతం సుదారుణమ్
మూత్రదోషం బహువిధం ప్రమేహం మధుసంజ్ఞకమ్
హస్తిమేహ మిక్షుమేహం నానామేహాన్ వినాశయేత్

వాతికం పైత్తికం చైవ శ్లైష్మికం సోమసంజ్ఞికమ్
నాశయే ద్బహుమూత్రం చ ప్రమేహా నవికల్పకాః
సోమనాథరసశ్చాయం చరకేణ వినిర్మితః
వృష్యా ద్వృష్యతమో హ్యేష మూత్రదోషకులాంతకృత్ ॥

ఇంగిలీకరసం తీసి వావిలి ఆకురసంతోనూ, గంధకం ఎలుకచెవిఆకురసంతోనూ శుద్ధి చేసి ఉంచుకునేది. ఆవిరెండూ ఒక్కొక్క భాగం గ్రహించి కజ్జలిచేసుకునేది. అందులో 4 భాగాల లోహభస్మం చేర్చి కలబందరసాన మర్దించేది. అందులో అభ్రకభస్మం, వంగభస్మం, రజతభస్మం, కఫరి, హేమమాక్షికభస్మం, స్వర్ణ భస్మం— ఇవి అర్ధభాగం చొప్పున చేర్చి మళ్ళీ కలబందరసాన మర్దించేది. తరవాత సరస్వతీఆకురసంతో ముందు భావనా తరవాతమర్దనా చేసి రెండేసిగురుగింజల యెత్తున మాత్రలు చేసి తేనెతో వాడేది.

ఇది సోమరోగం హరిస్తుంది. వింశతి ప్రమేహాలు, బహుమూత్రవ్యాధి, సోమరోగం, అత్యుగ్రమైన మూత్రాతిసారం, మూత్రాఘాతం, బహువిధాలైన మూత్రదోషాలు, మధుమేహం, హస్తిమేహం, ఇక్షుమేహం, నానామేహాలూ, త్రిదోషాలవల్లా పుట్టిన సోమరోగం పోగొడుతుంది. ఇది వృష్యయోగాలన్నిటిలోనూ మిక్కిలి శ్రేష్ఠమైనది.

## ౧౦ సువర్ణ క్రవ్యాదరసం

మృతం స్వర్ణం మృతం కాంతం మృతం శుల్బం చ తీక్ష్ణకమ్
మృతం రౌప్యం మృతం వంగం మృతం నాగం మృతాభ్రకమ్
మృతం సూతం తథాగంధం విద్రుమం శంఖ మేవ చ
మారితం పుష్పకాసీసం వరాటం మౌక్తికం తథా
భ్రష్టం టంకణమార్ణంచ మృతం మాండూర మేవ చ
నాగరం వేల్లజం చైవ కణా లవణపంచకమ్
రసేంద్రం దేవతాపుష్పం సమభాగాని కారయేత్
ఖల్వమధ్యే వినిక్షిప్య మర్దయే ల్లుంగవారిణా
ఆర్ద్రకస్య రసే నైవ రక్తబీజరసేన చ
చణకామ్లేన చ తథా భృంగకేన రసేన చ

మర్దయే దృఢమే చ్చైవ ద్విగుంజాఫలమానతః
భోజనాంతే చోష్ణవారి మస్తుతక్రసురాసవైః
క్షిప్రం తజ్జీర్యతే భుక్తం దీపనం పాచనం పరమ్
సర్వాజీర్ణా న్నిహం త్యాశు గుల్మప్లీహావినాశకమ్
శూల మష్టవిధం చైవ గ్రహణీం చిరజా మపి
అర్శోహరం చామవాత మరుచిం చ జయే త్పునః
స్వర్ణక్రవ్యాదనామాయం స్థౌల్యరోగం చ నాశయేత్ ॥

స్వర్ణభస్మం, కాంతభస్మం, తామ్రభస్మం, లోహభస్మం, రజతభస్మం, వంగభస్మం, నాగభస్మం, అభ్రకభస్మం, రసం, గంధకం, ప్రవాళభస్మం, శంఖభస్మం, కాసీస భస్మం, వరాటభస్మం, ముత్యభస్మం, పొంగించిన వెలిగారం, మాండూరభస్మం, శొంటి, పిప్పళ్ళు, మిరియాలు, సైంధవలవణం, సాముద్రలవణం, కాచలవణం, బిడాలవణం, సౌవర్చలవణం, రససిందూరం, లవంగాలు— ఇవి సమభాగాలు. ఇవన్నీ యథాశాస్త్రంగా కలిపి మాదీఫలరసంతోనూ, అల్లపురసంతోనూ, పుల్ల దానిమ్మపండురసంతోనూ, పెనగపులుసుతోనూ, గుంటకలగరరసంతోనూ మర్దించి రెండుగురిగింజలయెత్తున మాత్రలు చేసి వాడుకునేది.

అనుపానాలు వేడినీళ్ళు, మజ్జిగతేట, పెరుగు, మజ్జిగ, సుర, ఆసవం. భోజనం చేసి ఇది వాడేది.

ఇది ఆకలి పుట్టిస్తుంది. జీర్ణశక్తి కలిగిస్తుంది. సకలాజీర్ణాలూ హరిస్తుంది. గుల్మం, ప్లీహవ్యాధులు, శూలలు, గ్రహణి, మూలశంకలు, ఆమవాతం, అరుచి, స్థౌల్యరోగమున్నూ తగ్గించేస్తుంది.

## ౧౧ అభ్రకపంచామృతరసం

భుజంగం త్రపుకం శైలం కాంత మభ్రకభస్మకమ్
ఏకద్విత్రిచతుఃపంచ భాగ మేత ద్యథాక్రమమ్
కాశ్మీరం ఘనసారం చ టంకణం హేమమాక్షికమ్
సిందూరం పూర్వవ త్సర్వం ఖల్వమధ్యే వినిక్షిపేత్
ధత్తూరతులసీ భృంగీముండీమర్కటిగోక్షురైః

కుమారీశాల్మలీరంభాగుడూచీభి శ్చ మర్దయేత్
గుంజాద్వయప్రమాణేన హ్యానుపానవిశేషతః
వింశతిం మేహజాన్ రోగాన్ వింశతిక్షయరోగకాన్
వింశతిశ్లేష్మజాన్ రోగాన్ చతుర్వింశతిపైత్తికాన్
చతుర్వింశ త్యతీసారాన్ గ్రహణీం శూలకం తథా
మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి నాశయే న్నాత్ర సంశయః
స్త్రీణాం ప్రదరరోగం చ యోనిదోషం చ నాశయేత్
గర్భవృద్ధిం వపుఃపుష్టిం, శీతవీర్యం చ కారయేత్
అంతర్బాహ్యం తథా తాపం హిక్కాం ఛర్దిం చ నాశయేత్
అంతర్గతం జ్వరం జీర్ణం సర్వాజీర్ణ మతఃపరమ్
అభ్రపంచామృతాభిఖ్యో సీతానాథేన భాషితః ॥

నాగభస్మం 1 భాగం, వంగభస్మం 2 భాగాలు, కర్పూరశిలాజిత్తు 3 భాగాలు, కాంతభస్మం 4 భాగాలు, అభ్రకభస్మం 5 భాగాలు. ఇది పూర్వార్థం. ఇలాగే కుంకుమపువ్వు 1 భాగం, పచ్చకర్పూరం 2 భాగాలు, పొంగించినవెలిగారం 3 భాగాలు, హేమమాక్షికభస్మం 4 భాగాలు, రససిందూరం 5 భాగాలు. ఇది ఉత్తరార్థం. ఈరెండు ప్రతులూ కలిపి ఉమ్మెత్తాకురసం, తులసి ఆకురసం, గుంటకలగరరసం, బోడతరంరసం, దూలగొండికషాయం, పల్లేరురసం, కలబందరసం, బూరుగుచెక్కరసం, అరటిదుంపరసం, తిప్పతీగరసం— ఈపదిరసాలతో చక్కగా మర్దించి రెండేసి గురిగింజలయెత్తు చొప్పున వాడుకునేది.

ఇది వింశతిప్రమేహాలూ, వింశతిక్షయరోగాలూ, వింశతికఫవ్యాధులూ, చతుర్వింశతిపిత్తవ్యాధులూ, చతుర్వింశతి అతిసారాలూ, గ్రహణి, శూల, మూత్రకృచ్ఛ్రాలు, స్త్రీల ప్రదరరోగమూ, యోనిదోషం పోగొడుతుంది. గర్భవృద్ధిచేస్తుంది. శరీరానికి పుష్టి కలిగిస్తుంది. చలువచేస్తుంది. అంతస్తాపం, బహిస్తాపం, ఎక్కిళ్ళు, వాంతులు, అంతర్గతజ్వరం, జీర్ణజ్వరం, సర్వాజీర్ణాలూ హరిస్తుంది.

## ౧౨ పూర్ణచంద్రరసం

ద్వికర్షం శుద్ధసూతం చ గంధకం చ ద్వికార్షికమ్
లోహభస్మ పలం చైకం జారితాభ్రం పలాంశకమ్

ద్వితోలం రజతం చైవ వంగభస్మ ద్వికార్షికమ్
సువర్ణం తోలకం చైవ తామ్రం కాంస్యం చ తత్సమమ్
జాతీఫలం చేంద్రపుష్ప మేలాం భృంగం చ జీరకమ్
కర్పూరం వనితాం ముస్తం కర్షం దద్యాత్పృథక్పృథక్
సర్వం ఖల్లతలే క్షిప్త్వా కన్యారసవిమర్దితమ్
భావయిత్వా వరాతోయై రుపుకాణాం రసై స్తథా
ఏరండపత్రై స్సంవేష్ట్య ధాన్యరాశౌ దినత్రయమ్
ఉద్ధృత్య మర్దయిత్వా తు వటికాం చణకప్రభామ్
ఖాదే చ్చ వటికా మేకాం పర్ణఖండేన సంయుతామ్
సర్వవ్యాధివినాశాయ కాశీరాజేన నిర్మితా
బల్యా రసాయనీ వృష్యా వాజీకరణ ముత్తమమ్
అగ్నిమాంద్య మజీర్ణం చ గ్రహణీం చిరజా మపి
ఆమవాత మమ్లపిత్తం జీర్ణజ్వర మరోచకమ్
ఆమశూలం కటీశూలం హృచ్ఛూలం పక్తిశూలకమ్
కామశోకోద్భవం రోగం ప్రమేహం బహుమూత్రకమ్
వాయుం బహువిధం హంతి ధ్వజభంగం విశేషతః
మేధాం చ లభతే రాజ్ఞి తుష్టిపుష్టిసమన్వితామ్
వృద్ధోపి తరుణస్పర్ధీ స్త్రీషు చాపి వృషాయతే
దృష్ట స్సిద్ధఫలో హ్యేష రసాయనవర స్స్మృతః ॥

పాదరసం 4 తులాలు, గంధకం 4 తులాలు, లోహభస్మం 8 తులాలు, కృష్ణాభ్రక భస్మం 8 తులాలు, రజతభస్మం రెండుతులాలు, వంగభస్మం 4 తులాలు, స్వర్ణభస్మం, తామ్రభస్మం, కాంస్యభస్మం, ఒక్కొక్క తులం, జాజికాయ, లవంగాలు, ఏలకులు, దేవదారు, జీలకర్ర, పచ్చకర్పూరం, ప్రేంకణం, తుంగముస్తలు, ఇవి ఒక్కొక్క కర్షం.

ఇవన్నీ చేర్చి కలబందరసంతోనూ, త్రిఫలకషాయంతోనూ, ఆముదపాకుల రసంతోనూ, మర్దించి ఆముద్దఆముదపాకులతో చుట్టి అది మూడుదినాలు ధాన్యరాశిలో వుంచి తీసి పెనగగింజలంతేసి మాత్రలు చేసి ఒక్కొక్క మాత్ర తాంబూలంతో వాడుకునేది.

ఇది బలం కలిగిస్తుంది. వీర్యవృద్ధి చేస్తుంది. గొప్పవాజీకరం. అగ్నిమాంద్యమూ, అజీర్ణమూ, గ్రహణీ, ఆమవాతమూ, అమ్లపిత్తమూ, అజీర్ణజ్వరమూ, అరోచకమూ, ఆమశూలా, కటిశూలా, హృదయశూలా, పరిణామశూలా, కాముంవల్లా, శోకం వల్లా పుట్టిన వ్యాధులూ, ప్రమేహమూ, బహుమూత్రమూ, వాతవికారాలూ, ధ్వజభంగమూ పోగొడుతుంది. బుద్ధిబలం ఎక్కువచేస్తుంది. తుష్టీ పుష్టీ కలిగిస్తుంది. వృద్ధుడుకూడా యువకుడై అనేకమంది స్త్రీలతో రమించగలుగుతాడు. ఇది గొప్ప రసాయనం.

## ౧౩ బృహద్వంగేశ్వరరసం

సూతం గంధం మృతం లోహం మృత మభ్రం సమాంశకమ్
హేమ వంగం చ ముక్తా చ తాప్య మేవం సమం సమమ్
సర్వేషాం చూర్ణితం కృత్వా కన్యారసవిమర్దితమ్
గుంజాద్వయప్రమాణేన వటికాం కురుయత్నతః
బృహద్వంగేశ్వరో హ్యేష రక్తమూత్రే ప్రశస్యతే
శ్వేతమూత్రం బృహన్మూత్రం కృచ్ఛ్రమూత్రం తథైవ చ
సర్వప్రకారమేహాం స్తు నాశయే దవికల్పతః
అగ్నివృద్ధిం వయోవృద్ధిం కాంతివృద్ధిం కరోతి చ
క్షయరోగం నిహం త్యాశు కాసం పంచవిధం తథా
కుష్ట మష్టాదశవిధం పాండురోగం హలీమకమ్
శూలం శ్వాసం జ్వరం హిక్కాం మందాగ్నిత్వ మరోచకమ్
క్రమేణ శీలితో హంతి వృక్ష మింద్రాశని ర్యథా ॥

రసం, గంధకం, లోహభస్మం, అభ్రకభస్మం, స్వర్ణభస్మం, వంగభస్మం, ముక్తికభస్మం, రజతభస్మం, — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి కలబందరసాన మర్దించి రెండు గురిగింజల యెత్తున మాత్రలు కట్టుకుని వాడుకునేది.

ఇది రక్తమూత్రం, శ్వేతమూత్రం, అతిమూత్రం, మూత్రకృచ్ఛ్రం, సకలమేహాలూ, పోగొడుతుంది. అగ్నివృద్ధి, వయోవృద్ధి, కాంతివృద్ధి కలిగిస్తుంది. క్షయ తగ్గిస్తుంది. కాసలు, కుష్టు, పాండువు, హలీమకం, శూల, శ్వాసలు, జ్వరం, హిక్క, అరోచకం— ఇవిన్నీ పోగొడుతుంది.

## ౧౪ కుమారకల్యాణరసం

సిందూరం మౌక్తికం హేమ వ్యోమాయో హేమమాక్షికమ్
కన్యాతోయేన సంమర్ద్య కుర్యాన్ముద్గమితా వటీః
వటికాం వటికార్ధం వా సమీక్ష్యావస్థాం వివిచ్య చ
క్షీరేణ సితయా సార్ధం బాలేషు వినియోజయేత్
కుమారాణాం జ్వరం శ్వాసం వమనం పారిగర్భికమ్
గ్రహదోషాం శ్చ నిఖిలాన్ స్తన్యస్యాగ్రహణం తథా
కామలా మతిసారం చ కృశతాం వహ్నివైకృతమ్
రసః కుమారకల్యాణో నాశయే న్నాత్ర సంశయః ॥

రససిందూరం, మౌక్తికభస్మం, స్వర్ణభస్మం, అభ్రకభస్మం, లోహభస్మం, హేమ మాక్షికభస్మం— ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి కలబందరసాన మర్దించి పెసర గింజలంతేసి మాత్రలు కట్టుకునేది.

ఇది వయస్సునూ, బలమునూ, అవస్థనూ గుర్తించి చంటిపిల్లలకు దినానికి ఒక మాత్రగాని మాత్రలో సగం గాని వాడేది. అనుపానం కలకండపొడికలిపిన వేడిపాలు.

ఇది పిల్లల జ్వరం, వగర్పు, వమనం, గర్భవతులైవుండిన స్త్రీల స్తన్యం తాగడం వల్ల పిల్లలకు కలిగే రోగాలు, గ్రహదోషాలు, పాలుతాగకపోవడం, కామెర్లు, నీటివిరేచనాలు, చిక్కిపోవడం, ఆకలిలేకపోవడం మొదలైనవన్నీ పోగొడుతుంది.

## ౧౫ మహాయోగరాజగుగ్గులు

నాగరం పిప్పలీ చవ్యం పిప్పలీమూలచిత్రకైః
భ్రష్టం హింగ్వజమోదం చ సర్షపా జీరకద్వయమ్
రేణుకేంద్రయవాః పాఠా విడంగం గజపిప్పలీ
కటుకాతివిషా భార్గీ వచా మూర్వేతిభాగతః
ప్రత్యేకం శాణికాని స్యు ర్ద్రవ్యాణీమాని వింశతిః
ద్రవ్యేభ్య స్సకలేభ్య శ్చ త్రిఫలా ద్విగుణా భవేత్

ఏభి శ్చూర్ణీకృతై స్సర్వై స్సమో దేయస్తు గుగ్గులుః
వంగం రౌప్యం చ నాగం చ లోహసారం తథాభ్రకమ్
మాండూరం రససిందూరం ప్రత్యేకం పలసమ్మితమ్
గుడపాకసమం కృత్వా ఇమం దద్యా ద్యథోచితమ్
ఏకపిండం తతః కృత్వా ధారయే ద్ఘృతభాజనే
గుటికా శ్శాణమాత్రా స్తు కృత్వా గ్రాహ్యా యథోచితాః
గుగ్గులు ర్యోగరాజోఽయం త్రిదోషఘ్నో రసాయనః
మైథునాహారపానానాం త్యాగో నైవాత్ర విద్యతే
సర్వాన్ వాతమయాన్ కుష్ఠానర్శాంసి గ్రహణీగదమ్
ప్రమేహం వాతరక్తం చ నాభిశూలం భగందరమ్
ఉదావర్తం క్షయం గుల్మం అపస్మార మురోగ్రహమ్
మందాగ్నిశ్వాసకాసాం శ్చ నాశయే దరుచిం తథా
రేతోదోషహరః పుంసాం రజోదోషహర స్స్త్రియాః
పుంసా మపత్యజనకో వంధ్యానాం గర్భద స్తథా
రాస్నాదిక్వాథసంయుక్తో వివిధం హంతి మారుతమ్
కాకోల్యాదిశృతా త్పిత్తం కఫ మారగ్వధాదినా
దార్వీశృతేన మేహాం శ్చ గోమూత్రే ణైవ పాండుతామ్
మేదోవృద్ధిం చ మధునా కుష్ఠో నింబశృతేన చ
ఛిన్నాక్వాథేన వాతాస్రం శోఫం శూలం కణాశృతాత్
పాటలాక్వాథసహితో విషం మూషకజం జయేత్
త్రిఫలాక్వాథసహితో నేత్రార్తిం హంతి దారుణామ్
పునర్నవాదేః క్వాథేన హన్యా త్సర్వోదరా ణ్యపి॥

సొంటి, పిప్పళ్ళు, చవ్యం, పిప్పలిమోడి, చిత్రమూలం, వేయించిన ఇంగువ, అజామోదం, ఆవాలు, జీలకర్ర, నల్లజీలకర్ర, రేణుకలు, కొడిశపాలవిత్తులు, పాఠ, వాయువిడంగాలు, గజపిప్పళ్ళు, కటుకరోహిణి, అతివస, గంటుభారంగి, వస, చాగనార— ఇవి ఒక్కొక్కటి అరతులంచొప్పున గ్రహించేది. కరకతాడివుసిరికల

చూర్ణం 20 తులాలు, మహిషాక్షిగుగ్గిలం 86 తులాలు, వంగభస్మం, రజతభస్మం, నాగభస్మం, లోహభస్మం, అభ్రకభస్మం, మాండూరభస్మం, రససిందూరం— ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క పలం. ముందుగా మహిషాక్షిగుగ్గిలం బెల్లంలాగ పాకంపట్టి తక్కినచూర్ణం అంతా అందులో పోసి కలిపి నేతిపాత్రలో ఉంచు కోవాలి. మాత్రలు సెనగగింజలకంటె కొంచెం పెద్దవిగా చెయ్యాలి. వెంటనే మాత్రలు చెయ్యాలి లేకపోతే ఆముద్ద గట్టిపడిపోతుంది.

ఇది త్రిదోషాలూ సామ్యపరిచే రసాయనం. ఆహారపానమైథునాదులవిషయమై నిషేధం లేకుండా యిది పుచ్చుకోవచ్చు. ఇది సమస్త వాతవ్యాధులూ, కుష్ఠులూ, మూలశంకలూ, గ్రహణీ, ప్రమేహాలూ, వాతరక్తమూ, నాభిశూలా, భగందరమూ, ఉదావర్తమూ, క్షయా, గుల్మమూ, అపస్మారమూ. ఉరోగ్రహామూ, మందాగ్ని, శ్వాసకాసలూ, అరుచీ, పురుషుల వీర్యదోషాలూ, స్త్రీల రజోదోషాలూ హరిస్తుంది. పురుషులకు సంతానఫలం కలిగిస్తుంది. స్త్రీలకు గర్భం నిలుపుతుంది. సన్నరాష్ట్ర కషాయంతో పుచ్చుకుంటే వాతవ్యాధులూ, కాకోళికషాయంతో పుచ్చుకుంటే పిత్తవ్యాధులూ, రేలచెక్కకషాయంతో పుచ్చుకుంటే కఫవ్యాధులూ, మానుపసుపు కషాయంతో ప్రమేహాలూ, గోమూత్రంతో పాండురోగమూ, తేనెతో పుచ్చుకుంటే కొవ్వూ, వేపపట్టకషాయంతో పుచ్చుకుంటే కుష్ఠరోగమూ, తిప్పతీగకషాయంతో పుచ్చుకుంటే వాతరక్తమూ, పిప్పళ్ళకషాయంతో పుచ్చుకుంటే ఉబ్బూ, శూలా, పాటలకషాయంతో పుచ్చుకుంటే ఎలుకలవిషమూ, త్రిఫలాకషాయంతో పుచ్చుకుంటే నేత్రవ్యాధులూ, గలిజేరుకషాయంతో పుచ్చుకుంటే ఉదరరోగాలూ తగ్గిపోతాయి.

## ౧౬. బృహత్సర్వజ్వరహరలోహం

పారదం గంధకం శుద్ధం తామ్ర మభ్రం చ మాక్షికమ్
హిరణ్యం తారం తాళం చ కర్ష మేకం పృథక్పృథక్
మృతం కాంతం పలం దేయం సర్వ మేకీకృతం శుభమ్
వక్ష్యమాణౌషధై ర్భావ్యం ప్రత్యేకం దినసప్తకమ్
కారవేల్లరసేనాపి దశమూలరసేన చ
పర్పటస్య కషాయేణ క్వాథేన త్రైఫలేన చ
గుడూచ్యా స్స్వరసే నాపి నాగవల్లీరసేన చ
కాకమాచీరసే నైవ నిర్గుండ్యా స్స్వరసేన చ

పునర్నవార్ద్రికాంభోభి ర్భావనాం పరికల్ప్య చ
రక్తికాదిక్రమే ణైవ వటికాం కారయే ద్భిషక్
పిప్పలీ గుడసంయుక్తా వటికా వీర్యవర్ధనీ
జ్వర మష్టవిధం హంతి చిరకాలసముద్భవమ్
వివిధం చాదిదోషోత్థం నానాదోషోద్భవం తథా
సతతాదిజ్వరం హంతి సాధ్యాసాధ్య మథాపి వా
క్షయోద్భవం చ ధాతుస్థం కామశోకభవం తథా
భూతావేశజ్వరం చైవ బుక్షుదోషభవం తథా
అభిఘాతజ్వరం చైవ మభిచారసముద్భవమ్
అభిన్యాసం మహాఘోరం విషమంచ త్రిదోషజమ్
శీతపూర్వం దాహపూర్వం విషమం శీతలం జ్వరమ్
ప్రలేపకజ్వరం ఘోర మర్ధనారీశ్వరం తథా
ప్లీహాజ్వరం తథా కాసం చాతుర్థికవిపర్యయమ్
పాండురోగగణాన్ సర్వాన్ అగ్నిమాంద్యం మహాగదమ్
ఏతాన్ సర్వా న్నిహం త్యాశు పక్షార్ధే నాత్ర సంశయః
శాల్యన్నం తక్రసహితం భోజయేత్ పక్షిమాంసకమ్
కకారపూర్వకం సర్వం వర్జనీయం విశేషతః
మైథునం వర్జయే త్తావ ద్యావ న్న బలవాన్ భవేత్
సర్వజ్వరహరం శ్రేష్ఠ మనుపానం ప్రకల్పయేత్ ॥

రసం, గంధకం, తామ్రభస్మం, అభ్రకభస్మం, హేమమాక్షికభస్మం, స్వర్ణభస్మం, రజతభస్మం, తాళకం, — ఇవి ఒక్కొక్క కర్షం. కాంతభస్మం ఒకపలం. ఇవన్నీ కలిపి, కాకరాకురసం, దశమూలకషాయం, పర్పాటకకషాయం, త్రిఫలాకషాయం, తిప్పతీగస్వరసం, తమలపాకులరసం, కామంచాకురసం, వావిలిరసం, గలిజేరురసం, అల్లపురసం, — వీటితో ఒక్కొక్కదానితో ఏడేసి దినాలు మర్దించేది. మాత్ర వడ్లగింజయెత్తు. అనుపానం పిప్పళ్ళచూర్ణమూ పాతబెల్లమూను.

ఇది జీర్ణజ్వరాలు, నీళ్ళపల్లడితో వచ్చిన జ్వరాలు, త్రిదోషజ్వరాలూ, సన్నిపాత జ్వరాలూ, సతతసంతతాదిజ్వరాలూ, క్షయకు సంబంధించిన జ్వరాలూ, ధాతుగత

జ్వరాలూ, కామజ్వరాలూ, భూతజ్వరాలూ, అభిఘాతజ్వరాలూ, అభిచారజ్వరాలూ, అభిన్యాసజ్వరాలూ, విషమజ్వరాలూ, శీతజ్వరాలూ, దాహజ్వరాలూ, ప్లీహజ్వరాలూ, దగ్గూ, వగర్పూ, పాండువూ, అగ్నిమాంద్యమూ— మొదలైన అనేక వ్యాధులను పోగొడుతుంది. ఇది వాడినప్పుడు మజ్జిగతో అన్నంపెట్టమని శాస్త్రం. మైథునమున్నూ వర్జించాలి.

ఇది వంగదేశంలో ఎక్కువగా వాడతారు.

## ౧౭ హేమామృతరసం

భాగ మేకం పారదస్య బలేర్భాగద్వయం తథా
హేమ్నః పాదమితం భాగం ఏకైకం తారవంగయోః
అర్జునస్య కషాయేణ సంమర్ద్య రక్తికోన్మితామ్
వటీం కృత్వా దాపయేచ్చ సితాజ్యమధుసంయుతామ్
శామ్యంత్యనేన హృద్రోగాః సర్వఏవ నసంశయః
శ్రీమద్గహననాథేన నిర్మితోయం రసోత్తమః ॥

రసం ఒకభాగం, గంధకం రెండుభాగాలు, స్వర్ణభస్మం రసంలో నాలుగోవంతు. రజతభస్మమూ, వంగభస్మమూ ఒక్కొక్కభాగం. ఇవన్నీ కలిపి తెల్లమద్దికషాయంతో నూరి గురిగింజయెత్తున మాత్రలు చేసుకుని వాడేది. అనుపానం చక్కెర, నెయ్యి, తేనె.

దీంతో సకల హృద్రోగాలూ తగ్గిపోతాయి.

## ౧౮ స్వర్ణపర్పటి

రసోత్తమం పలం శుద్ధం హేమతోలకసంయుతమ్
శిలాయాం మర్దయేత్తావ ద్యావ దేకత్వ మాగతమ్
గంధకస్య పలం చైక మయఃపాత్రే తతో దృఢే
మర్దయే ద్దృఢపాణిభ్యాం యావత్కజ్జలతాం వ్రజేత్
తతఃపరం విధానజ్ఞః పర్పటీం కారయేత్సుధీః
రక్తికాదిక్రమే ణైవ యోజయే దనుపానతః

గ్రహణీం వివిధాం హంతి శూల మష్టవిధం తథా
సర్వజ్వరహరో వృష్యా నామ్నాయం స్వర్ణపర్పటీ ॥

శుద్ధపాదరసం ఒకపలం, బంగారం ఒక తులం. ఇవి రెండూ బాగా కలిసేటట్టు నూరాలి. తరవాత గంధకం ఒకపలం చేర్చి గట్టిగా— చక్కగా కజ్జలి అయేటట్టు మర్దించాలి. ఆకజ్జలి పర్పటీవిధానంగావండి రతి ప్రమాణం మొదలు వయోవస్థాను సారం వాడుకునేది.

ఇది వివిధగ్రహణులు, అష్టవిధశూలలు, సర్వజ్వరాలూ హరిస్తుంది. బలమూ, వీర్యవృద్ధీ కూడా కలిగిస్తుంది.

## ౧౯ వ సం త మా ల తీ ర సం

స్వర్ణం ముక్తా దరద మరిచం భాగవృద్ధ్యా ప్రదిష్టమ్
ఖర్పరాష్టౌ ప్రథమ మఖిలం మర్దయేత్ మ్రక్షణేన
యావ త్స్నేహో వ్రజతి విలయం నింబనీరేణ తావత్
గుంజాద్వంద్వం మధుచపలయా మాలతీప్రాగ్వసంతః
సేవితోఽయం హరే త్తూర్ణం జీర్ణం చ విషమజ్వరమ్
వ్యాధీ నన్యాం శ్చ కాసాదీన్ ప్రదీప్తం కురుతే నలమ్ ॥

స్వర్ణభస్మం 1 భాగం, మౌక్తికభస్మం 2 భాగాలు, ఇంగిలీకం 3 భాగాలు, మిరియాలు 4 భాగాలు, కఫరి 8 భాగాలు. ఇవి నిమ్మకాయరసంతో బాగా మర్దించి వయో బలానుసారం వాడుకునేది.

ఇది జీర్ణజ్వరాలూ, విషమజ్వరాలూ, శ్వాసకాసలూ, అగ్నిమాంద్యమూ పోగొడుతుంది.

## ౨౦ ఇ చ్ఛా భే దీ ర సం

సూతం గంధం చ మరిచం టంకణం నాగరాభయా
జైపాలబీజసంయుక్తం క్రమోత్తరగుణం భవేత్
సర్వతుల్యో గుడో దేయ ఇచ్ఛాభేదీ త్వయం రసః
ద్విత్రిగుంజాపరిమితా వటీ కార్యా విచక్షణైః ॥

రసం 1 భాగం, గంధకం 2 భాగాలు, మిరియాలు 3 భాగాలు, పొంగించినవెలిగారం 4 భాగాలు, సొంటి 5 భాగాలు, కరకవొలుపు 6 భాగాలు, నేపాళాలు 7 భాగాలు. ఇవి మెత్తగానూరి ఇవన్నీ యెంతో అంతకి రెండింతలు పాతబెల్లం కలుపుకుని రెండు మూడు గురిగింజలయెత్తుగా మోతాదు వాడుకునేది. చక్కగా విరోచనం చేస్తుంది.

గమనిక:— నాఅనుభవం. బెల్లం మానెయ్యడం. తక్కినవన్నీ వాముకషాయంతో మర్దించి కందిగింజ లంతేసి మాత్రలు చెయ్యడం. మంచినీళ్ళు అనుపానం. ఒక్కమాత్ర వేసుకుంటే మూడో నాలుగో విరోచనాలవుతాయి. రెండు వేసుకుంటే అయిదారు విరేచనాలవుతాయి. అంతకంటే యెక్కువగా నే నెప్పుడూ వాడలేదు.

## ౨౧ శ్వాసచింతామణి

ద్వికర్షం లోహచూర్ణస్య తదర్థం గంధ మభ్రకమ్
తదర్థం పారదం తాప్యం పారదార్థేన మౌక్తికమ్
శాణమానం హేమచూర్ణం సర్వం సంమర్ద్య యత్నతః
కంటకారీరసై శ్చాపి శృంగబేరరసై స్తథా
ఛాగీక్షీరేణ మధునా క్రమేణ మతిమాన్ భిషక్
గుంజాచతుష్టయం చాస్య విభీతకసమన్వితమ్
భక్షయే చ్ఛ్వాసకాసార్తో రాజయక్ష్మనిపీడితః ॥

లోహభస్మం రెండుకర్షాలు, గంధకం అభ్రకం ఒక్కొక్క కర్షం. పాదరసం, హేమమాక్షికం ఒక్కొక్కతులం. ముత్యాలభస్మం స్వర్ణభస్మం ఒక్కొక్కటి అరతులం. ఇవన్నీ కలిపి, వాకుడురసంతోనూ, అల్లపురసంతోనూ, మేకపాలతోనూ, తేనెతోనూ చక్కగా మర్దించి వయోబలానుసారంగా తాడికాయకషాయంతో పుచ్చుకునేది.

ఇది దగ్గు, వగర్పు, క్షయ పోగొడుతుంది.

## ౨౨ బృహత్కాంచనాభ్రరసం

కాంచనం రససిందూరం మౌక్తికం లోహ మభ్రకమ్
విద్రుమం మృతవైక్రాంతం తారం తామ్రం చ వంగకమ్

కస్తూరికా లవంగం చ, జాతీకోశైలవాలుకమ్
ప్రత్యేకం బిందుమాత్రం చ సర్వం మర్ద్యం ప్రయత్నతః
కన్యానీరేణ సంమర్ద్య కేశరాజరసేన చ
అజాక్షీరేణ సంభావ్యం ప్రత్యేకం దివసత్రయమ్
చతుర్గుంజాప్రమాణేన వటికాం కారయే ద్భిషక్
అనుపానం ప్రదాతవ్యం యథాదోషానుసారతః
నానారోగప్రశమనం సర్వోపద్రవసంయుతమ్
క్షయం హంతి తథా కాసం యక్ష్మాణాం శ్వాస మేవ చ
ప్రమేహాన్ వింశతిం చైవ దోషత్రయసముత్థితాన్
సర్వాన్ రోగాన్ నిహంత్యాశు భాస్కర స్తిమిరం యథా॥

స్వర్ణభస్మం, రససిందూరం, ముత్యభస్మం, లోహభస్మం, అభ్రకభస్మం, ప్రవాళభస్మం, వైక్రాంతభస్మం, రజతభస్మం, తామ్రభస్మం, వంగభస్మం, కస్తూరి, లవంగం, జాపత్రి, కూతురుబుడమ — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి కలబందరసంతోనూ, గుంటకలగరరసంతోనూ, మేకపాలతోనూ మూడేసిదినాలు మర్దించేది.

మోతాదు, అనుపానము వయోబలదోషానురూపంగా యేర్పరుచుకునేది.

ఇది అనేకరోగాలు పోగొడుతుంది. ముఖ్యంగా క్షయ, దగ్గు, వగర్పు, వింశతి ప్రమేహాలూ తగ్గిస్తుంది.

## ౨౩ అగ్నితుండీవటి

శుద్ధసూతం విషం గంధ మజమోదా ఫలత్రయమ్
సర్జిక్షారం యవక్షారం, వహ్ని సైంధవజీరకమ్
సౌవర్చలం విడంగం చ సాముద్రం టంకణం సమమ్
విషముష్టిం సర్వతుల్యం జంబీరామ్లేన మర్దయేత్
మరిచాభాం వటీం ఖాదే దగ్నిమాంద్యప్రశాంతయే ॥

శుద్ధపాదరసం, గంధకం, నాభి, అజామోదం, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, సర్జిక్షారం, యవక్షారం, చిత్రమూలం, సైంధవలవణం, జీలకర్ర, సౌవర్చలవణం, వాయువిళంగాలు, సముద్రలవణం, పొంగించిన వెలిగారం, — ఇవి సమభాగాలు. ఇవన్నీ యెంతో, అంత విషముష్టిపప్పు, ఇవన్నీ కలిపి నిమ్మకాయ

రసానమర్దించి మిరియాలంతేసి మాత్రలు చేసుకునేది.

ఇది అగ్నిమాంద్యాం పోగొడుతుంది.

### ౨౪ హుతాశనరసం

గంధేశటంకణక్షారైకైకం విషమత్రి త్రిభాగికమ్
అష్టభాగంతు మరిచం జంభాంభోమర్దితం దినమ్
తద్వటీం ముద్గమానేన కృత్వా ర్ద్రేణ ప్రయోజయేత్
శూలారోచకగుల్మేషు విషూచ్యామగ్నిమాంద్యకే
అజీర్ణే సన్నిపాతాదౌ శైత్యే జాడ్యే శిరోగదే ॥

గంధకం, పొంగించిన వెలిగారం, ఒక్కొక్కభాగం. శుద్ధనాభి మూడుభాగాలు. మిరియా లెనిమిది భాగాలు. ఇవి నిమ్మకాయరసాన చక్కగా మర్దించి పెసరగింజ లంతేసి మాత్రలుచేసి వాడుకునేది. అనుపానం అల్లపురసం. స్థితిగతులను బట్టి ఇతరఅనుపానాలుకూడా వాడుకోవచ్చు.

ఇది శూల, అరోచకం, గుల్మం, విషూచి, (కలరా), అగ్నిమాంద్యం, అజీర్ణం, సన్నిపాతాదులు, తలనొప్పి, శైత్యము తగ్గించేస్తుంది.

### ౨౫ కర్పూరరసం

హింగులం ఫణిఫేనం చ ముస్తకేంద్రయవం తథా
జాతీఫలం చ కర్పూరం సర్వం సంమర్ద్య యత్నతః
జలేన వటికా కార్యా ద్విగుంజాపరిమాణతః
జ్వరాతీసారిణే చైవ తథాతీసారరోగిణే
గ్రహణీ షట్ప్రకారే చ రక్తాతీసార ఉల్బణే ॥

ఇంగిలీకం, నల్లమందు, తుంగముస్తలు, కొడిశపాలవిత్తులు, జాజికాయ, హారతి కర్పూరం, ఇవి నీళ్ళతో మర్దించి రెండుగురిగింజలయెత్తున మాత్రలుచేసి తగిన అనుపానంతో వాడేది.

ఇది జ్వరాతిసారమూ, అతిసారమూ, గ్రహణీ, రక్తాతిసారమూ పోగొడుతుంది.

## ౨౬ అభయనరసింహరసం

దరదం చ విషం వ్యోషం జీరకం టంకణం సమమ్
గంధకం చాభ్రకం చైవ భాగైకం శుద్ధసూతకమ్
మందూకం సర్వతుల్యం స్యా న్మర్దయే న్నింబుకద్రవైః
ఏకైకం భక్షయే చ్చాను జీరకం మధునా సహ
త్రిదోషోత్థ మతీసారం సజ్వరం వాథ విజ్వరమ్
సర్వరూప మతీసారం సంగ్రహాగ్రహణీం జయేత్
రసోభయనృసింహోయం అతీసారే సుపూజితః ॥

ఇంగిలీకం, నాభి, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, జీలకర్ర, పొంగించిన వెలిగారం, గంధకం, అభ్రకం, పాదరసం— ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి యెంతో అంత నల్లమందు. ఇవన్నీ కలిపి వేపచెక్కరసంతో మర్దించి వయోబలానుసారంగా తేనె కలిపిన జీలకర్రకషాయంతో వాడుకునేది. సందర్భం అనుసరించి ఇంకా అనేక అనుపానాలు వాడుకోవచ్చు.

ఇది త్రిదోషాలవల్లనూ పుట్టిన అతిసారమూ, తక్కిన సకల అతిసారాలూ, గ్రహణీ పోగొడుతుంది. జ్వరంతోవున్న అతిసారం కూడా తగ్గించేస్తుంది.

## ౨౭ అమృతాగుగ్గులు

అమృతాయాః పలశతం దశమూల్యా స్తథా శతమ్
పాఠా మూర్వా బలా తిక్తా దార్వీ గంధర్వహ స్తకాః
ఏషాం దశఫలాన్ భాగాన్ విభీతక్యాః శతం హరేత్
ద్వే శతే చ హరీతక్యా ఆమలక్యా స్తథా శతమ్
జలద్రోణత్రయే పక్వా చాష్టభాగావశేషితమ్
ప్రస్థం గుగ్గులు మాహృత్య ప్రస్థార్థం చ ఘృతం పచేత్
పాకసిద్ధా ప్రదాతవ్యం గుడూచ్యా స్సత్వ మేవ చ
పలద్వయం తథా శుంఠ్యాః పిప్పల్యా శ్చ పలద్వయమ్
తతో మాత్రాం ప్రయుంజీత జ్ఞాత్వా దోషబలాబలమ్

అష్టాదశసు కుష్ఠేషు వాతరక్తగదేషు చ
కామలా మామవాతం చ వహ్నిమాంద్యం భగందరమ్
పీనసం చ ప్రతిశ్యాయం ప్లీహాన ముదరం తథా
ఏతాన్ రోగాన్ నిహంత్యాశు భాస్కర స్తిమిరం యథా ॥

తిప్పతీగ నూరుపలాలు, దశమూలాలు నూరుపలాలు, పాఠ, చాగనార, బల, నేల వేము, మానుపసుపు, ఆముదపుచెట్టు వేళ్ళు— ఇవి ఒక్కొక్కటి పదేసిపలాలు. ఇవన్నీ మెత్తగా చితకగొట్టి అరుద్రోణాల నీళ్ళలో కలపాలి. మరిన్ని నూరుతాడి కాయలూ, రెండువందల కరకకాయలూ, ఉసిరికాయలు నూరూ కూడా చితకగొట్టి అందులో కలిపేది. ఉసిరికాయలు పచ్చివివేస్తే చితకగొట్టనక్కరలేదు. ఈజలం ఎనిమిదోవంతు మాత్రమే మిగిలేటట్టు కషాయం కాచి దించి చల్లబడ్డ తరవాత వడ బోసుకునేది.

ఆకషాయంలో ఒక ప్రస్థం మహిషాక్షిగుగ్గిలం, అర్ధప్రస్థం ఆవునెయ్యి వేసి మళ్ళీ వంటచెయ్యాలి. అది గట్టిపడేటప్పుడు రెండుపలాల తిప్పసత్తూ, రెండుపలాల సొంటిచూర్ణమూ, రెండుపలాల పిప్పళ్ళచూర్ణమూ కలిపి దించుకుని మాత్రలు కట్టుకునేది.

ఇది అష్టాదశకుష్ఠులూ తగ్గించేస్తుంది. వాతరక్తం, కామెర్లు, ఆమవాతం, పీనస, అగ్నిమాంద్యం, భగందరం, ప్రతిశ్యాయం, ప్లీహవృద్ధి, ఉదరవ్యాధులు పోగొడుతుంది.

## ౨౮. బృహచ్చంద్రప్రభావటి

క్రిమిరిపుదహనవ్యోష త్రిఫలామరదారు చవ్యభూనింబమ్
మాగధీమూలముస్తం సశటీవచాధాతుమాక్షికం చైవ
లవణక్షారనిశాయుగ కుస్తుంబురు గజకణాతివిషా
కర్షాంశకా న్యేవ సమాని కుర్యాత్
పలాష్టకం చాశ్మజితో ర్విదధ్యాత్
నిష్పత్రశుద్ధస్య పురస్య ధీమాన్
పలద్వయం లోహరజ స్తథైవ
సితాచతుష్కం పల మత్ర వంశ్యా

నికుంభకుంభత్రిసుగంధియుక్తమ్
చంద్రప్రభేయం గుటికా ప్రయోజ్యా
అర్శాంసి నిర్నాశయతే షడేవ
భగందరం పాండుకకామలాం చ
నిర్నష్టవహ్నేః కురుతే చ దీప్తిమ్
హంత్యామయాన్ పిత్తకఫానిలోత్థాన్
నాడీగతే మర్మగతే వ్రణే చ
గ్రంథ్యర్బుదే విద్రధిరాజయక్ష్మే
మేహే భగాఖ్యే ప్రబలే చ యోజ్యా
చక్షుఃక్షయే చాశ్మరి మూత్రకృచ్ఛ్రే
శుక్రప్రవాహే హ్యుదరామయే చ
తక్రానుపానం త్వథ మస్తుపానమ్
ఆజో రసో జాంగలజో రసో వా
పయో థవా శీతజలానుపానం
బలేన నాగ స్తురగో జవేన
దృష్ట్యా సుపర్ణ శ్శ్రవణై ర్వరాహః
కాంత్యా రతీశో ధిషణ శ్చ బుద్ధ్యా
నపానభోజ్యే పరిహార్య మస్తి
నశీతవాతాతపమైథునేషు
శంభుం సమభ్యర్చ్య కృతప్రణామం
ప్రాప్తా గుటీ చంద్రమసః ప్రసాదాత్
శుక్రదోషా న్నిహంత్యష్టౌ ప్రమేహా నపి వింశతిమ్
వలీపలితనిర్ముక్తో వృద్ధోపి తరుణాయతే
వృద్ధవైద్యోపదేశేన పలార్ధం రసగంధకమ్
కేవలం మూర్ఛితం వాపి పలం వా దాపయే ద్రసమ్

అభ్రకం చ క్షిపే త్కించిత్ పలమానం, భిషగ్వరః
సంమర్ద్య మధుసర్పిభ్యా మాదా రక్తిచతుష్టయమ్
భక్ష్యంవృద్ధ్యా యథాయుక్తి మావస్యాష చతుష్టయమ్
త్రివృద్దంతీత్రిజాతానాం కర్షమానం పృథక్పృథక్ ॥

వాయువిడంగాలు, చిత్రమూలం, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, దేవదారు, చవ్యం, నేలవేము, పిప్పలీమూలం, తుంగముస్తలు, కచ్చూరాలు, వస, హేమమాక్షికం, సైంధవలవణం, యవక్షారం, సర్జిక్షారం, పసుపు, మానుపసుపు, ధనియాలు, గజపిప్పళ్ళు, అతివస— ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క కర్షం. గోమూత్రశిలాజిత్తు ఎనిమిదిపలాలు. శుద్ధమహిషాక్షి గుగ్గిలం రెండుపలాలు. లోహభస్మం రెండుపలాలు. కలకండ నాలుగుపలాలు. తవాక్షీరి, దంతివేళ్ళు, తెగడ, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం— ఇవి ఒక్కొక్క పలం. ఇవన్నీ కలిపి నీళ్ళతో నూరి చిన్నకుంకుడుగింజలంతేసి మాత్రలు కట్టి వాడేది.

ఈయోగంలో వృద్ధవైద్యులు కొందరు ఒకపలం పాదరసమూ, ఒకపలం గంధకమూ, కూడా చేర్చడం కద్దు. అభ్రకమున్నూ ఒకపలం కొందరుచేరుస్తారు.

ఇది నానావిధాల మూలశంకవ్యాధులూ పోగొడుతుంది. మరిన్నీ భగందరం, పాండువు, కామెర్లు, అగ్నిమాంద్యం, నాడీగతవ్రణాలు, మర్మగతవ్రణాలు, గ్రంధులూ, అర్బుదాలూ, విద్రధులూ, రాజయక్ష్మ, మూత్రాశ్మరీ, మూత్రకృచ్ఛ్రమూ, శుక్రనష్టమూ, ఉదరవ్యాధులూ తగ్గిస్తుంది.

దీనికి మజ్జిగ, పెరుగుమీది తేట, మేకపాలు, చల్లనిమంచినీళ్ళు — ఇవి అనుపానాలు.

ఇది సమస్తశుక్రదోషాలూ, వింశతిప్రమేహాలూ, వలీపలితాలూ పోగొడుతుంది. ఇది సేవిస్తే వృద్ధుడైనా యువకు డవుతాడు.

ఇది వాడేటప్పుడు పథ్యం లేశమూ చెయ్యనక్కరలేదు.

## ౨౫ నిత్యానందరసం

హింగూలసంభవం సూతం గంధకం మృతతామ్రకమ్
కాంస్యం వంగం హారితాలం తుత్థం శంఖం వరాటికా
త్రికటు త్రిఫలాలోహం విడంగం పటుపంచకమ్
చవికా పిప్పలీమూలం హాపుషా చ వచా తథా

శటీ పాఠా దేవదారు ఏలా చ వృద్ధదారకమ్
త్రివృతాం చిత్రకం దంతీం గృహీత్వా తు పృథక్పృథక్
ఏతాని సమభాగాని సంచూర్ణ్య గుడకీకృతమ్
హారీతకీరసం దత్వా దశగుంజోన్మితం శుభమ్
ఏకైకం భక్షయే న్నిత్యం శీతంచాను పిబే జ్జలమ్
శ్లీపదం కఫవాతోత్థం రక్తమాంసాశ్రితం చ యత్
మేదోగతం ధాతుగతం నిహంతి నాత్ర సంశయః
అర్బుదం గండమాలాం చ వాతరక్తం సుదారుణమ్
కఫవాతోద్భవం రోగం అంత్రవృద్ధిం చిరంతనీమ్
వాతరక్తే వాతకఫే గుదరోగే కృమౌ తథా
అగ్నివృద్ధిం కరో త్యేష బలం వర్ణం చ సుస్థతామ్
శ్రీవర్ధమాననాథేన నిర్మితో విశ్వసంపదే
నిత్యానందరస శ్చాయం మహాశ్లీపదనాశనః
రక్తజే పిత్తజే చాపి శ్లీపదే యోజయే దముమ్
నాతఃపరతరం కించి ద్విద్యతే శ్లీపదామయే ॥

ఇంగిలీకరసం, గంధకం, తామ్రభస్మం, కంచుభస్మం, వంగభస్మం, తాళకం, మైలతుత్థం, శంఖభస్మం, గవ్వలభస్మం, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, లోహభస్మం, వాయువిడంగాలు, సైంధవలవణం, సముద్రలవణం, సౌవర్చలవణం, కాచలవణం, బిడాలవణం, చెవ్యం, బోడతరం, పిప్పలీమూలం, వస, కచ్చూరాలు, పాఠ, దేవదారు, ఏలకులు, వృద్ధదారకం, తెగడ, చిత్రమూలం, నేపాళపువేళ్ళు,—ఇవి సమభాగాలు. ఇవన్నీ మెత్తగాదంచి కరక్కాయ కషాయంతో నూరి సెనగగింజలంతేసి మాత్రలు చేసి వాడేది. దీనికి మంచినీళ్ళే అనుపానం.

ఇది బోదవ్యాధికి తిరుగులేనిది. కఫంవల్లా, వాతంవల్లా పుట్టినదీ, రక్తగతమూ, మాంసగతమూ, మేదోగతమూ, ధాతుగతమూ అయిన బోదవ్యాధి నిది పోగొడుతుంది. అర్బుదం, గండమాల, వాతరక్తం, అంత్రవృద్ధి, మూలశంక, కృమిరోగం, తగ్గిస్తుంది. అగ్నిదీప్తీ, బలమూ, పుష్టీ, వీర్యవృద్ధీ కలిగిస్తుంది.

## ౩౦ శ్లీపదగజకేశరి

వ్యోషామృతం యమానీ చ సూతోఽగ్ని ర్గంధకం శిలా
సౌభాగ్యం జయపాలం చ చూర్ణ మేకత్ర కారయేత్
భృంగగోక్షురజంబీరార్ద్రికతోయై ర్విమర్దయేత్
అస్య రక్తిద్వయం ఖాదే దుష్ణతోయానుపానతః
శ్లీపదం దుస్తరం హంతి ప్లీహానం హంతి సేవితః ॥

సొంటి, పిప్పలి, మిరియాలు, నాభి, వాము, రసం, చిత్రమూలం, గంధకం, మణిశిల, పొంగించిన వెలిగారం, నేపాళాలు — ఇవి సమభాగాలు. ఇవన్నీ మెత్తగా చితక గొట్టి గుంటకలగరరసంతోనూ, పల్లేరురసంతోనూ, నిమ్మకాయరసంతోనూ, అల్లపు రసంతోనూ మర్దనాచేసి కందిగింజలంతేసి మాత్రలుచేసి వేడినీటి అనుపానంతో వాడేది.

ఇది బోదవ్యాధి ఎంత తీవ్రంగావుండినా తగ్గించేస్తుంది. ప్లీహవ్యాధులూ, పోగొడుతుంది.

గమనిక :— బోదవ్యాధిలో సాధారణంగా మలబంధబాధ వుంటుంది. అలా వుండినవారు ఉదయం నిత్యానందరసమూ, రాత్రి పరుండబోయేటప్పుడిదీ వాడుతూ బోద ఉండినచోట, విడంగాదితైలం మర్దనాచేసుకోవాలి.

## ౩౧ తారకేశ్వరరసం

మృతం సూతం మృతం లోహం మృతం వంగాభ్రకం సమమ్
మర్దయే న్మధునా చాహ్నో రసోఽయం తారకేశ్వరః
మాషమాత్రం లిహేత్ క్షౌద్రై ర్బహుమూత్రాపనుత్తయే
ఔదుంబరం పక్వఫలం చూర్ణితం మధునా లిహేత్ ॥

రససిందూరం, లోహభస్మం, వంగభస్మం, అభ్రకభస్మం — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి తేనెతో మర్దించి కందిగింజ లంతేసి మాత్రలు చేసుకుని సేవించేది. మేడిపండుచూర్ణంలో తేనెకలిపి అది అనుపానంగా వాడుకునేది.

బహుమూత్రవ్యాధిని ఇది పోగొడుతుంది.

## ౩౨ ప్రదరారి లోహం

వత్సకస్య తులాం సమ్యగ్జలద్రోణే విపాచయేత్
అష్టభాగావశిష్టం తు కషాయ మవతారయేత్
వస్త్రపూతే ఘనీభూతే ద్రవ్యాణీమాని దాపయేత్
సమంగా శాల్మలం పాఠా బిల్వం ముస్తం చ ధాతకీ
అరుణా వ్యోమకం లోహం ప్రత్యేకం తు పలం పలమ్
కోలమాత్రం ప్రయుంజీత కుశమూలం పయోఽపివా
శ్వేతం రక్తం తథా నీలం పీతం ప్రదరదుస్తరమ్
కుక్షిశూలం కటీశూలం దేహశూలం చ సర్వగమ్
ప్రదరారి రయం లోహో హంతి రోగాన్ సుదుస్తరాన్
ఆయుఃపుష్టికరం చైవ బలవర్ణాగ్నివర్ధనః ॥

కొడిశచెక్క పచ్చిది నూరుపలాలు మెత్తగా చితగగొట్టి రెండుద్రోణాల నీటిలో కలిపి ఎనిమిదో వంతు మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. ఆకషాయం లోహపాత్రలో పోసి కాచి గట్టిపడేటప్పుడు—

మంజిష్ఠ, బూరుగుబంక, పాఠ, మారేడుపిందెలు, తుంగముస్తలు, ఆరెపువ్వు, అతివస, అభ్రకభస్మం, లోహభస్మం — ఇవి ఒక్కొక్క పలం చొప్పున మెత్తగా దంచి వస్త్రగాలితం చేసి ఉంచుకునేది. ఈచూర్ణం గట్టిపడుతున్న ఆకషాయంలో కలిపి, దించి మాత్రకట్టుకు వచ్చిన తరవాత చిన్న కుంకుడుగింజలంతేసి మాత్రలు కట్టుకుని వాడేది. దీనికనుపానం దర్భవేళ్ళ కషాయం, లేక పాలు.

ఇది, తెలుపు, ఎరుపు, నలుపు, పచ్చని ప్రదరరోగం పోగొడుతుంది. కుక్షిశూల, కటిశూల, దేహశూల కూడా పోగొడుతుంది. పుష్టీ, బలమూ, తేజస్సూ కలిగిస్తుంది. ఆకలి వృద్ధిచేస్తుంది. దీర్ఘాయువు ప్రసాదిస్తుంది.

## ౩౩ కామినీవిద్రావణరసం

ఆకారకరభం శుంఠీ లవంగం కుంకుమం కణామ్
జాతీఫలం చ తత్కోశం చందనం కార్షికం పృథక్
హింగులం గంధకం శాణం ఫణిఫేనం పలోన్మితమ్

గుంజాత్రయమితాం కుర్యాత్సంమర్ద్య వటికాం భిషక్
పయసా పరిపీతోఽయం శుక్రస్తంభకరో రసః
విద్రావణః కామినీనాం వశీకరణ ఏవ చ ॥

అక్కలకర్ర, సొంటి, లవంగాలు, కుంకుమపువ్వు, పిప్పళ్ళు, జాజికాయ, జాపత్రి, చందనం — ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్కకర్షం. ఇంగిలీకమూ, గంధకమూ, ఒక్కొక్క అరతులం. నల్లమందు ఎనిమిది తులాలు.

ఇవన్నీ కలిపి నీటితో నూరి మూడుగురిగింజల యెత్తున మాత్రలు చేసి పాలతో పుచ్చుకునేది.

ఇది శుక్రస్తంభనంచేస్తుంది. స్త్రీలను కరిగించి వశవర్తులను చేస్తుంది.

గమనిక :— ఈమాత్రలు వారాని కొక్కనాడు మాత్రమే వాడుట మంచిది.

## ౩౪ మన్మథాభ్రరసం

రసగంధకయో ర్గ్రాహ్యం పల మేకం సుశోధితమ్
అభ్రం నిశ్చంద్రికం దద్యాత్పలాంశం చ విచక్షణః
కర్పూరం తోలకం దద్యాత్ వంగం చ కోలసమ్మితమ్
తామ్రం తోలార్థకం తత్ర నిశ్శేషం మారితం పునః
లోహకర్షం సుజీర్ణం చ వృద్ధదారం చ జీరకమ్
విదారీం శతమూలీం చ క్షురబీజం బలాం తథా
మర్కట్యతివిషాం చైవ జాతీకోషఫలే తథా
లవంగం విజయాబీజం శ్వేతసర్జం యమానికామ్
శాణభాగాన్ గృహీత్వైతాన్ ఏకీకృత్యైవ పేషయేత్
గుంజాద్వయం తు కర్తవ్యం కోష్ణం క్షీరం పిబే దను
గృహే యస్య శతం నార్యో విద్యంతేతివ్యవాయినః
న తస్య లింగశైథిల్య మౌషధస్యాస్య సేవనాత్
న చ శుక్రం క్షయం యాతి న బలం ప్రాసతాం వ్రజేత్
కామరూపో భవే న్నిత్యం వృద్ధ ష్షోడశవర్షవత్

రసః శ్రీమన్మథాభ్రోయం మహేశేన ప్రకాశితః
అస్య భక్షణమాత్రేణ కాష్ఠం జీర్యతి తత్‌క్షణాత్
నాశయే ద్ధ్వజభంగాదీన్ రోగాన్ యోగకృతానపి ॥

పాదరసం ఒకపలం, గంధకం ఒకపలం, నిశ్చంద్రికమైన అభ్రకభస్మం 4 తులాలు, పచ్చకర్పూరం ఒక తులం, వంగభస్మం ఒకతులం, పూర్తిగా మృతం అయిన తామ్రభస్మం అరతులం, లోహభస్మం రెండుతులాలు, వృద్ధదారకం, జీలకర్ర, నేలగుమ్మడు, పిల్లితేగలు, నీరుగొబ్బివిత్తులు, బల, దూలగొండివిత్తులు, అతివస, జాజికాయ, జాపత్రి, లవంగాలు, గంజాయివిత్తులు, సర్జరసం, వాము — ఇవి ఒక్కొక్కటి అరతులం చొప్పున. ఇవన్నీ కలిపి నీళ్ళతో నూరి రెండుగురిగింజల యెత్తున మాత్రలు కట్టుకుని వాడేది.

ఇది అపారమైన వీర్యవృద్ధీ, నరాలకు శక్తీ కలిగించి సంభోగశక్తి వృద్ధిచేస్తుంది. ముసలితనం రానివ్వదు. వచ్చింది పోగొడుతుంది.

## ౩౫. త్రిభువనకీర్తిరసం

హింగులం చ విషం వ్యోషం టంకణం మాగధీం శిఫామ్
సంచూర్ణ్య భావయే త్త్రేధా సురసార్ద్రికహేమభిః
రసః త్రిభువనకీర్తి ర్గుంజైకార్ద్రకసేవనా ద్వై
వినాశయే జ్జరా న్సర్వా న్సన్నిపాతా త్రయోదశ ॥

ఇంగిలీకం, నాభి, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, పొంగించిన వెలిగారం, పిప్పళ్ళు, పిప్పలిమోడి — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి తులసిఆకుల రసమూ, అల్లపురసమూ, ఉమ్మెత్తఆకులరసమూ వీటితో క్రమంగా బాగా మర్దనాచేసి ఒక్కొక్క గురిగింజయెత్తున మాత్రలు కట్టి వాడుకునేది. దీని కనుపానం ముఖ్యంగా అల్లపురసం. పరిస్థితులనుపట్టి ఇతరానుపానాలు కూడా వాడుకోవచ్చు.

ఇది సమస్తజ్వరాలూ పోగొడుతుంది. సన్నిపాతాలున్నా జయిస్తుంది.

## ౩౬. సూర్యావర్తి

మృతాభ్రం మాక్షికం చైవ హేమకార్పాసబీజకమ్
కాకబింబ్యాశ్చ బీజాని గుడూచీసత్త్వమేవ చ

టంకణం మౌక్తికం చైవ గీర్వాణకుసుమం తథా
హింగులం సర్వతుల్యం స్యా జ్జంబీ రామ్లేన మర్దయేత్
ద్రాక్షార్ద్రకరసై శ్చాపి భావయే త్సప్తవారకమ్
గుంజామాత్రప్రమాణేన వ్యానుపానవిశేషతః
సర్వపిత్తగదధ్వంసీ వాతపిత్తగదాపహః
ఛర్దిహిక్కా వినాశ శ్చ గ్రహణీదోషకం జయేత్
మందాగ్ని మమ్లపిత్తం చ కాసం శ్వాస మరోచకమ్
సూర్యావర్తరసో నామ వ్యాళ్యాని దేవకీర్తితః ॥

అభ్రకభస్మం. హేమమాక్షికభస్మం, పైడిపత్తిగింజలపప్పు, కాకిదొండగింజల పప్పు, తిప్పసత్తు, పొంగించిన వెలిగారం, ముత్యాలభస్మం, లవంగాలు — ఇవి సమభాగాలు. ఇవన్నీ యెంతో అంత ఇంగిలీకం.

యోగంలో ముత్యాలభస్మం చెప్పివుండినా అనుభవంలో వైద్యులందరూ దానికి బదులు ముత్యపుచిప్పల భస్మమే వాడుతున్నారు.

ఇవన్నీ కలిపి, నిమ్మకాయరసంతోనూ, ద్రాక్షపళ్ళకషాయంతోనూ, అల్లపురసంతోనూ ఏడేసిమార్లు మర్దనాచేసి స్థితిగతులకు తగిన అనుపానాలతో గురిగింజయెత్తు చొప్పున వాడేది.

ఇది సమస్తపిత్తవికారాలూ తగ్గించేస్తుంది. వాతపిత్తవ్యాధులున్నా హరిస్తుంది. వాంతి, ఎక్కిళ్ళు, గ్రహణి, అగ్నిమాంద్యం, అమ్లపిత్తం దగ్గు, వగర్పు, అరోచకం— ఇవన్నీ పోగొడుతుంది.

## ౩౭ రజః ప్రవర్తకరసం

టంకణం హింగు కాసీసం కన్యాసారం సమాంశకమ్
కుమారీస్వరసే మర్ద్యం చణకప్రమితా వటీ
రజోరోధం కష్టరజో వేదనా శ్చ తదుద్భవాః
రజఃప్రవర్తినీనామ వటీ తూర్ణం వినాశయేత్
భాషితా నీలకంఠేన వహ్నేః కాష్ఠచయం యథా ॥

పొంగించిన వెలిగారం, పచ్చిఇంగువ, కాసీసనిందూరం, ముసాంబరం — ఇవి సమ భాగాలు. కల్వంలో కలబందరసంపోసి దానిలో పచ్చిఇంగువ వేసి ఒకరాత్రి నాననిచ్చి తరవాత తక్కిన వస్తువులు కలిపి చక్కగా మర్దించి సెనగగింజ లంతేసి మాత్రలు చేసి వాడుకునేది. మందు మాత్రకట్టుకు రాగానే ఏకబిగిని మాత్రలు చేసెయ్యాలి. ఒక్క గంట వూరుకున్నా గట్టిపడి మరి మాత్ర కాదు. మళ్ళీ కలబంద రసాన మర్దించవలసివుంటుంది.

ఇది రజోరోధమూ, కష్టరజస్సూ పోగొడుతుంది. ఋతుసంబంధమైన శూలలు మొదలైనవి హరిస్తుంది. ఇది గర్భచిహ్నాలు కల స్త్రీలు వాడితే గర్భస్రావం జరుగుతుంది.

## ౩౭. వాతవిధ్వంసిరసం

రసం గంధకం నాగవంగౌ చ లోహం
తథా తామ్రజం వ్యోమ నిశ్చంద్రకం చ
కణా టంకణం నాగరం చోషణం వై
పృథ గ్భాగ మేకం క్షిపే త్తుల్యమధ్యే
తతో వత్సనాభం చతుష్కార్థభాగం
దృఢం మర్దయే ద్వ్యోషజై శ్చ త్రివారమ్
వరాచిత్రకై ర్మార్కవై: కుష్ఠజాద్భి:
పృథ గ్భావయే త్సింధువారార్ద్రివాసై:
తథా మోహినీజంభనీరై: పృథగ్వై
మహాన్ వాతవిధ్వంసకోయం రస శ్చ
సమీరే చ శూలే తథా శ్లేష్మరోగే
గ్రహణ్యాం తథా సన్నిపాతే చ మూకే
అపస్మారమాంద్యే చ శీతే చ పిత్తే
ప్లీహోదరే కుష్ఠరోగే చ దద్యాత్
స్త్రియ స్సూతికావాతరోగే తథైవ
ద్విగుంజం ప్రదద్యా దిమం సూతరాజం ।

పాదరసం, గంధకం, నాగభస్మం, లోహభస్మం, తామ్రభస్మం, అభ్రకభస్మం, పిప్పళ్ళు, పొంగించిన వెలిగారం, సొంటి, మిరియాలు — ఇవి ఒక్కొక్క భాగం నాభి నాలుగున్నరభాగాలు, ఇవన్నీ మెత్తగా చూర్ణించి, త్రికటుకషాయం, త్రిఫలకషాయం, చిత్రమూలరసం, గుంటకలగరరసం, చెంగల్వకోష్టుకషాయం, వావిలాకు రసం, అల్లపురసం, అడ్డసరపురసం, గంజాయికషాయం, నిమ్మకాయరసం — వీటితో మూడేసిమర్దనాలు చేసి వయోబలావస్థల ననుసరించి వాడుకునేది.

ఇది వాతవ్యాధు లన్నీ పోగొడుతుంది. సూతికావాతానికిది చెప్పినమందు, శూల, శ్లేష్మరోగాలు, గ్రహణి, సన్నిపాతజ్వరం, మూకత్వం, అపస్మారం. మద్దుతనం, శీతం, పిత్తం, ప్లీహవ్యాధులు, ఉదరవ్యాధులు, కుష్ఠు, పోగొడుతుంది.

ఇది ఒక్కొక్కరసంతో కొందరు ఒక్కొక్కమాటే మర్దనా చెయ్యడం వుంది. అది తప్పు. మూడేసిమాట్లు చెయ్యాలి.

## 3. వాతగజాంకుశం

అష్టభాగా రస స్యాపి విషతింద్కో, స్తథైవచ
గంధకస్య, త్రిభాగం స్యా త్కటుత్రయఫలత్రయమ్
గుంజామాత్రం వటీం ఖాదే దశీతీవాతనాశనమ్
వాతగజాంకుశో నామ్నా హ్యూరుస్తంభం నిహంతి చ ॥

పాదరసం 8 భాగాలు, విషముష్టిగింజలపప్పు 8 భాగాలు, గంధకం 8 భాగాలు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరక, తాడి, ఉసిరికలు — ఇవి మూడేసిభాగాలు.

వృద్ధవైద్యుల సంప్రదాయం ప్రకారం నిమ్మకాయరసాన మర్దనా. మాత్ర గురిగింజయెత్తు.

ఇది 80 వాతాలూ హరిస్తుంది. ఊరుస్తంభవాతాని కిది ప్రత్యేకౌషధం. అనుపానభేదాలతో అనేకవ్యాధులమీద పనిచేస్తుంది.

ఈయోగంలో గంధకం మూడుభాగాలు అని చెప్పిన టీక లున్నాయి. అది తప్పు. సమానంగా అయినా గంధకం లేకపోతే రసం జీర్ణం కాదు. కటుత్రియమూ, ఫలత్రయమూ మొత్తాన మూడేసి భాగాలు వేసే సంప్రదాయం కూడా వుంది.

## ౪౦ అజీర్ణబలకాలానలరసం

ద్విపలం శుద్ధసూతం చ గంధకం చ సమం మతమ్
లోహం తామ్రం హరితాళం విషం తుత్థం సవంగకమ్
పలప్రమాణం చ పృథ గ్లవంగం టంకణం తథా
దంతిమూలం త్రివృచ్చూర్ణం, ఏకైకపలసమ్మితమ్
అజమోదా యమానీ చ క్షారద్వయం లవణాని చ
పృథ గర్ధపలం గ్రాహ్యా మేకీకృత్య చ భావయేత్
ఆర్ద్రకస్వరసే నైవ వింశత్యా పంచకోలజైః
దశధా భావయే త్తోయై, ర్గుడూచీనాం రసై ర్దశ
సర్వార్థం మరిచం దత్వా కాచకూప్యాం చ ధారయేత్
చణమాత్రాం వటీం కృత్వా ఛాయాయాం పరిశోషయేత్
రసోజీర్ణబలకాలానల ఏషః ప్రకీర్తితః
ఆమవాతకులధ్వంసీ ప్లీహపాండుగదాపహః
ప్రమేహానాహవిష్టంభసూతికాగ్రహణీహరః
శ్వాసకాసప్రతిశ్యాయమూత్రకృచ్ఛ్ర [illegible] వినాశనః
అమ్లపిత్తం చ శూలం చ భగందరగుదోద్భవా
అష్టోదరాణి ప్లీహానం చ యకృతం హంతి దారుణమ్
ఆతురం భోజయిత్వాతు ఖాదయే చ్చ రసోత్తమమ్
అర్ధయామేన తత్సర్వం భస్మీభవతి నిశ్చితమ్
చతుర్విధరసోపేతం మహాభోజన మిచ్ఛతః
భోజనస్య నృపతేః కాంక్షా భోజనే కృపయా కృతః
గహనానందనాథేన సర్వలోకహితైషిణా ॥

పాదరసమూ, గంధకమూ రెండేసిపలాలు. లోహభస్మం, తామ్రభస్మం, తాళకం, నాభి, మైలతుత్థం, వంగభస్మం, లవంగాలు, పొంగించిన వెలిగారం, నేపాళపువేళ్ళు, తెగడ— ఇవి ఒకొ్కక్కపలం. అజామోదం, వాము, సర్జిక్షారం, యవక్షారం,

సాముద్రలవణం, సౌవర్చలవణం, సైంధవలవణం, బిడాలవణం, కాచలవణం — ఇవి ఒక్కొక్కటి అరపలం. ఇవన్నీ మెత్తగా చూర్ణించి గట్టి పింగాణీ బేసినులో పోసి, వరసగా, అల్లపురసంతో యిరవై భావనలూ, పంచకోలకషాయంతో పదిభావనలూ, తిప్పతీగరసంతో పదిభావనలూ చెయ్యాలి. అప్పుడు 74 తులాల మిరియాలు చూర్ణించి అందులో కలిపి మళ్ళీ తిప్పతీగరసంతో బాగా మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుచేసి వాడుకునేది.

ఇది ఆమవాతం నిర్మూలం చెయ్యడంలో చాలా శక్తి కలది. మరిన్ని ప్రమేహాలు, ఆనాహమూ, విష్టంభమూ, మూత్రకావ్యాధులూ, గ్రహణీ, దగ్గూ, వగర్పూ, ప్రతిశ్యాయమూ, రాజయక్ష్మా, క్షయా, ఆమ్లపిత్తమూ, శూలా, భగందరమూ, మూలశంకలూ, అష్టోదరాలూ, ప్లీహవ్యాధులూ, యకృద్వ్యాధులూ పోగొడుతుంది. కంఠందాకా భోజనంచేసి ఈమందు వేసుకుంటే అర్ధజాములో అదంతా జీర్ణం అయిపోతుంది.

## లఘు క్రవ్యాదరసం

పారదా ద్ద్విగుణం గంధ మర్ధాంశం మృతలోహకమ్
పిప్పలీ పిప్పలీమూల మగ్ని శుంఠీ లవంగకమ్
లోహసామ్యం పృథక్కుర్యా ద్రససామ్యం సువర్చలమ్
టంకణం మరిచంచాపి గంధతుల్యం ప్రదాపయేత్
ఏత ద్వి మూర్ణ్య యత్నేన భావయే త్సప్తధామ్లకైః
ఏత ద్రసాయనం శ్రేష్ఠం మాషమాత్రం ప్రదాపయేత్
తక్రేణ కేవలం వాపి దద్యా ద్భోజనపాచనే
శీఘ్రం తజ్జీర్యతే భుక్తం దీపనం భవతి ధ్రువమ్
సర్వాజీర్ణప్రశమనం లఘుక్రవ్యాదసంజ్ఞితమ్ ॥

పాదరసం 1 భాగం. గంధకం 2 భాగాలు. లోహభస్మం, పిప్పళ్ళు, పిప్పలిమోడి, చిత్రమూలం, సొంటి, లవంగాలు — ఇవి ఒక్కొక్క అరభాగం. సౌవర్చలవణం 1 భాగం. పొంగించిన వెలిగారం, మిరియాలు — ఇవి రెండేసిభాగాలు. ఇవి మెత్తగాచూర్ణించి. అమ్లవేతసకషాయం, నిమ్మకాయలరసం, మాదీఫలరసం, పుల్లదబ్బపళ్ళరసం, దానిమ్మపళ్ళరసం, సెనగపులుసు, నారింజపళ్ళరసం — వీటితో మర్దించి మాషంయెత్తు కొలాదు వాడుకునేది. అనుపానం మజ్జిగ.

ఇది సకలాజీర్ణాలూ పోగొడుతుంది. తిన్నది వెంటనే జీర్ణింపచేస్తుంది. ఆకలి హెచ్చుచేస్తుంది.

## ౪౨ సిం దూ ర భూ ష ణం

శ్లో॥ సుధాతురగంధకటంకణాన్
అర్ద్రిహంసపదకాంచనార్ద్రిజైః
స్నిగ్ధమర్ది సిందూరభూషణమ్
గర్భిణీగదనికృంతనే మతమ్ ॥

అభ్రకభస్మం, రససిందూరం, గంధకం, పొంగించిన వెలిగారం — ఇవి సమభాగాలు. ఇవన్నీ చేర్చి అల్లపురసంతోనూ, హంసపాదిఆకురసంతోనూ, నల్లఉమ్మెత్తాకురసంతోనూ, పచ్చిపసుపుకొంపలరసంతోనూ మర్దించి వాడుకునేది.

ఇది గర్భవతులకు కలిగే ఓకిరింత, అరుచి, అగ్నిమాంద్యం, తలనొప్పి మొదలైన సమస్తవికారాలూ తగ్గించేస్తుంది. పురుషులకున్నూ ఈవ్యాధులలో వాడవచ్చు.

## ౪౩ ఆ మ కు ఠా ర ం

జాతీఫలం త్రికటుకం టంకణం రసగంధకౌ
నిర్యాసం వత్సనాభం చ ముస్తా కుటజచిత్రకౌ
వరాచాతివిషాదీచా నిర్యాసక్షార రామఠమ్
సర్వం సంమర్ద్య విజయాస్వరసేన దినత్రయమ్
వల్లప్రమాణవటికాం శుంఠీద్రావానుపానతః
ఆమశూల మతీసారం గ్రహణీం చ చిరంతనమ్
ఏష ఆమకుఠారాఖ్యో రస స్త్రైలోక్యపూజితః ॥

జాజికాయ, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, పొంగించిన వెలిగారం, రసం, గంధకం, నల్లమందు, నాభి, తుంగముస్తలు, కొడిశపాలవిత్తులు, చిత్రమూలం, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, అతివస, సౌవర్చలవణం. బూరుగుజిగురు, సర్జిక్షారం, యవక్షారం, ఇంగువ — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి గంజాయి రసాన మూడు దినాలు మర్దించి వల్లప్రమాణంగా సొంటి కషాయంతో వాడేది.

ఇది ఆమశూల, అతిసారం, గ్రహణి పోగొడుతుంది.

## ౪౪ చిత్రకాదిగుటికలు

చిత్రకం పిప్పలీమూలం ద్వౌ క్షారౌ లవణాని చ
వ్యోషం హింగ్వజమోదం చ చవ్య మేకత్ర చూర్ణయేత్
గుటికా మాతులుంగస్య దాడిమస్య రసేన వా
కృతా విపాచయ త్యామం దీపయ త్యాశు చానలమ్ ॥

చిత్రమూలం, పిప్పలిమోడి, సర్జిక్షారం, యవక్షారం, సౌవర్చలవణం, సైంధవలవణం, బిడాలవణం, కాచలవణం, సముద్రలవణం, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, వేయించిన ఇంగువ, అజామోదం, చవ్యం — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి మాదీఫలరసంతో గాని, దానిమ్మపండురసంతో గాని, మర్దించి సెనగగింజల కంటే కొంచెం పెద్దమాత్రలు చేసి వాడుకునేది.

నాఅనుభవంలో, ఇవి, నిమ్మకాయరసంతోనూ, పుల్లదబ్బరసంతోనూ, మాదీఫలరసంతోనూ, పుల్లదానిమ్మరసంతోనూ, చివర నారింజపళ్ళరసంతోనూ మర్దించి వాడుతున్నాను.

ఇది ఆమపాచనం చేస్తుంది. ఆకలి వృద్ధిచేస్తుంది. శూల, విరేచనాలు కడుతుంది.

## ౪౫ ముస్తకాదివటి

అబ్దాత్పలద్వయం క్షుణ్ణం కణాకర్పూరహింగుతః
పలం పలం గృహీత్వా తు మర్దయిత్వా వటీం చరేత్
వల్లద్వయమితాం ఖాదేత్ కర్పూరాంబుసువాసితామ్
అతీసార మజీర్ణం చ విషూచీం ఘోరరూపిణీమ్
అరోచకం వహ్నిమాంద్యం గ్రహణీ మపి దారుణామ్
కాసం పంచవిధం చైవ నాశయే దవికల్పతః ॥

తుంగముస్తలు రెండుపలాలు, పిప్పళ్ళు, పచ్చకర్పూరం, వేయించిన ఇంగువ — ఇవి ఒక్కొక్కపలం — ఇవన్నీ కలిపి నీటితో మర్దించి కందిగింజలంతేసి మాత్రలు చేసి అనుపానవిశేషాలతో వాడుకునేది.

ఇది అతిసారం, అజీర్ణం, విషూచి (కలరా) అరోచకం, అగ్నిమాంద్యం, గ్రహణి, పంచకాసలు పోగొడుతుంది.

## ౪౭. స్వాయమగ్ని రసం

మరిచాబ్ద వచా కుష్ఠం సమాంశం విష మేవ చ
ఆర్ద్రికస్య రసైః పిష్ట్వా ముద్గమాత్రం తు కారయేత్
స్వాయమగ్నిరసో నామ సర్వాజీర్ణప్రశాంతయే ॥

మిరియాలు, తుంగముస్తలు, వస, చెంగల్వకోష్టు, నాభి — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి అల్లపురసంతో మర్దించి పెసరగింజలంతేసి మాత్రలు చేసి అనుపాన విశేషాలతో వాడుకునేది.

ఇది అజీర్ణవ్యాధు లన్నీ పోగొడుతుంది.

## ౪౮ శంఖచూడ రసం

రసాభ్రహేమభస్మాని వైక్రాంతం సర్వతుల్యకమ్
సర్వపంచగుణం శంఖచూర్ణం శుభ్రం విమర్దయేత్
లేహయే న్మధునా మాషచతుష్కం సానుపానకమ్
హిక్కాం పంచవిధాం హంతి మృత్యుమూర్ఘ్నో రపి తత్క్షణాత్ ॥

రససిందూరం, అభ్రకభస్మం, స్వర్ణభస్మం — ఇవి సమభాగాలు. వైక్రాంతభస్మం 3 భాగాలు, శంఖభస్మం 30 భాగాలు. ఇవన్నీ పొడిగానే బాగా కలిసేటట్లు, మర్దించేది. ఇది తేనెతో వాడేది.

ఇది అయిదువిధాలైన ఎక్కిళ్ళూ పోగొడుతుంది. మృత్యువు తప్ప దనుకున్నప్పుడు వచ్చే ఎక్కిళ్ళునూ తగ్గించేస్తుంది.

## ౪౯ అగ్నికుమార రసం

రసేంద్రగంధౌ సహ టంకణేన సమం విషం యోజ్య మిహ త్రిభాగమ్
కపర్దశంఖా విహ నేత్రభాగా మరీచ మత్రాష్టగుణం ప్రదేయమ్
సుపక్వజంబీరరసేన ఘృష్టః సిద్ధో భవే దగ్నికుమార ఏషః
విషూచికాజీర్ణసమీరణార్తే దద్యా ద్ద్వివల్లం గ్రహణీగదే చ ॥

పాదరసం, గంధకం, పొంగించిన వెలిగారం — ఇవి ఒక్కొక్క భాగం, నాభి 3 భాగాలు, గవ్వలభస్మం, శంఖభస్మం — ఇవి రెండేసి భాగాలు. మిరియాలు 8 భాగాలు. ఇవన్నీ కలిపి నిమ్మకాయరసాన మర్దించి మినపగింజ అంతేసి మాత్రలు చేసి అప్పటికి తగిన అనుపానంతో వాడుకునేది.

ఇది అజీర్ణం, విషూచి (కలరా) గ్రహణి, వాంతులూ పోగొడుతుంది. అతిసారం కడుతుంది.

## ౪౯ ఆదిత్యరసం

దరదం చ విషం గంధం త్రికటు త్రిఫలా సమమ్
జాతీఫలం లవంగం చ లవణాని చ పంచ వై
సర్వ మేకీకృతం చూర్ణం అమ్లయోగేన సప్తధా
భావయిత్వా వటీ కార్యా గుంజార్ధప్రమితా బుధైః
రసో హ్యాదిత్యసంజ్ఞోయం అజీర్ణక్షయకారకః
భుక్తమాత్రం పాచయతి జఠరానలదీపకః ॥

ఇంగిలీకం, నాభి, గంధకం, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకపొలుపు, తాడికాయ బెరడు, ఉసిరికపప్పు, జాజికాయ, లవంగం, సముద్రలవణం, సౌవర్చలవణం, సైంధవలవణం, బిడాలవణం, కాచలవణం — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి అమ్లవర్గంతో ఏడుభావనలు చేసి మినపగింజ అంతేసి మాత్రలు కట్టి వాడుకునేది.

ఇది అజీర్తి పోగొడుతుంది. ఆకలి వృద్ధిచేస్తుంది. భోజనమైన వెంటనే ఇది పుచ్చుకుంటే ఒక్కజాములో జీర్ణంచేసి మళ్ళీ ఆకలి అనిపిస్తుంది.

## ౫౦ సన్నిపాతభైరవిరసం

తాళకం గంధకం సూతం వత్సనాభి స్త్రిభి స్సమమ్
శిలా చ టంకణం చైవ సర్వత్ర సమహింగుళమ్
మర్దయే చ్చిత్రజంబీరై రార్ద్రికేణ దినత్రయమ్
అనుపానవిశేషేణ సన్నిపాతకభైరవమ్
త్రిదోషం చాతిసారం చ కఫపాండు మరోచకమ్
కుక్షిశూల ముదావర్తం సన్నిపాతనికృంతనమ్ ॥

తాళకం, గంధకం, పాదరసం—ఇవి ఒక్కొక్క భాగం. నాభి, మణిశిల, పొంగించిన వెలిగారం—ఇవి మూడేసి భాగాలు. ఇంగిలీకం సర్వసమం—అనగా 12 భాగాలు. ఇవన్నీ కలిపి చిత్రమూలరసంతోనూ, నిమ్మకాయరసంతోనూ, అల్లపురసంతోనూ మూడేసి దినాలు మర్దించి అనుపానవిశేషాలతో వాడుకు సేది.

ఇది త్రిదోషాలవల్లనూ పుట్టిన అతిసారం, కఫం, పాండువు, అరోచకం, కుక్షిశూల, ఉదావర్తం, సన్నిపాతజ్వరం తగ్గించేస్తుంది,

గమనిక :—ఈయోగంలో, కొంపరు, మణిశిల, పొంగించిన వెలిగారం—ఒక్కొక్కభాగమే వేస్తారు. అందువల్ల అన్నీ ఎనిమిదిభాగాలే అవుతాయి. కనక ఇంగిలీకమున్నూ ఎనిమిది భాగాలే వేస్తారు. కాని యిది మంచి సంప్రదాయం కాదు. యోగంలో చెప్పినట్టు అంటే, పైని నేను చెప్పినట్టు చేసుకోవడమే మంచిది.

మరిన్నీ కొందరు దీల్లో ఒకభాగం నేపాళాలు వెయ్యడమున్నూ ఉంది. అది మరీ అశాస్త్రీయం. ఈసన్నిపాతభైరవి ముఖ్యంగా జ్వరాతిసారం కట్టడానికి పుట్టింది. దీల్లో విరేచనం చేసే గుణం కల్పించుకోవడం అసంభావ్యం.

## ౫౧ శీతాంశురసం

రసటీ శుద్ధతాళం చ తత్తుల్యం వ్యోషకం భవేత్
మర్దయే న్నింబనీరేణ గుంజాయుగ్మంతు సేవయేత్
అనుపానం మధుపథ్యా వ్యుష్ణవారి తథార్ద్రకమ్
శీతజ్వరం సన్నిపాతం కామలాం పంచగుల్మకే
సర్వం శ్వాసం చ కాసం చ హ్యానరే పూర్వరోగజిత్
సన్నిపాతం తథా ఛర్ది మశీతే వాతపైత్తికే
శూలం శూకాజీర్ణశూలం నాభౌ కుక్షౌ చ విద్రధిమ్
ఆధ్మానానాహవిష్టంభం తాపం సర్వాంగదాహకమ్
జంగమస్థావరవిషం హిక్కా దీప్తే శ్చ కారణమ్
శోఫం చ భ్రమ మూర్ఛాం చ తిమిరం చానువిధ్యతి
మర్దితం నింబతోయేన లేపితం గజచర్మకమ్
విసర్పి మండలే చైవ తుషాచర్మ వ్యపోహతి
సేవితం లేపితం కుర్యా ద్వేధితం గ్రంథి మర్బుదమ్

లేపితం దంతరోగాంశ్చ జిహ్వానేత్రరుజ స్తథా
అర్క పత్రరసైః కర్ణే కర్ణరోగస్య నాశనమ్
నిర్గుండీమిశ్రితం నస్య మపస్మారం శిరోరుజామ్
అంజనం సర్షమాత్రం చ నేత్రరోగవినాశనమ్
మాషం చ సన్నిపాతానాం కామలా జ్వరశీతకే
ధనుర్వాతం తథాభూతం శేషరోగే చ కాకథా
భాషితం సేవణే నైవ రసం శీతాంశునామకమ్ ॥

మణిశిల, తాళకం ఒక్కొక్క భాగం. త్రికటుకాలు రెండుభాగాలు. ఇవన్నీ కలిపి చేపపట్టరసంతోనూరి రెండుగురిగింజల యెత్తున మాత్రలు కట్టుకుని వాడేది. ఇది అనేకఅనుపానాలతో వాడవచ్చు. ముఖ్యంగా తేనెతో గాని, కరక్కాయకషాయంతోగాని, వేడినీళ్ళతో గాని, అల్లపురసంతో గాని వాడితే శీతజ్వరం, సన్నిపాతజ్వరం, కామెర్లు, పంచగుల్మాలు, శ్వాసకాసలు, ఉదరవ్యాధులు, ఛర్ది, అశీతివాతాలు, వింశతిపిత్తాలు, శూల, శూకరోగం, అజీర్ణం, బొడ్డుదగ్గిరపోటు, ఉదరశూల, విద్రధి, అధ్మానం, ఆనాహం, విష్టంభం, తాపం, సర్వాంగదాహం, జంగమస్థావరవిషాలు, ఎక్కిళ్ళు, అగ్నిమాంద్యము, ఉబ్బు, భ్రమ, మూర్ఛలు, తిమిరరోగం, పోగొడుతుంది. ఇది మళ్లీ చేపపట్టరసంతోనూరి పూస్తే గజచర్మం హరిస్తుంది. విసర్పి, మండలకుష్ఠు, తుషాచర్మవ్యాధిన్నీ కూడా తగ్గించేస్తుంది. పైన లేపనం చేస్తూ లోపలికిన్నీ పుచ్చుకుంటే గ్రంధులు, అర్బుదమున్నూ తగ్గిస్తుంది. పైని పూస్తే దంతరోగాలు, జిహ్వారోగాలు, నేత్రవ్యాధులు పోగొడుతుంది. జిల్లేడాకులరసంతో చెవిలోపోస్తే చెవిలో పుట్టే రోగాలన్నీ హరిస్తాయి. వావిలిఆకురసంతో నస్యంచేస్తే అపస్మారం, తలనొప్పి పోగొడుతుంది. ఆవగింజంత తీసి కలికంవేస్తే నేత్రరోగం తగ్గించేస్తుంది. మినపగింజంత తీసి కలికంవేస్తే సకలసన్నిపాతాలూ, కామెర్లూ, శీతజ్వరాలూ, ధనుర్వాతమూ, భూతజ్వరాలూ పోతాయి. తక్కినవి యిక చెప్పే దేమిటి ?

గమనిక :—ఈయోగంలో, వ్యోషం అన్నచోట సంప్రదాయజ్ఞులైన వైద్యులలో అభిప్రాయభేదాలున్నాయి. వ్యోషం అంటే త్రికటుకాలు గదా ? అయితే, సొంటి పిప్పళ్ళిమిరియాలు మూడూ కలిపి రెండుభాగాలా, లేక సొంటి 2 భాగాలూ, పిప్పళ్లు 2 భాగాలూ, మిరియాలు 2 భాగలూనా ? నేను ఈరెండువిధాలుగానూ చేశాను. ఈమూడూ దేనికదే ప్రత్యేకంగా రెండేసిభాగాలు వేస్తే పనిచెయ్యకపోలేదు ; గాని అన్నీ కలిపి రెండుభాగాలు వేస్తే యెక్కువపనిచేసింది.

మరిన్నీ, యిది, యోగంలో, జేపచెక్కరసంతో మర్దించమని వుంది. ఆచరణలో నిమ్మకాయరసాన మర్దించడం బాహాటంగా వుంది. నేను రెండు విధాలా చేశాను; అయితే, జేపచెక్కరసంతో చేసింది ఎక్కువ పనిచేసింది. అసేపచెక్క మాత్రం ముదర జేపచెట్టు వేరుది తీసుకోవడం మంచిది; కాని వృద్ధవైద్యులు జేపచెక్కరసాన మర్దనా చేసింది. కలికానికి వాడడం నేనెరిగినంతలో యెక్కడాలేదు. నిమ్మకాయ రసాన మర్దించిందే వాడుతున్నారు.

ఇంకొకటి :—ఏరసంతో నూరినా మణిశిలా తాళకమూ బాగా నలిగి వెన్నలాగ అయితే కాని త్రికటుకచూర్ణం కలిపి నూరకూడదు. అవి కలిసిన తరవాత తాళకం బాగా నలగడానికి చాలా కాలం పడుతుంది.

మొత్తానికి, అతిపరిచయంవల్ల దేశంలో చిన్నచూపు ఉంది గాని, జ్వరహారౌష ధాళలో ఇది చాలా మంచిది.

## ౫౨ వంగేశ్వరరసం

వంగం కాంతం చ గగనం హేమపుష్పం సమం సమమ్
కుమారీరసతో భావ్యం సప్తవారం భిషగ్వరైః
ఏష వంగేశ్వరో నామ ప్రమేహాన్ వింశతీం జయేత్
మూత్రకృచ్ఛ్రం సోమరోగం పాండురోగం మహాశ్మరీమ్
రసాయనవర శ్రేష్ఠో నాగార్జునవినిర్మితః ॥

వంగభస్మం, కాంతభస్మం, అభ్రకభస్మం, తంగేడుపువ్వు — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి కలబందరసంతో ఏడుమాట్లు భావనచేసి వయోబలావస్థల ననుసరించి పుచ్చు కుంటే వింశతిప్రమేహాలూ తగ్గిస్తుంది. మూత్రకృచ్ఛ్రం, సోమరోగం, పాండురోగం, అశ్మరి పోగొడుతుంది.

## ౫౩ పంచలోహరసాయనం

మృతాభ్రం కాంతలోహాచ నాగవంగా విశోధినా
యథోత్తరం భాగవృద్ధ్యా ఖల్వమధ్యే వినిక్షిపేత్
తలపోటేన వారాహ్యా శతావర్యా హిమాంబునా
భావనాత్రి ప్రకర్తవ్యా యామం యామం పృథక్పృథక్

చణమాత్రాం వటీం కృత్వా నవనీతేన సేవయేత్
ప్రాతరుత్థాయ విధినా సర్వమేహాకులాంతకః
శాల్యన్నం చ పటోలం చ తండులీ మూక వాస్తుకమ్
మత్స్యాక్షీ ముద్గయూషం చా పథ్యకం కదళీఫలమ్
అర్శాంసి గ్రహణీదోష మూత్రకృచ్ఛ్రాశ్మరీ వ్రణాత్
కామిలాం పాండుశోఫం చా పస్మారం క్షతక్షయాన్
రక్తకాసం నిహంత్యాశు పంచలోహరసాయనమ్ ॥

అభ్రకభస్మం ఒక భాగము. కాంతభస్మం రెండుభాగాలు. లోహభస్మం మూడు భాగాలు. నాగభస్మం నాలుగుభాగాలు. వంగభస్మం అయిదుభాగాలు. ఇవి కల్వంలో కలిపి తంగేడురసం, పిల్లితేగలరసం, నేలతాడిగడ్డలకషాయం, రక్తచందన కషాయం—వీటితో ఒక్కొక్క జాము మర్దించి సెనగగింజ అంతేసి మాత్రలు చేసి వెన్నతో పుచ్చుకునేది.

ఇది పుచ్చుకునేటప్పుడు శాల్యన్నమూ, పొట్లకాయకూరా, చిర్రికూరా, చక్రవర్తి కూరా, పొన్నగంటికూరా, పెసరకట్టూ, అరటికాయకూరా—ఇవి పథ్యవస్తువులు.

ఇది మూలశంకలు, గ్రహణి, మూత్రకృచ్ఛ్రం, మూత్రాశ్మరి, కామెర్లు, పాండువు, ఉబ్బు, అపస్మారం, క్షతక్షయ, రక్తకాస పోగొడుతుంది.

## ౫౪ చంద్రోదయరసం

అభ్రకం గంధకం సూతం వంగభస్మ సమాంశకమ్
ఏలా శిలాజతుం చైవ రంభాసారేణ మర్దయేత్
ప్రమేహాన్ వింశతింహన్యాత్ కామిలాపిత్తనాశనః ॥

అభ్రకభస్మం, గంధకం, పాదరసం, వంగభస్మం, ఏలకులు, కర్పూరశిలాజిత్తు—ఇవి సమభాగాలు. ఇవి అరటిదుంపరసాన మర్దించి వాడుకునేది.

ఇది వింశతిప్రమేహాలూ, కామెర్లూ, పైత్యమూ తగ్గించేస్తుంది.

## ౫౫ కనకసుందరరసం

హింగుళం మరిచం గంధం పిప్పలీ టంకణం విషమ్
కనకస్య బీజాని సమాంశం విజయాద్రవైః

మర్దనే ద్వ్యామమాత్రం తు చణమాత్రా వటీకృతా
భక్షణాద్గ్రహణీం హంతి రసః కనకసుందరః
అగ్నిమాంద్యం జ్వరం తీవ్ర మతిసారం చ నాశయేత్
దధ్యన్నం దాపయేత్పథ్యం తథా తక్రోదనం చరేత్ ॥

ఇంగిలీకం, మిరియాలు, గంధకం, పిప్పళ్ళు, పొంగించిన వెలిగారం, నాభి, (శుద్ధ) నల్లఉమ్మెత్తగింజలు — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి గంజాయికషాయంతో మర్దించి సెనగగింజ లంతేసి మాత్రలుచేసి పుచ్చుకునేది.

ఇది గ్రహణి, అగ్నిమాంద్యం, జ్వరం, అతిసారం హరిస్తుంది. ఇది పుచ్చుకునే టప్పుడు పెరుగుఅన్నం అయినా, మజ్జిగ అన్నం అయినా—(ఇవి మాత్రమే)— పుచ్చుకోవాలి.

## ౫౬ లోహపర్పటి

సమౌ గంధరసౌ కృత్వా కజ్జలీకృత్య యత్నతః
శుద్ధలోహస్య చూర్ణం తు రసతుల్యం ప్రదాపయేత్
ఏకీకృత్య తతో యత్నా ల్లోహపాత్రే ప్రమర్దితమ్
ఘృతప్రలిప్తదర్వ్యాం తు స్వేదయే న్మృదునాగ్నినా
ద్రవీభూతం సమాహృత్య ఢాలయే త్కదలీదళే
చూర్ణీకృత్య సుఖార్థాయ పథ్యభుగ్భిః ప్రసేవ్యతే
శీతోదకానుపానం వా క్వాథం వా ధాన్యజీరయోః
లోహేన పర్పటీ హ్యేషా భక్ష్యా లోకస్య సిద్ధిదా
రక్తికైకాం సమారభ్య వర్ధయే ద్రక్తికాం క్రమాత్
సప్తాహైకం ద్వయం వాపి యావ దారోగ్యదర్శనమ్
సూతికాం శ్చ జ్వరాం శ్చైవ గ్రహణీ మతిదుస్తరామ్
ఆమశూలాతిసారాం శ్చ పాండురోగం సకామలమ్
ప్లీహాన మగ్నిమాంద్యం చ భస్మకం చ తథైవ చ
ఆమవాత ముదావర్తం కుష్ఠా న్యష్టాదశైవతు

ఏవ మాదీం స్తథా రోగాన్ ఘోరాణి వివిధాని చ
హంత్యనేన ప్రయోగేణ పథ్యభుక్ నిర్మల స్సుఖీ
జీవే ద్వర్ష శతం పూర్ణం పలీపలితవర్జితః
భోజనం రక్తశాలీనాం త్యక్త్వా శాకం విదాహి చ
అమవాతప్రకోపం చ చింతనం మైథునం తథా
ప్రాత రుత్థాయ సంసేవ్యా విధి నాయుః ప్రవర్ధినీ ॥

పాదరసమూ, గంధకమూ సమభాగాలుగా గ్రహించి మెత్తగా కజ్జలి చేసుకుని లోహభస్మం రసంతో సమానంగా గ్రహించి చక్కగా కలిసిపోయేటట్లు మర్దించేది. తరవాత, అది, నెయ్యిపూసిన మూకుడులో వేసి కరిగేటట్టు సన్నసెగమంట పెట్టాలి. చక్కగా కరిగిన తరవాత అది అరటాకు దొప్పలో గాని, పెనురుగొట్టంలో గాని పోసేది. చల్లబడ్డతరవాత మెత్తగా చూర్ణించి వయోబలావస్థానుసారంగా వాడుకునేది. అనుపానం చల్లని నీళ్ళు, లేక ధనియాల కషాయం. అదీ కాకపోతే జీలకర్ర కషాయం. ఇది ఒక రత్తిప్రమాణం మొదలు క్రమంగా వృద్ధిచేసి పుచ్చుకోవాలి. ఇది ఒక వారంగాని, రెండువారాలుగాని పుచ్చుకోవాలి. అంతలో ఆరోగ్యం కలుగుతుంది.

ఇది సూతికలు, జ్వరాలు, గ్రహణి, అమశూల, అతిసారం, పాండురోగం, కామెర్లు, ప్లీహవృద్ధి, అగ్నిమాంద్యం, భస్మకం, అమవాతం, ఉదావర్తం, కష్టాలు, వివిధవిషబాధలు పోగొడుతుంది. శరీరానికి మంచి కాంతి కలుగుతుంది. శరీరం ముడతలు పడకుండా, జుట్టు నెరియకుండా నూరుసంవత్సరాలుబతుకుతాడు. విదాహి కరాలైన కూరలు తినకూడదు. అమవాతం పెంచే వస్తువులున్నూ పుచ్చుకోగూడదు. చింత, మైథునం పనికిరావు.

## ౫౩ పంచామృత పర్పటి

అష్టౌ గంధకతోలకా రసదలం లోహం తదర్ధం శుభమ్
లోహార్ధం చ వరాభ్రకం సువిమలం తామ్రం తథాభ్రార్ధకమ్
పాత్రే లోహమయే చ మర్దనవిధౌ చూర్ణీకృతం చైకతో
దర్వ్యాం వా దరవహ్నినాతిమృదునా పాకం విదిత్వా దళే
రంభాయా లఘు ఢాలయే త్పటురియం పంచామృతా పర్పటీ
ఖ్యాతా క్షౌద్రఘృతాన్వితా ప్రతిదినం గుంజాద్వయం వృద్ధితః

లోహే మర్దనయోగతః సువిమలం భస్మక్రమాల్లోహవత్
గుంజాష్టౌ వసవో త్రికం త్రిఫలికం సప్తాంశ మేకం భజేత్
నానావర్ణగ్రహణ్యా మరుచిసముదితో దుష్టమన్దానకాద్యా
ఛర్ద్యాం దీర్ఘాతిసారే జ్వరభవాతిసారే రక్తపిత్తే క్షయేపి
వృష్యాణాం వృష్యరాజః పలితవలిహరా నేత్రరోగైకహంత్రీ
తుందం దీప్తం స్థిరాగ్నిం పునరపి నవకం రోగిదేహం కరోతి ॥

గంధకం ఎనిమిదితులాలు. పాదరసం నాలుగుతులాలు. లోహభస్మం రెండుతులాలు. అభ్రకభస్మం ఒకతులం. తామ్రభస్మం అరతులం. ముందు రసగంధకాలు కజ్జలిచేసి తరవాత భస్మాలు కలిపి లోహపాత్రలో బాగా కలిసేటట్టు గట్టిగా నూరాలి. ఈచూర్ణం పర్పటీవిధానంగా వండుకుని రెండురతుల ప్రమాణం మోతాదు చొప్పున వాడుకునేది. అనుపానం తేనె, లేక నెయ్యి.

ఇది సకలగ్రహణులు, అరుచి, మూలశంకలు; ఛర్ది, చిరకాలంగా వున్న అతిసారం, జ్వరాతిసారం, రక్తపిత్తం, క్షయ పోగొడుతుంది. మంచి వృష్యయోగం. వలీపలితాలు హరిస్తుంది. నేత్రరోగాలు తగ్గిస్తుంది. అగ్నిదీప్తి చాలా యెక్కువగా కలిగిస్తుంది.

## ౫౮. బాలకుటజావలేహం

మూలత్వచం వత్సకస్య పలమేకం సుకుట్టితమ్
అష్టభాగం జలం దత్త్వా చతుర్భాగావశేషితమ్
అతివిషా చ పాఠా జీరకం బిల్వమేవ చ
ఆమ్రాస్థి శతపుష్పా చ ధాతకీ ముస్తకం తథా
జాతీఫలం చ సంచూర్ణ్య నిక్షిపేత్తత్ర యత్నతః
బాలానా మామశూలఘ్నం రక్తస్రావం సుదారుణమ్
అపి వైద్యశతై స్త్యక్తం జయే దేత న్న సంశయః ॥

కొడిశచెట్టు వేరుపట్ట ఎనిమిదితులాలు గ్రహించి మెత్తగా చితకగొట్టి ఎనిమిదిరెట్లు నీళ్ళలో కలిపి నాలుగోభాగం మిగిలేటట్టు కాచి వడబోసుకునేది. అది మళ్ళీ సన్నమంటమీద కాచి, అందులో —అతివస, పాఠ, జీలకర్ర, మారేడుగుజ్జు, మామిడిజీడి,

సదాప, ఉశీరకపప్పు, తుంగముస్తలు, జాజికాయ — ఇవి ఒక్కొక్కటి పావులా యెత్తుచొప్పున గ్రహించి మెత్తగా నూరించి, వస్త్రగాలితం చేసి ఆ చూర్ణం, మరుగుతున్న ఆకషాయంలో వేసి, గట్టిపడేవరకూ కాచి కందిగింజలంతేసి మాత్రలు చేసుకుని పిల్లలకు వాడేది. అనుపానం మంచినీళ్ళు.

పిల్లలకు వచ్చే ఆమశూలలు, రక్తస్రావం ఇవి పోగొడుతుంది.

## ౫౫. మహాచంద్రకళారసం

ప్రత్యేకం కర్షమాత్రం స్యాత్సూతం తామ్రం తథాభ్రకమ్
ద్విగుణం గంధకం చైవ కృత్వా కజ్జలికాం శుభామ్
ముస్తా దాడిమదూర్వాభిః కేతకీస్తనజద్రవైః
సహదేవ్యాః కుమార్యాశ్చ పర్పటస్య చ వారిణా
రామశీతలికాతోయైః శతావర్యా రసేన చ
భావయిత్వా ప్రయత్నేన దివసే దివసే పృథక్
తిక్తా గుడూచికాసత్వం పర్పటోశీర మాధవీ
శ్రీగంధం శారిబా చైషాం సమానం సూక్ష్మచూర్ణితం
ద్రాక్షాఫలకషాయేణ సప్తధా పరిభావయేత్
తతః పాత్రాశయం కృత్వా వట్యః కార్యాశ్శుభోపమాః
అయం చంద్రకళా నామ రసేంద్రః పరికీర్తితః
సర్వపిత్తగదధ్వంసీ వాతపిత్తగదాపహః
అంతర్బాహ్యమహాదాహవిధ్వంసనమహాఘనః
గ్రీష్మకాలే శరత్కాలే విశేషేణ ప్రశస్యతే
కురుతే చాగ్నిమాంద్యం చ మహాతాపజ్వరం హరేత్
భ్రమం మూర్ఛాం నిహంత్యాశు స్త్రీణాం రక్తస్రవం మహత్
ఊర్ధ్వాధోరక్తపిత్తం చ రక్తవాంతిం విశేషతః
మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి నాశయేన్నాత్ర సంశయః ॥

పాదరసం, తామ్రభస్మం, అభ్రకభస్మం — ఇవి ఒక్కొక్క కర్షం. గంధకం రెండుకర్షాలు. ముందు రసగంధకాలు కజ్జలిచేసి తామ్రభస్మమూ, అభ్రకభస్మమూ కలిపి బాగా మర్దించి ఆవె తుంగముస్తలు, దానిమ్మపండు, గరిక, మొగిలిదుబ్బు, సహదేవి, కలబంద, పర్పాటకం, రామశీతలిక (ఇది మహారాష్ట్రదేశంలో ప్రసిద్ధం) పిల్లితేగలు — వీటి రసాలతోనూ, కషాయాలతోనూ ఒక్కొక్క దినం బాగా మర్దించి, అప్పుడందులో—కటుకరోహిణి, తిప్పసత్తు, పర్పాటకం, వట్టివేరు, గురిగింజవేరు, శ్రీగంధం, సుగంధి — ఇవి ఒక్కొక్క కర్షం గ్రహించి మెత్తగా చూర్ణించి కలిపి మళ్ళీ ద్రాక్షపళ్ళకషాయంతో ఏడుమార్లు మర్దించి సెనగగింజలంతేసి మాత్రలుచేసి వాడుకునేది.

ఇది సమస్తపిత్తవ్యాధులూ హరిస్తుంది. వాతపిత్తవ్యాధులు పోగొడుతుంది. అంతర్బాహ్యతాపాలు, తాపజ్వరం హరిస్తుంది. భ్రమ, మూర్ఛలు, స్త్రీల ప్రదరవ్యాధులు, ఊర్ధ్వాధోగతరక్తపిత్తం, రక్తవాంతి, మూత్రకృచ్ఛ్రాలు, నశింపచేస్తుంది.

## ౬౦ గోక్షురాదిగుగ్గులు

అష్టావింశతిసంఖ్యాని పలాన్యానీయగోక్షురాత్
విపచే త్షడ్గుణే నీరే క్వాథో గ్రాహ్యోర్ధశేషితః
తతః పునః పచే త్తత్ర పురం సప్తపలం క్షిపేత్
గుడపాకసమాకారం జ్ఞాత్వా తత్ర వినిక్షిపేత్
త్రికటు త్రిఫలా ముస్తం చూర్ణితం పలసప్తకమ్
తతః పిండీకృతం చాస్య గుటికా ముపయోజయేత్
హన్యా త్ప్రమేహం కృచ్ఛ్రాం చ ప్రదరం మూత్రఘాతకమ్
వాతాస్రం వాతరోగాం శ్చ శుక్రదోషం తథాశ్మరీమ్

ఇరవైయెనిమిది పలాల పల్లేరు సమూలం (పచ్చిదైతే 56 పలాలు) చితకగొట్టి ఆరురెట్ల నీళ్ళలో వేసి సగం మిగిలేటట్టు కాచి వడబోసుకుని, ఆకషాయంలో ఏడుపలాల మహిషాక్షిగుగ్గులు కలిపి మళ్ళీ కాచేది. గుగ్గులు ఆకషాయంలో కరిగిపోయి కాచగా కాచగా గట్టిపడుతుంది.

సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకపెచ్చు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, తుంగముస్తలు — ఇవి ఒక్కొక్క పలం గ్రహించి మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం

చేసి అగుగ్గులు పాకంలో బాగా కలిపి గట్టిపడ్డ తరవాత సెనగగింజలకంటే కొంచెం పెద్దమాత్రలు చేసి వాడుకునేది.

ఇది ప్రమేహం, మూత్రకృచ్ఛ్రం, మూత్రాఘాతం, ప్రదరం, వాతరక్తం, వాత రోగాలు, శుక్రదోషాలు, మూత్రాశ్మరి పోగొడుతుంది.

## ౬౧ చంద్రప్రభావటి

చంద్రప్రభా వచా ముస్తం భూనింబామృతదారుకమ్
హరిద్రాతివిషా దార్వీ పిప్పలీమూలచిత్రకౌ
ధాన్యకం త్రిఫలా చవ్యం విడంగం గజపిప్పలీ
వ్యోషం మాక్షికధాతుశ్చ ద్వౌ క్షారౌ లవణత్రయమ్
ఏతాని శాణమాత్రాణి ప్రత్యేకం కారయేద్బుధః
త్రివృద్దంతీపత్రికం చ త్వగేలా వంశలోచనా
ప్రత్యేకం కర్షమాత్రం చ కుర్యాదేతాని బుద్ధిమాన్
ద్వికర్షం హతలోహం స్యాచ్చతుష్కర్షా సితా భవేత్
శిలాజత్వష్టకర్షం స్యాదష్టౌ కర్షాస్తు గుగ్గులోః
ఏభిరేకత్ర సంక్షుణ్ణైః కర్తవ్యా గుటికా శుభా
చంద్రప్రభేతి విఖ్యాతా సర్వరోగప్రణాశినీ
ప్రమేహం వింశతిం కృచ్ఛ్రం మూత్రాఘాతం తథాశ్మరీమ్
విబంధానాహశూలాని మేహనం గ్రంథి మర్బుదమ్
అండవృద్ధిం తథా పాండుం కామలాం చ హలీమకమ్
అంత్రవృద్ధిం కటీశూలం శ్వాసం కాసం విచర్చికామ్
కుష్ఠాన్యర్శాంసి కండూం చ ప్లీహోదరభగందరమ్
దంతరోగం నేత్రరోగం స్త్రీణామార్తవజాం రుజమ్
పుంసాం శుక్లగతాన్ దోషాన్ మందాగ్ని మరుచిం తథా
వాయుం పిత్తం కఫం హన్యాద్బల్యా వృష్యా రసాయనీ ॥

కచ్చూరాలు, వస, తుంగముస్తలు, నేలవేము, తిప్పతీగ, దేవదారు, పసుపు, అతివస, మానుపసుపు, పిప్పలిమూలం, చిత్రమూలం, ధనియాలు, కరకవోలుపు, తాడికాయ బెరడు, ఉసిరికపప్పు, చవ్యం, వాయువిడంగాలు, గజపిప్పలి, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, హేమమాక్షికభస్మం, యవక్షారం, సర్జక్షారం, సైంధవలవణం, సౌవర్చ లవణం, బిడాలవణం — ఇవి ఒక్కొక్క శాణం. తెగడ, జెపాళపువేళ్ళు, ఆకు పత్రికం, దాల్చినిచెక్క, ఏలకులు, తవాక్షీరి — ఇవి ఒక్కొక్క కర్షం. లోహ భస్మం రెండుకర్షాలు. చక్కెర నాలుగుకర్షాలు. గోమూత్రశిలాజిత్తు ఎనిమిది కర్షాలు. మహిషాక్షిగుగ్గులు ఎనిమిది కర్షాలు. — ఇవన్నీ కలిపి మెత్తగా చూర్ణించి, జలంతో నూరి సెనగలకంటే కొంచెం పెద్దమాత్రలు చేసి వాడుకునేది.

ఇది సర్వరోగాలూ పోగొడుతుంది. వింశతిప్రమేహాలు, మూత్రకృచ్ఛ్రం, మూత్రా ఘాతం, మూత్రాశ్మరి, మలబంధం, ఆనాహం, శూల, మేహగ్రంధి, అర్బుదం, అండవృద్ధి, పాండువు, కామెర్లు, హలీమకం, అంత్రవృద్ధి, కటిశూల, శ్వాసకాసలు, విచర్చిక, కుష్ఠువులు, మూలశంకలు, దురదలు, ప్లీహోదరం, భగందరం, దంత రోగాలు, నేత్రరోగాలు, స్త్రీల బుతుదోషాలు, పురుషుల శుక్రదోషాలు, అగ్ని మాంద్యం, అరుచి, వాతం, పిత్తం, కఫం ఇవన్నీ తగ్గించేస్తుంది. బలకరం. వీర్యవృద్ధి చేస్తుంది. రసాయనం.

## ఉపి కైశోరగుగ్గులు

త్రిఫలాయా స్త్రయః ప్రస్థాః ప్రస్థైక మమృతా భవేత్
సంకుట్య లోహపాత్రే తు సార్థ ద్రోణాంబునా పచేత్
జల మర్థశృతం జ్ఞాత్వా గృహ్ణీయా ద్వస్త్రగాలితమ్
క్వాథే క్షిపే త్తు శుద్ధం చ గుగ్గులుం ప్రస్థసమ్మితమ్
పునఃపచే దయఃపాత్రే దర్వ్యా సంఘట్టయే న్ముహుః
సాంద్రీభూతమ్ చ తం జ్ఞాత్వా గుడపాకసమాకృతిమ్
చూర్ణీకృత్య తత స్తత్ర ద్రవ్యా ణీమాని నిక్షిపేత్
త్రిఫలార్థపలా జ్ఞేయా గుడూచీ పలికా మతా
షడక్షం త్ర్యూషణం ప్రోక్తం విడంగానాం పలార్థకమ్
దంతీ కర్షమితా కార్యా త్రివృత్కర్షమితా స్మృతా

తతః పిండీకృతం సర్వం ఘృతపాత్రే వినిక్షిపేత్
గుటికా శ్శాణికాః కార్యా యుంజ్యా ద్దోషా ద్యపేక్షయా
అనుపానే భిష గ్దద్యా త్కోష్ణనీరం పయో౽థవా
మంజిష్ఠాది శ్రుతం వాపి యుక్తియుక్త మతఃపరమ్
జయే త్సర్వాణి కుష్ఠాని వాతరక్తం త్రిదోషజమ్
సర్వవ్రణాం శ్చ గుల్మాం శ్చ ప్రమేహపిటికా స్తథా
ప్రమేహోదరమందాగ్ని కాసం శ్వయథు పాండుతామ్
హంతి సర్వామయా న్నిత్య ముపయుక్తో రసాయనః
కైశోరకాభిధానో౽యం గుగ్గులుః కాంతికారకః
వాసాదినా నేత్రగదాన్ గుల్మాదీన్ వరుణాదినా
క్వాథేన ఖదిర స్యాపి వ్రణకుష్ఠాని నాశయేత్
అమ్లం తీక్ష్ణ మజీర్ణం చ వ్యవాయశ్రమ మాతపమ్
మద్యం రోషం త్యజే త్సమ్య గ్గుణార్థీ పురసేవకః ॥

కరకవోలుపు, తాడికాయ బెరడు, ఉసిరికపప్పు — ఇవి మూడు ప్రస్థాలు. తిప్పతీగ ఒక ప్రస్థం. ఇవి మెత్తగా నలియగొట్టి ఇనపపాత్రలో వేసి ద్రోణంనర నీళ్ళు కలిపి సగం మిగిలేటట్టు కషాయం కాచి వడబోసుకునేది. ఆకషాయంలో ఒక ప్రస్థం మహిషాక్షిగుగ్గులు కలిపి సన్నమంటమీద మరగబెడుతూ ఇనపగరిటెతో కలియ బెడుతూ వుండాలి. అది బెల్లంపాకంలాగ అయేదాకా ఇలా చేస్తూ వుండాలి. కరకవోలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు—ఇవి అర్థపలం చొప్పునా, తిప్ప సత్తు ఒకపలమూ, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, —రెండేసి కర్షాలు, వాయు విడంగాలు అరపలం, నేపాళపువేరు, తెగడ ఒక్కొక్క కర్షం. —ఇవన్నీ మెత్తగా చూర్ణించి వస్త్రగాలితం చేసి ఆపాకంలో చేర్చి గట్టిపడగానే దింపి సెనగగింజలంతేసి మాత్రలుచేసి వాడుకునేది.

సాధారణంగా దీనికి గోరువెచ్చని నీళ్ళు, గోరువెచ్చని పాలు, మంజిష్ఠాది కషాయం— మొదలైనవి అనుపానాలు. అప్పటికి మంచిదిగా కనపడ్డ అనుపానమున్నా వాడుకోవచ్చు.

ఇది కుష్ఠరోగా లన్నీ జయిస్తుంది. త్రిదోషజమైన వాతరక్తమున్నూ హరిస్తుంది. సర్వవ్రణాలు, గుల్మాలు, ప్రమేహపిటికలు, ప్రమేహాలు, ఉదరవ్యాధులు, అగ్ని

మాంద్యం, కాస, పాండు, ఉబ్బు —ఇవన్నీ పోగొడుతుంది. వాసాకషాయంతో పుచ్చుకుంటే నేత్రవ్యాధులూ, వరుణాకషాయంతో పుచ్చుకుంటే గుల్మాదులూ, చంద్రకషాయంతో పుచ్చుకుంటే వ్రణాలూ, కుష్ఠులూ కూడా తగ్గిపోతాయి. ఇది వాడే టప్పుడు పులుసు, తీక్ష్ణద్రవ్యాలు, అజీర్ణకరద్రవ్యాలు, సంభోగం, ఎండ, మద్యం, రోషం ఇవి విడిచిపెట్టాలి.

## ౬౩ స్వచ్ఛందభైరవిరసం

సమభాగం చ సంగృహ్య పారదామృతగంధకమ్
జాతీఫలం చ భాగార్ధం దత్వా కుర్యాచ్చ కజ్జలీమ్
సర్వార్ధం మాగధీచూర్ణం ఖల్లయిత్వా నిధాపయేత్
గుంజాద్వయం త్రయం వాపి నాగవల్లీరసేన చ
ఆర్ద్రకస్వరసేనాపి ద్రోణపుష్పీరసేన వా
శీతజ్వరే సన్నిపాతే విషూచ్యాం విషమజ్వరే
పీనసే చ ప్రతిశ్యాయే జ్వరే జీర్ణే తథైవ చ
మందాగ్నౌ వమనే చైవ శిరోరోగే చ దారుణే
ప్రయోజ్యో భిషజా సమ్యగ్రస స్స్వచ్ఛందభైరవః
పథ్యం దధ్యోదనం దద్యా ద్వీక్ష్య దోషబలాబలమ్॥

పాదరసం, నాభి, గంధకం—ఇవి సమభాగాలు. జాజికాయ అర్ధభాగం. ముందు రసగంధకాలు బాగా కజ్జలిచేసి, తరవాత నాభి, జాజికాయ కలిపి బాగా నూరేది. తరవాత అన్నిటికీ సగం మిరియాల చూర్ణం కలిపి బాగామర్దించి రెండుగురిగింజల యెత్తున గాని, మూడుగురిగింజల యెత్తునగాని వాడేది. అనుపానం తమలపాకుల రసం లేక, అల్లపురసం లేక, తుమ్మిపూలరసం.

చూర్ణంగా వుంచుకోక తమలపాకులరసంతోనూ, అల్లపురసంతోనూ, తుమ్మిపూల రసంతోనూ బాగా మర్దించి మాత్రలు కట్టుకుని మళ్లీ ఆ అనుపానాలతో వాడటం వృద్ధవైద్యుల సంప్రదాయం. ఈపద్ధతి చాలా మంచిది.

ఇది శీతజ్వరం, సన్నిపాతం, విషూచి (కలరా), విషమజ్వరం, పీనస, పడిశం, జీర్ణజ్వరం, అగ్నిమాంద్యం, వాంతులు, శిరోరోగం పోగొడుతుంది. దోషబలాబలాలు గుర్తించి పెరుగుతో అన్నం పథ్యం పెట్టేది.

## ౨౪ శూలదావానలరసం

శుద్ధసూతం విషం గంధం పలాంశం మర్దయే ద్దృఢమ్
మరిచం పిప్పలీ శుంఠీ హింగు సౌవర్చలం ద్వయమ్
పలాష్టకం పటూనాం చ చించాక్షారం పలాష్టకమ్
సప్తవారం శంఖభస్మం జంబీరామ్లే నిషేచయేత్
పలాష్టకం చ సంయోజ్యం తత్సర్వం నింబుకద్రవైః
దినం మర్ద్యం కోలమాత్రం భక్షయే త్సర్వశూలజిత్
అజీర్ణోదరమందాగ్ని మసాధ్య మపి సాధయేత్
శూలదావానలాఖ్యోయం రసో జీర్ణాదిరోగహా ॥

పాదరసం, నాభి, గంధకం — ఇవి ఒక్కొక్కపలం. మిరియాలు, పిప్పళ్ళు, సొంటి, ఇంగువ, సౌవర్చలవణం — ఇవి రెండేసిపలాలు. సైంధవలవణం, చించాక్షారం, నిమ్మకాయరసంలో ముంచుతూ ఏడుమాట్లు కాల్చిన శంఖాల భస్మం — ఇవి ఎనిమిదేసిపలాలు. ఇవన్నీ కలిపి నిమ్మకాయలరసాన మర్దించి రేగుగింజంత మాత్రలు చేసుకుని వాడితే సర్వశూలలూ పోగొడుతుంది. అజీర్ణం, ఉదరవ్యాధులు, అగ్నిమాంద్యం — ఇవన్నీ తగ్గించేస్తుంది.

## ౨౫ బృహత్కఫకేతురసం

దగ్ధశంఖం త్రికటుకం టంకణం సమభాగికమ్
విషం చ పంచభి స్తుల్యం ఆర్ద్రితోయేన మర్దయేత్
వారత్రయం రక్తికా శ్చ వటీం కుర్యా ద్విచక్షణః
ప్రాత స్సాయం చ వటికాద్వయం మార్ద్రిక వారిణా
కఫకేతుః కంఠరోగం శిరోరోగం చ నాశయేత్
పీనసం కఫసంఘాతం సన్నిపాతం సుదారుణమ్ ॥

శంఖభస్మం, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, పొంగించిన వెలిగారం, ఇవి సమభాగాలు. నాభి 5 భాగాలు. ఇవన్నీ కలిపి అల్లపురసాన మూడుమాట్లు మర్దించి మినుములంతేసి మాత్రలుచేసి, అల్లపురసం అనుపానంగా ఉదయం సాయంత్రం పుచ్చుకుంటే కంఠ

రోగాలన్నీ పోగొడుతుంది. శిరోరోగం తగ్గిస్తుంది. పీనస, కఫసంఘాతం తగ్గిస్తుంది. పడిశంపట్టినప్పు డిది చాలా మంచిపనిచేస్తుంది.

## ౭౭ యకృదరిలోహం

ద్వికర్షం లోహచూర్ణస్య గగనస్య పలార్ధకమ్
కర్షం శుద్ధం మృతం తామ్రం లింపాకాంఘ్రిత్వచః పలమ్
మృగాజినభస్మ పలం సర్వ మేకత్ర కారయేత్
నవగుంజాప్రమాణేన వటికాం కారయే ద్భిషక్
యకృత్ప్లీహోదరం చైవ కామలాం చ హలీమకమ్
కాసం శ్వాసం జ్వరం హంతి బలవర్ణాగ్నివర్ధనమ్
యకృదరి నామ లోహోయం సర్వవ్యాధినిషూదనమ్ ॥

లోహభస్మం రెండుకర్షాలు. అభ్రకభస్మం రెండుకర్షాలు. తామ్రభస్మం ఒకకర్షం. నిమ్మవేళ్ళపట్ట ఒకపలం. పొగపైకిపోకుండా మూకుళ్ళలో వుంచి పుటంపెట్టి చేసిన నల్లయిర్రిచర్మంభస్మం ఒకపలం. ఇవన్నీ కలిపి జలంతో మర్దనాచేసి సెనగలంతేసి మాత్రలు చేసి అనుపానవిశేషాలతో వాడుకునేది.

ఇది యకృత్ప్లీహోదర వ్యాధులు పోగొడుతుంది. కామెర్లు, హలీమకం, దగ్గు, ఉగర్పు, జ్వరం తగ్గించేస్తుంది. బలం, కాంతి, జఠరాగ్ని వృద్ధిచేస్తుంది.

## ౭౮ కాలకూటరసం

రుద్రసంఖ్యామృతం చైవ త్రిభాగం సూత మేవ చ
గంధకం పంచభాగం చ శిలాయా ఋతుభాగకమ్
తామ్రభస్మ చతుర్భాగ మృషిభాగం చ టంకణమ్
తాళకం నవభాగంచ వహ్నిమూలం తథైవ చ
త్రిఫలా చ త్రికటుకం దశద్వాదశకం తథా
హింగుభాగైకసంఖ్యాక ముగ్రగంధా తథైవ చ
ఏవం ఖల్వే చ సంస్థాప్య హ్యార్ద్రకం వహ్నిమూలకమ్

జంబీరం లశునం చైవ శార్ఙ్గీశిగ్రుస్వమూలికమ్
లాంగలీ హంసపాదీ చ సింధురాండకఫలాని చ
అంకోల శిగ్రుమూలాని చైభిర్భావ్యం పృథక్పృథక్
పంచకోలకషాయేణ పంచమూలేన మర్దయేత్
గుంజామాత్రాం వటీం బధ్వా శృంగబేరం పిబే దను
అసాధ్యం సన్నిపాతం చ సర్వజ్వరహరం పరమ్
సన్నిపాతకులం చైవ సప్తదోషా న్వినాశయేత్
స్నానం కుర్యాత్ప్రయత్నేన శ్రీగంధం లేప మాచరేత్
పథ్యం దధ్యోదనం చైవ ఖర్జూరాదిఫలా న్యపి
తాంబూలచర్వణం కుర్యాత్ప్రత్యహం స్నైవం సమాచరేత్
కాలకూటరసో నామ్నా శంకరే ణైవ భాషితః
భిషగ్వరైః కృత శ్చైవ రోగాణాం కులనాశకృత్ ॥

నాభి 11 భాగాలు. పాదరసం 3 భాగాలు. గంధకం 5 భాగాలు. మణిశిల 6 భాగాలు. తామ్రభస్మం 4 భాగాలు. పొంగించిన వెలిగారం 7 భాగాలు. తాళకం 9 భాగాలు. చిత్రమూలం 9 భాగాలు. త్రిఫలాలు 10 భాగాలు. త్రికటుకాలు 12 భాగాలు. ఇంగువ 1 భాగం. వస 1 భాగం. ఇవన్నీ కలిపి మెత్తగా చితకగొట్టి, ఖల్వంలో వేసి అల్లపురసం, చిత్రమూలరసం, నిమ్మకాయరసం, వెల్లుల్లిరసం, బండిగురివిందరసం, కారుమునగరసం, జిల్లేడువేళ్ళపాలు, పొత్తిదుంపరసం, హంసపాదిఆకురసం, వావిలిరసం, తమలపాకుల రసం, ఊడుగుచెక్కరసం, మునగవేళ్ళరసం, పంచకోలకషాయం, పంచమూలకషాయం — వీటితో ఒక్కొక్కజాము మర్దించి గురిగింజమెత్తున మాత్రలు కట్టుకుని అల్లపురసంతో సేవించేది.

ఇది అసాధ్యసన్నిపాతాలు హరిస్తుంది. సర్వజ్వరాలూ తగ్గిస్తుంది. ఇది పుచ్చుకున్న తరవాత ప్రయత్నపూర్వకంగా స్నానంచేసి మంచిగంధం పూసుకుని పెరుగు అన్నం తినాలి. ఖర్జూరాది ఫలాలున్నూ భక్షించాలి. తాంబూలం వేసుకోవాలి.

## ఉల్లాకామచూడామణిరసం

మౌక్తికం మాక్షికం చైవ స్వర్ణభస్మ పృథక్పృథక్
కర్పూరం జాతికోశం చ జాతీఫలలవంగకమ్

వంగభస్మ తథా గ్రాహ్యం రూప్యం చాపి తదర్థకమ్
చాతుర్జాతం చ సంగ్రాహ్యా పర్వ మేకత్ర చూర్ణితమ్
శతమూలీరసే నైవ భావయే త్సప్తవారకమ్
తతో గుంజాప్రమాణేన వటికా భిషజా కృతా
అనుపానవిశేషేణ రోగాకరవినాశినీ
శీతం పయోనుపానం చ కామినీః కామయే చ్ఛతమ్
వీర్యహీనో భవే ద్యస్తు యో వా స్యా త్పతితధ్వజః
షోడశీతివార్షికో వాపి యువేవ రమతేంగనాః
భేషజై ర్వివిధైః కిం స్యా దన్యై శ్చ శతసంఖ్యకైః
ఫలం న కించి త్తత్రాస్తి కేవలం గౌరవం మహాః
నాతఃపరతరం కించిదస్తి పుష్టికరం భువి
అత స్సర్వప్రయత్నేన సేవ్యం భూమిభుజా సదా
విశేషా ద్ధ్వజభంగాం శ్చ సప్తాహేన వినాశయేత్
ప్రమేహం మూత్రరోగం చ మందాగ్నిం శ్వాసాధుం తథా
రక్తదోషం చ నారీణాం పానా ద్దోషం వినశ్యతి ॥

ముత్యాలభస్మం, హేమమాక్షికభస్మం, స్వర్ణభస్మం, పచ్చకర్పూరం, జాజికాయ, జాపత్రి, లవంగాలు, వంగభస్మం, రజతభస్మం — ఇవి ఒక్కొక్క భాగం. దాల్చిని చెక్క, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు — ఇవి అర్థభాగంచొప్పున గ్రహించాలి. ఇవన్నీ కలిపి పిల్లితేగలరసాన ఏడుమార్లు మర్దించాలి. తరవాత గురిగింజయెత్తున మాత్రలుచేసుకుని వాడుకుని పాలు పుచ్చుకోడం మంచిది.

వీర్యం తక్కువయిపోయి సంభోగశక్తి క్షీణించినవారి కిది చాలా మంచిది. ముఖ్యంగా ఏడుదినాలలో ధ్వజభంగం తగ్గిపోతుంది. ప్రమేహం, మూత్రవ్యాధులు, అగ్నిమాంద్యం, రక్తదోషం, స్త్రీల రజోదోషం, పోగొడుతుంది.

## ౬౫ చంద్రామృతరసం

త్రికటు త్రిఫలా చవ్యం ధాన్య జీరక సైంధవమ్
ప్రత్యేకం తోలకం గ్రాహ్యం ఛాగీక్షీరేణ గోళయేత్

రసగంధకలోహానాం ప్రత్యేకం కార్షికం శుభమ్
టంకణస్య పలం దత్వా మరిచస్య పలార్ధకమ్
నవగుంజాప్రమాణేన వటికాం కారయే త్పృథక్
ఏకైకాం వటికాం ఖాదే ద్రక్తోత్పలరసప్లుతామ్
నీలోత్పలరసే నాపి కుష్ఠస్య రసేన వా
పిప్పల్యా మధునా వాపి శృంగబేరరసేన వా
హంతి పంచవిధం కాసం వాతపిత్తసముద్భవమ్
వాతశ్లేష్మోద్భవం దోషం పిత్తశ్లేష్మోద్భవం తథా
వాతికం పైత్తికం చైవ నానాదోషసముద్భవమ్
రక్తనిష్ఠీవనం చాపి జ్వరం శ్వాసనమన్వితమ్
తృష్ణాం దాహం భ్రమం హంతి జఠరాగ్ని ప్రదీపనీ
బలవర్ణకరో హ్యేష ప్లీహగుల్మోకరాపహా
ఆనాహకృమిహృత్పాండుజీర్ణజ్వరవినాశనీ
ఇదం చంద్రామృతం నామ చంద్రచూడేన నిర్మితమ్
వాసా గుడూచీ భార్గీ చ ముస్తకం కంటకారికా
ఏషాం క్వాథం పిబే దంతే వటికా వీర్యధారిణీ ॥

సొంటి, పిప్పలి, మిరియాలు, కరక, తాడి, ఉసిరిక, చవ్యం, ధనియాలు, జీలకర్ర, సైంధవలవణం ఇవి ఒక్కొక్క తులం. పాదరసం, గంధకం, లోహభస్మం — ఇవి రెండేసి తులాలు. పొంగించిన వెలిగారం ఎనిమిది తులాలు. మిరియాలు మళ్లీ నాలుగుతులాలు. ఇవన్నీ యథాశాస్త్రంగా కలిపి మేకపాలతో మర్దించి తొమ్మిది గుంజల యెత్తున మాత్రలు కట్టుకునేది.

ఎర్రకలవపూలరసం, నల్లకలవపూలరసం, ఉలవల కషాయం, పిప్పళ్ల కషాయం, తేనె, అల్లపురసం — వీటిలో ఏదైనా అనుపానంగా వాడుకోవచ్చు. తరవాత అడ్డసరం, తిప్పతీగ, గంటుభారంగి, తుంగముస్తలు, వాకుడు — వీటి కషాయాలలో ఒకటిన్నీ పుచ్చుకునేది.

ఇది పంచవిధ కాసలు, రక్తనిష్ఠీవనం, పగర్పుతోకూడిన జ్వరం, తృష్ణ, తాపం, భ్రమ పోగొడుతుంది. ఆకలి వృద్ధిచేస్తుంది. బలమూ పుష్టీ కలిగిస్తుంది. ప్లీహవ్యాధులు, గుల్మం, ఆనాహం, ఉదరవ్యాధులు, క్రిములు, పాండువు, జీర్ణజ్వరమూ పోగొడుతుంది.

## ౭౦ కిన్నరకంఠరసం

రసం గంధక మభ్రం చ మాక్షికం లోహ మేవ చ
కర్షప్రమాణం సంగృహ్య వైక్రాంతం రసపాదికమ్
వైక్రాంతార్ధం తథా హేమ రూప్యం హేమచతుర్గుణమ్
వాసాయా శ్చ తథా భార్ఙ్గ్యా బృహత్యా రార్ద్రికస్య చ
స్వరసేన సరస్వత్యా భావయిత్వా పృథక్పృథక్
రక్తీర్ద్వయమితాః కుర్యా ద్వటీ శ్ఛాయాప్రశోషితాః
స్వరభేదా నశేషాం శ్చ కాసాన్ శ్వాసాం శ్చ దారుణాన్
నిఖిలాన్ కఫజాన్ వ్యాధీన్ వాతశ్లేష్మసముద్భవాన్
హన్యా త్కిన్నరకంఠాఖ్యో రసో సౌ రుద్రనిర్మితః
కిన్నర స్యేవ కంఠ స్య స్వరో స్య ప్రాశనా ద్భవేత్ ॥

పాదరసం, గంధకం, అభ్రకభస్మం, హేమమాక్షికభస్మం, లోహభస్మం — ఇవి రెండేసి తులాలు. వైక్రాంతభస్మం అరతులం. సువర్ణభస్మం పావుతులం. రజతభస్మం ఒక తులం. ఇవి చేర్చుకుని, అడ్డసరంరసంతోనూ, గంటుభారంగి కషాయంతోనూ, వాకుడు నేలములకల రసాలతోనూ, అల్లపురసంతోనూ, సరస్వతీఆకురసంతోనూ వేరువేరుగా భావనచేసి రెండేసిరతుల యెత్తున మాత్రలు కట్టుకుని వాడుకునేది.

ఇది సకలవిధాల స్వరదోషాలు, దగ్గులు, పగర్పులు, కఫవ్యాధులు సమస్తమూ పోగొడుతుంది.

## ౭౧ విషూచివిధ్వంసరసం

టంకనం మాక్షికం శుంఠీ పారదం గంధకం విషమ్
గరళం సమభాగేన సర్వేషాం హింగులం సమమ్

మర్దయే జ్జంబీరద్రావై ర్వటీ కార్యా ప్రయత్నతః
శ్వేతసర్షపతుల్యా చ మృతసంజీవనీ తథా
విషూచీం నాశయ త్యాశు దధ్యన్నం పథ్య మాచరేత్
త్రిదోషోత్థ మతీసారం సర్వోపద్రవసంయుతమ్ ॥

పొంగించిన వెలిగారం, హేమమాక్షికభస్మం, సొంటి, పాదరసం, గంధకం, నాభి, గరళం — ఇవి సమభాగాలు. వీటికన్నిటికీ సమం ఇంగిలీకం. ఇవన్నీ చేర్చి నిమ్మకాయరసాన మర్దించి ఆవగింజ లంతేసి మాత్రలు చేసి తగిన అనుపానంతో వాడుకునేది. పెరుగుతో అన్నంపెట్టాలి.

ఇది విషూచి (కలరా) పోగొడుతుంది. సర్వోపద్రవాలతోనూ కూడిన త్రిదోషాతీసారం కూడా తగ్గించేస్తుంది.

## ౭౨ అగ్నిముఖరసం

సూతం గంధం విషం తుల్యం మర్దయే దార్ద్రకద్రవైః
అశ్వత్థచించాపార్థక్షారాః క్షారౌ చ టంకణమ్
జాతీఫలం లవంగం చ త్రికటు త్రిఫలా సమమ్
శంఖక్షారం పంచపలం హింగు జీరం ద్విభాగికమ్
మర్దయే దమ్లయోగేన గుంజామాత్రా వటీ శుభా
పాచనీ దీపనీ సద్యోఽజీర్ణం శూలవిషూచికాః
హిక్కాం గుల్మం చోదరం చ నాశయే న్నాత్ర సంశయః ॥

పాదరసం, గంధకం, నాభి — ఇవి ఒక్కొక్క పలం గ్రహించి అల్లపురసాన మర్దించేది. తరవాత అందులో రావి, చింత, ఉత్తరేణుక్షారాలు, యవక్షారం, సర్జక్షారం, పొంగించిన వెలిగారం, జాజికాయలు, లవంగాలు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరక, తాడి, ఉసిరికలు — ఇవన్నీ ఒక్కొక్కపలమూ, శంఖభస్మం అయిదుపలాలు, ఇంగువ, జీలకర్ర రెండేసి పలాలు చేర్చి అమ్లద్రవ్యాలతో మర్దించి గురిగింజలంతేసి మాత్రలు కట్టి సమయానుకూలంగా అనుపానాలు నిర్ణయించుకుని వాడుకునేది.

ఇది జీర్ణశక్తిని వృద్ధిచేస్తుంది. ఆకలి పుట్టిస్తుంది. అజీర్ణం తగ్గిస్తుంది. శూల, విషూచి (కలరా), ఎక్కిళ్ళు, గుల్మాలు, ఉదరవ్యాధులు పోగొడుతుంది.

## ౬౩ సువర్ణసిందూరభూషణం

సువర్ణం రజతం వజ్రం మౌక్తికం చాపి విద్రుమమ్
భుజంగ మభ్రకం కాంతం రససిందూర వంగకే
పృథగ్ద్విభాగం పూర్వార్థే త్వేకభాగం పరార్థకే
జాతీపుష్పరసైః శోణమునిపుష్పైక్షువాలకైః
వరా వారాహిలామజ్జాహిమశాల్మలివారిభిః
ప్రత్యేకం త్రిదినం పిష్ట్వా మాషమాత్రం తు మానతః
మధునా సేవయే త్ప్రాతః కుష్ఠం సర్వం చ కామలామ్
వింశతిం తు ప్రమేహాంశ్చ చత్వారింశచ్చ పైత్తికాన్
సిందూరభూషణం నామ గర్భిణీరోగనాశకమ్
వీర్యవృద్ధికరం నిత్యం షండోపి తరుణాయతే ॥

సువర్ణభస్మం, రజతభస్మం, వజ్రభస్మం, మౌక్తికభస్మం, ప్రవాళభస్మం — ఇవి రెండేసి భాగాలు. నాగభస్మం, అభ్రకభస్మం, కాంతభస్మం, రససిందూరం, వంగభస్మం — ఇవి ఒక్కొక్క భాగం. ఇవన్నీ కలిపి జాజిపువ్వులు, ఎర్రఆవిసిపువ్వులు, చెరుకువేళ్ళు, కురువేరు, పిల్లితేగలు, నేలతాడి, వట్టివేళ్ళు, రక్తచందనం, బూరుగుచెక్క — వీటి రసాలతో మూడేసిదినాలు మర్దించేది.

ఇది మాషప్రమాణం తేనెతో పుచ్చుకునేది. ఇది సకలకుష్ఠులు, కామెర్లు, వింశతి ప్రమేహాలు, ఇరవైనాలుగు పిత్తవ్యాధులు, పోగొడుతుంది. గర్భవతులకు వచ్చే రోగాలన్నీ ముఖ్యంగా పోగొడుతుంది. వీర్యవృద్ధిన్నీ కలిగిస్తుంది. ఇది సేవించినవాడు వృద్ధుడైనా పడుచువాడవుతాడు.

## ౬౪ ఆనందభైరవి

సౌభాగ్య హింగుళ కణా గరళం మరీచం
సంమర్ద్య నింబకరసేన దినత్రయం చ
ఆనందభైరవవటీ తువరీప్రమాణం
నానానుపానసహితం సకలామయఘ్నమ్ ॥

పొంగించిన వెలిగారం, ఇంగిలీకం, పిప్పళ్ళు, నాభి, మిరియాలు — ఇవి సమ భాగాలు. ఇవి వేపచెక్క రసంతో నూరి కందిగింజలంతేసి మాత్రలు చేసి వాడుకునేది.

ఇది అందరూ నిమ్మకాయలరసాన మర్దించి తయారుచేస్తున్నారు. ఎక్కడో వృద్ధవైద్యులు మాత్రమే వేపచెక్కరసాన మర్దించి సిద్ధపరుస్తున్నారు.

ఇది సకలవ్యాధులూ తగ్గిస్తుంది.

## ౭౫ శూలకుఠారం

టంకణం పారదం గంధం త్రిఫలా వ్యోష తాళకమ్
విషం తామ్రం చ నేపాళం భృంగస్వరసమర్దితమ్
ద్విగుంజమాత్రా వటికా మరీచే నార్ద్రకేన వా
సర్వశూలకుఠారోయం విష్ణుచక్ర మివాసురాన్ ॥

పొంగించిన వెలిగారం, పాదరసం, గంధకం, కరక, తాడి, ఉసిరిక, సొంటి, పిప్పలి మిరియాలు, తాళకం, నాభి, తామ్రభస్మం, నేపాళాలు, — ఇవి సమభాగాలుగా గ్రహించి గుంటకలగరరసంతో మర్దించి రెండేసి గురిగింజలయెత్తున మాత్రలు కట్టుకుని వాడుకునేది. అనుపానం మిరియాలకషాయం గాని, అల్లపురసం గాని వాడుకునేది. సుదర్శనచక్రం సకలరాక్షసులనూ సంహరించేటట్టు ఇది సకలశూలలూ పోగొడుతుంది.

## ౭౬ పైత్త్యాంతకరసం

అల్లము జీలకర్రయును ఆమలసూపము సింధురంబునన్
తెల్లని సైంధవంబు సమభాగము దాల్చిని ఖల్వమందునన్
బుల్లని నిమ్మపండ్లరసముం గొని మర్దన చేసి చిన్నమున్
జల్లగ సేవజేసినను శాంతము నొందును సర్వపైత్త్యముల్ ॥

పొట్టుతీసిన అల్లం, జీలకర్ర, ఉసిరికపప్పు, రససిందూరం, సైంధవలవణం, దాల్చిని చెక్క — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి నిమ్మకాయల రసంతో మర్దనాచేసి చిన్నమెత్తు చొప్పున పుచ్చుకుంటే సకలపైత్త్యాలూ తగ్గిపోతాయి.

# వంట ఔషధాలు

## ౧ పూర్ణచంద్రోదయం

పలం మృదుస్స్వర్ణదళం రసేంద్రం
పలాష్టకం షోడశ గంధకస్య
శోణైస్సుకార్పాసభవప్రసూనై
స్సర్వం విమర్ద్యాథ కుమారికాద్భిః
తత్కాచకుంభే నిహితం ప్రగాఢే
మృత్కర్పటీభి ర్దివసత్రయం చ
పచేత్క్రమాగ్నా సికతాఖ్య యంత్రే
తతో రజః పల్లవరాగరమ్యమ్
నిగృహ్య చైత చ్చ పలం పలం చ
చత్వారి కర్పూరరజ స్తథైవ
జాతీఫలం శోషణ మింద్రపుష్పం
కస్తూరికాయా ఇహ శాణ మేకమ్
చంద్రోదయోయం కథితోస్య మాషో
భుక్తో హివల్లీదళమధ్యవర్తీ
మదోత్కటానాం ప్రమదాశతానాం
గర్వాధికత్వం శ్లథయ త్యకాండే
ఘృతం ఘనీభూత మతీవ దుగ్ధం
మృదూని మాంసాని సమస్తకాని
మాషాన్నపిష్టాని భవంతి పథ్యా
న్యానందదాయీ నృపరాణి చాత్ర

వలీపలితనాశన స్తనుభృతాం వయస్తంభన
స్సమస్తగదఖండనః ప్రచురరోగపంచాననః
గృహేపి గృహమాపతి ర్భవతి యస్య చంద్రోదయ
స్స పంచశరదర్పితో మృగదృశాం భవే ద్వల్లభః
రతికాలే రతాంతే వా సేవితవ్యో రసోత్తమః
మానహానిం కరో త్యేషః ప్రమదానాం సునిశ్చితమ్
కృత్రిమం స్థావరం చైవ జంగమం చాపి యద్విషమ్
న వికారాయ భవతి సాధకేంద్రస్య వత్సరాత్
యథా మృత్యుంజయాభ్యాసా
న్మృత్యుంజయతి దేహినామ్
తథాయం సాధకేంద్రస్య జరామరణనాశనః
తంత్రాంతరే ప్రసిద్ధోయం మకరధ్వజనామతః ॥

అతిమృదువుగా వున్న కుందనపు రేకులు ఒకపలం. శుద్ధమైన పాదరసం యెనిమిది పలాలు. గంధకం 16 పలాలు. ఇవి మూడూ సంప్రదాయం ప్రకారం కలిపి మర్దించేది. గంధకంలో రసం బాగా జీర్ణించాక అపాడి పైడిపత్తిపువ్వులరసంతో మూడు దినాలూ, కలబందరసంతో మూడుదినాలూ మర్దించాలి. తరవాత, అది నీడను ఎండించి చూర్ణంచేసి గాజుసెప్పెలలో ఎక్కించి సికతాయంత్రంతో క్రమాగ్నులమీద మూడు దినాలు వుండాలి. అప్పటికి మామిడిచిగురుటాకుల రంగుతో సిందూరం ఏర్పడుతుంది. అది తీసుకుని అది వొకపలం, పచ్చకర్పూరమూ, జాజికాయా, మిరియాలూ, లవంగాలూ — ఇవి నాలుగూ ఒక్కొక్కపలమూ, ఒకశాణం కస్తూరీ చొప్పున గ్రహించి మెత్తగా నూరి స్థితిగతులను పట్టి మోతాదు నిర్ణయించుకుని వాడుకోవాలి.

ఇది పుచ్చుకునేటప్పుడు పేరుకున్న నెయ్యీ, చిక్కని పాలూ, మంచిమంచి మాంసాలూ, మాషాన్నమూ, మినపసున్నీ ఇలాంటి బలకరపదార్థాలూ ఎక్కువగా భుజించాలి.

ఇది పుచ్చుకున్న పురుషుడు అనేకమంది స్త్రీలతో రమించగలుగుతాడు. ఇది సమస్తవ్యాధులనూ పోగొడుతుంది. శరీరం ముడతలుపడనివ్వదు. జుట్టు నెరియనివ్వదు. వయస్తంభనం కలిగిస్తుంది. ఇది సేవించేవాడు మన్మథుడు లాగ బలదర్పితుడై స్త్రీలకు ప్రీతిపాత్రుడై వుంటాడు. ఇది రతిప్రారంభించడానికి ముందుగాని,

రతి అయినదిరకాలి గాని తాంబూలంలో సేవిస్తే స్త్రీలకు గర్భభంగం కలిగించే శక్తి కలుగుతుంది. స్థావరజంగమవిషాలూ, కృత్రిమవిషాలూ ఇది ఒక్క సంవత్సరం తక్కువ కాకుండా సేవించే పురుషుణ్ణి ఏమీ చెయ్యలేవు. ఇది సేవిస్తే ముసలితనమూ మరణమూ కూడా రావు.

ఇదే ఇతరదేశాలలోనూ ఇతరగ్రంథాలలోనూ మకరధ్వజం అని ప్రఖ్యాతి పొందివుంది.

గమనిక:— ఇది చెప్యకంలో గ్రంథంలో వున్న విధానానికీ, మనదేశంలోవున్న సంప్రదాయానికీ చాలా భేదంవుంది. "తతో రజః పల్లవరాగరమ్యం నిగృహ్య" అని యోగంలో ఉంది. (మామిడి) చిగురుటాకులాగ రమ్యంగా వున్న సిందూరం గ్రహించవలసింది. అని మాత్రమే గ్రంథంలో వుంది. సిందూరం గాజుకుప్పెలో పైభాగాన వుంటుం దనీ, గంధకంయెగిరిపోయి బంగారం కింద వుండిపోతుందనీ అందరికీ తెలుసు. సిందూరంలో అబంగారం కలపకలసిం దని యోగంలో లేదు; కాని మనదేశంలో మొదట్నుంచీ అబంగారం కలిపి నూరి కుప్పెలుకట్టి వాడడం సంప్రదాయం అయింది, ఇది తప్పు. అబంగారంలోవున్న గుణం సిందూరానికి సంక్రమించింది. అబంగారం యిక నగలకు మాత్రమే పనికివస్తుంది. దాని ఔషధశక్తి పోయింది. అబంగారం సిందూరంలో కలిపి నూరడం, అబంగారం రసంలోనూ గంధకంలోనూ కలిపి మళ్లీ పూర్ణచంద్రోదయం వండడంవంటివి. నిరర్థకం. ఔషధాలు చేసేవారు ఈవిషయం బాగా యోచించాలి.

మరిన్నీ, సిందూరమూ బంగారమూ కలిపి నూరి యేదో అనుపానమార్గంలో వాడడం కూడా మనదేశంలో వాడుకలో వుంది. ఇది క్షయప్రకరణంలో చెప్పిన రసాయనౌషధం. క్షయవ్యాధిలో వాడినా, రసాయనంగా వాడినా యిది యోగంలో చెప్పినట్టు పచ్చకర్పూరమూ, లవంగాలూ, జాజికాయా, మిరియాలూ, కస్తూరీ కలిపే వాడాలి. ఇదికూడా వైద్యులు యోచించాలి.

## ౨ కాంతవల్లభరసం

కాంతం షోడశభాగం చ చతుర్దశ మయోరజః
కిట్టం ద్వాదశకం చైవ దశభాగంతు టంకణమ్
మనశ్శిలాష్టభాగం చ షడ్భాగం తు శిలాజతు
పర్వేణ చ సమం సూతం గంధకం చాపి తత్సమమ్

ఆర్ద్రీమూషోదరే న్యస్య వాలుకాయంత్రకే క్షిపేత్
పాచయే త్స్వప్తరాత్రం తు సంగ్రాహ్యం సూక్ష్మచూర్ణితమ్
సేవితం మధునా యుక్తం నిష్కార్థేన సమన్వితమ్
పాండురోగం క్షయం గుల్మం గ్రహణీ మపి నాశయేత్
కాసం శ్వాసం జ్వరం ఛర్దిం ప్లీహోదర మరోచకమ్
మందాగ్నిం కుష్ఠరోగం చ మూలరోగం భగందరమ్
వాతశూలహరం వృష్య మత్యంత మతిదీపనమ్
తుష్టిపుష్టికరం కాంతివర్ధనమ్ బలవర్ధనమ్
కాంతవల్లభనామ్నాయం విష్ణునా నిర్మితం పురా
సర్వేషాంను క్షయం చైవ లోకస్యారోగ్యకారణమ్ ॥

కాంతభస్మం 16 భాగాలు. లోహభస్మం 14 భాగాలు. మాండూరభస్మం 12 భాగాలు. పొంగించిన వెలిగారం 10 భాగాలు. మణిశిల 8 భాగాలు. శుద్ధశిలాజిత్తు 6 భాగాలు. వీటి అన్నిటికీ సమం పాదరసం. రసంతో సమానం గంధకం.

ముందు రసగంధకకజ్జలిచేసి తరవాత భస్మాలు కలిపి నూరాలి. ఏరసంతోనూ నూరమని యోగంలో లేకపోయినా, కృష్ణవైద్యులు నిమ్మకాయరసంతో నూరడం సంప్రదాయంచేశారు. అది ఆరాక మళ్లీ పొడిచేసి గాజుకుప్పెలో ఎక్కించి క్రమాగ్నులలో ఏడురాత్రింబగళ్ళు వంటచెయ్యాలి. వంటఅయిన తరవాత పైనిచేరిన సింధూరమూ, కిందవుండిపోయిన భస్మసంపుటీ కలిపి మిరియాలకషాయంతో నూరి, కుప్పెలు కట్టుకునేది. ఈమిరియాలకషాయం మర్దనా కూడా సంప్రదాయసిద్ధమే. గాజుకుప్పెలో అడుగున వుండిన భస్మసంపుటీ ఉన్నది ఉన్నట్టు తీసి సింధూరంతో కలపకూడదు. దానిలో గంధకం ఏమాత్రం అయినా మిగిలివుండవచ్చు; కనక, అది పెంకులో పోసి కొంతసేపు నిప్పుమీద ఉంచాలి. అలాచేస్తే బాగరూపానగాని మంటరూపానగాని ఆగంధకం హరించిపోతుంది. అదిచల్లబడ్డాక సింధూరంతో కలుపుకునేది.

ఇది తెనుగుదేశంలోనే వాడుకలో వుండిన గొప్పఔషధం. యుక్తిగా అనుపానభేదాలతో వాడుకుంటే యిది అనేకవ్యాధులను తగ్గిస్తుంది. కాని నిత్యపరిచయంవల్ల చాలామంది ఇది సామాన్య ఔషధం అనుకుంటారు. ఇది క్షయప్రకరణంలో ప్రధానంగా చెప్పబడ్డది.

ఇది పాండురోగం, క్షయ, గుల్మం, గ్రహణి, కాస, శ్వాస, జ్వరం, ఛర్ది, ప్లీహోదరం, అరోచకం, అగ్నిమాంద్యం, కుష్ఠువు, మూలశంక, భగందరం, వాతశూల పోగొడుతుంది. ఆకలివృద్ధి చేస్తుంది. వీర్యవృద్ధి కలిగిస్తుంది. రక్తవృద్ధి, శరీరపుష్టి, కాంతి, బలమూ కలిగించి తుష్టి కలిగిస్తుంది. సర్వ పాండువులకూ, క్షయలకూ ఇది తిరుగులేని ఔషధం.

ఇందులో కాంతం మొదలైన వన్నీ శాస్త్రీయంగా తయారైన భస్మాలు గానే వాడాలి. రజను వాడడం చాలా తప్పు. 'రజః' అంటే భస్మమే. శిలాజిత్తు అన్నచోట కొందరు గోమూత్రశిలాజిత్తు వాడడం కూడా ఉంది; కాని అది మంచి సంప్రదాయం కాదు. వంటలో గోమూత్రశిలాజిత్తు గంధకంతో పాటు మారించి పోతుంది. అంచేత కర్పూరశిలాజిత్తే వాడాలి.

మరిన్నీ కొందరిది మూడుదినాలే వంటచేస్తారు. అదిన్నీ తప్పే. ఏడురాత్రింబగళ్ళు వంటచేస్తేనే ఇది సరిగా పనిచేస్తుంది.

రజను వేస్తే గాని కుప్పె గట్టిగా వుండదనీ, గట్టిగా వుండడం దీనికి ముఖ్యం అనీ కూడా కొందరు చెబుతారు. అది మంచి అర్థం కాదు. భస్మాలే వాడాలి. కుప్పె నల్లరాయిలాగ వుండనక్కరలేదు.

## ౩ మకరధ్వజం

పల మేకం సువర్ణస్య రసేంద్రస్య పలాష్టకమ్
రసస్య ద్విగుణం గంధం కజ్జలీకృత్య యత్నతః
కుమారీకారసై ర్భావ్యం కాచపాత్రే నిధాపయేత్
వాలుయంత్రే చ సంస్థాప్య క్రమశ స్త్రిదినం పచేత్
స్వాంగశీతం సమాదాయ పుష్పారుణరజస్సమమ్
యవమాత్రం ప్రదాతవ్య మహివల్లీదళై స్సహ ॥

## ౪ షడ్గుణబలిజారిత మకరధ్వజం

రసస్య షడ్గుణై ర్గంధైః పూర్వవ త్కజ్జలీకృతే
భావితే పాచితే సమ్యక్ షడ్గుణో బలిజారితః
విధివ త్సేవితో హ్యేష ముముర్షు మపి జీవయేత్

ఏత దభ్యాసత శ్చైవ జరామరణనాశనమ్
అనుపానవిశేషేణ కరోతి వివిధాన్ గుణాన్
జ్వరం త్రిదోషజం ఘోరం మందాగ్నిత్వ మరోచకమ్
అన్యాంశ్చ వివిధాన్ రోగాన్ నాశయే న్నాత్రసంశయః
కరో త్యగ్నిం బలం పుంసాం వలీపలితనాశనః
మేధాయుః కాంతిజననః కామోద్దీపనకృ న్మహాన్
భాస్వజ్జ్యోతి ర్యథా భాతి కాచే నీలాదికే శుభే
తథానుపానభేదేన క్రియావాన్ మకరధ్వజః ॥

అపరంజి రేకులు ఒకపలం. శుద్ధపాదరసం ఎనిమిదిపలాలు. గంధకం 16 పలాలు. ముందు బంగారం రసంలో జీర్ణింపచేసి తరవాత గంధకంతో కలిపి మెత్తగా నూరి పిదప కలబందరసంతో నూరేసి. ఆపి నీడనెండించి చూర్ణించి గాజుకుప్పెలో యెక్కించి క్రమాగ్నులతో సికతాయంత్రంమీద మూడుదినాలు వండి చల్లబడిన తరవాత కుప్పె పైభాగాన వున్న సిందూరం గ్రహించాలి. అది యవప్రమాణం తాంబూలంతో సేవించేది.

షడ్గుణబలిజారిత మకరధ్వజానికిన్నీ ఇవే వస్తువులు. అయితే గంధకం రసానికి రెట్టింపు కాక ఆరురెట్లు వెయ్యాలి. అంటే, అపరంజిరేకులు ఒకభాగం. రసం ఎనిమిది భాగాలు. గంధకం 48 భాగాలు. బంగారం రసంలో జీర్ణింపజేసి అది అంత గంధకంలోనూ కలిపి కజ్జలిచేసి కలబందరసంతో నూరి ఆరినపిదప చూర్ణించి గాజుకుప్పెలో యెక్కించి సికతాయంత్రంమీద క్రమాగ్నులతో మూడు దినాలు వండేది. చల్లబడిన తరవాత పైని వుండే సిందూరం గ్రహించివాడుకునేది. ఇదొకవిధం.

ఇక రెండోవిధం: అపరంజి రేకులు ఒకభాగం. రసం ఎనిమిది భాగాలు. గంధకం పదహారుభాగాలు. మెత్తగానూరి కలబందరసంతో మర్దించి ఆర్చి చూర్ణించి గాజుకుప్పెలోయెక్కించి మూడుదినాలు వండేది. చల్లారినపిదప సిందూరంమాత్రం గ్రహించి మరో 16 భాగాలు గంధకంలో కలిపి కలబందరసంతో నూరి యథాప్రకారం వంటచేసేది. మళ్లీ సిందూరంమాత్రం గ్రహించి తక్కిన 16 భాగాలూ గంధకం కలిపి కలబందరసంతో మర్దించి యథాప్రకారం వండేది. ఇప్పటికి గంధకం 48 భాగాలూ వాడడం అయింది. ఇది మంచివిధానం అని చాలామంది అవలంబిస్తున్నది.

మూడోపద్ధతి. ఒక్కొక్కవంటకు ఎనిమిదేసి భాగాల గంధకంతో ఆరుమాట్లు వండడం. ఇది సాధారణంగా వాడుకలో లేదు. మూడుమాట్లు వండినా ఆరుమాట్లు

ఉండినా రెండో వంట మొదల్కు బంగారం కలపనక్కరలేదు. మొదటివంట కాగానే బంగారం తీసెయ్యాలి. కొత్తది అవసరం లేదు. సిందూరంమట్టుకే తక్కిన వంటలలో చేస్తుకోవాలి.

బంగారం కలిపినూరి వాడడం తప్పు. సిందూరమే వాడమని యోగంలో చెప్పబడ్డది.

ఇది మృత్యువును కూడా జయిస్తుంది. ముసలితనం రానివ్వదు. త్రిదోషాలవల్ల వచ్చిన జ్వరాలూ, అగ్నిమాంద్యమూ, అరోచకమూ పోగొడుతుంది. బలమూ పుష్టీ వీర్యవృద్ధీ కలిగిస్తుంది. శరీరం ముడతలుపడనివ్వదు. జుట్టు తెల్లబడనివ్వదు. బుద్ధిబలం పెంచుతుంది. ఆయువును వృద్ధిచేస్తుంది. తేజస్సూ, వర్చస్సూ కలిగిస్తుంది. కామోద్దీపనమున్నూ కలిగిస్తుంది. అనుపానవిశేషాలతో దీనిని వాడి సకల వ్యాధులనూ కుదర్చవచ్చు.

ఇది బతికివున్నంత కాలమూ తాంబూలంలో వాడతగ్గది. పథ్యం అక్కరలేదు.

మకరధ్వజానికీ షడ్గుణబలిజారితమకరధ్వజానికీ గుణాలు ఒక్కటే. అయితే, మకరధ్వజంకంటే ష. బ. మకరధ్వజం ఎక్కువగానూ, చురుగ్గానూ పనిచేస్తుంది.

మకరధ్వజమూ పూర్ణచంద్రోదయమూ ఒకటే. పూర్ణచంద్రోదయమే మరి రెండు వంటలు చేస్తే షడ్గుణబలిజారితమకరధ్వజం అవుతుంది. సిద్ధమకరధ్వజం మాత్రం సర్వాత్మనా వేరు.

## ౫ పుటపక్వ, విషమజ్వరాంతకలోహం

హింగూలసంభవం సూతం గంధకేన సుకజ్జలమ్
పర్పటీరసవత్పాచ్యం సూతాంఘ్రిహేమభస్మకమ్
లోహం తామ్ర మభ్రకం చ రసస్య ద్విగుణం తథా
వంగకం గైరికం చైవ ప్రవాళం చ రసార్థకమ్
ముక్తా శంఖం శుక్తి భస్మ ప్రదేయం రసపాదికమ్
ముక్తాగృహ్యా చ సంస్థాప్య పుటపాకేన సాధయేత్
భక్షయే త్ప్రాతరుత్థాయ ద్విగుంజాఫలమానతః
అనుపానం ప్రయోక్తవ్యం కణా హింగు ససైంధవమ్
జ్వర మష్టవిధం హంతి వాతపిత్తకఫోద్భవమ్

ప్లీహానం యకృతం గుల్మం సాధ్యాసాధ్య మథాపివా
సంతతం సతతాఖ్యం చ విషమజ్వరనాశనమ్
కామలాం పాండురోగం చ శోథం మేహ మరోచకమ్
గ్రహణీ మామదోషం చ కాసం శ్వాసం చ తత్ర చ
మూత్రకృచ్ఛ్రాతిసారం చ నాశయే దవికల్పతః
అగ్నిం చ కురుతే దీప్తం బలవర్ణప్రసాదనః
విషమజ్వరాంతకాఖ్యో ధన్వంతరిప్రకాశితః ॥

ఇంగిలీకరసం సమభాగగంధకంతో పర్పటి చేసేది. అదిన్నీ, రసంలో నాలుగోవంతు స్వర్ణభస్మమూ గ్రహించేది. లోహభస్మం, తామ్రభస్మం, అభ్రకభస్మం — ఇవి రసానికి రెట్టింపు, వంగభస్మం, వంటజేగురు, ప్రవాళభస్మం — ఇవి ఒక్కొక్కటి రసంలో సగంచొప్పున, ముక్తిభస్మం, శంఖభస్మం, ముత్యపుచిప్పలభస్మం — ఇవి ఒక్కొక్కటి రసంలో నాలుగోవంతు. ఇవన్నీ కలిపి నీళ్ళతో నూరి ముద్ద చేసి అది ముత్యపు చిప్పల సంపుటిలో పెట్టి ఆముత్యపుచిప్పలు భస్మం కావడానికి తగినన్ని పిడకలతో పుటం పెట్టేది.

ఇది అనేకఅనుపానాలతో వాడవచ్చు. పిప్పళ్ళు, సైంధవలవణం, ఇంగువ — ఇవి సమభాగాలుగా చేసిన చూర్ణంతో వాడితే విషమజ్వరాలూ, యకృత్ప్లీహవృద్ధులూ పోగొడుతుంది. కామల, పాండువు, ఉబ్బు, మేహరోగం, గ్రహణి, ఆమదోషం, దగ్గు, ఉగర్పు, మూత్రకృచ్ఛ్రం, మూత్రాతిసారం తగ్గిస్తుంది.

పుటం అయినతరవాత కొందరు సంపుటిలో వున్న మందే వాడతారు. కొందరు ముత్యపుచిప్పలతో కలిపి నూరి వాడతారు. అయితే, ముత్యపుచిప్పలు కలపడమే మంచిది. చాలామంది వాడుక అదే. యకృత్ప్లీహవృద్ధులూ, ఆమదోషమూ తగ్గించడం జ్వరంలో అగత్యం కనుక యీసంప్రదాయమే చాలామంచిది.

## ౬. సిద్ధమకరధ్వజం

పలమానం రసం సమ్యక్ సప్తసంస్కారసంస్కృతమ్
తథాపలద్వయం గంధం శుద్ధహేమ ద్వికార్షికమ్
శైలాసాచలసంభూతే సుదృఢే చ సుచిక్కణే
శోణవస్త్రరజే ఖల్వే సర్వం సంస్థాప్య మిశ్రయేత్

మర్దయే ద్యత్నతో వైద్యో యామా నష్టౌ నిరంతరమ్
రక్తకార్పాసపుష్పస్య శ్వేతాంకోటఫలస్య చ
కుమార్యాశ్చ రసైస్సమ్యగ్భావయిత్వా పృథక్ పృథక్
స్థాపయిత్వా కాచకూపీమధ్యే సర్వం ప్రయత్నతః
రక్తాంగసాలసరళఖదిరశ్రీఫలోద్భవామ్
కాష్ఠే నాన్యత మే నైవ నీరసేన ప్రతాపయేత్
మృదునానలయోగేన ప్రాగ్యామద్వితయం పచేత్
పున ర్యామద్వయం పాచ్యం మధ్యతాపేన వహ్నినా
అగ్నినా ప్రఖరే ణైవ తతో యామద్వయం పచేత్
భూయో మందాగ్నినా పాచ్య మవశిష్ట్వయామకమ్
సాంగశీత మథోద్ధృత్య నవచూతదళోపమమ్
భంగురం లోహితం పిష్టే దాడింబకుసుమోపమమ్
తతోవతార్య గంధేన ద్విగుణేన విమర్దయేత్
భావయే త్పూర్వవ ద్భూయః పాచయేచ్చ ప్రయత్నతః
ఏవం వారద్వయం కుర్యా త్సమ్య గౌషధసిద్ధయే
సన్నిపాతం జ్వరం ఘోరం మందాగ్నిత్వ మరోచకమ్
ఆమశూలం కటీశూలం హృచ్ఛూలం పక్తిశూలకమ్
కాసం శ్వాసం చ యక్ష్మాణం శూలం కుష్ఠ మశేషతః
గలోత్థాం నంత్రవృద్ధిం చ తథాతీసార మేవ చ
శ్లీపదం కఫవాతోత్థం చిరజం కులజం తథా
నాడీవ్రణం వ్రణం ఘోరం గుదామయభగందరమ్
వాయుం బహువిధం హంతి ధ్వజభంగం విశేషతః
సేవనా దస్య నశ్యంతి సర్వే రోగా ననశంయః
కరో త్యగ్నిం బలంవీర్యం వలీపలితనాశనః
విధివ త్సేవితో హ్యేష ముమూర్షు మపి జీవయేత్

స్వేచ్ఛాచారవిహారోపి న కదాచి ద్వ్యపద్యతే
మేధాయుః కాంతిజననః కామోద్దీపనకృన్మహాన్
వృద్ధోపి తరుణస్పర్థీ స్త్రీషు చాపి వృషాయతే
సేవనాదస్య సమ్రాజో గచ్ఛంతి ప్రమదాశతమ్
త్రైలోక్యశుభదం శ్రీమ దేష ఏవ మహౌషధమ్
మృత్యుంజయో యథాభ్యాసాన్మృత్యుం జయతి దేహినామ్
తథాయం సాధకేంద్రస్య జరామరణనాశనః
స్వయం త్రైలోక్యనాథేన త్రైలోక్యహితమిచ్ఛతా
సమర్పితోయం సిద్ధేభ్యః కరుణార్ద్రేణ వై యతః
అతోయం భువనే ఖ్యాతః శ్రీసిద్ధమకరధ్వజః
భాస్వాన్ యథా తమో హంతి కేసరీ కరిణం యథా
తులాసంఘం యథా వహ్నిః తథారోగా నసౌ హరేత్ ॥

బహుసంస్కారసంస్కృతం అయిన పాదరసం ఒకపలం. శుద్ధగంధకం రెండు పలాలు. అపరంజి రేకులు నాలుగుతులాలు. ఇవన్నీ మంచికల్వంలో వేసి కలిపి ఎడతెరిపి లేకుండా తొమ్మిది జాములు చక్కగా నూరాలి. తరవాత ఎర్రపత్తిపూల రసంతోనూ, తెల్లఊమెత్తపళ్ళరసంతోనూ, కలబందరసంతోనూ వేరువేరుగా మర్దించాలి. అది నీడ నెండిన తరవాత చూర్ణంచేసి గాజుకుప్పెలోపోసి సికతా యంత్రంలో మొదట రెండుజాములూ మందాగ్నితోనూ, తరవాత రెండుజాములు మధ్యమాగ్నితోనూ. పిదప రెండుజాములు గాఢాగ్నితోనూ. చివర మరో రెండు జాములు మళ్ళీ మందాగ్నితోనూ వంటచెయ్యాలి. మంజిష్ఠ, మద్ది, సరళ, చంద్ర, మారేడు — ఈజాతులలో వొకచెట్టు కట్టె బాగా ఎండబెట్టి వంటచెయ్యాలి.

కుప్పెలు చల్లబడ్డతరవాత విప్పిచూసుకుంటే పైభాగాన పాదరసం చక్కగా సిందూరించి పట్టివుంటుంది. అది విరిస్తే ఎర్రగా వుంటుంది. నూరితే దానిమ్మపూల రంగుగా వుంటుంది. ఆసిందూరంతీసుకుని మళ్ళీ రెండురెట్లు గంధకం కలిపి వెనకటి లాగే ఎర్రపత్తిపువ్వుల రసంతోనూ, తెల్లఊమెత్తపళ్ళరసంతోనూ కలబందరసం తోనూ మర్దించి గాజుకుప్పెలో పోసి యథాపూర్వంగా వండాలి. మళ్ళీ సిందూరం గ్రహించి రెండురెట్లు గంధకం చేర్చి మూడోమాటున్నూ అలాగే మర్దించి అలాగే వంటచెయ్యాలి.

ఇలాగ మొత్తం ఆరుసార్లు గంధకంతో మూడుమార్లు వండితే సిద్ధమకరధ్వజం తయారవుతుంది. కుప్పె పైభాగాన అంటివుండిన సిందూరమే సిద్ధమకరధ్వజం. మొదటివంట కాగానే బంగారం తీసెయ్యకప్పు. అది మూడువంటలలోనూ చేర్చడమూ, చివర సిందూరంతో చేర్చడమూ నిరుపయోగం. దానిలోవుండే ఔషధశక్తి మొదటివంటలోనే పాదరసానికి సంక్రమించేస్తుంది. అంచేతనే తక్కిన రెండు వంటలలోను చూపులకు మామిడి చిగురులాగా, విరిస్తే ఎర్రగానూ, నూరితే దానిమ్మ పువ్వు రంగుగానూ వుండే సిందూరమే గ్రహించమని గ్రంథకర్త చెప్పాడు. మన తెనుగుదేశంలో, మూడువంటలలోనూ బంగారం వుంచి, చివర సిందూరంతో కలిపి నూరడం కొన్నిచోట్ల ఆచారంగా వుంది; కాని, గ్రంథకర్త కంఠోక్తిగా చెప్పినది గుర్తించినా, రసాయనశాస్త్రదృష్ట్యా ఆలోచించినా భారతదేశం అంతటా ఆచరణలో వుండిన సంప్రదాయం గుర్తించినా మొదటివంటతోనే బంగారంపని అయిపోతుందని బోధపడుతుంది. ఆబంగారం, నగలకే గాని యిక ఔషధాలకు పనికిరాదు. కొందరు, బంగారం కూడా పాదరసంతో పైకెగిరేలాగ చేస్తామంటారు; కాని అది ఎవరూ ఎక్కడా చూపించిందీ చూసిందీ కాదు. ఏవిధంగా చూసినా అది నమ్మడానికి వీలులేదు. పోగా, రసం సర్వవిధాలా శుద్ధిచెయ్యడంలోనే వుంది సిద్ధమకరధ్వజం విశేషం. గంధకం కూడా సకలశుద్ధులూ చెయ్యాలి. మర్దనానురసాలూ, వంటపద్ధతీ కూడా దీనికి ప్రత్యేకశ్రద్ధతో అవలంబించాలి. ఈవిషయాలు పూర్ణచంద్రోదయయోగంలోనూ, షడ్గుణబలిజారితమకరధ్వజయోగంలోనూ సూచించి వున్నాను. కొందరు షడ్గుణబలిజారితమకరధ్వజమే సిద్ధమకరధ్వజం అనుకోడమే కాక చెప్పడమూ, వాడడమూ నేను చూశాను. వారికి సిద్ధమకరధ్వజయోగం వేరే వుందని తెలియదు. పూర్ణచంద్రోదయంలోనూ, మకరధ్వజంలోనూ, షడ్గుణమకరధ్వజంలోనూ సిద్ధమకరధ్వజంలోనూ పడే వస్తువులు రసం, గంధకం, బంగారం— ఇంతే; కాని ఈగ్రంథంచూసినవారు పాటాలలోనూ, మర్దనాలలోనూ, వంటలోనూ, వంట చెయ్యవలసిన కాలంలోనూ చాలా భేదాలుండడం గమనించి వుంటారు.

శాస్త్రపరిజ్ఞాతలైన ఆయుర్వేదవైద్యులు నావ్యాఖ్యానం బాగాపరిశీలిస్తారని నమ్ముతున్నాను.

ఇలాగ తయారుచేసి సిద్ధమకరధ్వజం వయోబలావస్థలు గుర్తించి తగిన అనుపానాలతో వాడితే ఘోరమైన సన్నిపాతిజ్వరాలూ, అగ్నిమాంద్యమూ, అరోచకమూ, ఆమశూలా, కటిశూలా, హృదయశూలా, పరిణామశూలా, దగ్గూ, వగర్పూ, (ఉబ్బసం) క్షయా, శూలా, కష్టా, గళరోగాలూ, అంత్రవృద్ధీ, అతిసారమూ, కఫవాతాలవల్ల పుట్టిన శ్లీపదమూ, చిరకాలం మించీ వున్న శ్లీపదమూ, వంశక్రమంగా

వస్తున్న శ్లీపదమూ, నారికురుపులూ, మూలశంకలూ, భగందరమూ, వాతవ్యాధులూ, ధ్వజభంగమూ పోగొడుతుంది. ఇంకా అనేక వ్యాధులున్నూ తగ్గించేస్తుంది. ఆకలి వృద్ధిచేస్తుంది. వీర్యవృద్ధీ, దేహబలమూ కలిగిస్తుంది. శరీరం ముడతలుపడనివ్వదు. జుట్టు నెరియనివ్వదు. యథావిధిగా సేవిస్తే యిది మృత్యుభయమున్నూ జయిస్తుంది. ఆహారవిహారాలలో విధినిషేధాలు లేకుండా— పథ్యం లేకుండా ఇది స్వేచ్ఛగా పుచ్చుకోవచ్చు. ఇది బుద్ధిబలం యెక్కువచేస్తుంది. వర్చస్సు కలిగిస్తుంది. కామోద్దీపనమున్నూ కలిగిస్తుంది. వృద్ధుణ్ణికూడా యువకునిగా మారుస్తుంది. సూర్యుడు చీకటినీ, సింహం యేనుగునూ, అగ్ని దూదిరాశినీ లాగ ఇది సకలవ్యాధులనూ నాశనం చేసేస్తుంది.

ఇది సేవించడం విషయమయినీ మనదేశములో కొన్ని దురభిప్రాయాలున్నాయి. ఒక మండలమో, రెండుమండలాలో సేవిస్తే చాలునన్నది వాటిలో వొకటి. ఇది రసాయనం. బతికివుండినంత కాలమూ పుచ్చుకోవలసింది. రసాయనం అంటే వ్యాధులూ ముసలితనమూ రాకుండాచేసేది. అని అర్థం. యావజ్జీవమూ వాడితేనే రసాయనౌషధం యీఫలితాలు కలిగించకలదు. ఈసిద్ధమకరధ్వజమే కాదు, రసాయనౌషధం యేదయినా యావజ్జీవమూ పుచ్చుకోవాలి. అప్పుడే అది పనిచేస్తుంది. అలా పుచ్చుకున్నవారే పూర్ణాయుర్దాయభాగ్యం పొందగలరు. సకల ఐహిక సుఖాలున్నూ అనుభవించగలరు.

అంటే, వైద్యుడు ఈసిద్ధమకరధ్వజం యెంత బాగా తయారుచెయ్యాలో, స్త్రీలు గాని పురుషులు గాని అంత శ్రద్ధగానూ, దీక్షగానూ పుచ్చుకోవాలి. ఇది వాడేటప్పుడు జఠరదీప్తి ననుసరించి బలకరమైన పదార్థాలు పుష్కలంగా వాడాలి.

## ౬ మహాకనకసుందరరసం

రసగంధకనాగాశ్చ రసకో మాక్షికాభ్రకే
కాంతభ్రమముక్తానాం వంగభస్మం చ తాళకమ్
భస్మకృత్వా ప్రయత్నేన ప్రత్యేకం కర్షసమ్మితమ్
సర్వతుల్యం శుద్ధహేమం భస్మకృత్వా ప్రయోజయేత్
మర్దయే త్రిదినం సర్వం హంసపాదీరసై ర్భిషక్
తతో వై గోళకాన్ కృత్వా కాచకుప్యాం వినిక్షిపేత్
రుద్ధ్వా తత్కాచకూపీం చ సప్తవస్త్రేణ వేష్టితాం

తతో వై సికతాయంత్రే త్రిదినం చోక్తవహ్నినా
పశ్చాత్తం సాంగశీతం చ మర్ద్యం పూర్వోదితే రసే
వినిక్షిప్య కరండే థ సంపూజ్య సరాజకమ్
మహాకనకసిందూరో రాజయక్ష్మహరః పరః
పాండురోగం శ్వాసకాసకామలాగ్రహణీగదాన్
కృమిశోఫోదరావర్తగుల్మమేహగుదాంకురాన్
మందాగ్నిం ఛర్ది మరుచిం ఆమశూలహలీమకాన్
జ్వరాన్ ద్వంద్వాదికా న్సర్వా న్సన్నిపాతాం స్త్రయోదశ
పిత్తరోగ మపస్మారం వాతరోగాన్ వినాశయేత్
రక్తపిత్తప్రమేహాం శ్చ స్త్రీణాం రక్తస్రుతిం తథా
వింశతిశ్లేష్మరోగాం శ్చ మూత్రరోగం నిహంత్యసౌ
హేమవర్ణ్యశ్చ బల్యశ్చ ఆయుశ్శుక్రవివర్ధనః
మహాకనకసిందూరః కశ్యపేన వినిర్మితః ॥

రసం, గంధకం, నాగభస్మం, కపరి, హేమమాక్షికభస్మం, అభ్రకభస్మం, కాంత భస్మం, ప్రవాళభస్మం, మౌక్తికభస్మం, వంగభస్మం, తాళకభస్మం — ఇవి ఒక్కొక్కటి కర్షం. స్వర్ణభస్మం సర్వతుల్యం, అనగా, 22 తులాలు. ఇవన్నీ కలిపి హంసపాది ఆకులరసాన మూడుదినాలు మర్దించి మాత్రలు చేసి, గాజుకుప్పెలో పోసి, సికతాయంత్రాన మందమధ్యమ గాఢాగ్నులతో మూడుదినాలు వండి చల్లబడ్డతరవాత తీసి, మళ్లీ హంసపాది ఆకురసంతోనే మర్దించి కుప్పెలు కట్టుకుని వయోబలావస్థల ననుసరించి వాడుకునేది.

ఇది క్షయలకు ప్రధానమైన ఔషధం. సకాలంలో ప్రారంభించివాడితే ఎలాంటి క్షయలైనా యిది తగ్గించేస్తుంది. మరన్నీ, పాండువు, శ్వాసకాసలు, కామెర్లు, గ్రహణి, కృమి, ఉబ్బు, ఉదరవ్యాధులు, గుల్మాలు, మేహాలు, మూలశంకలు, మందాగ్ని, ఛర్ది, అరుచి, ఆమశూల, హలీమకం, ద్వంద్వాదిసకలజ్వరాలు, సన్నిపాతాలు, పిత్తరోగాలు, అపస్మారం, వాతరోగాలు, రక్తపిత్తం, ప్రమేహం, స్త్రీల కుసుమవ్యాధులు, వింశతిశ్లేష్మరోగాలు, మూత్రవ్యాధులు పోగొడుతుంది. బలం కలిగిస్తుంది. వీర్యవృద్ధిచేస్తుంది. శరీరానికి బంగారపుఛాయ కలిగించి దీర్ఘాయుర్దాయమున్నూ ప్రసాదిస్తుంది.

## లా సువర్ణకాంతవల్లభరసం

కాంతం షోడశభాగం చ చతుర్దశ మయోరజః
కిట్టం ద్వాదశకం చైవ దశభాగం తు టంకణమ్
మనశ్శిలాష్టభాగం చ షడ్భాగం స్యా చ్ఛిలాజతు
సువర్ణం చైకభాగం స్యా ద్రౌప్యకం తు ద్విభాగికమ్
సర్వై స్తుల్యం శుద్ధసూతం గంధకం సూతసమ్మితమ్
జంబీరఫలసారేణ మర్దయే న్మతిమాన్ భిషక్
ఆర్ద్రీ మూషోవరే న్యస్య వాలుకాయంత్రయోగతః
పాచయే త్సప్తరాత్రం తు సంగ్రాహ్య సూక్ష్మచూర్ణితః
మర్దయే న్మరిచక్వాథై ర్వటికాం శ్చైవ కారయేత్
సేవితో మధునా యుక్త శ్చతుర్గుంజాప్రమాణతః
పాండురోగం క్షయం గుల్మం గ్రహణీం చ చిరంతనీమ్
కాసం శ్వాసం జ్వరం ఛర్దిం ప్లీహోదర మరోచకమ్
మందాగ్నిం కుష్ఠరోగం చ మూలరోగం భగందరమ్
వాతశూలం హరే ద్వృష్య స్తథాచై వాతిదీపకః
తుష్టిపుష్టికరః కాంతివర్ధకో బలవర్ధకః
కాంతవల్లభనామాయం సువర్ణపదపూర్వకః ॥

కాంతభస్మం 16 భాగాలు, లోహభస్మం 14 భాగాలు, మాండూరభస్మం 12 భాగాలు, పొంగించిన వెలిగారం 10 భాగాలు, మణిశిల 8 భాగాలు, కర్పూరశిలాజిత్తు 6 భాగాలు, సువర్ణభస్మం 1 భాగం, రజతభస్మం 2 భాగాలు. ఇవన్నీ యెంతో అంత పాదరసం, రసానికి సమం గంధకం. ముందు రసగంధకాలు చక్కగా కజ్జలి చేసి, తరవాత భస్మాలు కలిపి నిమ్మకాయరసంతో బాగా మర్దించి గాజుకుప్పెలలో పోసి వాలుకాయంత్రాన 7 రాత్రులు వంటచేసేది.

చల్లారిన తరవాత తీసి సింమూరమూ భస్మసంపుటీ కలిపి మిరియాల కషాయంతో మర్దించి కుప్పెలు కట్టుకునేది.

ఇది నాలుగు గుంజలయెత్తు తేనెతో కలిపి పుచ్చుకుంటే పాండురోగం, క్షయ, గుల్మం, గ్రహణి, కాస, శ్వాస, జ్వరం, ఛర్ది, ప్లీహోదరం, అరోచకం, అగ్నిమాంద్యం, కుష్టురోగం, మూలశంక, భగందరం, వాతశూల, తగ్గించేస్తుంది. ఇది వృష్యయోగం. మిక్కిలీ ఆకలి పుట్టిస్తుంది. తుష్టి పుష్టి కాంతి, బలమూ పెంపు చేస్తుంది.

## ౬ మహాలక్ష్మీవిలాసరసం

సువర్ణతారాభ్రకతామ్రవంగ కాంతం చ వైక్రాంత సుతీక్ష్ణకం చ
సువిద్రుమం మాక్షిక మౌక్తికం చ నాగం చ శుద్ధం రసభస్మకం చ
ఏత త్సమం వ్యోషరసేన మర్ద్యం ఏకీకృతం స్యా త్కృతకజ్జలీకమ్
సమర్ద నే న్మాక్షికసంప్రయుక్తం సంశోషయే ద్వాత్రిదినం చ ఘర్మే
తతాపచక్రీ వ్యషనమధ్యసంస్థం యుక్తే కృతే తామ్రపుటేన పక్వమ్
యామాష్టకం సిద్ధితపావకస్య లక్ష్మీవిలాసాఖ్యరసః ప్రసిద్ధః
శతావరీగోక్షురకం శతాంబు న్యగ్రోధవాసాదిగణేన భావ్యం
క్షయం త్రిదోషప్రభవం చ పాండుం సకామలామ్ సర్వసమీరణాం చ
శోథప్రతిశ్యాయవినష్టవీర్యం మూలామయం చైవ సశూలకుష్ఠమ్
మందాగ్ని మేహా నపి సన్నిపాతం
శ్వాసం చ కాసం చ హరే త్ప్రయుక్తః
తారుణ్యలక్ష్మీప్రతిబోధకో మహాలక్ష్మీవిలాసో రసరాజ ఏషః ॥

సువర్ణభస్మం, రజతభస్మం, అభ్రకభస్మం, తామ్రభస్మం, వంగభస్మం, కాంతభస్మం, వైక్రాంతభస్మం, లోహభస్మం, ప్రవాళభస్మం, హేమమాక్షికభస్మం, ముత్యభస్మం, నాగభస్మం, రససిందూరం — ఇవి సమభాగాలు. ఇవన్నీ ముందు త్రికటుకషాయంతోనూ, తరవాత తేనెతోనూ బాగా మర్దించి రెండుమూడు దినాలు ఎండలో ఎండించేది. మూకుళ్ళలో ఉంచి సంధిబంధనం చేసి గాయపుటంవేసి చల్లబడ్డతరవాత తీసుకుని, పిల్లితేగలరసంతోనూ, పల్లేరురసంతోనూ, పన్నీటితోనూ, న్యగ్రోధగణకషాయంతోనూ, వాసాదిగణకషాయంతోనూ భావనలుచేసి కుప్పెలుకట్టుకుని యథోచితంగా వాడుకునేది.

ఇది త్రిదోషాలవల్లా పుట్టిన క్షయ, పాండువు, కామెర్లు, వాతవ్యాధులు, ఉబ్బు, ప్రతిశ్యాయం శుక్రనష్టం, మూత్రకష్టం, అగ్నిమాంద్యం, మేహాలు, సన్నిపాతాలు, శ్వాసకాసలు పోగొడుతుంది. వయస్తంభం చేస్తుంది. లక్ష్మీప్రదం.

## ౧౦ కనకబాలసూర్యోదయం

దశభాగం శుద్ధసూతం గంధం ద్వాదశభాగికమ్
ద్విభాగే చ శిలాతాళే తార్ధాంశం శుద్ధస్వర్ణకమ్
తారం తామ్రం నాగవంగే స్వర్ణపాదాంశకాని చ
కుమారీదాడిమద్రావైశ్చిత్రమూలద్రవేణ చ
త్రిదినం మర్దయిత్వా తు కాచకూప్యాం నిక్షిపేత్
సమ్యగావేష్టయేత్పశ్చాద్వస్త్రఖండైస్సమృత్తికైః
గోలకం తత్తు పచేద్బుద్ధ్యా వాలుకాయంత్రకే భిషక్
త్రిదినం పాచయేచ్చుల్ల్యాం మందమధ్యోత్తమైః క్రమాత్
స్వాంగశీతం సముద్ధృత్య సిందూరం రక్తవర్ణకమ్
సిద్ధం చైతదితి జ్ఞాత్వా సద్యోయోగేషు యోజయేత్
సన్నిపాతజ్వరం ఘోరం చైకాదశక్షయం హరేత్
ఉదరాణి చ సర్వాణి వాతరోగాన్విశేషతః
సంతతోచ్ఛ్వాసకాసౌ చ వలీపలితనాశకః
గుంజాద్వయం ప్రదాతవ్యం తత్తద్రోగానుపానతః
నాశయేదితి తత్సర్వం శివేన పరిభాషితః
బాలసూర్యోదయో నామ భిషగాశ్చర్యకారకః ॥

పాదరసం 10 భాగాలు. గంధకం 12 భాగాలు. మణిశిల, తాళకం రెండేసి భాగాలు. స్వర్ణభస్మం ఒకభాగం. రజతభస్మం, తామ్రభస్మం నాగభస్మం, వంగభస్మం పావుభాగం చొప్పున గ్రహించేది. ఇవన్నీ కలిపి కలబందరసంతోనూ, దానిమ్మపండురసంతోనూ, చిత్రమూలకషాయంతోనూ బాగా మర్దించి గాజుకుప్పెలో వుంచి సికతాయంత్రంలో క్రమాగ్నులతో మూడు దినాలు వండి, చల్లబడ్డ

తరవాత తీసి కలబందరసంతోనూ, దానిమ్మపండురసంతోనూ మర్దించి కుప్పెలు కట్టుకునేది.

ఇది సన్నిపాతజ్వరమూ, ఏకాదశక్షయలూ, ఉదరవ్యాధులూ, వాతవ్యాధులూ, శ్వాసకాసలూ, వలీపలితాలూ పోగొడుతుంది. మోతాదు రెండు గురిగింజలయెత్తు.

## ౧౧ సువర్ణవాతరాక్షసం

హేమతారాభ్రకే లోహం రసేంద్రం శుద్ధగంధకమ్
వైక్రాంతం మౌక్తికం చైవ విద్రుమం తామ్రతాళకే
శంఖచూర్ణం మృతం వంగం మాండూరం కాంత మేవ చ
త్రిఫలాచూర్ణకం చైవ సూతార్ధం విషకం తథా
వాసానింబరసైః పంచభావనా శ్చ పృథక్ పృథక్
చతుర్యామం మర్దనం చ కారయే చ్ఛోషయే త్తతః
కుక్కుటాఖ్యపుటే పక్వా సాంగశీతం విచూర్ణయేత్
గుంజామాత్రప్రయోగేణ కణామధ్వాజ్యసంయుతమ్
ఊరుస్తంభం వాతరక్తం గాత్రస్తంభం చ నాశయేత్
ఆమవాతం ధనుర్వాతం సూతికావాత మేవ చ
ఆధ్మానం చాగ్నిమాంద్యం చ తూనీం ప్రతితూనీ మపి
వాతరాక్షసనామాయం వాతాశీతివినాశనమ్ ॥

సువర్ణభస్మం, రజతభస్మం, అభ్రకభస్మం, లోహభస్మం, పాదరసం, గంధకం, వైక్రాంతభస్మం, మౌక్తికభస్మం, ప్రవాళభస్మం, తామ్రభస్మం, తాళకభస్మం, శంఖభస్మం, వంగభస్మం, మాండూరభస్మం, కాంతభస్మం, త్రిఫలాచూర్ణం — ఇవి సమభాగాలు. నాభి రసంలో సగం. ఇవన్నీ చేర్చి అడ్డసరంరసం, వేపచెక్కరసం, వీటితో అయిదేసిభావనలుచేసి, నాలుగుజాములు మర్దించి ఎండినపిదప కుక్కుటపుటం వేసి తీసి పైరసాలతోనే మర్దించి కుప్పెలు కట్టుకునేది.

ఇది పిప్పలిచూర్ణం, నెయ్యి, తేనే కలిపి ఒక్కగురిగింజయెత్తు చొప్పున పుచ్చుకుంటే ఊరుస్తంభం, వాతరక్తం, గాత్రస్తంభం, ఆమవాతం, ధనుర్వాతం, సూతికావాతం, ఆధ్మానం, అగ్నిమాంద్యం, తూనీ, ప్రతితూనీ — ఈవ్యాధులు పోగొడుతుంది. ఎనభైవాతాలున్ను తగ్గించేస్తుంది.

## ౧౨ సువర్ణసూర్యావర్తి

ఏకభాగం జాతరూపం ద్విభాగం కాంత మభ్రకమ్
వంగప్రవాళవైక్రాంతరౌప్యమౌక్తికమాక్షికాః
రాహిషం రససిందూరం గంధకం టంకణం తథా
మర్దయేత్సర్వమేకత్ర జంభనారంగదాడిమైః
శుష్కం లఘుపుటే పాచ్యం తత ఉద్ధృత్య బుద్ధిమాన్
లవంగం కేసరం శుంఠీం హేమకార్పాసబీజకమ్
కాకబింబ్యాశ్చ బీజాని సూక్ష్మైలాన్మృతసత్వకమ్
ప్రక్షిపేత్పాంతతుల్యం చ హింగులం ద్విపలం క్షిపేత్
మర్దయేజ్జంభనారంగదాడిమైః శ్వాపర్ణికైరపి
బీజపూరరసే నాపి మాషమాత్రం ప్రయోజయేత్
పంచహిక్కా స్తథా ఛర్దిం శ్వాసకాస మరోచకమ్
సమస్తాన్ పైత్తికాన్ రోగాన్ జీర్ణజ్వర మజీర్ణకమ్
ఆస్యపాకం కంఠదాహం హృద్రోగం పాండుకామలే
ఉన్మాదం మూర్ఛరోగం చాప్యపస్మారం జ్వరం తథా
మూత్రకృచ్ఛ్రం ప్రమేహం శ్చ శుక్లమేహం తథాశ్మరీమ్
గ్రహణీం శూలతృష్ణే చ దాహం నైశకరపాదయోః
నాశయేన్నాత్ర సందేహో నృష్యశ్చైవ రసాయనమ్
పుష్ట్యాయుః కాంతిజననో హ్యశ్వసిదేవనిర్మితమ్
సూర్యావర్తిరసో నామ సువర్ణపరపూర్వకమ్
నాతః పరతరం శ్రేష్ఠం విద్యతే పిత్తనాశకమ్ ॥

స్వర్ణభస్మం ఒకభాగం. కాంతభస్మం, అభ్రకభస్మం, వంగభస్మం, ప్రవాళభస్మం, వైక్రాంతభస్మం, రజతభస్మం, మౌక్తికభస్మం, హేమమాక్షికభస్మం, దుప్పికొమ్ము భస్మం, రససిందూరం, గంధకం, పొంగించిన వెలిగారం — ఇవి రెండేసి భాగాలు. ఇవన్నీ కలిపి నిమ్మరసాన, నారింజపళ్ళరసాన, దానిమ్మపళ్ళరసాన మర్దించి ఎండిన తరవాత లఘుపుటం వేసేది.

చల్లబడ్డ తరవాత ఆది గ్రహించి లవంగాలు, నాగకేసరాలు, సొంటి, పైడిపత్రి గింజలపప్పు, కాకిదొండగింజలపప్పు, ఏలకులు, తిప్పసత్తు — ఇవి రెండేసి తులాలు. ఇంగిలీకం 16 తులాలు. ఇవన్నీ కలిపి పుల్ల నిమ్మరసాన, నారింజపళ్ళరసాన, దానిమ్మపళ్ళరసాన, అల్లపురసాన, మాదీఫలరసాన మర్దించి మాషప్రమాణం తగిన అనుపానంతో వాడుకుంటే పంచహిక్కలు, ఛర్ది, శ్వాసకాసలు, అరోచకం, సమస్త పైత్యాలు, జీర్ణజ్వరం, అజీర్ణం, ముఖపాకం, కంఠంలో మంట, హృద్రోగం, పాండువు, కామెర్లు, ఉన్మాదం, మూర్ఛలు, అపస్మారం, జ్వరాలు, మూత్రకృచ్ఛ్రం, ప్రమేహాలు, శుక్లమేహం, మూత్రాశ్మరి, గ్రహణి, శూల, విస్ఫిక, కాలు చేతుల మంటలు పోగొడుతుంది. వృష్యం, రసాయనం. పుష్టి, ఆయువు, కాంతి వృద్ధిచేస్తుంది. పిత్తనాశకౌషధాలలో ఇంతమంచిది మరిలేదు.

## ౧౩ సువర్ణ మేహ వంగ రాజీయం

స్వర్ణ మేకం ద్విగుణం వంగం స్వర్ణసామ్యం తు పారదమ్
గంధకం తు ద్విభాగం చ కన్యారసవిమర్దితమ్
పాచితం వాలుకాయంత్రే దినం సార్ధం భిషగ్వరః
స్వాంగశీతల మాదాయ గుంజాద్వయ ప్రమాణకమ్
సేవనీయం తథా హంతి సాంగదాహం చ కృచ్ఛ్రకమ్
క్షయం క్షయకృతాన్ వ్యాధీన్ దౌర్బల్యం శ్వాస మేవ చ
ప్రమేహాన్ వివిధాం శ్చైవ బహుమూత్రం తథైవ చ
వృష్యం రసాయనం చైవ బుద్ధీంద్రియబలప్రదమ్ ॥

సువర్ణభస్మం ఒకభాగం. తగరం రెండుభాగాలు. పాదరసం ఒకభాగం. గంధకం రెండుభాగాలు. మేహవంగరాజీయంలోలాగే ముందు రసమూ తగరమూ కలిపి తరవాత స్వర్ణభస్మమూ గంధకమూ చేర్చి కలబందరసంతో మర్దించి సికతాయంత్రాన దినంనర వండాలి.

ఇది శరీరతాపం పోగొడుతుంది. మూత్రకృచ్ఛ్రం, క్షయ, క్షయకు సంబంధించిన అనేకవ్యాధులూ, దౌర్బల్యం, శ్వాస, ప్రమేహాలు, బహుమూత్రం తగ్గించేస్తుంది. వీర్యవృద్ధి కలిగిస్తుంది. మంచి రసాయనం. బుద్ధికి పదును పెడుతుంది.

## ౧౪ రజతచంద్రోదయం

రజతం నేత్రభాగం స్యాత్ పారదం వసుభాగకం
గంధం షోడశభాగం చ కన్యాకాన్యాసకై ర్ద్రవైః
సంమర్ద్యం త్రిదినం పశ్చాత్ సైకతే క్రమవహ్నిభిః
సాంగశీతం సముద్ధృత్య కన్యానిర్గుండికమ్
అనుపానవిశేషేణ భక్షయే ద్రాజపూజితమ్
ప్రమేహాన్ శ్వాసకాసాం శ్చ శుక్రస్రావం చ పాండుతామ్
జీర్ణజ్వరా నగ్నిమాంద్యం రక్తదోషాన్ క్షయం తథా
చర్మదోషా నశేషాం శ్చదౌర్బల్యం గ్రహణీ ముఖా
హిక్కాం హంతి, కరో త్యేవ శుక్లవృద్ధిం విశేషతః
చంద్రోదయ స్సమాఖ్యాతో రాజతం భిషగుత్తమైః ॥

రజతం రెండు భాగాలు. పాదరసం ఎనిమిది భాగాలు. గంధకం పదహారు భాగాలు. ముందు రజతం పాదరసంలో జీర్ణం అయిపోయేట్టు మర్దించి తరవాత గంధకమున్నూ చేర్చి కజ్జలిచేసి కలబందరసంతోనూ, ఎర్రపత్తిఆకురసంతోనూ నూరి సికతాయంత్రంతో క్రమాగ్నులమీద మూడుదినాలు వండి, సాంగశీతం అయిన తరవాత మళ్లీ కలబందరసంతో మర్దించి వాడుకునేది,

ఇది ప్రమేహాలు, శ్వాసకాసలు, శుక్రనష్టం, పాండురోగం, జీర్ణజ్వరాలు, అగ్నిమాంద్యం, రక్తదోషాలు, క్షయ, చర్మదోషాలు, దౌర్బల్యం, గ్రహణి, ఎక్కిళ్ళు పోగొడుతుంది. వీర్యవృద్ధి కలిగిస్తుంది.

## ౧౫ సువర్ణలోహరసాయనం

సువర్ణం పారదం గంధం క్రమాత్ త్రిగుణం భవేత్
రసతుల్యం తీక్ష్ణలోహం సర్వ మేకత్ర మర్దయేత్
జంబీరతులసీవాసానిర్గుండీచిత్రమూలకైః
క్షిప్త్వా కాచఘటే పక్త్వా సికతాయంత్రయోగతః
శీతాగ్నికం చ సంగృహ్య పూర్వోక్తేనైవ చ మర్దయేత్

కృత్వా చ గుళికా స్సమ్యక్ త్రిగుంజాం భక్షయే త్తతః
కాసం శ్వాసం తథా జీర్ణం కామలాం క్షయశోఫకే
వాతవ్యాధీన్ తథా శీఘ్రం కఫవ్యాధీ నశేషతః
సర్వరోగా న్హర త్యేవ స్వర్ణలోహరసాయనమ్ ॥

స్వర్ణభస్మం 1 భాగం. పాదరసం 2 భాగాలు. గంధకం 3 భాగాలు. లోహభస్మం 2 భాగాలు. ఇవన్నీ కలిపి నిమ్మకాయరసంతోనూ, తులసిఆకురసంతోనూ, అడ్డసరపు రసంతోనూ, వావిలిరసంతోనూ, చిత్రమూలరసంతోనూ, మర్దించి గాజుకుప్పెలో ఉంచి సికతాయంత్రంతో ఎనిమిదిజాములు కాంచి, చల్లారిన తరవాత మొదటచెప్పిన రసాలతో మళ్లీ మర్దించి కుప్పెలు కట్టుకునేది.

మోతాదు మూడుగురిగింజలయెత్తు. ఇది దగ్గులు, వగర్పులు, అజీర్ణం, కామెర్లు, క్షయ, ఉబ్బు, వాతవ్యాధులు, కఫవ్యాధులు పోగొడుతుంది.

## ౧౬. త్రైలోక్య చింతామణి

రసం వజ్రం హేమ తారం తామ్రం తీక్ష్ణం మృతాభ్రకమ్
మౌక్తికం గంధకం శంఖం ప్రవాళం తాళకం శిలా
శోధితం చ సమం సర్వం సప్తాహం మర్దయే ద్దృఢమ్
వహ్నిమూలకషాయేణ భానుదుగ్ధే దినత్రయమ్
నిర్గుండీసూరణద్రావై ర్వజ్రీదుగ్ధై ర్దినత్రయమ్
అనేన పూరయే ద్గర్భం పీతవర్ణవరాటికామ్
టంకణం రవిదుగ్ధేన పిష్ట్వా తస్య ముఖం లిపేత్
రుద్ధ్వా భాండముఖం పాచ్యం స్వాంగశీతం విచూర్ణయేత్
చూర్ణతుల్యం మృతం సూతం వైక్రాంతం సూతపాదకమ్
శోభాంజనద్రవై స్సర్వం సప్తవారాన్ విభావయేత్
వహ్నిమూలకషాయేణ భావనాద్వాయ మాహతే
ఏవం సంశుద్ధసూతేంద్రః సర్వవ్యాధికులాంతకః
మాసార్థేన నిహంత్యాశు జరామృత్యుం న సంశయః

వాతం విద్రధిపాండుశూలగ్రహణీ
రక్తాతిసారాన్ జయేత్
మేహప్లీహాజలోదరాశ్మరితృష్ణా
శోథం హలీమోదరమ్
మూత్రాధ్మానభగందరజ్వరగదాన్
సర్వాణి కుష్ఠాన్యపి
సాధ్యాసాధ్యభవం గదం బహుతరం
సంసాధయేద్యోగతః ॥

పాదరసం, వజ్రభస్మం, రజతభస్మం, తామ్రభస్మం, లోహభస్మం, అభ్రకభస్మం, మౌక్తికభస్మం, గంధకం, శంఖభస్మం, ప్రవాళభస్మం, తాళకం, మణిశిల — ఇవి సమభాగాలు.

ఇవన్నీ చిత్రమూలకషాయంతోనూ, జిల్లేడుపాలతోనూ, వావిలిరసంతోనూ, అల్లపురసంతోనూ చెముడుపాలతోనూ మూడేసిదినాలు మర్దించేది. ఈముద్ద పచ్చని తేనెగవ్వ కడుపులో వుంచి జిల్లేడుపాలతో నూరి పొంగించిన వెలిగారంతో ఆగవ్వ మూతిమూసి అది మూకుళ్ళలో ఉంచి చీలయిచ్చి పుటంపెట్టి చల్లారిన పిదప గవ్వతో కలిపి చూర్ణించి, ఆచూర్ణం యెంతో అంత రససిందూరమూ, రసభస్మంలో నాలుగోవంతు వైక్రాంతభస్మమూ చేర్చి మునగచెక్కరసంతో ఏడుమాట్లూ, చిత్రమూల కషాయంతో రెండుమాట్లూ భావనచేసి వయోబలావస్థానుసారంగా వాడుకునేది.

ఇది సర్వవ్యాధులూ తగ్గించేస్తుంది. పక్షందినాలు వాడితే జరామృత్యువులు పోగొడుతుంది. వాతమూ, విద్రధీ, శూలా, పాండువూ, గ్రహణీ రక్తాతిసారమూ, మేహమూ, ప్లీహవ్యాధులూ, జలోదరమూ, అశ్మరీ, తృష్ణా, ఉబ్బూ, హలీమకమూ, ఉదరవ్యాధులూ, మూత్రాధ్మానమూ, భగందరమూ, జ్వరాలూ, కుష్ఠువులూ తగ్గించేస్తుంది.

## ౧౩ రాజమృగాంకరసం

రసభస్మ త్రయో భాగాః భాగైకం హేమభస్మకమ్
మృతతామ్రస్య భాగైకం శిలాతాళకగంధకమ్
ప్రతిభాగద్వయం తత్రా ప్యేకీకృత్య నిధాపయేత్

వరాటీః పూరయేత్తేన చాజాక్షీరేణ టంకణమ్
పిష్ట్వా తేన ముఖం రుద్ధ్వా మృద్భాండేన నిధాపయేత్
తస్యాం గజపుటే పాక్యం చూర్ణయేత్స్వాంగశీతలమ్
రసో రాజమృగాంకోఽయం చతుర్గుంజః క్షయాపహః
దశపిప్పలికైః క్షౌద్రైః మరిచైరూనవింశతి
సఘృతైర్దాపయేద్వాతపిత్తశ్లేష్మోద్భవే క్షయే ॥

రసభస్మం 3 భాగాలు. స్వర్ణభస్మం ఒక భాగం. తామ్రభస్మం ఒక భాగం. మణిశిల రెండు భాగాలు. తాళకం రెండు భాగాలు. గంధకం రెండు భాగాలు. ఇవన్నీ కలిపి నూరి ఆ చూర్ణం శుద్ధిచేసిన తెల్ల గవ్వలలో ఎక్కించి, పొంగించిన వెలిగారం మేక పాలతో నూరి దానితో గవ్వల రంధ్రం పూడ్చాలి. తరవాత ఆగవ్వలు మూకుళ్ళలో ఉంచి చీలమన్ను పూసి గజపుటం పెట్టాలి. చల్లబడ్డ తరవాత ఆగవ్వలతో కూడా మందు నూరుకుని నాలుగు గురిగింజల ప్రమాణంగా వాడుకునేది. అందులో పిప్పళ్ళూ మిరియాలూ కలిపి చేసిన చూర్ణం కలిపి తేనెతోనూ నేయితోనూ వాడేది.

ఇది క్షయకు మంచి ఔషధం. వాతపిత్తకఫాలవల్ల వచ్చిన క్షయ దీంతో తగ్గిపోతుంది.

కొన్ని గ్రంథాలలో ఈయోగంలో తామ్రభస్మకు బదులుగా అభ్రకభస్మం చెప్పబడి వుంది. కాని తామ్రభస్మమే మంచిది.

## ౧౮ రసమాణిక్యం

తాళకం వంశపత్రాఖ్యం కూష్మాండసలిలే క్షిపేత్
సప్తధా వా త్రిధా వాపి దధ్యామ్లేన తథైవ చ
శోధయిత్వా పునశ్చూర్ణం చూర్ణయేత్తండులాకృతిమ్
తతః శరావకే యంత్రే స్థాపయేత్తు కుశలో భిషక్
బదరీపల్లవోత్థేన లేపనం కారయేత్తతః
అరుణాభమధఃపాత్రం తావజ్జ్వాలాం ప్రదాపయేత్
స్వాంగశీతం సముద్ధృత్య మాణిక్యాభో భవేద్రసః
ఘృతక్షౌద్రేణ సంమర్ద్య ఖాదయేద్రక్తికాద్వయమ్

సంపూజ్య దేవదేవేశం కుష్ఠరోగాద్వియుచ్యతే
స్ఫుటితం గలితం కుష్ఠం వాతరక్తం భగందరమ్
నాడీవ్రణాం వ్రణాం దుష్టం ఉపదంశం విసర్పికామ్
నాసాస్యసంభవాన్ రోగాన్ క్షతాన్ హన్యాత్ సుదారుణాన్
పుండరీకం చ చర్మాఖ్యం విస్ఫోటం మండలం తథా ॥

మంచిపత్రితాళకం రేకులుగా విడదీసి ముందు బూడిదగుమ్మడికాయరసంలోనూ, తరవాత పుల్లని పెరుగులోనూ ఏడేసి దినాలు ఊరబెట్టాలి. చివరకి, మూడేసి దినాలైనా ఊరబెట్టాలి. తరవాత తీసి శుభ్రంగా కడిగి కష్లగింజలంత చేసి ముక్కలు చేసి మూకుడులో పోసి పైని మూకుడు బోర్లించేది. రెండుమూకుళ్ళూ సరిగా తాసుకునేటట్టు చూసుకోవాలి. తరవాత మట్టితో కాక, రేగుచిగురు నూరి ఆముద్దతో చీలయివ్వాలి. అప్పుడు పొయ్యిమీద సన్నమంటతో ప్రారంభించి కుండాలి. కింది మూకుడు ఎర్రబడుతుండగా దింపుకునేది. సాధారణంగా మూడుగంటలుకుండితే చాలు. చల్లబడ్డతరవాత చీలతీసేసి చూస్తే మందు అంతా మామిడిచిగురురంగుతో మూకుడుకి అంటుకుపోయి వుంటుంది. అది శాణంతో మెల్లిగా తీసుకుంటే ముక్కలు ముక్కలుగా వస్తుంది. ఆముక్కలు మాణిక్యాలలాగే వుంటాయి. అయితే నూరితే మాత్రం బంతిపువ్వు రంగులో వుంటుంది. అది నేతితోనూ, తేనెతోనూ మర్దించి పుచ్చుకునేది. ఎత్తుకెత్తు సుగంధిమూలం చేర్చి మర్దించి మాత్రలు చేసుకోడం కూడా వృద్ధాచారం.

ఇది స్ఫుటితం, గళితం, మొదలైన అష్టాదశకుష్ఠులు, వాతరక్తం, భగందరం, నారికురుపులు, సవాయి, విచర్చిక తగ్గించేస్తుంది. నోటనూ, ముక్కుల్లోనూ, పుట్టే వ్యాధులు పోగొడుతుంది. నరుకులూ, పుళ్ళూ మాన్పుతుంది.

## ౧౯. అష్టావక్రరసం

రసరాజస్య భాగైకం ద్విభాగం గంధకస్య చ
భాగమేకం సువర్ణస్య భాగార్థం రజతస్య చ
నాగం తామ్రం ఖర్పరం చ వంగం చైవ సమాంశకమ్
ప్రత్యేకం రజతార్థంచ సర్వమేకత్ర మర్దయేత్
వటాంకురరసై ర్యామం యామం కన్యారసై స్తథా

కూపీమధ్యే చ సంస్థాప్య త్రిదినం పాచయేత్సుధీః
దాడిమీరాజమునుప్రఖ్యో జాయతే హ్యవికల్పతః
వలీపలితవిధ్వంసీ బలపుష్టికరో మహాన్
ఆరోగ్యజననం మేధాకాంతిశ్శుక్రవర్ధనమ్
మహౌషధవరం చైత దష్టావక్రేణ కీర్తితమ్ ॥

పాదరసం ఒకభాగం. గంధకం రెండుభాగాలు. స్వర్ణభస్మం ఒకభాగం. రజత భస్మం అర్థభాగం. నాగభస్మమూ, తామ్రభస్మమూ, ఖర్పరమూ, వంగభస్మమూ, ఒక్కొక్కటీ పావుభాగాలు. మొదట మల్లెపూవుల రసంతోనూ, తరవాత కలబంద రసంతోనూ బాగా మర్దించి గాజుకుప్పెలో మూడుదినాలు క్రమాగ్నులమీద వండి సిద్ధంచేసుకునేది.

ఇది బలమూ పుష్టీ కలిగిస్తుంది. వలీపలితాలు పోగొడుతుంది. బుద్ధిబలమూ, దేహకాంతీ, శుక్రవృద్ధీ కలిగించి చక్కని ఆరోగ్యం నిలుపుతుంది.

## ౨౦ స్వర్ణసిందూరం

పలం రసేంద్రస్య చ గంధకస్య
హేమ్నోపి కర్షం పరిగృహ్య సమ్యక్
వటప్రరోహస్య రసేన యామం
యామం విమర్ద్యాథ కుమారికాయాః
తత్కాచకుప్యాం నిహితం ప్రయత్నాత్
పచేత్ విధిజ్ఞః సికతాఖ్యయంత్రే
తతో రజం చోర్ధ్వగతం సురమ్యం
ప్రగృహ్య యత్నా దరుణప్రభం యత్
తద్యోజయే త్సర్వగదేషు వీక్ష్య
ధాతుం బలం వహ్ని మధో వయశ్చ
రసాయనం వృష్యతరం చ బల్యం
మేధాగ్నికాంతిస్స్వరవర్ధనం చ ॥

పాదరసం ఒకపలం. గంధకం ఒకపలం. అపరంజి రేకులు రెండుతులాలు. ఇవి మర్రిపూవుల రసంతోనూ, కలబందరసంతోనూ మర్దించి గాజుకుప్పెలో వేసి సికతా యంత్రంలో క్రమాగ్నులతో మూడు దినాలు వండి దించుకునేది. చల్లారిన తరవాత చూస్తే పాదరసం ఎర్రగా సిందూరంవలె కుప్పె పైభాగాన చేరివుంటుంది. అది మెల్లిగా తీసుకునేది. బంగారం అంతతో చేర్చకూడదు.

వయోబలావస్థలు గుర్తించి ఇది సర్వవ్యాధులకూ వాడవచ్చు. ముఖ్యంగా ఇది మంచి రసాయనం. వీర్యవృద్ధి కలిగిస్తుంది. బలమూ, బుద్ధిబలమూ, జఠరాగ్ని, దేహకాంతి, కామోద్రేకమూ కలిగిస్తుంది.

## ౨౧ స్వర్ణవంగం

## ఇదే

## హేమసుందరరసం

ప్రక్షిపేద్భాజనే వంగమాయసే వాపి మృణ్మయే
విద్రుతే వహ్నితాపేన తస్మిన్ తద్వ్యానకం రసమ్
క్షిప్త్వా సంచూర్ణయేత్తత్ర నరసారం చ గంధకమ్
తనుపాసో మృదాలిప్త కాచకూప్యాం నిధాయ చ
తత్కూప్యాం సికతాయంత్రే పచేద్యామచతుష్టయమ్
పాకాత్సంజాయతే చిత్రం క్షీణం హేమకణైరివ
రమణీయతరం స్వర్ణవంగం నామ రసాయనమ్
బల్యం మేహహరం కాంతిమేధావీర్యాగ్నివర్ధనమ్ ॥

ఇనపమూకుడులోనైనా, మట్టిమూకుడులోనైనా శుద్ధిచేసిన వంగంవేసి కరిగించి అందులో వంగంయెత్తున శుద్ధిచేసిన పాదరసంపోసి గరిటితో కలిపేది. అది కల్వంలోవేసి నూరితే పొడుం అయిపోతుంది. అందులో వంగంయెత్తు నవాసారమూ గంధకమూ చేర్చి కలబందరసాన మర్దించి గాజుకుప్పెలోపోసి క్రమాగ్నులతో నాలుగుజాములు వండేది. అప్పటికది బంగారంవలె తయారవుతుంది. అది వయోబలావస్థానురూపంగా తగిన అనుపానంతో వాడితే వింశతిప్రమేహాలూ తగ్గిస్తుంది. బలంచేస్తుంది. కాంతి, బుద్ధి, వీర్యం, జఠరాగ్ని వృద్ధిచేస్తుంది.

ఇది మట్టిమూకుళ్ళలో వండేపద్ధతిన్నీ వుంది. మూకళ్ళపద్ధతే తెలుగుదేశంలో ఎక్కువగా వాడుకలో వుంది. ఈయోగం ఆంధ్రేతరదేశాలలో వాడేది.

## ౨౨ వాతరాక్షసం

మృతం సూతం తథా గంధం కాంతం చాభ్రక మేవ చ
తామ్రభస్మకృతం సమ్యక్ జర్ద్ధయిత్వా సమాంశకమ్
పునర్నవా గుడూచ్యగ్ని సురసా త్ర్యూషణం తథా
ఏతేషాం స్వరసై నైవ భావయే త్త్రిదినం పృథక్
దత్వా లఘుపుటం సమ్యక్ స్వాంగశీతం సముద్ధరేత్
వాతరాక్షసనామాఽయం వాతరోగే ప్రయోజయేత్
తత్తద్దోషానుపానేన ద్విగుంజామాత్రసేవనాత్
ఊరుస్తంభం వాతరక్తం గాత్రకంపం తథైవ చ
ఆమవాతం ధనుర్వాతం వేదనావాత మేవ చ
పక్షాఘాతం కంపవాతం సర్వసంధిగతం తథా
సుప్తివాతం చ శూలం చ ఉన్మాదం చ వినాశయేత్
తత్తద్రోగానుపానేన వాతాశీతివినాశనమ్ ॥

రసభస్మం, గంధకం, కాంతభస్మం, అభ్రకభస్మం, తామ్రభస్మం — ఇవి సమభాగాలు. ఇవన్నీ కలిపి గలిజేరు, తిప్పతీగ, చిత్రమూలం, తులసి, త్రికటుకాలు — వీటికషాయాలతోనూ, రసాలతోనూ మర్దించేది.

ఆముద్ద బిళ్ళలుగా చేసి నీడవారనిచ్చి మూకళ్ళలో వుంచి చీలయిచ్చి గంధకం యెన్నితులాలో అన్ని పిడకలతో లఘుపుటం పెట్టి చల్లారిన తరవాత తీసుకుని మళ్లీ మొదటిలాగే ఆరసాలతోనూ కషాయాలతోనూ మర్దించి కుప్పెలు కట్టుకుని వాడుకునేది.

అనుపానవిశేషాలతో యిది ఊరుస్తంభం, వాతరక్తం, పక్షవాతం, సర్వాంగవాతం, ఆమవాతం, ధనుర్వాతం, కంపవాతం, సంధిగతవాతం, సుప్తివాతం, శూల, ఉన్మాదం పోగొడుతుంది. మొత్తానికి అశీతివాతాలూ తగ్గిస్తుంది.

## ౨౩ వ్యాధిహరణరసం

హింగుళోత్థరసం భాగం ద్వౌ భాగౌ రసకర్పూరమ్
రసతుల్యం బలిం దద్యాత్త్ర్యం మర్ద్యేతు కజ్జలీ
దత్తాండే మృత్పుటం పంచ వారం శాయంత్రగం పచేత్
దినైకం తు క్రమాగ్నౌ తు స్వాంగశీతం సముద్ధరేత్
పూజయే ద్గురువిప్రాదీన్ యథారోగం ప్రయోజయేత్
గుంజాచతుష్టయం ఖాదే న్నాగవల్లీకలై ర్యుతమ్
షండోపి లభతే పుంస్త్వం వాజీకరణ ముత్తమమ్
అపుత్రః పుత్ర మాప్నోతి జీవే చ్ఛరదాం శతమ్
వలీపలితహృచ్ఛూల వాతశ్లేష్మనిబర్హణమ్
అయం వ్యాధిహర సూతః పూజ్యపాదేన నిర్మితః ।

ఇంగిలీకరసం 1 భాగం. రసకర్పూరం 2 భాగాలు. గంధకం 3 భాగాలు. ఇవి మూడూ మెత్తగా కాటుకలాగ మర్దించి కోడిగుడ్ల డొల్లలలో ఎక్కించి గుడ్డను మట్టిపూసి చీలయిచ్చి క్రమాగ్నులతో ఒకదినం వండి చల్లారిన తరవాత తమలపాకుల రసాన మర్దించి కుప్పెలు కట్టి వాడుకునేది.

ఇది షండత్వం పోగొట్టి పుంస్త్వం వృద్ధిచేస్తుంది. వాజీకరౌషధం. దీర్ఘాయువు కలిగిస్తుంది. వలీపలితాలూ, హృదయశూలాలూ, వాతశ్లేష్మాలూ తగ్గించేస్తుంది.

అనుభవంలో ఇది జీర్ణించిన సవాయివ్యాధి పోగొడుతోంది.

## ౨౪ బాలసూర్యోదయం

చతుష్పలం గంధకం చ చతుష్పలరసం తథా
పల మేకం తాలకం చ పలార్థం చ మనశ్శిలామ్
శిలార్థం టంకణం చైవ సర్వే స్తుల్యం తు హింగులమ్
శాఖావృక్షస్య పత్రైస్తు మర్దయే చ్చ దినత్రయమ్
కాచకూప్యంతరే క్షిప్త్వా వాలుకాయంత్రకే పచేత్

మందాగ్నినా చ త్రిదినం సాంగశీతల ముద్ధరేత్
బాలసూర్యోదయో భక్ష్యే సర్వజ్వరకులాంతకః ।

గంధకం 4 పలాలు. పాదరసం 4 పలాలు. తాళకం 1 పలం. మణిశిల అరపలం. పొంగించిన వెలిగారం పావుపలం. అన్నిటికీ సమానం ఇంగిలీకం. ఇవన్నీ కలిపి చేదుకాకర పాయంతో మర్దనాచేసి గాజుకుప్పెలోవుంచి క్రమాగ్నులతో మూడు దినాలు వండి చల్లబడ్డతరవాత మళ్ళీ చేదుకాకర పాయంతో మర్దించి కుప్పెలు కట్టుకునేది.

ఇది సర్వజ్వరాలూ తగ్గించేస్తుంది.

## ౨౩. తామ్రలోహరసాయనం

పారదం గంధకం శుద్ధం ద్విభాగం పరికల్పయేత్
తామ్రభస్మాయోభస్మ చైకభాగం పృథక్ పృథక్
నిర్గుండీబృహతీవాసామండూకీ చిత్రకైః
మరీచశృంగబేరాభ్యాం మర్దయేచ్చ పృథక్ పృథక్
కాచకూప్యంతరే క్షిప్త్వా వాలుకాయంత్రకే పచేత్
తత ఉద్ధృత్య తచ్చూర్ణం మర్దయేల్లికుచద్రవైః
గుళికాన్ ఛాయయా శుష్కాననుపానవిశేషతః
కఫరోగే ప్రయోక్తవ్యాం ద్విగుంజాపరిమాణతః
తిమిరం వాతశూలే చ కాసం శ్వాసం హరేత్త్వరమ్
క్షయం కుష్ఠం తథాజీర్ణం శోఫం పాండ్వామయం హరేత్
ప్రసిద్ధం భువనే నిత్యం తామ్రలోహరసాయనమ్ ।

పాదరసం, గంధకం, రెండేసిభాగాలు. తామ్రభస్మం, లోహభస్మం ఒక్కొక్క భాగం. వావిలిరసం, వాకుడురసం అడ్డసరంరసం, జిల్లేడుపాలు, చిత్రమూలరసం, మిరియాల కషాయం, అల్లపురసం — వీటితో వేరువేరుగా మర్దించి గాజుకుప్పెలో ఉంచి మూడుదినాలు క్రమాగ్నులతో వండి చల్లారిన తరవాత నిమ్మకాయరసాన మర్దించి కుప్పెలు కట్టుకుని వాడేది. మోతాదు రెండు గురిగింజలయెత్తు.

ఇది కఫవ్యాధు లన్నీ తగ్గించేస్తుంది. తిమిరం, వాతశూలు, దగ్గు, వగరుపు, క్షయ, కష్టం, అజీర్ణం, ఉబ్బు, పాండువు పోగొడుతుంది.

## ౨౬ సహస్రకిరణార్క రసం

త్రిక్షారం పంచలవణం టంకణం చైకభాగకమ్
నాగవిద్రుమకాంతాభ్రరజతానాం చ భస్మకమ్
పాషాణపంచకం వక్రానాభమాక్షికమనశ్శిలాః
ద్విభాగ మష్టభాగాభ్యాం రసగంధకసంయుతిమ్
చతుర్భాగం లోహతామ్రతాళవైక్రాంతభస్మకమ్
ఏతత్సర్వం రసై రేతైశ్శిగ్రుచిత్రకపీలుజైః
త్రిఫలాకుండలీశ్యామావృశ్చికగుడూచకైః
నైదిగ్ధికాచక్రపత్రీ వారుణైర్వాజవల్లిజైః
సమ్మర్ద్య ఖల్వే ప్రత్యేకం యామం యామం ప్రయత్నతః
తత్కాచకుప్యాం నిక్షిప్య మృద్బేసికతాంతరే
యామద్వయం పచే దగ్నౌ క్రమవి ద్భిషగుత్తమః
స్వాంగశీతం సముద్ధృత్య మస్యమాయూరకుక్కుటైః
ఔష్ట్రవారాహశశకమత్స్యైణకగైదకైః
మార్కండైర్భల్లుకై రాజైః స్థలకామఠపిత్తకైః
ఏతైర్గాఢం చాప్రమత్తః భావయే త్పృకటీకృతః
సహస్రకిరణాఖ్యోయం రస శ్చారోగ్యదాయకః
సన్నిపాతం మహాఘోరం బహూనే దోషజ్వరా నపి
అశీతి వాతరోగాంశ్చ వింశతిశ్లేష్మరోగకాన్
సూతికారోగకాన్ హంతి మహాతాపం ప్రశామ్యతే ।

సర్జిక్షారం, యవక్షారం, పొంగించిన వెలిగారం, సముద్రలవణం, సౌవర్చలవణం, కాచలవణం, బిడాలవణం, సైంధవలవణం, మళ్ళీ పొంగించిన వెలిగారం — ఇవి ఒక్కొక్క భాగం. పంచపాషాణాలు — అనగా 1గౌరీపాషాణం 2తెల్ల

పాషాణం 3శంఖపాషాణం 4నెల్లిపాషాణం 5వొడ్డిపాషాణం, నాభి, హేమమాక్షికభస్మం, మణిశిల — ఇవి రెండేసిభాగాలు. పాదరసం, గంధకం — ఇవి ఎనిమిదేసి భాగాలు. లోహభస్మం, తామ్రభస్మం, తాళకం, వైక్రాంతభస్మం — ఇవి నాలుగేసి భాగాలు. ఇవన్నీ కలిపి మునగచెక్కరసం, చిత్రమూలరసం, వంగోగురసం, త్రిఫలాకషాయం, తిప్పిరసం, నల్లతెగడకషాయం, తెల్లగలిజేరురసం, తిప్పతీగరసం, వాకుడురసం, నల్లతులసిరసం, తులిమిరికషాయం, నల్లేరురసం — వీటితో ఒక్కొక్క జాము మర్దించి నీడ నారనిచ్చి అది గాజుకుప్పెలో వుంచి సికతాయంత్రంలో రెండుజాములు క్రమాగ్నులతో వండేది. చల్లబడ్డ తరవాత అది గ్రహించి చేప, నెమలి, కోడి, లొట్టిపిట్ట, అడవిపంది, కుందేలు, తాబేలు, లేడి, ఉడుము, కోతి, ఎలుగుబంటి, మేక, పెట్టతాబేలు — వీటి చేమకట్లతో భావనలు చేసి అవస్థానుగుణంగా వాడుకునేది.

ఇది ఆరోగ్యవర్ధక మైన గొప్పఔషధం, మహాఘోర మైన సన్నిపాతజ్వరం, రకరకాల దోషజ్వరాలూ, ఎనభై వాతాలు, వింశతిశ్లేష్మరోగాలు, మూత్రరోగాలు పోగొడుతుంది. దారుణ మైన తాపమున్నూ పుట్టిస్తుంది.

## ౨౩ పూర్ణచంద్రోదయసిందూరం

తుల్యం తుల్యం రసం గంధం ఖల్వమధ్యే వినిక్షిపేత్
కపిత్థమూలసారేణ మర్దితం చ దినత్రయమ్
వటికాం ఛాయయా శుష్కాం భాండమధ్యే వినిక్షిపేత్
కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాభిః ప్రపూరయేత్
దీపాగ్నౌ చ ద్విషడ్యామం స్వాంగశీతం సముద్ధరేత్
కపిత్థమూలసారేణ త్రిదినం మర్దయేత్క్రమాత్
బిల్వమూలకషాయేణ మర్దయే త్రిదినం పునః
జాతుర్జాతకకర్పూరలవంగకుసుమాన్వితమ్
సర్వం రససమం చైవ మేళయిత్వాథ చూర్ణకమ్
లాజచూర్ణసితా మిశ్రం మధునా సహ సేవయేత్
వల్లద్వయమితం మాత్రం వమనస్తంభనం తథా
కాసాదిపంచఛర్దీనాం హృద్రుచే ర్జ్వాకర స్తథా

హృద్రోగం స్వరభంగం చ మందాగ్నిం చ నివారయేత్
పూర్ణచంద్రోదయో నామ నిర్మిత శ్శూలపాణినా ॥

పాదరసమూ, గంధకమూ సమభాగాలుగా గ్రహించి వెలగవేళ్ళ కషాయంతో మూడుదినాలు మర్దించి సీసనిండించి గాజుసీసాలో ఉంచి సికతాయంత్రంతో పన్నెండుజాములు క్రమాగ్నులతో వండి చల్లబడ్డతరవాత తీసి, ముందుగా మళ్లీ వెలగవేళ్ళ కషాయంతో మూడుదినాలూ, తరవాత మారేడువేళ్ళ కషాయంతో మూడుదినాలూ, మర్దించి కుప్పెలు కట్టుకునేసి. తరవాత దాల్చినిచెక్క, ఏలకులు, తమపత్రికం, నాగకేసరాలూ, పచ్చకర్పూరం, లవంగాలు సమభాగాలుగా చూర్ణించి అది మందుతో సమభాగం కలిపి రెండువల్లాలమెత్తు చక్కెర కలిపిన వేలపిండితో పుచ్చుకుంటే వాంతులు కట్టేస్తుంది.

మున్నీళ్లు, యువ కాసలు, అరుచి, హృద్రోగం, స్వరభంగం, అగ్నిమాంద్యం పోగొడుతుంది.

## వీర రసభూపతి

శుద్ధసూతం సమం గంధం మృతస్వర్ణం తయో స్సమమ్
అభ్రలోహకయో ర్భస్మ కాంతకస్య సువర్ణజమ్
రాజతం చ విషం సామ్యం పృథక్స్యాత్సమం భవేత్
హంసపాదీం సై ర్మర్ద్యం దిన మేకం వటీకృతమ్
కాచకుప్యాం వినిక్షిప్య మృదా సంలేపయే ద్బహిః
శుష్కాం తాం వాలుకాయంత్రే శనై ర్మృద్వగ్నినా పచేత్
చతుర్గుంజామితం దేయం పిప్పల్యాద్రవేణ తు
క్షయం త్రిదోషజం హంతి సన్నిపాతాం స్త్రయోదశ
ఆమవాతం ధనుర్వాతం శృంఖలావాత మేవ చ
ఆఢ్యవాతం పంగువాతం కఫవాతాగ్నిమాంద్యనుత్
కటివాతం సర్వశూలం నాశయే న్నాత్ర సంశయః
గుల్మశూల ముదావర్తం గ్రహణీ మతిదుస్తరామ్
ప్రమేహా ముదరం సర్వా మశ్మరీం మూత్రవిడ్గ్రహమ్

భగందరమ్ సర్వకుష్ఠం విద్రధిం మహతీం తథా
శ్వాసం కాస మజీర్ణం చ జ్వర మష్టవిధం తథా
కామలాం పాండురోగం చ శిరోరోగం చ నాశయేత్
అనుపానవిశేషేణ సర్వరోగా న్వినాశయేత్
యథా సూర్యోదయే నశ్యే త్తమ స్సర్వగతం తథా
సర్వరోగవినాశాయ సర్వేషాం స్వర్ణమాపతిః ।

పాదరసం, గంధకం ఒక్కొక్క భాగం. తామ్రభస్మం రెండు భాగాలు. అభ్రకభస్మం, లోహభస్మం, కాంతభస్మం, స్వర్ణభస్మం, రజతభస్మం, నాభి — ఇవి ఒక్కొక్క భాగం. ఇవన్నీ కలిపి హంసపాద ఆకురసాన ఒక్కదినం మర్దించి గాజుకుప్పెలో ఉంచి సికతాయంత్రంతో క్రమాగ్నులమీద వండి చల్లబడ్డతరవాత మళ్ళీ పిప్పళ్ళ కషాయంతోనూ, అల్లపురసంతోనూ మర్దించి కుప్పెలుకట్టుకునేది.

ఇది తగిన అనుపానాలతో వాడితే త్రిదోషాలవల్ల పుట్టిన క్షయ హరిస్తుంది. త్రయోదశసన్నిపాతాలున్నూ పోగొడుతుంది. మరిన్నీ, ఆమవాతం, ధనుర్వాతం, శృంఖలావాతం, ఆఢ్యవాతం, పంగువాతం, కఫవాతం, అగ్నిమాంద్యం, కటీవాతం, సర్వశూలలు, గుల్మశూల, ఉదావర్తం, గ్రహణి, ప్రమేహం, ఉదరవ్యాధులు, అశ్మరి, మలమూత్రబంధాలు, భగందరం, సర్వకుష్ఠులూ, విద్రధి, దగ్గులు, ఎగుప్పు, అజీర్ణం, అష్టవిధజ్వరాలు, కామెర్లు, పాండురోగం, శిరోరోగం తగ్గించేస్తుంది.

## [illegible] పాశుపతాస్త్ర రసం

ద్విపాషాణం ద్వితుత్థం చ నేపాళం తాళకం విషమ్
సర్వతుల్యం శుద్ధసూతం అర్కక్షీరేణ మర్దయేత్
దోలాయంత్రే పచేద్యామం సముద్ధృత్య విమర్దయేత్
భావితం ఫణిపిత్తేన గుంజామాత్రం భిషగ్వరః
లశునస్య చ తైలేన బ్రహ్మద్వారే విలేపయేత్
తత్క్షణేన నిహంత్యాశు సన్నిపాతాం త్రయోదశ
రసః పాశుపతాస్త్రోయం శంకరేణ ప్రకల్పితః ।

తెల్లపాషాణం, గౌరీపాషాణం, మైలతుత్తం, పాలతుత్థం, మణిశిల, తాళకం, నాభి— ఇవి సమభాగాలు. వీటి కన్నిటికీ సమం రసభస్మం, ఇవన్నీ కలిపి జిల్లేడు పాలతో నూరి కోలాయంత్రాన ఒక్క జాము ఉడికి పిమ్మట చూర్ణించి గురిగింజ యెత్తు వెల్లుల్లితైలంతో బ్రహ్మరంధ్రాన మర్దిస్తే సమస్తసన్నిపాతాలూ తత్క్షణమే నశించిపోతాయి.

## ౩౦ లోకనాథరసం

వరాటకుల్యగంధారం తదర్థం తీక్ష్ణలోహకమ్
తత్పాదాంశం మృతం సూతం సూతస్యోగుణగంధకమ్
ఖల్వోదరే వినిక్షిప్య మర్దయేద్దినత్రయమ్
వర్షాభూమూలసారేణ వజ్రవల్లీరసేన చ
వాసాపాటలకేనాపి చిత్రమూలేన మర్దయేత్
గోళకం చాతపే శోష్యం దినాంతం తు వినిక్షిపేత్
శరావేణ చ మృద్భాండే కుక్కుటే పుటవద్భవేత్
సూక్ష్మచూర్ణం తతః కృత్వా తత్సమం మారిచం రజః
భావనానంతరం దద్యాన్నాగవల్లీరసార్ద్రికమ్
భృంగరాజం చ నిర్గుండీ ముండీ శిగ్రురసస్తథా
త్రిఫలారసభావేన చాయూషమ్యం తు కారయేత్
నిష్కార్థం మధునా లేహ్యం యామే యామే చ భక్షయేత్
క్షయం క్షయకృతాన్ వ్యాధీన్ వాతపిత్తకఫోద్భవాన్
కాసశ్వాసప్రతిశ్యాయశోఫపాండుగదాదికాన్
హలీమకం చాస్థిగతం నిహంతి చ సత్వరమ్
దీపనం వీర్యవృద్ధిం చ కారయేన్నాత్ర సంశయః
లోకనాథరసో నామ శంభునా పరికీర్తితః ।

గవ్వలభస్మం, మాండూరభస్మం సమభాగాలు. లోహభస్మం అర్థభాగం. రసభస్మం పావుభాగం. గంధకం అర్థభాగం. ఇవన్నీ ఖల్వంలో ఉంచి మూడుదినాలు భా

మర్దించాలి. గలిజేరు వేళ్ళరసంతోనూ, నల్లేరు రసంతోనూ అడ్డసరం రసంతోనూ, సంబి రేణుక రసంతోనూ, చిత్రమూల రసంతోనూ మర్దించాలి. ఆ ముద్ద ఎండలో ఎండించి మూకుళ్ళలో వుంచి సంధిబంధనం చేసి కుక్కుటపుటం వేసేది. తరవాత ఆమందు గ్రహించి దానికి సమానంగా మిరియాల చూర్ణం కలిపి తమలపాకుల రసంతోనూ, అల్లపు రసంతోనూ, గుంటకలగర రసంతోనూ, వావిలి రసంతోనూ, బోడతరం రసంతోనూ, మునగచెక్క రసంతోనూ, త్రిఫలా కషాయంతోనూ భావనలు చేసి నీడ నెండించి అర్ధ నిష్కం యెత్తున తేనెతో పుచ్చుకునేది.

ఇది క్షయ, క్షయానుబంధ వ్యాధులు, శ్వాసకాసలు, పడిశం, ఉబ్బు, పాండువు, హలీమకం పోగొడుతుంది. ఆకలి పుట్టిస్తుంది. వీర్యవృద్ధి కలిగిస్తుంది.

## ౩౧ మహావంగరాజీయం

రసమేకం త్రయం వంగం వంగసామ్యాం తు గంధకమ్
మర్దయే ద్దినమేకం తు కుమార్యా స్స్వరసే బుధః
సంస్థాప్య గోళకం భాండే రోధయే త్సుస్మృతం ముఖమ్
పాచయే ద్వాలుకాయంత్రే దినమేకం దృఢాగ్నినా
స్వాంగశీతల మాదాయ సంపూజ్య ద్విజదేవతాః
పిప్పలీ మధునా యుక్తం సర్వమేహేషు యోజయేత్
క్షీరాన్నం యోజయే త్పథ్యం లవణామ్లవివర్జితమ్
మహావంగేశ్వరో నామ సర్వమేహనికృంతనః ॥

పాదరసం ఒకభాగం. తగరం మూడు భాగాలు. గంధకమున్నూ మూడు భాగాలు. ముందు తగరం కరిగించి అందులో రసం వేసి కలిపి నూరితే అది పొడుము అవుతుంది. అప్పుడు గంధకం కలిపి మర్దించి కలబంద రసంతో మళ్ళీ బాగా మర్దించి నీడ నెండాక గాజుకుప్పెలో ఎక్కించి సికతాయంత్రంలో ఒక్కదినం వండి స్వాంగశీతం అయిన తరవాత తీసి మళ్ళీ కలబంద రసాన మర్దించి కుప్పెలు కట్టుకుని పిప్పళ్ళ చూర్ణం చేర్చి తేనె కలిపి పుచ్చుకునేది.

ఇది సకలమేహాలూ పోగొడుతుంది. ఉప్పూ పులుసూ, తగలనివ్వకూడదు. క్షీరాన్నం (అన్నంలో పాలు కలుపుకుని) పుచ్చుకోవాలి.

## ౩౨ రజత మేహవంగరాజీయం

రస మేకం ద్వయం వంగం వంగసామ్యం తు గంధకమ్
రజతం చైకభాగం చ కన్యాయా తు విమర్దయేత్
వాలుకాయంత్రకే పాచ్యం దిన మేకం విచక్షణః
సాంగశీతల ముద్ధృత్య నారికేలాంబుమర్దితమ్
వటకాన్ కారయిత్వాతు ద్విగుంజం భక్షయే న్నరః
సర్వమేహాన్ హరత్యేవ శుక్రవృద్ధిం చ కారయేత్
శుక్రదోషం చ హరతి బుద్ధీంద్రియబలప్రదః
నానారోగప్రశమన స్సర్వమేహనికృంతనః ।

పాదరసం ఒకభాగం. తగరం రెండుభాగాలు. గంధకం రెండుభాగాలు. రజతభస్మం ఒకభాగం. మేహవంగరాజీయంలోలాగే ముందు రసవంగాలు కలిపి తరవాత గంధకమూ, రజతభస్మమూ చేర్చి కలబందరసంతో మర్దించి నీడనెండించి సికతా యంత్రంలో ఒక్క దినం వండేది. తరవాత కొబ్బరికాయనీళ్ళతో నూరి వడియాబలాను పారంగా తగిన అనుపానాలతో వాడుకునేది.

ఇది సకలమేహాలూ హరిస్తుంది. శుక్రవృద్ధి కలిగిస్తుంది. శుక్రదోషాలు తగ్గిస్తుంది. బుద్ధీంద్రియాలకి చురుకు కలిగిస్తుంది, నానారోగాలూ పోగొడుతుంది.

## ౩౩ ప్రవాళ పంచామృత రసం

ప్రవాళముక్తాఫలశంఖశుక్తి కపర్దకానాం చ సమాంశభాగమ్
ప్రవాళమాత్రం ద్విగుణం ప్రయోజ్యం సర్వై స్సమాంశం రవిదుగ్ధమేవ
ఏకీకృతం తత్ఖలు భాండమధ్యే క్షిప్త్వా ముఖే బంధన మత్ర యోజ్యమ్
పుటం విదధ్యా జ్జతిశీతలే చ హ్యుద్ధృత్య తద్భస్మ క్షిపే త్కరండే
నిత్యం ద్విబారం ప్రతిపాకయుక్తం వల్లప్రమాణం హి నరేణ సేవ్యమ్
ఆనాహగుల్మోదరప్లీహకాసశ్వాసాగ్నిమాంద్యాన్కఫమారుతోత్థాన్
అజీర్ణ ముద్గార హృదామయఘ్నం గ్రహణ్యతీసారవికారనాశమ్

మేహామయం మూత్రరోగం మూత్రకృచ్ఛ్రం తథాశ్మరీమ్
నాశయేన్మాత్ర సందేహః సత్యం గురువచో యథా
పథ్యాశ్రితం భోజన మాదరేణ సమాచరేన్నిర్మలచిత్తవృత్త్యా
ప్రవాళపంచామృతనామధేయో యోగోత్తమ స్సర్వగదాపహారీ ॥

పగడాలు 2భాగాలు. ముత్యాలు, శంఖం, ముత్యపుచిప్పలు, గవ్వలు — ఇవి ఒక్కొక్క భాగం. ఇవన్నీ మూకుడులో ఉంచి ఆరుభాగాలు జిల్లేడుపాలు పోసి, పైని మూకుడు మూసి చీలయిచ్చి గజపుటం వేసేది. చల్లబడ్డతరవాత తీసుకుని సీసాలో ఉంచుకుని అవస్థానుసారంగా రెండుపూటలా పుచ్చుకునేది.

ఇది కడుపుబ్బరం, గుల్మం, ఉదరవ్యాధులు, ప్లీహవ్యాధులు, దగ్గు, వగర్పు, అగ్నిమాంద్యం, అజీర్ణం, తేనుపులు, హృద్రోగం, గ్రహణి, అతిసారం, మేహాలు, మూత్రరోగాలు, మూత్రకృచ్ఛ్రాలు, మూత్రాశ్మరి పోగొడుతుంది.

## ౩౪ శిలావంగేశ్వరరసం

త్రపుకం దశభాగం చ తత్సమం తు శిలాజతుమ్
పారదం దశభాగం చ తత్సామ్యం గంధకం తథా
కుమార్యాశ్చ రసే నైవ మర్దయే దేకరాత్రకమ్
వాలుకాయాం కాచకుంభే త్రిదినం పాచయే త్తథా
స్వాంగశీతం విచూర్ణ్యాథ ద్వివల్లం సేవయే త్తథా
తనుపుష్టిం వర్ధయే చ్ఛుక్రదోషం నిహంతి చ
త్రివిధం మూత్రకృచ్ఛ్రం చ బహుమూత్రం చ నాశయేత్
శిలావంగేశ్వరో నామ రసో రుద్రేణ భాషితః ॥

వంగభస్మం 10భాగాలు. కర్పూరశిలాజిత్తు 10భాగాలు. పాదరసం 10భాగాలు. గంధకం 10భాగాలు. ఇవన్నీ యథావిధిగా కలిపి కలబందరసంతో మర్దించి వాలుకా యంత్రాన మూడుదినాలు వండి చల్లబడ్డతరవాత తీసుకుని వయోవస్థానుసారంగా వాడుకునేది.

ఇది దేహపుష్టి కలిగిస్తుంది. శుక్రదోషాలు, త్రివిధాలైన మూత్రకృచ్ఛ్రాలు, బహుమూత్రం పోగొడుతుంది.

## ౩౫ క్షయకుఠారం

శుద్ధసూతం విషం గంధ మభ్రం తామ్రం వరాటకమ్
ప్రవాళం తారకం చైవ లోహం మాండూరటంకణౌ
మాక్షికం నాగవంగే చ తథా మౌక్తికకాంతకే
సమభాగం చ సంగ్రాహ్య ఖల్వమధ్యే వినిక్షిపేత్
వర్షాభూమూలసారేణ వజ్రవల్లీరసేన చ
పీలూ చిత్రరసాభ్యాం చ హంసపాదీరసేన చ
గుడూచ్యా భృంగరాజస్య నాగవల్ల్యా స్తథైవ చ
కుండల్యా శ్చ రసేనాపి పృథగ్యామం విమర్దయేత్
శరావసంపుటే చైవ కౌక్కుటే పుటకే పచేత్
స్వాంగశీతల ముద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్
శిగ్రుమూలరసే నైవ దినైకం మర్దయే ద్దృఢమ్
గుళికాన్ కారయిత్వాథ ఛాయాశుష్కాం శ్చ కారయేత్
తత్తద్రోగానుపానేన దేయం గుంజాచతుష్టయమ్
తువరీ ముద్గయూషౌ చ తండులీయక మేవ చ
గోక్షీరం వాస్తుకం చైవ తథాలర్కం త్వజాపయః
గోఘృతం మధు తక్రం చ సైంధవం లవణం భిషక్
తథా పురాణశాలిం చ దీయతాం తత్ర యత్నతః
క్షయం క్షయకృతాన్ వ్యాధీన్ అస్థిగజ్వరకం తథా
వాతం పిత్తం హరే చ్చైవ పాండుం గుల్మం కఫం హరేత్
సద్యః క్షయకుఠారోఽయం పూజ్యపాదేన నిర్మితః ।

పాదరసం, నాభి, గంధకం, అభ్రకభస్మం, తామ్రభస్మం, గవ్వలభస్మం, ప్రవాళభస్మం, రజతభస్మం, లోహభస్మం, మాండూరభస్మం, పొంగించిన వెలిగారం, హేమమాక్షికం, నాగభస్మం, వంగభస్మం, ముత్యాలభస్మం, కాంతభస్మం — ఇవి సమభాగాలు. ఇవన్నీ యథావిధిగా కలిపి, గలిజేరు, నల్లేరు, వరగోగు, చిత్రమూలం,

హంసపాది, త్రిప్పతీగ, గుంటగలగర, తమలపాకులు, ఉప్పి — వీటి రసాలతో ఒక్కొక్క జాము మర్దించి నీడనెండించి మూకుళ్ళలో ఉంచి చీలుబిచ్చి కుక్కుట పుటంవేసి, చల్లారినతరవాత తీసి, మళ్లీ, మునగవేళ్ళరసంతో నూరి వయోవస్థాను గుణంగా, ఆయా రోగాలకు తగిన అనుపానాలతో వాడుకునేది. కందికట్టు, పెసర కట్టు, చిర్రికూర, ఆవుపాలు, చక్రవర్తికూర, మేకపాలు, ఆవునెయ్యి, తేనె, మజ్జిగ, సైంధవలవణం, పాతబియ్యం — ఇవి పథ్యవస్తువులు.

ఇది క్షయ, క్షయవల్లవచ్చే వ్యాధులు, అస్థిగతజ్వరం, నాలిపిత్తాలు, పాండువు, గుల్మం, కఫం హరిస్తుంది.

## ౩౭ వంగరాజీయం

రస మేకం ద్వయం వంగం వంగసామ్యం తు గంధకమ్
కుమార్యా స్స్వరసే మర్ద్యం దిన మేకం విచక్షణః
పాచయే ద్వాలుకాయంత్రే దిన మేకం క్రమాగ్నినా
తత ఉద్ధృత్య శీతం చ సేవ్యం తదనుపానతః
వింశతిం చ ప్రమేహాణాం నాశయే న్నాత్ర సంశయః
మూత్రాతిసారం కృచ్ఛ్రం చ గ్రహణీం పాదదాహకమ్
మూత్రాఘాతం చాశ్మరీం చ హంత్యత్ర న విచక్షణః ॥

పాదరసం ఒకభాగం. తగరం రెండుభాగాలు. గంధకం రెండుభాగాలు. తగరం కరిగించి అందులో రసం పోసి కలిపి తరవాత గంధకం కలిపి కజ్జలిచేసి కలబంద రసాన మర్దించి ఒక్కదినం వాలుకాయంత్రాన వండి మళ్లీ కలబందరసాన నూరి మాత్రలు కట్టుకుని వాడుకునేది.

ఇది వింశతిప్రమేహాలు, మూత్రాతిసారం, మూత్రకృచ్ఛ్రాలు, మూత్రాశ్మరి, గ్రహణి, కాళ్ళమంట, మూత్రాఘాతం, పోగొడుతుంది.

## ౩౮ రజతలోహరసాయనం

ఏకైకం సూతతారాభ్యాం చ ద్విభాగం జీవలోహకమ్
గంధకం తు చతుర్భాగం తథా ఖల్వే వినిక్షిపేత్
కన్యారసేన విమలా భృంగరాజ రసిల్లకైః

భద్రేణ వజ్రవల్ల్యా చ ప్రత్యేకం మర్దయే ద్దినమ్
అథాతో వాలుకాయంత్రే పచే ద్యామచతుష్టయమ్
భాషితం పూజ్యపాదేన తారలోహరసాయనమ్
గుంజాద్వయం ప్రదాతవ్య మనుపానవిశేషతః
రాజయక్ష్మాదికాన్ రోగాన్ శ్లేష్మపిత్తాదికాన్ జయేత్
అజీర్ణం తిమిరం శ్వాసం కాసం చైవాతిదుస్తరమ్
పాండుం శోఫం చ హృద్రోగం కామలాం కుంభకామలామ్
పక్షాఘాతార్దితౌ హంతి వాతవ్యాధివినాశకమ్ ।

పాదరసం, రజతంరజను ఒక్కొక్క భాగం. లోహపురజను రెండుభాగాలు. గంధకం నాలుగుభాగాలు. ఇవి యథావిధిగా ఖల్వంలోకలిపి కలబంద, సంబరేణు, గుంటకలగర, గలిజేరు, అల్లం, నల్లేరు — వీటిరసాలతో ఒక్కొక్క దినం మర్దించి, నాలుగుజాములు సికతాయంత్రాన వండేది.

ఇది చిన్న పుటం పెట్టడం కూడా వుంది. వంటగాని పుటంగాని అయిన తరవాత మళ్లీ పైరసాలతోనే మర్దించి కుప్పెలు కట్టుకునేది. దీనిమాత్రాదు సాధారణంగా రెండుగురిగింజలయెత్తు.

ఇది రాజయక్ష్మ, అజీర్ణం, తిమిరం, శ్వాసకాసలు, పాండువు, ఉబ్బు, హృద్రోగం, కామెర్లు, కుంభకామల, పక్షవాతం, అర్దితవాతం, సకలవాతాలూ, సకలకఫవ్యాధులూ పోగొడుతుంది.

## ఇలా చూడామణిరసం

ద్వినిష్కం రససిందూరం తదర్థం హేమ జారితమ్
నిష్కద్వయం గంధకం చ మర్దయే చ్చిత్రకద్రవైః
కుమారికారసై ర్యామం ఛాగీదుగ్ధే త్రియామకమ్
ముక్తావిద్రుమవంగానాం నిష్కం నిష్కం విమిశ్రయేత్
గోలకం పూరయే ద్భాండే రుద్ధ్వా గజపుటే పచేత్
స్వాంగశీతం విచూర్ణ్యాథ భక్షయే ద్రక్తికాద్వయమ్

మధునా క్షయరోగఘ్నం వాతపిత్తసముద్భవమ్
అజాపయశ్చానుపిబేత్ శర్కరామధుసంయుతమ్ ॥

రససిందూరం ఒక తులం. స్వర్ణభస్మం అరతులం. గంధకం ఒకతులం. ఇవి కలిపి ముందు చిత్రమూలరసంతోనూ, తరవాత కలబందరసంతోనూ, ఒక్కొక్క జాము మర్దించేది. వాటితో ముత్యాలభస్మమూ, పగడాల భస్మమూ, వంగభస్మమూ అర తులంచొప్పున చేర్చి మేకపాలతో మూడు జాములు మర్దించి, ముద్దచేసి, అది నీడనెండించి, మూకళ్ళలో చీలమన్ను ఇచ్చి గజపుటంలో వేసేది. ఇది తేనెతో పుచ్చుకుని తేనేచక్కెరా కలిపిన మేకపాలు తాగేది.

ఇది వాతపిత్తాలవల్ల పుట్టిన క్షయరోగం పోగొడుతుంది.

## ౩౯ రసరాట్టు

దరదం పారదం సూతసిందూరం రసకర్పూరమ్
ఏకైకభాగం సంగృహ్య గంధకం త్వష్టభాగికమ్
జీవలోహస్య చూర్ణం తు చతుర్భాగం వినిక్షిపేత్
కుమారికారసైర్ద్రవ్యం త్రిదినం శోషయేత్తతః
శరావసంపుటే పాచ్యం యావద్గంధం వినశ్యతి
స్వాంగశీతం సముద్ధృత్య కన్యాభృంగపునర్నవైః
ఆర్ద్రకైశ్చిత్రకైర్నాగవల్లీసారైశ్చ మర్దయేత్
అనుపానవిశేషేణ మధునా చ విశేషతః
సకలాన్ కఫజాన్ రోగాన్ వాతజాంశ్చ వినాశయేత్
ఆమవాతంహరేచ్చాపి శిశురోగనికృంతనః
రసరాడితి విఖ్యాతో సిద్ధనాగేన నిర్మితః ॥

ఇంగిలీకం, పాదరసం, రససిందూరం, రసకర్పూరం — ఇవి ఒక్కొక్కభాగం. గంధకం 8 భాగాలు. లోహరాపాడి 4 భాగాలు. ఇవి యథాశాస్త్రంగా కలిపి కలబందరసాన మూడు దినాలు మర్దించి నీడ నెండించి మూకుళ్ళలో ఉంచి లఘుపుటంలో వాసి, పొయ్యిమీద ఉంచి వాని గంధకం కరిగి హరించేదాకా వండేది.

చల్లబడ్డతరవాత తీసుకుని మళ్లీ కలబందరసంతోనూ, గుంటకలగర, తెల్లగలిజేరు, అల్లం, చిత్రమూలం, నల్లేరురసాలతోనూ మర్దించి అనుపానవిశేషాలతో వాడుకునేది. విశేషించి దీనికి తేనె మంచి అనుపానం. ఇది సకలకఫవ్యాధులూ, వాతవ్యాధులూ, అనువాతమూ హరిస్తుంది. చంటిపిల్లలకు చాలామంచిది.

## ౪౦ నవగ్రహి

గౌరీశిలా హింగుల గంధకాంశ్చ
రసం చ గోదంతి మయూరతుత్థే
తాలం శిలాం ఖర్పరసంయుతాం చ
సామ్యేన కృత్వా నవ ఖల్వమధ్యే
సుకారవేల్లీ రసనింబతోయై
ర్విమర్దయే త్త్ర్యాహదినం చ గాఢమ్
కాచకుంభేతతః క్షిప్త్వా వాలుకాయాం చ పాచయేత్
సర్వరోగేషు దాతవ్య శ్చానుపానవిశేషతః ॥

గౌరీపాషాణం, ఇంగిలీకం, గంధకం, పాదరసం, తాళకం, మైలతుత్థం, పిండతాళకం, మణిశిల, శుద్ధకపరి — ఇవి తొమ్మిదిన్నీ సమభాగాలుగా గ్రహించి, కాకరాకురసంతోనూ, వేపచెక్కరసంతోనూ 12 జాములు మర్దించి వాలుకాయంత్రాన వండి వాడుకునేది. అనుపానవిశేషాలతో ఇది సకలవ్యాధులూ హరిస్తుంది. కాని చాలా జాగ్రత్తగా వాడాలి.

## ౪౧ అమోఘరామబాణరసం

తుత్థద్వయం టంకణతాళకం చ
నీలాంజనం సూతవిషం బలించ
ద్వయం చ పాషాణ రసాంజనం చ
శిలాసమం జంభరసత్రిమర్దితం
నిర్గుండికాపత్రరసత్రిమర్దితం

పుటం తతః కుక్కుటకేన యుక్తమ్
అమోఘకం విశ్రుతరామబాణం
వల్లద్వయం శర్కరయూషయా స్యాత్
ఏకాహికద్వ్యాత్రిచతుర్థికం చ
శీతజ్వరం తద్విషమజ్వరం చ
పథ్యం స్తు శాల్యోదన ముద్గయూషం
దధిం చ తక్రం చ జలోదనం చ
భుక్త్వా చ ఇక్షుః కదళీఫలం చ
ఖర్జూరకామ్లాఫల చూతకం చ
నానానుగంధం కుసుమం చ భోగం
ప్రౌఢాంగనాసంగము మత్యాదీరితమ్ ॥

మైలతుత్థం, పాలతుత్థం, పొంగించిన వెలిగారం, తాళకం, నీలాంజనం, రసం, నాభి, గంధకం, గౌరీపాషాణం, ఉల్లిపాషాణం, రసాంజనం, మణిశిల — ఇవి సమ భాగాలుగా గ్రహించి నిమ్మకాయరసాన మూడుమార్లు వావిలిఆకురసాన మూడు మార్లు మర్దించి కుక్కుటపుటం వేసుకుని చల్లబడ్డతరవాత మళ్లీ నిమ్మకాయరసాన మర్దించి కుప్పెలు కట్టుకుని రెండుగుంజలయెత్తున చక్కెరపానకంతో వాడేది. పథ్యం — శాల్యోదనం, పెసరకట్టు, పెరుగు, మజ్జిగ, తరవాణి, చెరుకురసం, అరటిపండు, ఖర్జూరపుపండు, మామిడిపండు పుచ్చుకునేది. నానాసుగంధపుష్పాలూ ధరించేది. ప్రౌఢాంగనాసంగమమున్నూ అగత్యమైతే చేసేది.

ఇది ఏకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థికజ్వరాలు, శీతజ్వరం, విషమ జ్వరాలు హరిస్తుంది.

# ఆసవాలూ - అరిష్టాలూ

## ఆసవారిష్టాల కల్పన

ద్రవేషు చిరకాలస్థం ద్రవ్యం యత్సంధితం భవేత్
ఆసవారిష్టభేదైస్తత్ప్రోచ్యతే భేషజోచితమ్
యదపక్వౌషధాంబుభ్యాం సిద్ధం మద్యం స ఆసవః
అరిష్టః క్వాథసాధ్యస్స్యాత్తయోర్మానం పలోన్మితమ్
అనుక్తమానారిష్టేషు ద్రవద్రోణే తులాం గుడమ్
క్షౌద్రం క్షిపేద్గుడాదర్ధం ప్రక్షేప్యం దశమాంశకమ్ ॥

నీళ్ళు మొదలైన ద్రవపదార్థం కుండలో పోసి, అందులో, మెత్తగా దంచివుంచుకున్న ఔషధద్రవ్యం బాగా కలిపి, చీలమన్ను పూసి చాలా దినాలుంచితే అది మంచి ఔషధం అవుతుంది. ఆసవమూ, అరిష్టమూ, అని అది రెండు విధాలు.

కుండలో పోసే ద్రవపదార్థం పచ్చినీళ్ళు మాత్రమే అయితే అందులో సిద్ధం అయేది ఆసవం. ఆద్రవపదార్థం కషాయం అయితే, అందులో సిద్ధం అయేది అరిష్టం.

ఆసవారిష్టాలలో, ప్రతీదానికీ, ఏవస్తువు ఎంత వెయ్యాలో తూకాలూ, కొలతలూ వివరంగా చెప్పబడివున్నాయి. ఎక్కడ అయినా అలా కాక స్థూలంగా మాత్రమే చెప్పబడివుంటే, అక్కడ, ద్రవద్రవ్యం ఒక ద్రోణం వేసుకోవాలి. బెల్లం నూరు పలాలు వేసుకోవాలి. తేనె ఆబెల్లంలో సగం వేసుకోవాలి. ఆద్రవపదార్థంలో కలిపే ఔషధద్రవ్యానికి ప్రక్షేప్యం అని పేరు. అది బెల్లంలో పదోవంతు వేసుకోవాలి.

విశేషసూచనలు—

పచ్చినీళ్ళతో చేసినవాటికి అరిష్టాలనీ, కషాయాలతో చేసిన వాటికి ఆసవా లనీ కూడా అక్కడక్కడ కొన్నిగ్రంథాలలో వాడుక కనపడుతోంది. అయితే, యీవాడుక చాలా అరుదుగా మాత్రమే వుంది.

ప్రక్షేప్యం మెత్తగా దంచాలి. వస్త్రగాలితం మాత్రం చెయ్యనక్కరలేదు. అది యెంత మెత్తగా వుంటే దాని గుణం ఆద్రవపదార్థానికి అంతగా సంక్రమిస్తుంది.

బెల్లం చెప్పినచోట, ఆబెల్లం మెత్తగా తరగాలి, లేకపోతే చితకగొట్టాలి. అది పూర్తిగా కరగిపోయేదాకా ద్రవపదార్థంలో బాగా పిసికి కలపాలి. చక్కర

చెప్పినచోట, అందులో పలుకులుంటే అవి మెత్తగా కొట్టి చక్కెరకూడా కరిగిపోయేటట్టు కలపాలి.

ప్రక్షేప్యమూ, తేనె కూడా యిలాగ బాగా కలపాలి గాని కుండలో పోసేసి వూరుకోగూడదు.

ఆసవారిష్టాలలో, కొందరు, కూరలలోనూ పులుసులలోనూ వేసుకునే కొత్త బెల్లం వాడుతున్నారు. అది తప్పు. అది ఆసవారిష్టాలు పులిసిపోవడానికి కారణం అవుతుంది. పాతగిల్లిన తాటిపాకబెల్లం మంచిది. ఇదే ఖర్టూళ్ళ బెల్లం అని ప్రసిద్ధి. ఇది దొరకనిచోట పాతబెల్లం వాడుకోవాలి. అది గట్టిగా వుండాలి. ఎంత గట్టిది అయితే, అంత మంచిది. ఇంకొకటి: ఈ బెల్లం ఏ ప్రాంతానిదయినా చెరుకుబెల్లమే వాడుకోవాలి. తాటిబెల్లం పనికిరాదు.

కొన్ని ఆసవారిష్టాలలో ప్రక్షేప్యంలో ద్రాక్షపండుకూడా చేరివుంటుంది. అది మెత్తగా ముద్ద అయ్యేటట్టు దంచివెయ్యాలి గాని ఉన్నది ఉన్నట్టు వెయ్యగూడదు. గింజలు తియ్యకపోయినా బాధలేదు. అది కూడా ద్రవపదార్థంలో కలిసిపోయేటట్టు పిసకాలి గాని ముద్దలుముద్దలుగా వెయ్యగూడదు. ఈ ద్రాక్షపండు ఎంత కొత్తది అయితే అంత మంచిది.

చీలయిచ్చేటప్పుడు, కుండ మీద బోర్లించే మూకుడు కుండమూతికి సరిగా అమరేటట్టుండాలి. మెత్తని మట్టి బురదగా చేసి అది గుడ్డపీలికకు పూసి ఆపీలిక కుండమూతీ మూకుడూ కలిసేచోట బాగా చుట్టి పైని గూడా బాగా మట్టి పుయ్యాలి. కుండలోకి గాలి యెంతమాత్రమూ వెళ్ళగూడదు.

ఇలాగ, చీలమన్ను ఇచ్చిన కుండ గాలి చొరని గదిలో వుంచాలి. యోగంలో చెప్పివుంటే తప్ప ఈకుండ ఒక నెల తక్కువ కాకుండా విప్పగూడదు. నెలమీద ఒక్కవారం కంటే యెక్కువ కూడా వుంచగూడదు.

నెల పూర్తి అయినాక చీలమన్ను మెల్లిగా విప్పాలి. మూత తీసేటప్పటికి, కొన్ని ఆసవారిష్టాలలో ప్రక్షేప్యం కొంత పైకి తేలి అట్టుకట్టివుంటుంది. మందు కలిగిపోకుండా అది మెల్లిగా తీసివెయ్యాలి. తరవాత తేరివున్నది చిక్కనిగుడ్డతో వడబోసుకుని జాడీలలోనో సీసాలలోనో జాగ్రత్తపరుచుకునేది.

వడబోసుకునే గుడ్డ శుభ్రంగా వుండాలి, వడబోసుకునే పాత్రలు పింగాణీవి అయితే మంచిది. మట్టిపాత్రలూ, బంగారపుపాత్రలూ, వెండిపాత్రలూ శాస్త్రంలో చెప్పినవి; కాని రాగి యిత్తడి మొదలైన లోహపాత్రలు మాత్రం వాడగూడదు.

కుండలో తేరివుండినది పోగా, మిగిలివుండే మడ్డి కూడా గుడ్డలోవేసిపిసికితే

బురదలాగ కొంత ద్రవపదార్థం వస్తుంది. అది సీసాలల్లో పోసి ఒక్కవారం దినా లుంచితే మంచిని తేరుకుంటుంది. అది జాగ్రత్తగా తీసుకుని మడ్డిపారబోసేది.

గుడ్డతో వడబొయ్యాక కల్ల నిలవవుంచిన సీసాలలోనూ, జాడీలలోనూ కూడా కొన్నాళ్ళకి కొద్దిపాటి మడ్డి తేలవచ్చు.

అరిష్టాలకు కషాయం కాచేటప్పుడు మూలవస్తువు ఎండుది అయితే మెత్తగా దంచిన తరవాత పరిమాణజలంలోనే ఒక్క దినం నానబెట్టివుంచడం మంచిది. పచ్చిది అయితే ముద్దఅయేటట్టు చితకకొట్టి అది నీళ్ళలో కలిపి కాచాలి.

కషాయం కాచేటప్పుడు ఎక్కువ పెద్దమంట పెట్టగూడదు.

ఔషధద్రవ్యాలు అడుగున చేరి యిగిరిపోకుండా మధ్యమధ్య కలుపుతూ వుండాలి. దానిమీద మూతపెట్టగూడదు.

కొన్ని యోగాలలో మాత్రం కషాయం కాచేటప్పుడు ఏడువంతులు నీరు ఇగిరేటట్టు కాచాలి. సాధారణంగా, చాలా యోగాలలో, మూడువంతులే యిగర కాచాలి. శేషం ఎనిమిదో వంతో నాలుగోవంతో యోగంలో చెప్పినట్టు సరిగా వుండేటట్టు ఉంచుకోవాలి. చాలా యెక్కువగా మిగిలినా బాగా తగ్గిపోయినా ఔషధం చెడిపోతుంది. పని చెయ్యదు. అయితే, చేస్తూవుంటే, అనుభవంమీద యీపరిమాణం తెలిసిపోతుంది.

ఇలాగ, ఉజ్జాయింపుగా దింపుకుని చల్లగా చల్లారిన తరవాత ఆకషాయం వడబోసుకుని కుండలో పొయ్యాలి.

ఆసవారిష్టాలు చెయ్యడానికి నేతితో నానిన కుండ మంచిది. కషాయమూ పచ్చినీళ్ళూ పొయ్యడానికి ముందు, కొన్ని యోగాలలో కుండకి కొన్నివస్తువులతో ధూపం వెయ్యవలసివుంటుంది.

ఆసవానికయినా అరిష్టానికయినా పానయోగ్యమైన నీరే వాడాలి.

ప్రక్షేప్యాలలో పచ్చివస్తువులు వాడగూడదు.

ఆసవారిష్టాలు అన్నిటిలోనూ నీళ్ళు రెట్టింపు వేసుకోవాలి. అంటే, యోగంలో నాలుగు ద్రోణాలనివుంటే ఎనిమిది ద్రోణాలు వేసుకోవాలి. ఈసూత్రాన్నిబట్టే కషాయద్రవ్యాల పరిమాణం నిర్ణయించుకోవాలి.

కషాయద్రవ్యాలు పచ్చివస్తువు లయితే గూడా కొన్ని ద్విగుణంగా వేసుకోవాలి.

ఈసూత్రాల ననుసరించే ఈ గ్రంథంలో ఆసవారిష్టాలకు టీక రాస్తున్నాను.

విశేషవిధు లుంటే అవి వుండిన యోగంలో స్పష్టం చేస్తాను.

మొత్తానికి ఆంధ్రదేశంలో అసవారిష్టాల కల్పన చాలా కొత్త. మూలగ్రంథాలలో ఇవి చాలా వున్నాయి; కాని యెంచేతనో మన పూర్వులివి చెయ్యలేదు. తక్కినవి మాత్రం అన్ని రసాలూ వాడుతున్నారు. ఈ కారణంవల్ల కొత్తవా రెవరైనా ఆసవారిష్టాలు చెయ్యదలుచుకుంటే ప్రారంభంలో అనుభవపరుల సలహాలు పుచ్చుకోవడం మంచిది, కొన్నాళ్ళకి వారికే అనుభవం యేర్పడుతుంది.

---

## ద్రాక్షారిష్టం

ద్రాక్షా తులార్థం ద్విద్రోణే జలస్య విపచే త్సుధీః
పాదశేషే కషాయే చ పూతే శీతే వినిక్షిపేత్
గుడస్య ద్వితులాం తత్ర త్వగేలా పత్రకేసరమ్
ప్రియంగు ర్మరిచం కృష్ణా విడంగం చేతి చూర్ణయేత్
పృథక్పలోన్మితై ర్భాగై స్తతో భాండే నిధాపయేత్
సమంతతో ఘాటయిత్వా పిబే జ్జాతరసం పునః
ఉరఃక్షతం క్షయం హంతి కాసశ్వాసగళామయాన్
ద్రాక్షారిష్టాహ్వయః ప్రోక్తో బలకృ న్మలశోధనః ।

ద్రాక్షపండు 50పలాలు రోటిలో వేసి ముద్దగా దంచి అది రెండుద్రోణాల నీటిలో బాగా కలిపి కాచాలి. చివరికి అర్థద్రోణం మాత్రమే మిగిలేటట్టు తక్కిన నీరంతా ఇగరకాచాలి. అప్పుడు దించి చల్లబడ్డతరవాత వడబోసి ఆకషాయం మంచికుండలో పోసేది. రెండువందల పలాల బెల్లం మెత్తగా చితకగొట్టి ఒక్క పలుకయినా మిగలకుండా ఆకషాయంలో కలపాలి.

దాల్చినచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, నాగకేసరాలు, ప్రేంకణాలు, మిరియాలు, పిప్పళ్ళు, వాయువిడంగాలు — ఇవి ఒక్కొక్కటి పలంచొప్పున చేర్చుకుని అన్నీ కలిపి మెత్తగా దంచివుంచుకోవాలి. ఇది ప్రక్షేప్యం. ఈప్రక్షేప్యం కూడా బెల్లం కలిపిన ద్రాక్షకషాయంలో కలిపేది.

తరవాత చీలయిచ్చి ఒక్కనెల గడిచాక తీసుకుని వాడేది. ఇది ఉరఃక్షతమూ, క్షయా, దగ్గూ, వగర్పూ, కంఠరోగాలూ పోగొడుతుంది. ఇంకిన్నీ, ఇది బలం చేస్తుంది. విరేచనకారి. జబ్బుపడిలేచినవారికి ఇది వెంటనే పుష్టీ, సత్తువా కలిగిస్తుంది.

## ౨ అమృతారిష్టం

అమృతాయాః పలశతం దశమూలీశతం తథా
చతుర్ద్రోణే జలే పక్త్వా కుర్యాత్పాదావశేషితమ్
శీతే తస్మిన్ రసే పూతే గుడస్య త్రితులాః క్షిపేత్
అజాజ్యా షోడశపలం పర్పటస్య పలద్వయమ్
సప్తపర్ణం త్రికటుకం ముస్తకం నాగకేసరమ్
కటుకాతివిషే చేంద్రయవం చ పలసమ్మితమ్
ఏకీకృత్య క్షిపే ద్భాండే నిదధ్యా న్మాసమాత్రకమ్
అమృతారిష్ట ఇత్యేష సర్వజ్వరకులాంతకృత్ ।

తిప్పతీగ నూరుపలాలు. దశమూలాలు అన్నీ కలిసి నూరుపలాలు. (అంటే, మారేడు వేళ్ళు 80తులాలు. దుండిగం 80తులాలు. గుమ్మడి 80తులాలు. కలిగొట్టు 80తులాలు. తక్కాల 80తులాలు. ముయ్యాకుపొన్న 80తులాలు. కోలపొన్న 80తులాలు. వాకుడు 80తులాలు. పెద్దములక 80తులాలు. పల్లేరు 80తులాలు. మొత్తం నూరు పలాలు) ఇవన్నీ మెత్తగా దంచి ఎనిమిది ద్రోణాల నీళ్ళలో వేసి రెండు ద్రోణాలు మిగిలేటట్టు కాచేది. అది చల్లబడ్డతరవాత వడబోసి, అది కుండలో పోసి, అందులో మూడువందల పలాల బెల్లం కలిపేది. తరవాత జీలకర్ర 16పలాలు. పర్పాటకం 2పలాలు, సప్తపర్ణి, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, తుంగముస్తలు, నాగకేసరాలు. కటుకరోహిణి, అతివస, కోడిశపాలవిత్తులు — ఇవి ఒక్కొక్కపలం. ఇవన్నీ మెత్తగా దంచి కషాయంలో కలిపేది. తరవాత చీలయిచ్చి నెల అయిన తరవాత తీసి వడబోసుకునేది.

ఇది సమస్తజ్వరాలూ హరిస్తుంది.

## ౩ లోహాసవం

లోహచూర్ణం త్రికటుకం త్రిఫలం చ యమానికా
విడంగం ముస్తకం చిత్రం చతుస్సంఖ్యాపలం క్షిపేత్
ధాతకీకుసుమానాం తు ప్రక్షిపే త్పలవింశతిమ్
చూర్ణీకృత్య తతః క్షౌద్రం చతుష్షష్టిపలం పృథక్

దద్యాద్గుడతులాం తత్ర జలద్రోణద్వయం తథా
ఘృతభాండే వినిక్షిప్య నిదధ్యాన్మాసమాత్రకమ్
లోహాసవ మముం మర్త్యః పిబే ద్వహ్నికరం పరమ్
పాండుశ్వయథుగుల్మాని జఠరా ణ్యర్శసాం రుజమ్
ప్లీహామయం జ్వరం జీర్ణం కాసం శ్వాసం భగందరమ్
అరోచకం చ గ్రహణీం హృద్రోగం చ వినాశయేత్ ॥

లోహభస్మం, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకపొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, వాము, వాయువిడంగాలు, తుంగముస్తలు, చిత్రమూలం, ఇవి ఒక్కొక్కటి నాలుగేసి పలాలు. ఆరెపువ్వు ఇరవైపలాలు. ఇవన్నీ మెత్తగా చూర్ణించి నాలుగుద్రోణాల నీళ్ళలో వేసి కలిపేసి. అందులో నూరుపలాల బెల్లమూ, అరవై నాలుగు పలాల తేనె కూడా కలిపి చీలమన్ను యిచ్చి నెల తరవాత తీసి వడ బోసుకునేది.

ఇందులో లోహచూర్ణం అంటే కొందరు లోహరజను వాడుతున్నారు. అది మంచిసంప్రదాయం కాదు. శతపుటాలూ పడిన లోహభస్మమే వాడాలి. మరన్నీ యివన్నీ పోసి చీలమన్ను యిచ్చే కుండ నేతితో మాగినదై వుండాలి. అధమం, లోపలిభాగాన కొంచెం నెయ్యి అయినా పుయ్యాలి.

ఇది ఆకలివృద్ధిచేస్తుంది. పాండువు, ఉబ్బు, గుల్మాలు, ఉదరరోగాలు, మూలశంకలు, ప్లీహావ్యాధులు, జీర్ణజ్వరం, దగ్గు, వగర్పు. భగందరం, అరుచి, గ్రహణి, హృద్రోగం — ఇవి తగ్గిస్తుంది.

## ౪ రోహీతకారిష్టం

రోహీతకతులామేకాం చతుర్ద్రోణే జలే పచేత్
పాదశేషే రసే పూతే శీతే పలశతద్వయమ్
దద్యాద్గుడస్య, ధాతక్యాః పలషోడశికా మతా
పంచకోలం త్రిజాతం చ త్రిఫలాం చ వినిక్షిపేత్
చూర్ణయిత్వా పలాంశేన తతో భాండే నిధాపయేత్
మాసాదూర్ధ్వం చ పిబతాం సర్వోదరరుజాం జయేత్

ప్లీహగుల్మోదరాష్ఠీలా గ్రహణ్యర్శాంసి కామలామ్
కుష్ఠశోథారుచిహరో రోహీతారిష్టసంజ్ఞితః ॥

ములుమోదుగు పట్ట నూరుపలాలు మెత్తగా దంచి అది యెనిమిది ద్రోణాల నీటిలో వేసి రెండుద్రోణాలు మిగిలేటట్లు కాచి, చల్లారగానే వడబోసి ఒక కుండలో పొయ్యాలి. అందులో రెండువందల పలాల బెల్లం కలపాలి. ఆరెప్పువ్వు 16 పలాలు. పిప్పళ్ళు, మోడి, చవ్యం, చిత్రమూలం, సొంటి, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రికం, కరకవొలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు — ఇవి ఒక్కొక్క పలం. వీటన్నీ మెత్తగా దంచి ఆకషాయంలో కలపాలి. చీలమన్ను పూసి నెలగడిచాక తీసి వడబోసుకునేం.

రోహీతకం అంటే కొందరు మోదుగుచెక్క వాడుతున్నారు. అది తప్పు. ములుమోదుగు వాడాలి.

ఈ రోహీతకారిష్టం ఉదరవ్యాధులన్నీ తగ్గిస్తుంది. ముఖ్యంగా ప్లీహవృద్ధీ, యకృద్వృద్ధీ తగ్గిస్తుంది. కడుపులో బల్లలు పెరిగిన పిల్లలకు ఇది చాలా మంచిది. అష్ఠీలా, గ్రహణీ, మూలశంకలూ, కామెర్లూ, కుష్ఠూ, ఉబ్బూ, అరుచీ కూడా పోగొడుతుంది.

## ౫ అభయారిష్టం

అభయాయాస్తులా మేకాం మృద్వీకార్ధతులాం తథా
విడంగస్య దశపలం మధూకకుసుమస్య చ
చతుర్ద్రోణే జలే పక్త్వా ద్రోణ శేషం చ శేషయేత్
శీతీభూతే రసే తస్మిన్ పూతే గుడతులాం క్షిపేత్
శ్వదంష్ట్రా త్రివృతాం ధాన్యం ధాతకీ మింద్రవారుణీమ్
చవ్యం మధురికాం శుంఠీం దంతీం మోచరసం తథా
పలయుగ్మమితం సర్వం పాత్రే మహతి మృణ్మయే
క్షిప్త్వా సంరుధ్య తత్పాత్రం మాసమాత్రం నిధాపయేత్
తతో జాతరసం జ్ఞాత్వా పరిశ్రావ్య రసం నయేత్
బలం కోష్ఠం చ వహ్నిం చ వీక్ష్య మాత్రాం ప్రయోజయేత్

అర్శాంసి నాశయే చ్ఛీఘ్రం తథాష్టావుదరాణి చ
వర్చోమూత్రవిబంధఘ్నో వహ్నిసందీపనః పరః ॥

కరకవోలుపు నూరుపలాలు. ద్రాక్షపండు యాభైపలాలు. వాయువిడంగాలు, ఇప్పపువ్వు పదేసిపలాలు. ఇవి మెత్తగా కొట్టి ఎనిమిది ద్రోణాల నీటిలో వేసి రెండు ద్రోణాలు మిగిలేటట్టు కాచాలి. చల్లబడ్డ తరవాత వడపోసి, ఆకషాయం వోకకుండలో పోసి, అందులో నూరుపలాల బెల్లం కలపాలి. పల్లేరుకాయలు, తెగడ, ధనియాలు, ఆరెపువ్వు, చేదుపుచ్చ, చవ్యం, మధుకిక, సొంటి, నేపాళపువేళ్ళు, బూరుగుజిగురు — ఇవి రెండేసి పలాలు కలిపి మెత్తగా దంచి యిది కూడా అందులో కలపాలి. తరవాత చీలమన్ను పూసి నెలదినాలుంచి తీసుకోవాలి.

బలమూ, కోష్ఠస్థితీ, ఆకలీ గుర్తించి మోతాదు నిర్ణయించుకోవాలి. ఇది మూల శంకలు పోగొడుతుంది. ఉదరవ్యాధులూ, మలమూత్రబంధమూ తగ్గిస్తుంది. ఆకలి పుట్టిస్తుంది.

ఇది విరేచనకారి కనక, జాగ్రత్తగా వాడాలి.

## ౬ పునర్నవాసవం

త్రికటుం త్రిఫలాం దార్వీం శ్వదంష్ట్రాం బృహతీద్వయమ్
వాసా మేరండమూలం చ కటుకీం గజపిప్పలీమ్
శోథఘ్నీం పిచుమర్దం చ గుడూచీం శుష్కమూలకమ్
దురాలభాం పటోలం చ పలాంశేన విచూర్ణయేత్
ధాతకీం షోడశపలాం ద్రాక్షాయాః పలవింశతిమ్
తులామానాం సితాం దత్వా మాక్షికార్ధపలం తథా
జలద్రోణద్వయే క్షిప్త్వా మాసం భాండే నిధాపయేత్
పునర్నవాసవో హ్యేష శోథోదరవినాశనః
ప్లీహానమమ్లపిత్తం చ యకృద్గుల్మజ్వరాదికాన్
కృచ్ఛ్రసాధ్యామయాన్ సర్వాన్ నాశయేన్నాత్ర సంశయః ॥

సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, కరకవోలుపు, తాడికాయబెరడు, ఉసిరికపప్పు, మానుపసుపు, పల్లేరు, వాకుడు, నేలములక, అడ్డసరపుపట్ట, ఆముదపుచెట్టువేరు, కటుక

రోహీతకి, గజపిప్పలి, తెల్లగలిజేరు, శేపవేరుపట్ట, తిప్పతీగ, ఎండిన ముల్లంగిదుంప, దూలగొండివేళ్ళు, చేదుపొట్ల — ఇవి ఒక్కొక్కపలం. ఆరెపువ్వు 16పలాలు. ఇవి మెత్తగా దంచి వుంచుకునేది. ద్రాక్షపండు 20పలాలు. ఇవన్నీ ముద్దగా చేసుకునేది. చక్కెర నూరుపలాలు. తేనె 50పలాలు. నాలుగుద్రోణాల నీళ్ళలో ఇవన్నీ కలిపి, కుండలోపోసి, చీలయిచ్చి నెల అయిన తరవాత తీసుకునేది.

ఇది ఉబ్బూ, ఉదరవ్యాధులూ తగ్గిస్తుంది. ప్లీహవ్యాధులూ, అమ్లపిత్తమూ, గుల్మాలూ, యకృద్వ్యాధులూ, జ్వరాలూ పోగొడుతుంది.

## ౭ ఉశీరాసవం

ఉశీరం వాలకం పద్మం కాశ్మరీం నీల ముత్పలమ్
ప్రియంగుం పద్మకం లోధ్రం మంజిష్ఠా ధన్వయాసకమ్
పాఠాం కిరాతతిక్తం చ న్యగ్రోధోదుంబరం శటీమ్
పర్పటం పుండరీకం చ పటోలం కాంచనారకమ్
జంబూశాల్మలినిర్యాసం ప్రత్యేకం పలసమ్మితమ్
సర్వం సుచూర్ణితం కృత్వా ద్రాక్షాయాః పలవింశతిమ్
ధాతకీం షోడశపలాం జలద్రోణద్వయే క్షిపేత్
శర్కరాయా స్తులాం దత్వా క్షౌద్ర స్యార్థతులాం తథా
మాసం సంస్థాపయే ద్భాండే మాంసీమరిచధూపితే
ఉశీరాసవ ఇత్యేష రక్తపిత్తవినాశనః
పాండుకుష్ఠప్రమేహార్శఃకృమిశోథహర స్తథా ॥

వట్టివేరు, కురువేరు, తామరపువ్వు, పెన్నమ్ముడు, నల్లకలువ, ప్రేంకణాలు, పద్మకాష్ఠం, లొద్దుగుచెక్క, మంజిష్ఠ, దూలగొండివేళ్ళు, పాఠా, నేలవేము, మర్రిపట్ట, మేడిపట్ట, కచ్చూరాలు, రావిపట్ట, చెంగల్వకోష్టు, చేదుపొట్ల, దేవకాంచనపుపట్ట, నేరేడుపట్ట, బూరుగుజిగురు — ఇవి ఒక్కొక్కపలం. ఆరెపువ్వు 16పలాలు. ఇవన్నీ మెత్తగా దంచి వుంచుకునేది. ఇరవై పలాల ద్రాక్షపండున్నూ మెత్తగా దంచివుంచుకునేది. ఇవీ, నూరుపలాల చక్కెరా, యాభైపలాల తేనే నాలుగు ద్రోణాలు నీళ్ళలో కలిపేది. తరవాత, ఇది జటామాంసీ, మిరియాలూ చితకకొట్టి దాంతో కుండలోపల ధూపంవేసి ఆకుండలోపోసి, చీలయిచ్చి, నెల అయిన తరవాత తీసుకునేది.

ఇది రక్తపిత్తం తగ్గిస్తుంది. పాండురోగం, కుష్ఠు, ప్రమేహం, మూలశంకలు, క్రిములు, ఉబ్బు పోగొస్తుంది.

## ౭. వాసారిష్టం

వాసకస్య తులే ద్వే తు చతుర్ద్రోణేపాం విపాచయేత్
ద్రోణార్ధశేషం తత్కృత్వా పూతే శీతే ప్రదాపయేత్
గుడస్యైకతులాం తత్ర ధాతక్యాస్తు పలాష్టకమ్
క్షిపేచ్చూర్ణీకృతం తస్మిన్ త్వగేలా పత్రకేసరమ్
కంకోలవ్యోషతోయాని పలికాన్యుపకల్పయేత్
సమ్యక్పక్వం తతో జ్ఞాత్వా పక్షాదూర్ధ్వం పిబేదముమ్
వాసకాసవ ఇత్యేష సర్వశ్వయథునాశనః ॥

అడ్డసరంపట్ట పచ్చిది రెండువందలపలాలు ముద్దగా చితకకొట్టి నాలుగుద్రోణాల నీళ్ళలో వేసి కలిపి ఒక ద్రోణం మిగిలేటట్టు కాచేది. చల్లబడ్డ తరవాత అది వడబోసి కుండలో పోసి, అందులో నూరుపలాల బెల్లమూ, ఆరెపువ్వు గుండ ఎనిమిది పలాలూ, దాల్చినిచెక్కా, ఏలకులూ, ఆకుపత్రికమూ, నాగకేసరాలూ, తక్కోలమూ, సొంటీ, పిప్పళ్ళూ, మిరియాలూ, కురువేరూ — ఇవి ఒక్కొక్కపలం మెత్తగా చూర్ణించి ఇదీ ఆకుండలో పోసి కలిపి చీలయిచ్చి 15 దినాలు గడిచాక తీసుకునేది.

ఇది అన్నివిధాల ఉబ్బులూ తగ్గిస్తుంది.

## ౮. కనకాసవం

సంశుద్ధ్య కనకం శాఖామూలపత్రఫలైస్సహ
తతశ్చతుష్పలం గ్రాహ్యం వృషమూలత్వచస్తథా
మధుకం మాగధీ వ్యాఘ్రీ కేసరం విశ్వభేషజమ్
భార్గీ తాలీసపత్రం చ సంచూర్ణ్యైషాం పలద్వయమ్
సంగృహ్య ధాతకీప్రస్థం ద్రాక్షాయాః పలవింశతి
జలద్రోణద్వయం దత్త్వా శర్కరాయాస్తులాం తథా
క్షౌద్రస్యార్ధతులాం చాపి సర్వం సంమిశ్ర్య యత్నతః

భాండే నిక్షిప్య చావృత్య నిదధ్యాన్మాసమాత్రకమ్
నిహంతి నిఖిలాన్ శ్వాసాన్ కాసం యక్ష్మాణ మేవ చ
క్షతక్షీణం జ్వరం జీర్ణం రక్తపిత్త మురఃక్షతమ్ ॥

నల్లవుమ్మెత్తచెట్టు సమూలం — అంటే కొమ్మలతోనూ ఆకులతోనూ వేళ్ళతోనూ పువ్వులతోనూ కాయలతోనూ పళ్ళతోనూ ఎండబెట్టి అది నాలుగుపలాలు. అడ్డసరపు వేరుపట్ట నాలుగుపలాలు. యష్టిమధుకమూ, పిప్పళ్ళూ, వాకుడూ, నాగకేసరాలూ, సొంటీ, గంటుభారంగీ, తాళీసపత్రీ, ఇవి ఒక్కొక్కటి రెండేసి పలాలు. ఆరెపువ్వు ఒక ప్రస్థం. ద్రాక్షపండు 20పలాలు. నీళ్ళు నాలుగుద్రోణాలు. చక్కెర నూరుపలాలు. తేనె యాభైపలాలు. ఇవన్నీ కుండలో కలిపి చీలయిచ్చి ఒక్కనెల గడిచాక తీసి వడబోసేది.

ఇది ఉబ్బసం తగ్గిస్తుంది. దగ్గు పోగొడుతుంది. క్షయలో మంచిమందు. జీర్ణజ్వరమూ, క్షతక్షీణతా, రక్తపిత్తమూ, ఉరఃక్షతమూ కూడా పోగొడుతుంది.

## ౧౦ పార్థాద్యరిష్టం

పార్థత్వచ స్తులా మేకాం మృద్వీకార్థతులాం తథా
భాగం మధూకపుష్పస్య పలవింశతిసమ్మితమ్
చతుర్ద్రోణేంభసః పక్త్వా ద్రోణ మే వావశేషయేత్
ధాతక్యా వింశతిపలం గుడస్య చ తులాం క్షిపేత్
మాసమాత్రం స్థితో భాండే భవే త్పార్థాద్యరిష్టకః
హృత్ఫుప్ఫుసగదాన్ సర్వాన్ హంత్యయం బలవీర్యకృత్ ॥

ఇందులో ప్రధానద్రవ్యం తెల్లమద్దిపట్ట. తెల్లమద్దికి అర్జునుని పేళ్ళన్నీ వర్తిస్తాయి. అంచేత కొందరు ఇది అర్జునారిష్టం అని కూడా వ్యవహరిస్తారు.

తెల్లమద్దిపట్ట నూరుపలాలు. ద్రాక్షపండు యాభైపలాలు. ఇప్పపువ్వు ఇరవైపలాలు. నీళ్ళు ఎనిమిది ద్రోణాలు. రెండు ద్రోణాలు మిగిలేటట్టు కాచి చల్లారిన తరవాత వడగట్టి కుండలోపోసి అందులో ఆరెపువ్వు ఇరవైపలాలు — పాతబెల్లం నూరుపలాలు — కలిపేది. నెలగడిచాక తీసి వడబోసేది.

ఇది హృద్రోగాలూ ఫుప్ఫుసవ్యాధులూ అన్నీ పోగొడుతుంది. బలంచేస్తుంది. వీర్యవృద్ధిని కలిగిస్తుంది.

## ౧౧. ముస్తకారిష్టం

ముస్తకస్య తులాద్వంద్వం చతుర్ద్రోణేంబునః పచేత్
పాదశేషే రసే తస్మిన్ క్షిపేద్గుడతులాత్రయమ్
ధాతకీం షోడశపలాం యమానీం విశ్వభేషజమ్
మరిచం దేవపుష్పం చ మేథీం వహ్నిం చ జీరకమ్
పలయుగ్మమితం క్షిప్త్వా శుద్ధభాండే నిధాపయేత్
సంస్థాప్య మాసమాత్రం తు తతః సంస్రావయేద్భిషక్
అజీర్ణ మగ్నిమాంద్యం చ విషూచీ మపి దారుణామ్
గ్రహణీం వివిధాం హంతి నాత్ర కార్యా విచారణా ।

తుంగముస్తలు రెండువందల పలాలు. ఇది మెత్తగా కొట్టి ఎనిమిది ద్రోణాలనీళ్ళలో కలిపి రెండుద్రోణాలు మిగిలేటట్టు కాచేది. చల్లబడ్డతరవాత వడిబోసి కుండలో పోసి, అందులో 3వందల పలాల బెల్లమూ, ఆరెపువ్వు 16పలాలూ, వామూ, సొంటీ, మిరియాలూ, లవంగాలూ, మెంతులూ, చిత్రమూలమూ, జీలకర్రా — ఇవి ఒక్కొక్కటి రెండేసిపలాలూ కలిపి చీలయిచ్చి నెలగడిచాక తీసి వడబోసుకునేది.

ఇది అజీర్ణమూ, అగ్నిమాంద్యమూ, దారుణమైన విషూచీ (కలరా,) గ్రహణీ తగ్గిస్తుంది. ఏమీ సందేహం లేదు.

## ౧౨. కర్పూరాసవం

తులాం ప్రసన్నాం పరిగృహ్య శుద్ధామ్
పలాష్టకం చోడుపతేః క్షిపేచ్చ
ఏలా చ ముస్తా ఘనశృంగబేరే
యమానికా వేల్లజ మత్ర సర్వమ్
పలప్రమాణం పిహితే చ భాండే
మాసం నిదధ్యాద్భిషగత్ర యత్నాత్
విషూచికాయాః పరమౌషధం తత్
స్నిహంతి చాన్యాన్ వివిధాన్ వికారాన్ ।

పోతుతాటికల్లు నూరుపలాలు. పారతికర్పూరం ఎనిమిది పలాలు. ఏలకులూ, తుంగ ముస్తలూ, సొంటీ, వాముా, మిరియాలూ — ఇవి ఒక్కొక్క పలం. ఇవన్నీ కలిపి కుండలో పోసి చీలయిచ్చి ఒక్క నెల అయిన తరవాత తీసి వడబోసుకునేది.

విషూచిక (కలరా) కు ఇది ముఖ్యమైన ఔషధం. సకలవిధాల విరేచనాలూ కడుతుంది.

ప్రసన్న అంటే చాలామంది పోతుతాటికల్లు వాడుతున్నారు. ఇప్పకల్లుకూడా కొందరు వాడుతున్నారు. అనుభవంలో యివి రెండూ మంచివిగానే కనపడతాయి. అయితే, మరికొందరు సారా వాడుతున్నట్టు తెలిసింది. అది మంచిది కాదనే నానమ్మకం. మామూలు కల్లుకూడా అంతమంచిది కాదు.

ఇందులో చేర్చే ముద్దపారతికర్పూరం మెత్తగా పొడిచేసి కల్లులో తక్కిన వాటితో కలిపవేసి బాగా పిసకాలి. లేకపోతే సరిగా జీర్ణం కాదు. అది జీర్ణం కాక పోతే యీ ఆసవం బాగా పనిచెయ్యదు. ఈవిషయమై మిక్కిలీ శ్రద్ధ చెయ్యాలి.

ఈకర్పూరారిష్టం కొందరు జేడిసీళ్ళతో చేస్తున్నట్టూ, దానికి కర్పూరారిష్టం అని పేరుపెడుతున్నట్టూ తెలిసింది. ఆ యోగం నేను ముఖ్యగ్రంథాలలో యెక్కడా చూడలేదు.

## ౧౩ కుటజారిష్టం

తులాం కుటజమూలస్య మృద్వీకార్ధతులాం తథా
మధూకపుష్పకాశ్మర్యోర్భాగాన్ దశపలోన్మితాన్
చతుర్ద్రోణేఽంభసః పక్త్వా ద్రోణం చైవావశేషయేత్
ధాతక్యా వింశతిపలం గుడస్య చ తులాం క్షిపేత్
మాసమాత్రం స్థితో భాండే కుటజారిష్టసంజ్ఞితః
జ్వరాన్ ప్రశమయేత్ సర్వాన్ కుర్యాత్ తీక్ష్ణం ధనంజయమ్
దుర్వారాం గ్రహణీం హంతి రక్తాతీసారముల్బణమ్ ॥

కొడిశచెక్క నూరు పలాలు. ద్రాక్షపండు 50పలాలు. ఇప్పపువ్వూ, పెగ్గుమ్మడూ ఒక్కొక్కటి పదేసిపలాలు, ఎనిమిది ద్రోణాల నీళ్ళలో కలిపి రెండు ద్రోణాలు మిగిలేటట్టు కాచి చల్లారిన తరవాత వడకట్టి కుండలో పోసి అందులో 20పలాలు ఆరెపువ్వూ, నూరుపలాల బెల్లమూ కలిపి చీలయిచ్చి ఒక నెలతరవాత తీసివడబోసేది.

ఇది అన్ని జ్వరాలూ తగ్గిస్తుంది. ఆకలి వృద్ధిచేస్తుంది.

ఇది అతిసారాలలో ప్రధాన మైనది. రక్తవిరేచనాలూ, దారుణ మైన గ్రహణీ కట్టుతుంది.

కొడిశచెక్క పచ్చిది తెచ్చి చితకకొట్టి పిటిలో వేసి కాచాలి. ఎండుది పనికి రాదు. ద్విగుణం వెయ్యకూడదు. నూరుపలాలే వెయ్యాలి.

## ౧౪ అహిఫేనాసవం

తులాం మధూకమద్యస్య శుభే భాండే వినిక్షిపేత్
ఫణిఫేనస్య కుడవం ముస్తకం పలసమ్మితమ్
జాతీఫలం చేంద్రయవం తథైలాం తత్ర దాపయేత్
రుద్ధ్వా భాండం మాసమాత్రం యత్నతః పరిరక్షయేత్
హంత్యతీసార మత్యుగ్రం విషూచీ మపి దారుణామ్ ॥

ఇప్పకల్లు నూరుపలాలు కుండలో పోసి, ముందు దాన్లో ఒక కుడవం నల్లమందు బాగా పిసికి కలపాలి. తరవాత జాజికాయా, కొడిశపాలవిత్తులూ, ఏలకులూ, తుంగ ముస్తలూ ఒక్కొక్క పలం మెత్తగా చూర్ణించినది కలపాలి. చీలయిచ్చి నెల గడిచాక తీసి వడబోసుకునేది.

ఇది అతిదారుణ మైన అతిసారం కడుతుంది. ఏస్థితిలో వుండినా విషూచి(కలరా) కూడా కట్టేస్తుంది.

దీనిమోతాదు చాలా జాగ్రత్తగా నిర్ణయించుకోవాలి.

## ౧౫ బబ్బులాద్యరిష్టం

తులాద్వయం తు బబ్బూల్యాశ్చతుర్ద్రోణే జలే పచేత్
ద్రోణశేషే రసే శీతే గుడస్య త్రితులాః క్షిపేత్
ధాతకీం షోడశపలాం కృష్ణాం చ ద్విపలాంశికామ్
జాతీఫలాని కక్కోలం త్వగేలా పత్రకేసరమ్
లవంగం మరిచం చైవ పలికా న్యుపకల్పయేత్
మాసం భాండే స్థితో హ్యేష బబ్బూలారిష్టకో జయేత్

క్షయం కుష్ఠ మతీసారం ప్రమేహాశ్వాసకాసకాన్
గ్రహణ్యాం యేరసాః ప్రోక్తా స్తేతిసారే నియోజితాః
హన్యు స్సర్వ మతీసారం శివ స్యాజ్ఞావిశేషతః
స్నానాభ్యంగావగాహంశ్చ గురుస్నిగ్ధాతిభోజనమ్
వ్యాయామ మగ్నిసంతాప మతీసారీ వివర్జయేత్ ॥

నల్లతుమ్మపట్ట 2వందల పలాలు. ఎనిమిది ద్రోణాల నీటిలో రెండు ద్రోణాలు మిగిలేట్టు కాచాలి. అది చల్లబడ్డతరవాత వడగట్టి కుండలో పోసేది. అందులో 3వందల పలాల బెల్లమూ, 16పలాల ఆరెపువ్వూ, 2 పలాల పిప్పళ్ళూ, ఒక్కొక్క పలం జాజికాయా, కంకోలమూ, దాల్చినిచెక్కా, ఏలకులూ, ఆకుపత్రికమూ, నాగకేసరాలూ, లవంగాలూ, మిరియాలూ మెత్తగా గుండకొట్టి అందులో కలిపి చీలయిచ్చి నెల అయిన తరవాత తీసి వడబోసుకునేది.

ఇది క్షయా, కుష్టూ, అతిసారమూ, ప్రమేహాలూ, దగ్గూ, బగర్వూ, గ్రహణీ పోగొట్టుతుంది. అయితే, అతిసారరోగులు స్నానమూ, తలంటూ, నీటిలో దిగి స్నానంచెయ్యడమూ విడిచిపెట్టాలి. గురుపదార్థాలూ, చమురుగల వస్తువులూ తినరాదు. అతిగా భోజనమున్నూ చెయ్యగూడదు. కసరత్తు మానాలి. నిప్పుసెగకి దూరంగా వుండాలి.

ఇందులో చెప్పిన నల్లతుమ్మపట్ట పెరుదీ పచ్చిదీ వేసుకోవాలి. అది మెత్తగా చితకగొట్టాలి. రెట్టింపున్నూ వేసుకోవాలి.

ఒకపెద్దమనిషికి చిరకాలంగా శూలబాధ వుండి. దాని కాయన సోడాచప్పరించి నీళ్ళు తాగేవారు. అయిదారు సంవత్సరాలుగా అలా జరుగుతోంది. ఆయనకు నేనీ అరిష్టం రెండుమాసాలు వాడాను. పదిహేను దినాలకు శూల తగ్గింది. రెండు మాసాలకు పూర్తిగా పోయింది. జాగ్రత్తకోసం మరోరెండుమాసాలు కూడా యిదివాడాను.

కడుపునొప్పితో వుండే అతిసారమూ, గ్రహణీ కూడా దీంతో అద్భుతంగా తగ్గాయి.



## ౧౬. పిప్పల్యా...

పిప్పలీ మరిచం చవ్యం హారిద్రా చిత్రకో ఘనః
విడంగం క్రముకో లోధ్రః పాఠా ధా...వాలుకమ్

జాతీఫలం లవంగైలా త్వక్పత్రాణి పృథక్పృథక్
పలోన్మితాని కృష్ణాయా దద్యాత్పలచతుష్టయమ్
ఘృతభాండే వినిక్షిప్య మాసాదూర్ధ్వం పిబేత్తతః
మహాకుష్ఠాని హృద్రోగం పాండురోగార్బుదం తథా
గుల్మం గ్రంథిం క్రిమీన్ కాసం తథా ప్లీహోదరం జయేత్
ఏష వై ఖదిరారిష్టః సర్వకుష్ఠనివారణః ॥

చంద్రచేవ 50 పలాలు. దేవదారు 50 పలాలు. బావంచాలు 12 పలాలు. మానుపసుపు 20 పలాలు. త్రిఫలాలు (మూడూ కలిపి) 20 పలాలు. ఇవి మెత్తగా దంచి 16 ద్రోణాల నీళ్ళలో వేసి 2 ద్రోణాలు మిగిలేటట్టు కాచాలి. ఇది చల్లారిన తరవాత వడగట్టి కుండలో పోసి, అందులో 2 వందల పలాల తేనే, నూరుపలాల చక్కెరా, 20 పలాల ఆరెపువ్వూ, కంకోలమూ, నాగకేసరాలూ, జాజికాయా, లవంగాలూ, ఏలకులూ, దాల్చినిచెక్కా, ఆకుపత్రికమూ, — ఇవి ఒక్కొక్క పలమూ, 4 పలాల పిప్పళ్ళూ మెత్తగా దంచి ఆకషాయంలో కలిపేది. చీలయిచ్చి నెల గడిచాక తీసి వడబోసుకునేది.

ఇది కషాయం అష్టభాగావశేషం చెయ్యవలసిన అరిష్టం. ఇది వేసేకుండ నేతితో మాగివుండాలి. చంద్రచేవ ఎంత ముదిరితే అంత మంచిది.

ఇది మహాకుష్ఠురోగాలు అన్నీ తగ్గించేస్తుంది. హృద్రోగాలూ, పాండురోగమూ, అర్బుదమూ, గుల్మాలూ, గ్రంథులూ, క్రిములూ, దగ్గులూ, ప్లీహోదరమూ పోగొడుతుంది.

కుష్ఠువ్యాధులలో ఇది చాలా మంచి ఔషధం.

## ౧౮ బలారిష్టం

బలాశ్వగంధయోర్గ్రాహ్యం పృథక్పలశతం శుభమ్
చతుర్ద్రోణే జలే పక్త్వా ద్రోణమేవావశేషయేత్
శీతే తస్మిన్ రసే పూతే క్షిపేద్గుడతులాత్రయమ్
ధాతకీం షోడశపలాం పయస్యాం ద్విపలాంశికామ్
పంచాంగులపలద్వంద్వం రాస్నామేలాం ప్రసారిణీమ్
దేవపుష్పముశీరం చ శ్వదంష్ట్రాం చ పలాంశికామ్

మాసం భాండే స్థితస్త్వేష బలారిష్టో మహాఫలః
హంత్యుగ్రాన్ వాతజాన్ రోగాన్ బలపుష్ట్యగ్నివర్ధనః ।

బల నూరుపలాలు. పెన్నేరు నూరుపలాలు. ఇవిరెండూ మెత్తగా చితకగొట్టి ఎనిమిది ద్రోణాలలో కలిపి రెండుద్రోణాలు మిగిలేటట్టు కాచి చల్లబడ్డతరవాత వడకట్టి కుండలో పోసి, అందులో, బెల్లం 3వందలపలాలూ, ఆరెపువ్వు 16పలాలు, క్షీర కాకోలి 2పలాలు, ఆముదపుచెట్టువేరు 2పలాలు, సన్నరాస్న, ఏలకులు, ప్రసారిణి, లవంగాలు, వట్టివేరు, పల్లేరువేరు — ఇవి ఒక్కొక్క పలమూ మెత్తగా చూర్ణించి కలిపి చీలయిచ్చి నెలగడిచాక తీసి వడబోసుకునేది.

బల అంటే బలాకుటుంబానికి చెందిన ఏబల అయినా వాడవచ్చు నాలుగు బలలూ సమంగా గాని, ఎచ్చుతక్కువగా కాని కలిపి అయినా వాడవచ్చును. వేళ్ళే వాడాలి. అది పచ్చిది అయితే రెట్టింపువేసుకోవాలి.

ప్రక్షేప్యంలో చెప్పిన ఆముదపువేరు ఎండుదే వాడాలి.

ఇది సమస్తవాతవ్యాధులనూ తగ్గిస్తుంది. బలమూ, పుష్టీ, అగ్నిదీప్తీ కలిగిస్తుంది.

ఆమవాతవ్యాధిలో మహారోగరాజగుగ్గులుతో కలిపివాడగా ఇది చాలా ఎక్కువ పనిచేసింది. ఒకమనిషి మిక్కిలిబీదవాడు పక్షవాతం వచ్చి పడిపోయాడు. ఉచితంగా చికిత్సచెయ్యవలసివచ్చింది. వాతగజాంకుశంతో కలిపి ఇది వాడగా ఆమనిషి లేచి తిరగగలిగాడు. క్రమంగా నాలుగుమాసాలకు అస్థివచ్చింది. సువర్ణం వాడమన్నాను గాని, కాలక్షేపం అయిపోతున్నందువల్లా, భార్య భిక్షాటనంచేసి పోషిస్తూ వుండడంవల్లా అశ్రద్ధచేశాడు. అలాగే తిరుగుతూ తరవాత అయిదారేళ్ళకు వయస్సుకూడా ఎక్కువ అయి చచ్చిపోయాడు.

మరికొందరికి వాడడంలో ఇది యింకా అనేకవాతవ్యాధులలోకూడా మంచి గుణం యిచ్చింది. నరాలకు సత్తువ కలిగించడంలో యిది చాలా అద్భుతమైన పని చేసింది.

## ౧౯. అశ్వగంధారిష్టం

తులార్థం చాశ్వగంధాయా ముసల్యాః పలవింశతిః
మంజిష్ఠాయా హరీతక్యా రజన్యో ర్మధుకస్య చ
రాస్నావిదారీపార్థానాం ముస్తకత్రివృతో రపి

భాగాన్ దశపలాన్ దద్యా దనంతాశ్యామయో స్తథా
చందనద్వితీయస్యాపి వచాయా శ్చిత్రకస్య చ
భాగా నష్టపలాన్ క్షుణ్ణా నష్టద్రోణేంభసః పచేత్
ద్రోణశేషే కషాయేస్మిన్ పూతే శీతే ప్రదాపయేత్
ధాతక్యా షోడశపలం మాక్షికస్య తులాద్వయమ్
వ్యోషస్య ద్విపలం చాపి త్రిజాతకచతుష్పలమ్
చతుష్పలం ప్రియంగో శ్చ ద్విపలం నాగకేసరమ్
మాసా దూర్ధ్వం పిబే దేనం పలార్ధపరిమాణతః
మూర్ఛా మపస్మృతిం శోషం ఉన్మాద మపి దారుణమ్
కార్శ్య మర్శాంసి మంద త్వ మగ్నే ర్వాతభవాన్ గదాన్
అశ్వగంధా ద్యరిష్టోయం పీతో హన్యా దసంశయమ్ ।

పెన్నేరు 50పలాలు. నేలతాడి 20పలాలు. మంజిష్ఠా, కరకవోలుపూ, పసుపూ, మానుపసుపూ, యష్టిమధుకమూ, సన్నరాస్న, నేలగుమ్మడూ, తెల్లమద్దిపట్టా, తుంగముస్తలూ, తెగడా, — ఇవి ఒక్కొక్కటీ పదేసిపలాలు. సుగంధి 16పలాలు. రక్తచందనమూ, చందనమూ, వసా, చిత్రమూలమూ — ఇవి ఒక్కొక్కటి ఎనిమిదేసి పలాలు, ఇవన్నీ మెత్తగా దంచి 16ద్రోణాల నీటిలో కలిపి 2ద్రోణాలు మిగిలేటట్టు కాచి చల్లబడ్డతరవాత వడగట్టి కుండలో పోసేది. అందులో తేనె 2వందలపలాలు చేర్చాలి. అరెఫ్రువ్వ 16పలాలూ, సొంటి రెండుపలాలూ, పిప్పళ్ళు రెండుపలాలూ, మిరియాలు రెండుపలాలూ, దాల్చినిచెక్క ఏలకులు — ఆకుపత్రికం — ఇవి ఒక్కొక్కటి నాలుగేసిపలాలూ, ప్రేంకణాలు 4పలాలూ, నాగకేసరాలు రెండు పలాలూ — ఇవన్నీ మెత్తగా దంచి ఆకషాయంలో కలిపి చీలయిచ్చి నెలగడిచాక తీసి వడబోసి జాగ్రత్త చేసుకునేది.

ఇది అష్టభాగావశేషం చెయ్యవలసిన అరిష్టం.

ఇది మూర్ఛలూ, అపస్మారమూ, శోషా, ఉన్మాదమూ, కార్శ్యమూ (చిక్కిపోవడమూ), మూలశంకలూ, అగ్నిమాంద్యమూ, వాతవ్యాధులూ పోగొట్టుతుంది.

అనంత, శ్యామ — ఇవి సుగంధిలో భేదాలు. కనక సుగంధి 16 పలాలు వేసు కోవడం వృద్ధవైద్యసంప్రదాయం.

## ౫౦ దేవదార్వరిష్టం

దేవదారు తులార్థం చ వాసాయాః పలవింశతిః
మంజిష్ఠేంద్రయవా దంతీ తగరం రజనీద్వయమ్
రాస్నా కృమిఘ్నం ముస్తం చ శిరీషం ఖదిరార్జునౌ
భాగాన్ దశపలాన్ దద్యా ద్యవాన్యా వత్సకస్య చ
చందనస్య గుడూచ్యాశ్చ రోహిణ్యా శ్చిత్రకస్య చ
భాగా నష్టపలా నేతా నష్టద్రోణేఽంభసః పచేత్
ద్రోణశేషే కషాయే చ పూతే శీతే ప్రదాపయేత్
ధాతక్యా షోడశపలం మాక్షికస్య తులాత్రయమ్
వ్యోషస్య ద్విపలం దద్యా త్త్రిజాతక చతుష్పలమ్
చతుష్పలం ప్రియంగో శ్చ ద్విపలం నాగకేసరమ్
సర్వా ణ్యేతాని సంచూర్ణ్య ఘృతభాండే నిధాపయేత్
మాసా దూర్ధ్వం పిబే దేనం ప్రమేహాం హంతి దుస్తరమ్
వాతరోగ గ్రహణ్యర్శో మూత్రకృచ్ఛ్రాణి నాశయేత్
దేవదార్వాదికోఽరిష్టో దద్రుకుష్ఠవినాశనః ॥

దేవదారు 50పలాలు. అడ్డసరపు పట్ట (పచ్చిది) 20పలాలు, మంజిష్ఠా, కొడిశపాల విత్తులూ, నేపాళపువేరూ, గ్రంధితగరమూ, పసుపూ, మానుపసుపూ, సన్నిరాస్నా, వాయువిడంగాలూ, తుంగముస్తలూ. దిరిసెనపట్టా, చండ్రచేవా, తెల్లమద్దిపట్టా — ఇవి ఒక్కొక్కటి పదేసిపలాలు. వామూ, కొడిశచెక్కా, చందనమూ, తిప్పతీగే, కటుకరోహిణీ, చిత్రమూలమూ, — ఇవి ఒక్కొక్కటి ఎనిమిదేసిపలాలు. ఇవన్నీ మెత్తగా చితకగొట్టి పదహారు ద్రోణాల నీళ్ళలో కలిపి రెండు ద్రోణాలు మిగిలేటట్టు కాచి చల్లారిన తరవాత పదగట్టి కుండలో పోసి, తేనె 3వందల పలాలు చేర్చి, ఆరెపువ్వు 16పలాలు. సొంటి రెండుపలాలు, పిప్పళ్ళు రెండుపలాలు, మిరియాలు రెండుపలాలు, దాల్చినిచెక్క 4పలాలు, ఏలకులు 4పలాలు, ఆకుపత్రికం 4పలాలు. ప్రేంకణాలు 4పలాలు, నాగకేసరాలు 2పలాలు — ఇవన్నీ మెత్తగా కొట్టి అందులో కలిపి చీలయిచ్చి ఒక్క నెల గడిచాకతీసి వడపోసుకునేది.

ఇది ప్రమేహం పోగొడుతుంది. నాశరోగాలూ, గ్రహణీ, మూలశంకలూ, మూత్రకృచ్ఛ్రాలూ తగ్గిస్తుంది. దుద్దుర్లు కుష్ఠు పోగొడుతుంది.

## ౨౧ చందనాసవం

(శార్ఙ్గధరయోగమునుబట్టి చూపేది)

చందనం వాలకం ముస్తం గంభారీం నీలముత్పలమ్
ప్రియంగుం పద్మకం లోధ్రం మంజిష్ఠాం రక్తచందనమ్
పాఠాం కిరాతతిక్తం చ న్యగ్రోధం పిప్పలం శటీమ్
పర్పటం మధుకం రాస్నాం పటోలం కాంచనారకమ్
ఆమ్రత్వచం మోచరసం ప్రత్యేకం పలమాత్రికమ్
ధాతకీం షోడశపలాం ద్రాక్షాయాః పలవింశతిమ్
జలద్రోణద్వయే క్షిప్త్వా శర్కరాయా స్తులాం తథా
గుడస్యార్థతులాం చాపి మాసం భాండే నిధాపయేత్
చందనాసవ ఇత్యేష శ్శుక్రమేహవినాశకృత్
బలపుష్టికరో హృద్యో వహ్నిసందీపనః పరః
అభిష్యం ద్యతితీక్ష్ణం చ పానాన్నం వహ్నిసూర్యయోః
సంతాపం స్త్రీప్రసక్తిం చ వేగరోధం ప్రజాగరమ్
క్రోధం శోకం దివానిద్రాం లంఘనం చాతిచింతనమ్
అత్యాలస్య మసత్సంగం శుక్రమేహీ వివర్జయేత్
సుపథ్యం శుక్రకృచ్ఛ్రాన్నం సత్సంసక్తి శ్చ సత్కథా
శాంతిగ్రంథ స్వాధ్యయనం హితా న్యాత్మేశచింతనమ్ ।

చందనం, కురువేరు, తుంగముస్తలు, పెద్దగుమ్మడు, నల్లకలువ, ప్రేంకణాలు, పద్మకాష్ఠం, లొద్దుగుచెక్క, మంజిష్ఠ, రక్తచందనం, పాఠ, నేలవేము, మర్రిపట్ట, రావిపట్ట, కచ్చూరాలు, పర్పాటకం, యష్టిమధుకం, సన్నరాస్న, చేదుపొట్ల, దేవకాంచన పట్ట, మామిడిపట్ట, బూరుగుజిగురు — ఇవి ఒక్కొక్క పలం. ఆరెపువ్వు 16 పలాలు ద్రాక్షపండు 20పలాలు. ఇవన్నీ మెత్తగా దంచి నాలుగుద్రోణాలనీళ్ళలో

బాగా కలపాలి. తరవాత, అందులో మూడుపల్లాల చక్కెరా, 50పలాల బెల్లమూ కలపాలి. తరవాత, చీలయిచ్చి నెల గడిచాక తీసి వడబోసుకునేది.

ఇందులో ప్పరిపట్ట, రావిపట్ట, మామిడిపట్ట మొదలైనవి కూడా బాగా యెండినవే వెయ్యాలి. పచ్చివి వెయ్యగూడదు. బెల్లమూ, చక్కెరా బాగా కలిసిపోయేట్టున్నా చెయ్యాలి.

ఇది శుక్లమేహం పోగొట్టుతుంది. బలమూ, పుష్టి కలిగిస్తుంది. హృదయానికి బలంచేస్తుంది. అగ్నిదీప్తిన్నీ కలిగిస్తుంది.

అయితే, శుక్రమేహంతో బాధపడుతున్న మనిషి కఫం పెంచే వస్తువులూ, వేడిచేసే వస్తువులూ భుజించగూడదు. అలాంటి పానీయాలున్నూ పుచ్చుకోగూడదు. నిప్పుసెగా, ఎండవేడీ తగలనిచ్చుకోరాదు. స్త్రీలతో విలాసంగా సంచరించగూడదు. మలమూత్రాదుల వేగాలు నిరోధించగూడదు. రాత్రి మేలుకోరాదు. క్రోధమూ, శోకమూ ఇవి వర్జించాలి. పగలు నిద్రపోగూడదు. ఉపవాసం చెయ్యగూడదు. అతిగా ఆలోచిస్తూ కూచోరాదు. ఏపనిలోనూ ఆలస్యం పనికిరాదు. చెడ్డమనుష్యులతో సహవాసంచెయ్యరాదు. చక్కగా వుడికినదీ, శుక్రవృద్ధి చేసేదీ మాత్రమే ఆహారం పుచ్చుకోవాలి. సజ్జనులతోనే సహవాసం చెయ్యాలి. సత్కథలు చదవాలి. కామోద్రేకం కలిగించేవి చదవగూడదు. తత్వగ్రంథాలే చూడాలి. ఈశ్వరప్రార్థనమున్నూ చేసుకుంటూ వుండాలి.

ఈవ్యాధిలో లేశమూ ఉద్రేకం కలగకూడదు. అందుకోసమే యీనియమ నిషేధాలు. ఇవన్నీ రోగానికే కాని ఔషధానికి కావు. ఉద్రేకం కలిగే ఆహారవిహారాదులు మానకపోతే ఔషధాలు పుచ్చుకున్న ప్రయోజనం వుండదు.

## ౨౨ శా రి బా ద్యా స వం

శారిబాం ముస్తకం లోధ్రం న్యగ్రోధం పిప్పలం శటీమ్
అనంతాం పద్మకం వాలం పాఠాం ధాత్రీం గుడూచికామ్
ఉశీరం చందనద్వంద్వం యమానీం కటురోహిణీమ్
పత్ర మేలాద్వయం కుష్ఠం స్వర్ణపత్రీం హారీతకీమ్
ఏషాం చతుష్పలాన్ భాగాన్ సూక్ష్మచూర్ణీకృతాన్ శుభాన్
జలద్రోణద్వయే క్షిప్త్వా దద్యా ద్గుడతులాత్రయమ్
పలాని దశ ధాతక్యా ద్రాక్షాం షష్టిపలాం తథా

మాసం సంస్థాపయే ద్భాండే సంవృతే మృణ్మయే శుభే
శారిబాద్యాసవ స్యాస్య పానా న్మేహాం శ్చ వింశతిః
శరావికాదయ స్సర్వా పిటకా స్తత్కృతా శ్చ యాః
ఔపదంశికరోగా శ్చ వాతరక్తం భగందరమ్
సర్వ ఏతే శమం యాంతి వ్యాధయో నాత్ర సంశయః
పాన మన్న మభిష్యంది రూక్షం తీక్ష్ణం చ గుర్వపి
వేగరోధం వ్యవాయ శ్చ వ్యాయామం నిశి జాగరమ్
సురాం సుతీక్ష్ణాం మత్స్యం చ పలాండుం చ రసోనకమ్
త్యజే త్సార్యాగ్ని సంతాపం ప్రమేహపిటకాతురః ॥

సుగంధి, తుంగముస్తలు, లొద్దుగుచెక్క, మర్రిపట్ట, రావిపట్ట, కచ్చూరాలు, సుగంధి, పద్మకాష్ఠం, కురువేరు, పాఠ, ఉసిరికపప్పు, తిప్పతీగ, వట్టివేరు, చందనం, రక్తచందనం, వాము, కటుకరోహిణి, అనుపత్రికం, ఏలకులు, పెద్దయేలకులు, చెంగల్వకోష్టు, సునాముఖీఆకు, కరకవోలుపు — ఇవి ఒక్కొక్కటి నాలుగేసి పలాలు. ఇవన్నీ మెత్తగా చూర్ణించి నాలుగుద్రోణాల నీళ్ళలో కలిపి కుండలో పోసేది. అందులో మూడునందల పలాల బెల్లమూ, పదిపలాల తేనెపువ్వూ, అరవైపలాల ద్రాక్షపండూ మెత్తగా కొట్టి అందులో కలిపెయ్యాలి. తరవాత చీలయిచ్చి నెలగడిచాక తీసి వడబోసుకునేది.

ఇందులో మర్రిపట్ట నగైరా లన్నీ ఎండువే వాడాలి తిప్పతీగ ఎండుదే వెయ్యాలి. సుగంధి రెండుచోట్ల చెప్పడం త్రిగుణం కోసం.

ఇవి ఇరవైప్రమేహాలూ తగ్గిస్తుంది. ఔపదంశిక (సుఖ) రోగాలూ, వాతరక్తమూ, భగందరాలూ తగ్గిస్తుంది. ప్రమేహపిటకలు పోగొడుతుంది.

అనుభవంలో మధుమూత్రరోగులకూ, సవాయివ్యాధిగలవారికీ, కురుపులూ, చిడుమూ, గజ్జికలవారికీ, ఋతుక్రమం సరిగా లేని స్త్రీలకూ, కుసుమవ్యాధిగల స్త్రీలకూ వాడగా చాలా గొప్పపనిచేసింది. జరాయుదోషాలు తగ్గించింది. సూతికలలో చాలాపనిచేసింది. రక్తశుద్ధిచెయ్యడంలో చాలా అద్భుతంగా పనిచేసింది.

అయితే, ప్రమేహవ్యాధిగలవారూ, ప్రమేహపిటకలు గలవారూ, కఫంపెంచేవీ, త్వరగా జీర్ణం కానివీ, రూక్షమైనవీ, వేడిచేసేవీ ఆహారపానాలు పుచ్చుకోగూడదు. మలమూత్రాదుల వేగం నిరోధించరాదు, రాత్రి జాగరణం చెయ్యగూడదు.

సంభోగమూ, కసరత్తూ పనికిరావు. తీక్ష్ణమైన బ్రాందీ, సారా మొదలైన మద్యాలు ముట్టగూడదు. చేపలు తినగూడదు. నీరుల్లీ, వెల్లుల్లీ వాడగూడదు. నిప్పుసెగా, ఎండ వేడిమీ తగలనిచ్చుకోరాదు.

ఈ పథ్యాలు చాలా శ్రద్ధగా ఆచరించాలి.

## ౨౩ అశోకారిష్టం

అశోకస్య తులా మేకాం చతుర్ద్రోణే జలే పచేత్
పాదశేషే రసే పూతే శీతే పలశతిద్వయమ్
దద్యా ద్గుడస్య, ధాతక్యాః పలషోడశికం మతమ్
అజాజీం ముస్తకం శుంఠీం, దార్వ్యుత్పలఫలత్రికమ్
ఆమ్రాస్థి జీరకం వాసాం చందనం చ వినిక్షిపేత్
చూర్ణయిత్వా పలాంశేన తచ్ఛోభాండే విధాపయేత్
మాసా దూర్ధ్వం చ పీత్వైన మసృగ్దరరుజాం జయేత్
జ్వరం చ రక్తపిత్తార్శో మందాగ్నిత్వ మరోచకమ్
మేహశోథారుచిహర స్త్వశోకారిష్టసంజ్ఞితః ||

అశోక చెక్క నూరుపలాలు మెత్తగా చితకగొట్టి ఎనిమిదిద్రోణాల నీటిలో వేసి రెండు ద్రోణాలు మిగిలేటట్టు కాచి చల్లబడ్డ తరవాత వడగట్టి కుండలో పోసేది. అందులో 2వందలపలాల బెల్లమూ, 16పలాల ఆరెపువ్వూ, జీలకర్రా, తుంగముస్తలూ, సొంటీ, మానుపసుపూ, నల్లకలువపువ్వూ, కరకవోలుపూ, తాడికాయబెరడూ, ఉసిరికపప్పూ, మామిడిటెంకలోని జీడీ, జీలకర్రా, అడ్డసరపుగట్టూ, చందనమూ — ఇవి ఒక్కొక్క పలమూ మెత్తగా చూర్ణించి అందులో కలిపి చీలయిచ్చి నెలగడిచాక వడగట్టుకునేది.

ఇది స్త్రీలకు సంభవించే ఎర్రకుసుమా, తెల్లకుసుమా తగ్గించేస్తుంది. జ్వరమూ, రక్తపిత్తమూ, మూలశంకలూ, అగ్నిమాంద్యమూ, అరోచకమూ, ప్రమేహశోథా పోగొడుతుంది.

నా అనుభవంలో మలబారు అశోక చెక్క చాలామంచిది.

రజన్యా పలమానేన దద్యాదత్ర చ నాగరమ్
మాసాదూర్ధ్వం జాతరసం యథామాత్రం ప్రయోజయేత్
శిరీషారిష్ట ఇత్యేష విషవ్యాపన్నాశనః ॥

దిరిసెన పట్ట 50పలాలు మెత్తగా చితకకొట్టి నాలుగుద్రోణాల నీళ్ళలో కలిపి, ఒక ద్రోణం మిగిలేటట్టు కాచి చల్లారిన పిదప వడగట్టి కుండలో పోసేది. తరవాత, అందులో రెండురెండల పలాల బెల్లమూ, పిప్పళ్ళూ, ప్రేంకణాలూ, చెంగల్వకోష్టూ, ఏలకులూ నీలివేళ్ళూ, నాగకేసరాలూ పసుపూ, మానుపసుపూ, సొంటీ — ఇవి ఒక్కొక్కపలమూ మెత్తగా దంచి కలిపి చీలయిచ్చి నెల గడిచాక తీసి వడబోసుకునేది.

దిరిసెనచెక్క పచ్చిది వెయ్యడం మంచది. పచ్చిది అయితే రెట్టింపు వేసుకోవాలి. ఇది సకలవిషాలూ విరిచేస్తుంది. ఏవిషం జీర్ణించినవారి కయినా ఇది అమృతం కంటే యెక్కువగా పనిచేస్తుంది.

## ౨౬ సారస్వతారిష్టం

సమూలపత్రశాఖాయా బ్రాహ్మ్యాశ్చ బ్రాహ్మముహూర్తకే
గృహీత్వా వింశతిపలం పుష్యయోగే శతావరీ
విదారీకాభయోశీరాణ్యార్ద్రకం చ తథా మిశిః
పంచ పంచ పలాన్యేషాం జలద్రోణే పచేద్భిషక్
పాదావశేషే విస్రావ్య రసం వస్త్రేణ గాలయేత్
మాక్షికస్య దశపలం సితాయాః పంచవింశతిః
ధాతకీ పంచపలికా రేణుకా త్రివృతా కణా
దేవపుష్పం వచా కుష్ఠం వాజిగంధా విభీతకీ
అమృతైలా విడంగం త్వక్ప్రత్యేకం కర్షసమ్మితమ్
క్వాథే తస్మిన్ సమస్తాని సమాక్షిప్య ప్రయత్నతః
స్వర్ణకుంభే నిదధ్యాద్వా నవే మృద్భాజనేఽపి వా
స్వర్ణప్రతనుపత్రం చ క్షిప్త్వాస్మిన్ కర్షసమ్మితమ్

మాసా జ్జాతరసం దృష్ట్వా హేమపత్రే క్షయంగతే
వాససా చ పరిస్రావ్య స్థాపయే ద్ఘృతభాజనే
సారస్వతాభిధోఽరిష్ట ఏషోఽమృతసమః పురా
శిష్యాణా ముపకారార్థం ధన్వంతరినా స్మృతః
ఆయుర్వీర్యం ధృతిం మేధాం బలం కాంతిం వివర్ధయేత్
వాగ్విశుద్ధికరో హృద్యో రసాయనవర స్స్మృతః
బాలకానాం చ యూనాం చ వృద్ధానాం చ హితస్సదా
సః నారీహితో నిత్యం పరమోజస్కరో మతః
వారయే త్స్వరకార్కశ్యం తథా చాస్పష్టభాషణమ్
స్వరం పరభృతస్యేవ జనయేత్ సేవనా త్సదా
రజోదోషేణ దుష్టానాం యోషితాం శుక్రదోషిణాం
పుంసాం చాపి శుభకరః సర్వదోషహరో మతః
అత్యధ్యయనగీతాదిక్షీణస్మృతిబలా నరాః
లభంతే చిత్తసంతోషం స్మృతిం చాస్య నిషేవణాత్
పయసా సహ పాతవ్యోఽరిష్టోఽయం శాణమానతః
మాసాభ్యాం రోగహృచ్చాయం శరదా సర్వసిద్ధిదః
అకాలమృత్యో ర్హరణే యదీచ్ఛా
నారీప్రియత్వం యది వాంఛితం స్యాత్
వాక్శుద్ధిధైర్యస్మృతిలబ్ధి రిష్టా
నిషేవ్యతాం తర్హ్యమృతం భవద్భిః ॥

ఈయోగంలో ప్రధానద్రవ్యం సరస్వతీతీగ. అది సమూలంగా పచ్చిది 40పలాలు. పిల్లితేగలూ, నేలగుమ్మడూ, కరకవొలుపూ, వట్టివేళ్ళూ, అల్లమూ, జంటామాంసీ. ఇవి ఒక్కొక్కటి అయిదేసి పలాలు. ఇవన్నీ మెత్తగా కొట్టి సరస్వతీతీగతో కలిపి రెండు ద్రోణాల నీళ్ళలో వేసి అరద్రోణం మిగిలేటట్టు కాచి చల్లారిన తరవాత వడగట్టి కుండలో పోసేది. తరవాత ఆకషాయంలో పదిపలాల తేనే, కలకండ 25 పలాలూ, అయిదుపలాల ఆరెపువ్వూ, రేణుకలూ, తెగడా, పిప్పళ్ళూ, లవంగాలూ,

వసా, చెంగల్వకోష్టూ, పెన్నేర్లూ, తాడికాంచబెరడూ, తిప్పతీగే, ఏలకులూ, వాయువిడంగాలూ. దాల్చినిచెక్కా — ఇవి ఒక్కొక్క కర్షమూ మెత్తగా చూర్ణించి కలిపి చీల యిచ్చేది.

ఈకషాయమూ, యీప్రక్షేప్యమూ బంగారపుపాత్రలో పోసి చీలయివ్వాలి. అది సాధ్యం కాకపోతే మట్టికుండలో పోసి చీలయివ్వవచ్చు. అయితే, మట్టి కుండలో పోసేపక్షంలో కర్షం యెత్తు మేలిమిబంగారం పల్చనిరేకు చేయించి అందులో వెయ్యాలి. ఒక్క నెలకి ఇది తయారవుతుంది. అప్పటికి ఆబంగారపు రేకు కరిగిపోతుంది. అప్పుడది గుడ్డతో వడబోసి నేతితో మాగిన పాత్రలో జాగ్రత్తచేసుకునేది.

సరస్వతీతీగ యెప్పుడూ పచ్చిదే వేసుకోవాలి. పిల్లితేగలున్నూ పచ్చివే వెయ్యాలి; కాని పిల్లితేగలకు మాత్రం ద్విగుణం అక్కరలేదు. సరస్వతీతీగ మాత్రం యిరవై పలాలకూ మరో యిరవైపలాలు చేర్చి వేసుకోవాలి. నేను మేలిమిబంగారపు రేకు వేశాను; గాని అది యెప్పుడూ కరిగిపోలేదు. కరగకపోయినా ఔషధానికి బంగారపు గుణం సంక్రమిస్తుం దనే నానమ్మకం. బంగారపుపాత్రలో పోసి చీలయిస్తే బంగారపు రేకు వెయ్యవక్కరలేదు. ఆపాత్ర కరగకపోయినా దానిగుణం అంటుతుం దనే ధన్వంతరి నిశ్చయం అయివుంటుంది. పైగా, బంగారపు రేకు కరగకపోయినా యిది చాలా పని చెయ్యనేచేసింది.

నిజంగా, యీసారస్వతారిష్టం అమృతం అనే చెప్పాలి. తన శిష్యులకు ఉపకారం చెయ్యదలిచి ఇది ధన్వంతరి కల్పించిన యోగం.

ఇది ఆయుర్దాయం వృద్ధిచేస్తుంది. బలపరాక్రమాలూ. ధైర్యమూ. మేధాశక్తీ, కాంతీ, వర్చస్సూ వృద్ధిచేస్తుంది. ఇది గొప్ప రసాయనం. వాక్శుద్ధి కలిగిస్తుంది. బాలకులకూ, యువకులకూ, వృద్ధులకూ కూడా ఇది చాలా మేలుచేస్తుంది. స్త్రీలకూ పురుషులకూ కూడా ఇది సమానంగా ఓజోవృద్ధిచేస్తుంది. మరీన్నీ యిది స్వరానికి గల కర్కశత్వమూ, ముద్దమాటలూ పోగొడుతుంది. కోకిలస్వరంవంటి స్వరం కలిగిస్తుంది. స్త్రీల రజోదోషమూ, పురుషుల శుక్రదోషాలూ హరిస్తుంది. మిక్కిలి చదవడంవల్లా, వాడడంవల్లా క్షీణించిన జ్ఞాపకశక్తి మళ్ళీ వృద్ధిచేస్తుంది. ఇది పాలతో కలిపి సేవించాలి. ఇది రెండుమాసాలు పుచ్చుకుంటే సకలరోగాలూ తగ్గిపోతాయి. ఒక్కసంవత్సరం విడవకుండా పుచ్చుకుంటే సర్వసిద్ధులూ కలుగుతాయి.

అకాలమృత్యువు పోవాలన్నా, స్త్రీల ప్రీతి సంపాదించుకోవాలన్నా, వాక్శుద్ధీ, ధైర్యమూ, జ్ఞాపకశక్తీ హెచ్చుకావాలన్నా అమృతమే అనతగ్గ యిది సేవించేది.

నేనిది చాలామందికి వాడాను. సారితానికీ పుచ్చుకున్నాను. కాని పాలకు బదులు నీళ్ళవాడాను. బాగా పనిచేసింది పాలతో మాత్రం వాడిచూడలేదు. పాలతో పుచ్చుకుంటే యింకా యెక్కువ పనిచేస్తుం దనడానికి సందేహం లేదు. పాలు మంచివి దొరకకపోతే మాత్రం మంచినీళ్ళే మంచిది.

## ౨౭ దశమూలారిష్టం

పర్ణ్యౌ బృహత్యౌ శోణకో బిల్వోఽగ్నిమంథనోరళుః
పాటలా కాశ్మరీ చేతి దశమూల మిహోచ్యతే
దశమూలాని కుర్వీత భాగైః పంచపలైః పృథక్
పంచవింశత్పలం కుర్యాచ్చిత్రకం పౌష్కరం తథా
కుర్యాద్వింశత్పలం లోధ్రం గుడూచీ తత్సమా భవేత్
పలై ష్షోడశభి ర్ధాత్రీ రవిసంఖ్యై ర్దురాలభా
ఖదిరో బీజసారం చ పథ్యా చేతి పృథక్పలైః
అష్టాభి ర్గుణితైః కుష్ఠం మంజిష్ఠా దేవదారు చ
విడంగం మధుకం భార్గీ కపిత్థోక్షః పునర్నవా
చవ్యం మాంసీ ప్రియంగు శ్చ శారిబా కృష్ణజీరకమ్
త్రివృతా రేణుకం రాస్నా పిప్పలీ క్రముక శ్శటీ
హరిద్రా శతపుష్పా చ పద్మకం నాగకేసరమ్
ముస్త మింద్రయవ శ్శృంగీ జీవకర్షభకౌ తథా
మేదా చాన్యా మహామేదా కాకోల్యౌ ఋద్ధివృద్ధికే
కుర్యా త్పృథక్ ద్విపలికాన్ పచే దష్టగుణే జలే
చతుర్థాంశశ్శృతం నీత్వా మృద్భాండే సన్నిధాపయేత్
తత ష్షష్టిపలాం ద్రాక్షాం పచే న్నీరే చతుర్గుణే
త్రిపాదశేషం శీతం చ పూర్వక్వాథే శ్శృతం క్షిపేత్
ద్వాత్రింశత్పలికం క్షౌద్రం దద్యాద్గుడచతుశ్శతమ్
త్రింశత్పలాని ధాతక్యాః కక్కోలం జలచందనమ్

జాతీఫలం లవంగం చ త్వగేలా పత్రకేసరమ్
పిప్పలీ చేతి సంచూర్ణ్య భాగై ర్ద్విపలికైః పృథక్
శాణమాత్రాం చ కస్తూరీం సర్వ మేకత్ర నిక్షిపేత్
భూమౌ నిఖనయే ద్భా[illegible]సం పిబేత్
కతకస్య ఫలం క్షిప్త్వా రసం నిర్మలతాం నయేత్
గ్రహణీ మరుచిం శూలం శ్వాసకాసభగందరాన్
వాతవ్యాధిం క్షయం ఛర్దిం పాండురోగం చ కామలాన్
కుష్ఠా న్యర్శాంసి మేహాం శ్చ మందాగ్ని ముదరాణి చ
శర్కరా మశ్మరీం మూత్రకృచ్ఛ్రం ధాతుక్షయం జయేత్
కృశానాం పుష్టిజననో వంధ్యానాం పుత్రదః పరమ్
అరిష్టో దశమూలాఖ్య స్తేజశ్శుక్రబలప్రదః ॥

శాలిపర్ణి, పృశ్నిపర్ణి, వాకుడు, నేలములక, పల్లేరు, మారేడు, దుండిగం, పెగ్గుమ్మడి, కలిగొట్టు, తక్కాల — ఇవి దశమూలాలు. వీటి వేళ్ళు ఒక్కొక్కటి అయిదేసి పలాలు. చిత్రమూలమూ, పుష్కరమూలమూ ఒక్కొక్కటి 25పలాలు. లొద్దుగ చెక్క 20పలాలు. తిప్పతీగ 20పలాలు. ఉసిరిక వొలుపు 16పలాలు. దూలగొండి వేళ్ళు, 12పలాలు, చంద్రచేవ, వాయువిళంగాలు, కరక వొలుపు — ఇవి ఒక్కొక్కటి ఎనిమిదేసిపలాలు. చెంగల్వకోష్టు, మంజిష్ఠ, దేవదారు, వాయువిడంగాలు. యష్టి మధుకం, గంటుభారంగి, వెలగ, తాడికాయవొలుపు, గలిజేరు, చవ్యం. జటామాంసి. ప్రేంకణాలు. సుగంధి, నల్లజీలకర్ర, తెగడ, రేణుకలు. సన్నరాస్న, పిప్పళ్ళు, పచ్చి పోకచూరు, కచ్చూరాలు, పసుపు, సదాప, పద్మకాష్ఠం, నాగకేసరాలు, తుంగ ముస్తలు, కొడిశపాలవిత్తులు, కర్కాటకశృంగి, జీవకం, ఋషభకం, మేద, మహామేద, కాకోళి, క్షీరకాకోళి, ఋద్ధి, వృద్ధి — ఇవి ఒక్కొక్కటి రెండేసిపలాలు.

ఇవన్నీ మెత్తగా చితకగొట్టి 16ద్రోణాల నీళ్ళలో నాలుగోవంతు మిగిలేటట్టు కాచి చల్లారిన తరవాత వడగట్టి ఒక కుండలో పోసేది.

60పలాల ద్రాక్షపండు మెత్తగా చితకగొట్టి 240పలాల నీళ్ళలో కలిపి మూడు వంతులు మిగిలేటట్టు కాచి చల్లారిన తరవాత వడగట్టి పైకషాయంలో కలుపుకునేది, అందులో 32పలాల తేనే, 4వందల పలాల బెల్లమూ, కలపాలి. 30పలాల ఆరె పువ్వూ, కంకోలమూ, కురువేరూ, చందనమూ, జాజికాయూ, లవంగాలూ, దాల్చిని

చెక్కా, ఏలకులూ, ఆకుపత్రికమూ, నాగకేసరాలూ, పిప్పళ్ళూ — ఇవి ఒక్కొక్కటి రెండేసిపలాలు మెత్త[illegible] చూర్ణించి యీచూర్ణమున్నూ ఆకషాయంలోకలపాలి. అరతులం కస్తూరికూడా కలిపి చీలయిచ్చి భూమిలోపాతిపెట్టి నెలగడిచాక తీసి వడబోసి ఇంకా పుకాయుల జిగురు కలిపి కూడా వడగట్టి జాగ్రత్త చేసుకునేది.

ఇది గ్రహణీ, అరుచీ, శూ[illegible]ర్శూ, దగ్గూ, భగందరాలూ, వాతవ్యాధులూ, క్షయా, ఛర్ది, పాండురోగమూ, కామెర్లూ, కుష్ఠురోగమూ, మూలశంకలూ, ప్రమేహాలూ, అగ్నిమాంద్యమూ, ఉదరవ్యాధులూ, మూత్రశర్కరా, మూత్రాశ్మరీ, మూత్రకృచ్ఛ్రమూ, ధాతుక్షయమూ, పోగొట్టుతుంది. కృశించిపోయినవారికి పుష్టి కలిగిస్తుంది. వంధ్యలకు సంతానం కలిగిస్తుంది. పురుషులకు తేజస్సూ, శుక్రమూ, బలమూ వృద్ధిచేస్తుంది.

ఇందులో పడే అష్టకవర్గం దొంకడం కష్టం. అంగళ్ళలో కొన్నిచోట్ల వున్న దంటారు గాని యెంతవరకూ అది సరి అయినదో ప్రతీవారూ నిర్ధారణచేసుకోడం కష్టం. కనక, ఇదివరకు జరుగుతున్నట్టే వాటికి బదులు ప్రతినిధివస్తువులు వాడుకోడం మంచిది. అవి యీక్రింద చూపుతున్నాను.

జీవకానికి ప్రతినిధిద్రవ్యం తిప్పతీగ. ఋషభకానికి నేలగుమ్మడు, మేదకు పెన్నేరు, మహామేదకు సుగంధి, ఋద్ధికి బల. వృద్ధికి మహాబల కాకోలీ, క్షీరకాకోలీ మాత్రం అంగళ్ళలో దొరుకుతాయి.

## ౨౨. మృగమదాసవం

మృతసంజీవనీ గ్రాహ్యా పంచాశత్పలసమ్మితా
తదర్ధం మధు సంగ్రాహ్యం తోయం మధుసమం తథా
కస్తూరీ కుడవం తత్ర మరిచం దేవపుష్పకమ్
జాతీఫలం పిప్పలీ త్వగ్భాగాన్ ద్విపలికాన్ క్షిపేత్
భాండే సంస్థాప్య రుద్ధ్వా చ నిదధ్యాన్మాసమాత్రికమ్
విషూచికాయాం హిక్కాయాం త్రిదోషప్రభవే జ్వరే
వీక్ష్య కోష్ఠం బలం చైవ భిషజ్మాత్రాం ప్రయోజయేత్ ॥

మృతసంజీవనీసుర 50పలాలు. తేనె 25పలాలు. మంచినీళ్ళు 25పలాలు. కస్తూరి ఒక కుడవం అంటే 32తులాలు. మిరియాలూ, లవంగాలూ, జాజికాయా, పిప్పళ్ళూ,

ద్రాక్షపాని చెక్కా — ఇవి ఒక్కొక్కటి రెండేసి పలాలు, ఇవన్నీ కలిపి కుండలో పోసి, చీలయిచ్చి ఒక నెల గడిచాక తీసి వడబోసుకునేది.

కోష్ఠస్థితి, శరీరబలమూ బాగా గుర్తించి వైద్యుడు దీనికి జాగ్రత్తగా మోతాదు నిర్ణయించాలి.

ఇది విషూచి (కలరా) తగ్గించేస్తుంది. ఎక్కిళ్ళ[illegible]మతుంది. సన్నిపాతజ్వరాలు పోగొడుతుంది.

మృతసంజీవనీసుర అనేది అనేకమూలికలతో తయారవుతుంది. అది చెయ్యడం కొంచెం కష్టం. అది బంగాళాదేశంలో పెద్దపెద్ద వైద్యులు కొందరు చేసి బాహాటంగా విక్రయిస్తున్నారు.

## ౨౯. చందనాసవం

చందనే సరళం దేవదారు దారునిశానిశా
త్రివృ చ్చిత్రకమూలం చాగురు ధాత్రీ సురప్రియమ్
శతమూ ల్యశ్వభీః వాసాత్వచ శ్చ శారిబాద్వయమ్
లక్ష్మణాయా స్తథా మూలం పావరీవరుణాత్వచా
ప్రత్యేకం పలికం జ్ఞేయు ద్రాక్షాయాః పలవింశకమ్
ధాతకీ షోడశపలాం తులామానాం సితాం తథా
మాక్షికార్ధఫలం సర్వం జలద్రోణద్వయే క్షిపేత్
మాస మేకం భాండమధ్యే సపిధానే నిధాపయేత్
చందనాసవ ఇత్యేష రోగానీకనికృంతనః
శుక్రదోషం రజోదోషం మూత్రదోషం సుదారుణమ్
నిహంతి వివిధాన్ మేహాన్ కృచ్ఛ్రి సుష్టవిధం తథా
చతస్ర శ్చాశ్మరీ స్తద్వ న్మూత్రాఘాతాం స్త్రయోదశ
అంత్రవృద్ధిం పాండురోగం కామలాం చ హలీమకమ్
కాసం శ్వాసం తథా కుష్ఠ మగ్నిమాంద్య మరోచకమ్
ఔపసర్గికమేహాం శ్చ నాశయే దవికల్పతః
భాషిత శ్శ్రీమహేశేన లోకానాం హితకారిణా ॥

చందనం. రక్తచందనం, సరళదేవదారు, మానుపసుపు, పసుపు, తెగడ చిత్రమూలం, అగురుచెక్క. ఉసిరికపప్పు, పిరంగిచెక్క, పిల్లితేగలు, కొండపిండిశేళ్ళు. అడ్డసరపు చెక్క, తెల్లసుగంధి, నల్లసుగంధి, అత్యుణమూలం, నల్లతుమ్మచెక్క, ఉలిమిడి చెక్క— ఇవి ఒక్కొక్కపలం. అ... పువ్వు 16పలాలు. ఇవన్నీ మెత్తగా దంచేది. ద్రాక్షపండు 20పలాలున్నూ మెత్తగా కొట్టేది. ఇవన్నీ నాలుగుద్రోణాల నీళ్ళలో కలిపి, కుండలో పోసి, అరిధు చక్కెర నూరుపలాలూ, తేనె 50 పలాలూ కూడా కలిపి చీలయిచ్చి నెల గడిచాక తీసి వడబోసుకునేది.

ఇది అనేకరోగాలు పోగొడుతుంది. శుక్రదోషాలూ, రజోదోషాలూ, మూత్ర దోషాలూ తగ్గిస్తుంది. మేహాలన్నీ తగ్గిస్తుంది. మూత్రాఘాతాలూ, మూత్రాశ్మరులూ, మూత్రకృచ్ఛ్రాలూ, అంత్రవృద్ధీ, పాండురోగమూ. కామెర్లూ. హలీమకమూ, దగ్గూ' ఒగర్పూ, కుష్ఠూ, అగ్నిమాంద్యమూ, అరోచకమూ, ఔపసర్గిక మేహామూ (సెగ) తగ్గించేస్తుంది.

ఇది మహేశ్వరుడు కల్పించిన యోగం.

గమనిక = ఈప్రకరణంలో (21) మరోకచందనాసవం చూపించివున్నాను. అది చిరకాలంగా నేను చేస్తున్నది. అనేకులు ప్రసిద్ధవైద్యులున్నూ వాడుతున్నదీ అదే. సంప్రదాయం అనుసరించే నేనూ చేస్తున్నాను. కాని, ఈయోగం వస్తుసంపుటినిబట్టి అంతకంటే గుణకారి అని తోస్తుంది. నేను చేసి చూస్తాను. నాసోదరవైద్యులున్నూ చేసి వాడి చూడగోరినాను.

## 30 అరవిందాసవం

అరవింద ముశీరం చ కాశ్మరీం నీలముత్పలమ్
మంజిష్ఠైలా బలా మాంసీ రంబుదం శారిబాం శివామ్
విభీతకవచాధాత్రీ శ్శటీం శ్యామాం నసిలినీమ్
పటోలం పర్పటం పార్థం మధూకం మధుకం మురామ్
పలమానేన సంగృహ్య ద్రాక్షాయాః పలవింశతిమ్
ధాతకీం షోడశపలాం జలద్రోణద్వయే క్షిపేత్
శర్కరాయా స్తులాం తత్ర తులార్థం మాక్షికస్య చ
మాసం సంస్థాపయే ద్భాండే మృత్తికావరినిర్మితే

బాలానాం సర్వరోగఘ్నో బలపుష్ట్యగ్ని వర్ధనః
అరవిందాసవః ప్రోక్త ఆయుష్యో గ్రహదోషహృత్ ।

తామరపువ్వు (ఎండుది) వట్టివేరు, వెగ్గుమ్ముడు, నల్లకలవదుంప, మంజిష్ఠ. ఏలకులు, బల, జటామాంసి, తుంగముస్తలు, సుగంధి, కర[illegible]. తాడికాయబెరడు, వస, ఉసిరికపప్పు, కచ్చూరాలు, సుగంధి, పాలసుగంధి, చేదుపొట్ల, రావిపట్ట, తెల్లమద్ది పట్ట, ఇప్పపట్ట, యష్టిమధుకం, మురామాంసి — ఇవి ఒక్కొక్కపలం చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి కుండలో నాలుగు ద్రోణాల నీళ్ళలో కలిపి, అందులో ద్రాక్షపండు 20పలాలూ, అరెపువ్వు 16పలాలూ, చక్కెర 100పలాలూ, తేనె 50పలాలూ కూడా కలిపి చీలయిచ్చి ఒక్క నెలకు తీసి వడబోసుకునేది.

ఇది పిల్లలకు వచ్చే సకలవ్యాధులూ పోగొడుతుంది. బలమూ, పుష్టి, ఆకలీ కలిగిస్తుంది. ఆయుర్దాయం వృద్ధిచేస్తుంది. గ్రహబాధలు పోగొడుతుంది.

సంపూర్ణం

---

సరస్వతీ, రాజమండ్రి, ఇ. జి .11 (17–12–47) 2000 కాపీలు 4441